ఓమ్

# విషయసూచిక

పేజీ

ఓమ్

శ్రీ కృష్ణాయనమః

శ్రీ భీమేశ్వరేశ్వరాయనమః

# శ్రీమదుత్తరరామాయణము

## ప్రథమ సర్గము



రామ కృష్ణదేవా !
యారాధ్య మహాప్రభావ ! యర్థిజనాశా
పూరణ సేవా ! మామక
ధీరచిత కథానురాగదీపితభావా !

### అగస్త్యాది మహర్షులు శ్రీరామ దర్శనార్థులై వచ్చుట.

శ్రీరాముఁడు రాక్షసవధంబు గావించి ప్రాప్తరాజ్యుఁడై యుండఁగా ఋషులెల్లరు వాని నభినందించువారై యరుగుదెంచిరి. తూర్పు దిక్కునుండి కౌశికుఁడు, యవక్రీతుఁడు, రైభ్యుఁడు, చ్యవనుఁడు, కణ్వుఁడు మేధాతిథి పుత్త్రుఁడు ననువారును

దక్షిణముననుండి అగస్త్యునితోఁగూడి స్వస్తి, ఆత్రేయుఁడు, నముచి, ప్రముచి యనువారును

పడమటినుండి సశిష్యులగు పృషద్గువు, కవషుఁడు, ధౌమ్యుఁడు, రౌద్రేయుఁడు ననువారును

ఉత్తరముననుండి వసిష్ఠుఁడు, కశ్యపుఁడు, అత్రి, విశ్వామిత్రుఁడు, గౌతముఁడు, జమదగ్ని, భరద్వాజుఁడు నను సప్తమహర్షులును జనుదెంచిరి.

వహ్నితేజులు వేదవేదాంగ విదులు నానాశాస్త్ర విశారదులు, మహాత్ములునగు నాఋషులు శ్రీరాముని మందిర ద్వారంబుచేరి ద్వారపాలకునికై వేచియున్నంత మునిశ్రేష్ఠుఁడగు నగస్త్యుఁడు దౌవారికునిఁ గాంచి తమరాక దాశరథి కెఱింగింపు మని నంతఁ బరహృదయజ్ఞుఁడు ధైర్యశాలియునగు నాప్రతి

హారి యగస్త్యుల వచనంబు నూఁది తద్దయు వేగంబున రాముని సమీపం బున కరిగి నమస్కరించి నిరాహారులతోఁ గూడి యగస్త్యుఁడు తమ్ముఁ గాంచ నరుదెంచెనని విన్నవింపఁగా రాముఁడు 'బాలసూర్యప్రభా భాసితులగు నా మునీంద్రుల యథాసుఖముగాఁ దోడి తెమ్మ'న నాతఁడు సంయమీంద్రులఁ బూజించి తోడ్కొనిరాఁగా వారు నానారత్న విభూషితమైన రామమంది రము ప్రవేశించిరి.

శ్రీరాముఁడు యతుల రాకఁగాంచి యెదురేగి యేటికోళ్లు ఘటించి యర్ఘ్యపాద్యాది పూజనం బాదరంబుమై నాచరించి, గోవు నర్పించి యర్హాస నంబుల నొసంగ వారందు యథార్హముగా సుఖోపవిష్టులైరి. అంత వేదవిదు లగు నాతపోధనులను గాంచి రాముఁడు 'సశిష్యులరగు మీకుఁ గుశలంబే?' యని ప్రశ్నంబు గావింప నెదుట నున్నవారు

## మౌనులు శ్రీరాముఁ బ్రశంసించుట.

"రాఘవా! మాకు సర్వత్ర కుశలంబు. శత్రుసంహారము గావించి సుఖమున్న నిన్ను అదృష్టవశంబునఁ జూడఁ గంటిమి. రాజా! లోకవిద్రావ ణుండగు రావణుని మాభాగ్యంబు కతంబున హతమార్చితివి. రావణునిఁ బుత్రపౌత్రకంబుగాఁ బరిమార్చుట నీకొక భారంబుగాదు. నీవు ధనువు దాల్చితివేని ముల్లోకంబులు నశ్రమంబునఁ ద్రుటిలో జయింతువు. సంది యము లేదు. నృపాలా! విజయివై వైదేహితో మాతృదేవతలతోఁ దమ్ములతోఁ బ్రసన్నమై నున్న నిన్నిపుడు చూచు భాగ్యంబు మాకుఁ గలిగెను. దైవానుగ్రహంబునఁ బ్రహస్తుఁడు, వికటుఁడు, విరూపాక్షుఁడు మహోదరుఁడు, అకంపనుఁడు అను నిశాచరులు నీచే నిహతులైరి. కుంభకర్ణునిఁ గూల్చితివి. త్రిశిరునిఁ జీల్చితివి. అతికాయునిఁ గెడపితివి. దేవాంతక నరాంత కులను గూడఁ బిలుకుమార్చితివి. కుంభకర్ణ కుమారులగు కుంభ నికుంభులఁ బీఁచమణఁచితివి. లయకాలకాలతుల్యులగు యుద్ధోన్మత్తుని, మత్తుని, మట్టు వెట్టితివి. యజ్ఞకోపుఁడు ధూమ్రాక్షుఁడు మున్నగు ఘోర రాక్షసులెల్ల శస్త్రాస్త్రపారగులై క్రూరనారాచంబుల ఘోరంబుగ నీతోఁ బోరి మారి మసఁ గిన చందాన నేలపాలైరి. మాయదృష్టవశంబున నపరాజితుండగు రావణుని సురరిపుఁడగు నింద్రజిత్తును గూడ ద్వంద్వయుద్ధంబున దొరించితివి. మా యల్ల మారియు నజయ్యుఁడునగు, రావణి మరణవార్త మాచెవులవేసి మాకానం దంబు నాపాదించితివి. అభయ దక్షిణ నొసంగితివి." అని పలుక మేనం బుల కలువొడమ విని రాముఁడు మిక్కిలి యక్కజంబునొంది ప్రాంజలియై వారి కిట్లనియె.

శ్రీరాముఁడు మునుల నింద్రజిత్తు నాధిక్యమునకుఁ గారణ మడుగుట.

పూజ్యులారా! మహావీర్యధుర్యులగు రావణ కుంభకర్ణ, మహోదర ప్రహస్త విరూపాక్ష మత్తోన్మత్త దేవాంతక నరాంత కాతికాయ త్రిశిరో ధూమ్రాక్షాదులఁ గాదని మీ రేల యింద్రజిత్తునే పొగడుచున్నారు? వాని ప్రభావ మెట్టిది? బలమెంత? పరాక్రమ మెంతటిది? కన్న తండ్రి కన్న వీఁ డేకారణంబున జన్యంబున మిన్నయై యున్నవాఁడు. ఇంద్రు నెట్లు జయింపఁ గలిగినాఁడు? అతఁ డొందిన వరంబు లెట్టివి? ఆమూలాగ్రముగా సెలవిండు. నేవినఁ గుతూహలపడుచున్నాను. రహస్యంబు గాదు గదా? నా యీప్రార్థనంబు ఆజ్ఞగాఁ దలంపరాదు సుఁడీ!" అని వాకొనిన శ్రీరామ చంద్రుని మాటలాలించి మహాతేజస్వియగు నగస్త్యుఁ డిట్లు వక్కాణించెను.

ఇది మొదటి సర్గము

---

## రెండవ సర్గము

అగస్త్యుఁడు శ్రీరామునకు రావణుని జన్మాదివృత్తాంతము దెలుపుట.

శ్రీరామా! వినుము. ఇంద్రజిత్తు కథావృత్తాంతమ్మును, తేజమ్మును, నధిక బలమ్మును, శత్రుసంహారకత్వమ్మును, అవధ్యత్వమ్మును, జన్మోదంత మ్మును, వరమహిమమ్మును, రావణకుల చరిత్రమ్మును వాక్రుత్తును.

కృతయుగంబునఁ బులస్త్యుఁడను బ్రహ్మర్షి కలఁడు; అతఁడు ప్రజా పతి సుతుఁడు; ప్రభువు; సాక్షాత్పితామహుఁడు. ధర్మమునుబట్టిగాని శీల మునుబట్టిగాని వాని గుణగణములు గణింప శక్యంబులుగావు. పేరునుబట్టి ప్రజాపతి పుత్త్రుఁడని చెప్పనొప్పును. ప్రజాపతి సుతుఁడుగావుట నాతఁడు దేవతలకును, సర్వజనులకు వల్లభుఁడాయెను. శుభ్రగుణశోభితుఁడు మహామతి యగు నా పులస్త్య మునిపుంగవుఁడు ధర్మముల నతివిస్తరముగా నెఱుంగఁ గోరి మేరుధరాధరంబు పొంతఁగల తృణబిందువను ఋషీశ్వరు నాశ్రమంబు నాశ్రయించి వేదాధ్యయనంబుచేయుచు జితేంద్రియుఁడు సువ్రతుఁడు నై తపంబొనర్చెను. అతఁడు తపంబున్న యాశ్రమతలంబు సర్వఋతుసంపదలు నుపభోగింపఁదగిన మిక్కిలి చక్కని చిక్కని యరణ్యప్రదేశమందుండుటం జేసి దేవపన్నగరాజర్షి కన్యలును అప్సరోంగనలును రమణీయంబును దర్శనీ యంబును నగు నా ప్రదేశంబున నాడుచుఁ బాడుచు వీడక నాదంబు గావిం చుచు వాని తపంబునకు నంతరాయంబు గావించిరి. అదికని పులస్త్యుఁడు కోపంబు దీపింప 'ఎవ్వతె తనకంటఁబడునో యామె గర్భంబు దాల్చుఁగాత'

మని శపించెను. అదివిని యాకన్యలందఱు వెఱచి పఱచి మఱి యాప్రదేశం బునకుఁ జనరైరి. రాజర్షి యగు తృణబిందువు కూఁతు రా శాపవృత్తాంతము వినలేదు. కావున నా యాశ్రమపదమును జేరి యందు నిర్భయురాలై చరింపఁదొడఁగెను.

అత్తఱి మహాతేజస్వియగు ప్రజాపతి తపంబుచేఁ బరిశుద్ధుఁడై వేదాధ్యయనంబు చేయుచుండెను. ఆ వేదధ్వని విని యామె యాతపోనిధినిఁగాంచి తత్క్షణంబ, విస్పష్టగర్భచిహ్నయై పాండుశరీరయై యాత్మదోషంబు పరికించి సముద్విగ్నమానసయై తత్కారణం బారయంగోరి నిజ జనకు నాశ్రమంబు చేరి సిగ్గుచేఁ దలవాంచి నిలువఁబడెను. తృణబిందు వామెను గాంచి 'అమ్మా! యేమిటిది ? నీకుఁదగని శరీరమునుదాల్చియున్మలించుచున్నావు ? చెప్పు' మన నామె దీనయై కైమోడ్చి తండ్రీ ! నాకిట్టి రూపంబేల కలిగెనో యెఱుంగఁ జాలను; కాని మహర్షియగు పులస్త్యుని దివ్యాశ్రమంబున కింతకుమున్న యేగితిని, అందాత్మసఖుల నెమకితిని, అక్కడ నెక్కడను నొక్కచెలికత్తెయు వచ్చిన జాడ కానరాదయ్యెను. నా రూపము మాత్రము చిత్రముగా నిట్లు మాఱెను. ఇదికని మనంబున ఘనంబగు భయంబునొంది తమ చరణసన్నిధి కరుదెంచితిని. అన విని తృణబిందువు ధ్యానంబునూని నిజంబారసి దానికిఁ గారణంబు పులస్త్యశాపంబకా నెఱింగికొని కూఁతుఁ దోడ్కొని వానియొద్ద కేగి యిట్లనియె.

## తృణబిందుఁడు పుత్త్రికను బులస్త్యున కర్పించుట.

'జాపికాగ్రణీ! సుగుణభూషితయగు మత్కన్యను భిక్షగా గ్రహింపుము. నన్నను గ్రహింపుము. తపశ్చరణయుక్తుఁడవు జితేంద్రియుఁడవు నగు నీకీమె నిత్యము శుశ్రూష యొనర్పఁగలదు.' అని విన్నవించు తృణబిందు వాక్యము నాలించి మేలెంచి యా భూసురుఁడా కన్యను గ్రహింప నిచ్ఛగలవాఁడై మంచిది యట్లే యొనర్పుమనెను. అంతఁ దృణబిందువు యథాన్యాయంబుగాఁ బుత్త్రికను బులస్త్యున కర్పించి నిజాశ్రమంబున కరిగెను. ఆకన్యయందే నివసించుచు నాథు నడుగులకు మడుగులొత్తుచుఁ దన సుగుణంబుల వానిఁ దనియించుచుండెను. మునిపుంగవుఁడును ఆమె శీలమునకును, నడవడికిని నమందానందంబు నొంది 'నితంబినీ ! నీ సుగుణసంపదకుఁ గరంబు పరితుష్టిగాంచితిని కాన దేవీ! నీ కిదే సర్వవిధంబుల నన్నుఁబోలువాఁడును, ఉభయ వంశోద్ధారకుఁడును, పౌలస్త్యుఁడనఁ బరఁగువాఁడును నగు పుత్త్రు నొసఁగెదను. నీవు నాచేయు వేదాధ్యయనము వినుటంజేసి నీ తనయుండు విశ్రవుండను పేరఁ బ్రసిద్ధిగాంచును. అని పలుకఁగా నామె మేనం బులకలు

వ్రేడము నాలించి సంతసించి యచిరకాలంబునన విశ్రవసుఁడను కుమారునిఁ గాంచెను. అతఁడు యశోధనవిరాజియై త్రిలోక విఖ్యాతుఁడై త్రయీవిద్య నార్జించి సమదర్శియై వ్రతాచారరతుఁడై తండ్రివలెఁ దపోనిష్ఠాగరిష్ఠుఁడై సత్యవ్రతుఁడై శీలవంతుఁడై శాంతస్వభావుఁడై శుచియై సర్వభోగ విరక్తుఁడై ధర్మపరాయణుఁడై పన్నె కెక్కెను.

ఇది రెండవ సర్గము

---

## మూఁడవ సర్గము

### విశ్రవసునకుఁ గుబేరుఁడు జన్మించుట.

భరద్వాజమహామునీంద్రుఁడు ఆ విశ్రవసుని వాని వృత్తాంతమును దెలిసికొని సంతసించి తన తనూజాతయగు దేవవర్ణిని వానికి నర్ధాంగిగా నొసంగెను. విశ్రవసుఁ డామెను శాస్త్రోక్తవిధినిఁ బరిగ్రహించి సంతతిని బొందుట శ్రేయస్కరంబని యెంచి, పరమానందంబు నొంది, బ్రహ్మ గుణ సంశోభితుఁడును, బరమ ధార్మికుఁడు వీర్యసంపన్నుఁడునగు పుత్త్రునామె వలనఁగాంచెను. అతఁడుదయింపఁగానె పితామహుఁడు తనబుద్ధితో యోజించి వానిని భావిధనాధ్యక్షునిగా నెఱింగి సంతోషితస్వాంతుఁడై విబుధులను గరన్మందులనుగూడి 'వీఁడు మూఁడుమూర్తులఁ దండ్రికిఁ బోలినవాఁడుగాన వైశ్రవణుఁడనుపేరఁ బ్రఖ్యాతుఁడగును.' అని నుడివె. అంత నావైశ్రవణుఁడు తత్సమీప తపోవనమునకేగి వ్రేల్చిన యగ్నివలె నైజతేజంబునఁ బ్రకాశిం చుచుఁ బ్రవృద్ధిఁగాంచెను. తదాశ్రమపదమునందున్న యా మహాత్మునకు 'ధర్మము నిత్యమైనది, ధర్మాచరణమే పరమార్థము' అను బుద్ధిపొడమెను. దానంజేసి యాతఁడొక మహావనంబునకుఁ జని భయంకరనియమబద్ధుఁడై వేయేండ్లు భీకరతపంబొనర్చెను. నీరంబులు మాత్రమె త్రావుచు గాలిమాత్రమె పీల్చుచు నిరాహారుఁడై తపంబుగావించు వాని కావేయేండ్లు నొక్కయేఁడుగాఁ గడచిచనెను. అంత నాసుస్వాంతుని తపంబునకు విరించి సంతసించి శతమఖసుపర్వపరివృతుఁడై వానిచెంత కరుదెంచి 'బిడ్డా! నీ దొడ్డతపంబునకు మెచ్చువచ్చె నీ వలసిన వరమూకోరుము. నీకు మేలగుఁగాక' యన వినమిత గాత్రుఁడై వైశ్రవణుఁడు సురజ్యేష్ఠునిఁగాంచి 'భగవానుఁడా! ధనాధిపత్య మును లోకపాలకత్వమును అనుగ్రహింపుము' అని వేఁడుకొనెను.

### బ్రహ్మ కుబేరున కుత్తర దిక్పాలకత్వమొసఁగుట.

అరవిందాసనుఁడా ప్రార్థనంబు నాలించి దేవతలతోపాటు పరితుష్టి గాంచి నీ కోరినవరం బొసంగితిని. నేను నాల్గవలోకపాలుని సృష్టింపనెంచియుం

టిని. యమేంద్రవరుణు లే పదంబునుగోరిరో నీవు నాపదమ్మునే కోరితివి. కానఁదత్తుల్యపదమును బొందుము. నిధీశుఁడవుగమ్ము. మఱి నీవు యమేంద్ర వరుణులలో నాల్గవవాఁడవు కాఁగలవు.

ఇదిగోఁ జూడు ఇది పుష్పకవిమానము. మార్తాండబింబమును విడంబించుచున్నది. ప్రతిగ్రహింపుము. ఇందు సుఖోపవిష్టుఁడవై విహరింపుము. త్రిదశులతోఁ దుల్యగౌరవము నొందుము. నీకు శుభంబగుఁగాక. మే మంద అను మామాస్థలంబుల కరుగుచున్నాము. నాయనా! 'నీకు వరద్వయం బొసంగి మేము కృతకృత్యులమైతిమి.' అనిపలికి వేల్పులు వెంటరా నిజనివాసంబున కరిగెను.

బ్రహ్మాదులట్లు చనఁగానె ధనేశుఁడగు వైశ్రవణుఁడు పరిశుద్ధాత్ముఁడై తండ్రింగాంచి నమస్కరించి "భగవానుఁడా! చతురాననునివలన వలచిన వరంబులను బొందితిని. కాని ప్రజాపతియగు విధాత నాకు నివాసమొసఁగఁడయ్యెను. నీవు నాకనుగ్రహించి యేప్రాణికిని గించిత్తయిన బాధ కలుగని మంచి ప్రదేశము నెంచి యొసంగుము" అని ప్రార్థింప విశ్రవసుఁడు నందనునిఁ గాంచి "కుమారా! ధర్మజ్ఞా! వినుము! దక్షిణసముద్రతీరమునఁ ద్రికూట మను పర్వతరాజముగలదు. ఆ కొండకొనను దేవేంద్రపట్టణమువలె విశాలమై, విశ్వకర్మ నిర్మితమై రమ్యమైన లంకాపట్టణము గలదు. అమరావతి యింద్రునకుఁబోలె నది రాక్షసులకు నివాసస్థానమై వెలుఁగొందుచుండును. అది బంగారు ప్రాకారములతోడను, అగడ్తలతోడను, యంత్రములతోడను, శస్త్రముల తోడను, మరకత వైడూర్యతోరణంబులతోడను, రమణీయంబై యుండును. ఇంతకు మున్నె యాపురంబును రాక్షసులు విష్ణుభయార్దితులై విడిచిచనిరి. రాక్షసులు పాతాళమున కరుగుటచే నాపీడు పాడువాఱి వన్నెదఱిగియున్నది. శూన్యమైన యాలంకాపత్తనమున కిప్పుడు ప్రభువులేఁడు. కాన నాయనా! నీవా నగరమున నివసించుటకై యథాసుఖముగాఁజనుము. నిర్దోషమైనయందు సుఖంబుండుము. నీ యునికింజేసి యందెవ్వరికి నెట్టిబాధయుఁ గలుగదు." అని పలికిన విని వైశ్రవణుఁడు ముదమొంది తండ్రి ముదలగొనిచని లంకాపట్టణంబున నివసించెను. రామా! నీ శాసనంబునఁజేసి యచిరకాలంబులో నా లంకాపట్టణము హృష్టరాక్షస సహస్రంబులచే నిండియుండెను. పుణ్యజనులకు నేతయై వైశ్రవణుఁడు సంప్రీతిచెంది కంధియే కందకముగాఁగల యాలంకాపురమందు డెందంబానందంబునొంద నివసించుచుఁ బ్రతికాలమందును బుష్పకవిమానంబునెక్కి తల్లిదండ్రుల సన్నిధికి నయంబు భయంబు గదురఁజనుదెంచుచుండును. దేవగంధర్వగణంబులచేఁ గొనియాడఁబడుచుం

డును. నిజగృహంబున నప్సరోంగనలు నిత్యంబు నృత్యంబు గావించుచుండ లోకబాంధవునిభాతి. నైజతేజంబున వెలుఁగొందుచుండును.

ఇది మూఁడవ సర్గము

---

## నాల్గవ సర్గము

### శ్రీరాముఁడగస్త్యునిఁ బూర్వరాజుల వృత్తాంతమడుగుట.

అగస్త్యుల వచసరచనంబు నాలించి రాముఁ డచ్చెరుపాటుచెంది 'తొల్లి యీ లంకయందు రక్కసు లెక్కరణి జనించిరో కదా' యని శిరంబు పంకించి త్రేతాగ్నిమూర్తియగు కుంభజన్ము నాలోకించి యిట్లనియె.

"భగవానుఁడా! పూర్వముగూడ నీలంక రాక్షసుల కునికిపట్టని తాము సెలవిచ్చితిరి. తమ పలుకుల పొలుపు తలంప నాకక్కజము మిక్కిలి గలుగుచున్నది. పూర్వదేవతలు పులస్త్య వంశసంజాతులని మేము వినియుంటిమి. అట్లు కాదని మీమాటలఁ దేటపడుచున్నది. రావణుని కంటెఁ గుంభకర్ణుని కంటెఁ, బ్రహస్తుని కంటె, వికటుని కంటె, రావణ పుత్త్రులకంటె నా రాక్షసులు బలవత్తరులా? వారికి నాదిపురుషుఁ డెవ్వఁడు? వాని పేరేమి? వాని తపోబల మెట్టిది? ఏయపరాధంబునంజేసి వారు విష్ణువుచే లంకనుండి తఱుమఁబడిరి? సవిస్తరంబుగా నాకెఱింగింపుఁడు! సూర్యుఁడు చీఁకట్లు పోఁద్రోలునట్లు నాసందియంబులు దలఁగింపుఁడు" అన విని యగస్త్యుఁడు సంస్కారాలంకృతంబగు రామ వాక్యంబున కానందంబు సెంది మందహాసంబు చిందులువాఱ నిట్లనియె.

### యక్ష రాక్షసుల యుత్పత్తి.

తొలుదొల్తఁ బద్మసంభవుఁడగు బ్రహ్మ నీళ్లుల సృజించి వానిని గాపాడుటకై సత్వముల సృష్టించెను. ఆ సత్వములు ఆఁకలి దప్పులచేఁ బీడితములై సృష్టికర్తయగు విరించి కడకేగి తమ చేయుకార్యం బెయ్యది యాన తిమ్మని. యడఁకువతో విన్నవించుకొనఁ జతురాననుఁడు వానిఁ గని నవ్వుచు 'మీరీ నీళ్లను బ్రయత్నమ్మునమైఁ గాపాడుచుండుఁ డని' యాన తిచ్చెను. అది విని యందుఁ గొన్ని సత్వంబు లాఁకలిచే నకనకలాడి నీళ్ల నాహారింపనేగెను. కొన్ని నీరంబులను రక్షింపనరిగెను. వానికిలెఱిఁగి బ్రహ్మ ధాత్వర్థ యుక్తముగా నిట్లనియె.

'జక్ష' యనునది భక్షణార్థకమైన క్రియ. 'రక్ష' యనునది పాలనార్థకమైన ధాతువు. జక్షణమువలన యక్షులనియు, రక్షణమువలన రాక్షసులనియు

మీరిఁక వ్యవహరింపఁబడుదురు. కాన మీ మీ యభిమతంబుల నెఱింగింపుఁడన నందు అంబుభుంక్షితములు భక్షించెదమనెను. లాఁతివి రక్షించెదమనెను. భక్షింతు మన్నవారిని యక్షులు. రక్షింతు మన్నవారిని రాక్షసులు. కండని మొదటివేల్పు మాఁదలించెను. అక్కడ రాక్షసాధిపులైన 'హేతి ప్రహేతి' యను నిరువు రన్నదమ్ములు గలరు. వారు మధుకైటభతుల్యులు. అరిందములునై మెసంగిరి. ప్రహేతి ధార్మికుఁడగుటఁ దపోవనమున కరిగెను. హేతి పరిణయవాంఛచే భార్యార్థమై యిందు నందు నధికయత్నంబుగావించి కాలుని సోదరియు భయావహాయునగు 'భయ' యను కన్యను స్వయంబుగఁ బెండ్లియాడి విద్యుత్కేశుఁడను పుత్త్రు నామెవలనఁ గాంచి పుత్త్ర వంతులలో శ్రేష్ఠుఁడయ్యెను. దీప్త సూర్యప్రకాశుఁడగు విద్యుత్కేశుఁడు జలంబుల నడుమఁ బద్మంబు భాతిఁ బ్రవృద్ధిచెందెను. హేతి జవ్వనంబున నివ్వటిల్లుచున్న నందనునకు సుందరాంగి నొకతెఁ బెండ్లిచేయ నెంచి సంధ్యాసమ ప్రభావయు సర్వలక్షణ లక్షితయునగు, 'సాలకటంకట' యను సంధ్యా పుత్త్రికను అర్థించెను. 'సంధ్యయు ఆఁడు బిడ్డ యెప్పటికైనఁ బరుల కీయవలసినదే కదా' యని యెంచి, తన కూఁతును విద్యుత్కేశున కొసంగెను. విద్యుత్కేశుఁడు సంధ్యాతనయను గృహలక్ష్మిగాఁ బడసి, శచీదేవితో నింద్రుఁడు వోలె రమించుచుండెను. అంతఁ గొంత కాలంబునకు సముద్రమువలన మేఘరాజివలె విద్యుత్కేశునివలన సాలకటంకటగర్భంబు దాల్చెను.

## సుకేశుని జన్మ వృత్తాంతము.

పిమ్మట నారక్కసికొమ్మ మందర పర్వతమున కరిగి యగ్నిజంబగు గర్భంబును గంగవలె ఘనగర్భసమ ప్రభంబగు గర్భంబును బ్రసవించి యా బిడ్డ నచ్చటన విడిచిపుచ్చి పచ్చవిల్తు కేళిందేలనెంచి మగని కడకరిగి కడు పాఱఁ గన్న కొడుకును మఱచి వెఱసఱవక భర్తంగూడి క్రీడించుచుండెను.

తల్లిచే విడువఁబడిన యాశిసుఁగు మేఘగంభీరస్వనుఁడై శరత్కాల శరజాప్తునివలె భాసిల్లుచుఁ దన పిడికిలిని నోరఁబెట్టుకొని మెల్లగా రోదనము చేసెను.

అంతలో శివుఁడు పార్వతీ సహితుఁడై నంది నెక్కి వాయుమార్గంబునఁ బోవుచు నా యేడ్పు వెలుంగు విని వానింగనెను. ఉమాదేవి వాని యందుగద యడంచి రక్షింపుమని నాథుని వేఁడుకొనెను. ప్రియురాలి మాటదాఁటఁజాలక భవుఁడు తన శంకరత్వంబు సార్థకంబుగా వానికిఁ దల్లికి నీడగు నీడును అమరత్వంబును అక్షయంబై యవ్యయంబైన యాకాశగమనంబు గల పురంబును గర్భంబు కనికరంబు మెఱయ నొసంగెను. కాత్యాయనియు రాక్షసులకు సద్యో

గర్భప్రాప్తియు, సద్యః ప్రసవంబును మాతృవయస్సమంబగు సద్యోవయః ప్రాప్తియు వరంబులుగా నొసంగెను.

అంత సుకేశుఁడు వరదాన గర్వితుఁడై ఖగపురగామియై హరిహర పార్శ్వంబుల కరిగి శతమఖుని చందంబున నెల్ల యెడలఁ బెల్లుబ్బి చరింపఁ దొడంగెను.

ఇది నాల్గవ సర్గము

---

## అయిదవసర్గము

ధార్మికుఁడును లబ్ధవరుండును నగు సుకేశునిఁగాంచి విశ్వావసుసమ ప్రభాకలితుఁడును, గంధర్వకులగ్రామణియు నగు గ్రామణియనువాఁడు హృదయంబున ముదమొంది లోకవిఖ్యాతయు రూపయౌవనశాలినియు అపరలక్ష్మియు నగు 'దేవవతి' యను తన తనయను వానికి రాక్షస లక్ష్మి వోలె ధర్మయుక్తంబుగ ననురక్తభావుఁడై యెల్లరకు మెచ్చువుట్ట నిచ్చెను. ఆమచ్చెకంటి వరదానకృతైశ్వర్యుఁడును వల్లభుఁడు నగు వల్లభునిఁ బడసి పెన్నిధిఁగన్న పేదవలె సంతుష్టురాలయ్యెను. దేవవతిం గూడిన సుకేశుఁడు అఁడేనుఁగుఁ గూడి యంజనపర్వతంబును వీడి చనుదెంచు వారణంబు తీరున సొరు మీఱెను.

### సుకేశునకు మాల్యవదాదులు పుట్టుట.

రామా! సుకేశుఁడగు సుకేశుఁడు దేవవతియందు ఉగ్రసమ విగ్రహులగు మాల్యవంతుఁడు సుమాలి మాలి యను మూఁగురు తనయులఁ గనెను. వారు మువ్వురు స్థిరంబులగు త్రిపురంబులువలెఁ బ్రజ్వలితంబగు నగ్నిత్రయంబు భాతి ఉగ్రంబగు మంత్రత్రయంబుమాడ్కి, ఘోరంబగు రోగత్రయంబుపగిది భాసిల్లుచు నొప్పరికించిన వ్యాధులవలె నుప్పరంబు నంటుచు వృద్ధిగాంచిరి. తమ తండ్రి తపోబలంబున వరంబు లొందుట నైశ్వర్యవంతుఁడగుట యెఱింగినవారై వారు తాము ను ఐశ్వర్యంబు నొందఁ గృతనిశ్చయులై తపంబు గావింప మేరుధరాధరంబున కరిగిరి. రామా! అట్లరిగి వారు ఘోరనియమము నూని సత్యము ఋజుభావము శమముగలవారై దుష్కరాతి దుష్కరంబులగు తపంబులచే దేవదానవ మానవలోకంబులు మూఁటిని అట్టుడికినట్లు తపింపఁజేయ సర్వభూతంబులు భీతిల్లెను. అంతఁ జతుర్ముఖుఁడగు బ్రహ్మ విమానారూఢుండై యచ్చటికిఁ జెచ్చెర వచ్చి వారిఁ జేరి "మీకు వరంబు లొసంగెదఁ గోరుకొనుఁడన" నాసుకేశపుత్త్రులు దేవేంద్రగణ పరివృతుండగు

వానిని బమ్మదేవరగా నెమ్మనంబుల నెఱింగి భూమిజమ్ములవలె వడ వడ వడంకుచుఁ జేతులు జోడించి "దేవా! నీవు మాతపంబులకు సంతసించి మాకు వరంబులు దయచేయఁదలంచితివేని అజెయ్యులము శత్రుసంహారకులము చిర జీవులము ప్రభవిష్ణులము పరస్పరానుర క్తవ్రతులము అగునట్లు వరం బను గ్రహింపుము." అని ప్రార్థింప బ్రాహ్మణ వత్సలుఁడగు బ్రహ్మ 'యట్ల యగుఁ గాక' యని పలికి నిజలోకంబున కరిగెను.

## మాల్యవదాదులు లోకంబుల బాధించుట.

రామా! అంత నారాత్రించరులందఱు వరదానగర్వితులై నిర్భ యులై సురాసురుల బాధింపఁదొడఁగిరి. వారిచే బాధితులగు దేవతలు ఋషులు చారణులు నరకమందున్న నరుల కరణి నరతులైరి. అంత నారాక్షసులు సంహృష్టులై శిల్పిశ్రేష్ఠుఁడగు విశ్వకర్మకడకరిగి 'మహామతీ! నీవు బలపరా క్రమోత్సాహంబులు గలిగి తమతేజున నెల్లరఁదలకడచు వేలుపులకు మేలు భవనంబులు గట్టిన దిట్టవు. మాకుఁగూడ హిమవంతంబు పొంతఁగాని, మేరువు కడఁగాని, మందరమునొద్దఁగాని, మహేశ్వర గృహతుల్యంబగు నొక యున్నత గృహంబు నిర్మింపుమ'న విశ్వకర్మ అమరేశ్వరున కమరావతివలె వారి కొక యునికిపట్టు చూపువాఁడై యిట్లు వచించెను.

## మాల్యవదాదులకు విశ్వకర్మ లంకావృత్తాంతము తెలుపుట.

"రాక్షసేశ్వరులారా! వినుఁడు! దక్షిణ సముద్రతీరంబునఁ ద్రికూట మను పర్వతము గలదు. అందె యాత్రికూటమును బోలి సువేలమను మఱి యొక్క పర్వతము గూడఁ గలదు. ఆశైల శిఖరంబు నడుమ మబ్బుల యుబ్బును గెబ్బుచుఁ బక్షులకుఁ గూడఁ జొరరానిదై ఉలులచే నలువలంకులు తీర్చి దిద్దఁబడినదై ముప్పది యామడ వెడల్పును, నూఱామడ నిడివియుఁ గలదై పసిఁడి ప్రాకారములు, పైఁడి తోరణములు గలిగి యొప్పారు లంకానగ రము ఇంద్రాజ్ఞచే నాచే నిర్మింపఁబడినది. ఇంద్రుఁడు దేవతలు అమరావతి యందువలె మీరాలంకయందు దుర్ధర్షులై వసింపుఁడు. మీరు లంకాదుర్గమును బహురాక్షససమన్వితులై ప్రవేశింపఁగనె శత్రువుల కభేద్యులై శత్రు సూదనులై సర్వత్ర యొసంగఁ గలరు."

అని వచించిన విశ్వకర్మ వచనంబుల కలరి వారు న క్తంచరభట సహ స్రంబులతో లంకాపట్టణంబున కేగి దిట్టమైన ప్రహారులు, లోఁతైన యగ డ్తలు, బంగారు గృహంబులు గల్గి మెఱుంగులీను నావీటి సొరు పరికించి హృద యంబులు ముదంబునఁ బొదల యదవద లేక వీకమై నందు విహరించుచుండిరి. రామా! వారట్లు స్వేచ్ఛావిహారులై పొంపిరిపోవు కాలమందె నానాధర్మ

పారంగతయగు 'నర్మద'యను గంధర్వ స్త్రీయొక్కతె పేరెక్కెను. ఆమెకు హ్రీ శ్రీ కీర్తి సమద్యుతి భాసితలగు ముగ్గురు కొమారితలు గలరు. పుత్త్రికా శర్మదయగు నానర్మద తాను దేవాంగన యయ్యును పూర్ణచంద్రనిభాననలు ప్రహృష్టమతులు నగు తన కన్యలను మఘానక్షత్రమందు నారాక్షసులు ముగ్గురకు జ్యేష్ఠానుక్రమంబున నొసంగెను. అచ్చరప్రోఁడలంగూడి చరించు నిర్జరులవలె వారు తమ ప్రోఁడలఁ గూడి క్రీడింపఁదొడఁగిరి.

## మాల్యవదాదులకుఁ బుత్త్రులుదయించుట.

రామా! అందు మాల్యవంతుని భార్య త్రిలోకసుందరియగు సుందరి. ఆసుందరియందు మాల్యవంతుఁడు వజ్రముష్టి, విరూపాక్షుఁడు, దుర్ముఖుఁడు, సుప్తఘ్నుఁడు, యజ్ఞకోపుఁడు, మత్తుఁడు, ఉన్మత్తుఁడు, అను కుమారులను, 'అనల' యను కుమారికను గాంచెను.

సుమాలి పూర్ణచంద్రనిభాననయగు కేతుమతినిఁ బెండ్లియాడి ప్రాణములకన్న మిన్నగా నాక్రొన్ననబోఁడినిఁ బ్రేమించుచుండెను. ఆ కేతుమతియందు సుమాలి, ప్రహస్తుఁడు, అకంపనుఁడు, వికటుఁడు, కాలకార్ముకుఁడు, ధూమ్రాక్షుఁడు, దండుఁడు, సుపార్శ్వుఁడు, సంహ్రాది, ప్రఘసుఁడు, భాసకర్ణుఁడు, అను పుత్త్రులను బాల, పుష్పోత్కట, కైకసి, కుంభీనసి యను పుత్త్రికలను గనెను.

మాలి తనకు నాలిగా 'వసుధ' యను గంధర్వ స్త్రీనిఁ బరిగ్రహించెను. ఆమె స్వక్షియను యక్షపక్ష్మలాక్షికి నీడుజోడై పద్మాక్షియై, రూపశాలినియై యేపుసూపుచు మగని మనంబు దనియించుచుండెను. మాలి ఆచక్కెరబొమ్మవలన అనిలుఁడు, అనలుఁడు, హరుఁడు, సంపాతి, యను సూనులను బడసెను. వీరె కొన్నాళ్లకుఁ బిమ్మట విభీషణమంత్రులై మంతుకెక్కిరి. పదంపడి యామాల్యవదాదులు మూగురు నిశాచర పుత్త్రశతంబులం గూడి, వరదానంబున భృశంబు గర్వించి, బలవీర్యంబుల మిన్నుమన్నుఁ గానక, గాలివోలె జగంబు నందంతటఁ జరించుచు, దురాసదులై యుద్ధంబుల మృత్యుతుల్యులై దేవతలఁ గారించుచు దేవేంద్రునిఁ దటుముచు, జడదారులఁ బెడదారులఁ బట్టఁజేయుచు, నాగుల వేఁగఁజేయుచు దానవుల దీనులఁ గావించుచు జన్నంబులకు బన్నంబు లొదవించుచు మున్నరకమైఁ జరింపఁ జొచ్చిరి.

ఇది అయిదవ సర్గము

## ఆఱవ సర్గము.

### మాల్యవదాదులకు భయపడి దేవతలు శివుని శరణంబు వేఁడుట.

అక్కఱటి రక్కసులచేఁ జిక్కులువడిన దేవాదులెల్ల మిక్కిలికంటి వేల్పు చక్కటికింజని తమయెడ నక్కటికము చూపుమని వేఁడుకొనుచు మ్రొక్కి 'దేవాదిదేవా! జగత్సృష్ట్యంతకర్తా! అజా! అవ్యక్తరూపా! సర్వలోకాధారా! సకలలోకారాధ్యా! పరమగురూ! కామారీ! త్రిపురాంతకా! త్రిలోచనా! ప్రజాపతీ! భగవానుఁడా! ఆపన్నశరణ్యా! మా మొఱాలకింపుము! బ్రహ్మవరగర్వితులు శత్రుసంహారకులు నగు సుకేశపుత్త్రులు ప్రజలనెల్ల నానాబాధలు పెట్టుచున్నారు. సకలజన శరణ్యంబులగు మాయాశ్రమంబులు అశరణంబులైనవి. ఇంద్రుండు నాకలోకంబునుండి తఱుమఁబడినాఁడు. తామె యింద్రులై యా యుక్కివులైన రక్కసులక్కడ నిక్కుచు నీల్గుచు విఱ్ఱవీఁగుచుఁ గ్రీడించుచున్నారు. 'నేనే విష్ణుఁడను, నేనే రుద్రుఁడను, నేనే బ్రహ్మను, నేనే మహేంద్రుఁడను, నేనే యముఁడను, నేనే వరుణుఁడను, నేనే చంద్రుఁడను, నేనే సూర్యుఁడను' అని యారాక్షసులు వరదాన దర్పితులై సంగరమదోన్మేషులై వేర్వేఱ వాకొనుచు మమ్ముల ముమ్మరమ్ముగ నుమ్మలికమ్ముల పాలొనర్చుచున్నారు. కాన దేవా! భయార్తులమైన మమ్ము నభయం బిచ్చి కాపాడుము! నీవు దక్క నన్యుండు మాకు దిక్కొక్కరుండును లేఁడు. కానఁ గ్రూరరూపమును దాల్చి దేవవిరోధులను జంపుము.

అని గద్గదకంఠులై విన్నఁదనంబుతోఁప విన్నవింప నీలలోహితుఁడు సుకేశునకుఁ గూర్చువాఁడై వారి కిట్లనియె.

దేవతలారా! నే నారక్కసుల జక్కాఁడను. వారు నాకవధ్యులు. అయినను వారెవరిచేఁ జంపఁబడుదురో యారహస్యము మాత్రము చెప్పెదను. ఆలింపుఁడు 'మీరీదారినె పూనికమెయిఁ జని యాపన్నశరణ్యుఁడగు వెన్నునిశరణొందుఁడు. సర్వలోక ప్రభుండగు నా చతుర్భుజుఁడు మిమ్ముఁ గారించుచు నా పొలదిండి మూఁకలనెల్లఁ బరిమార్చి మీ కభయంబొసంగును.

### దేవతలకు విష్ణు వభయమిచ్చుట.

అని పరమశివుండు పరమదయాళుండై పలుకఁగానె వారందఱు జయజయనినాదంబులతో మహేశ్వరుని అభినందించి నిశాచరభయార్దితులై విష్ణుసన్నిధికరిగి శంఖచక్రగదాధారియగు నా విష్ణునకు నమస్కరించి సంస్తవంబు గావించి చిత్తంబులుత్తలపాటునఁ దత్తరంబు చెంద నిట్లనిరి.

"దేవా! త్రేతాగ్నిసన్నిభులగు సుకేశసుతత్రితయంబుకతంబున మాకు నిలువ నీడలేకుండఁబోయినది. త్రికూట శిఖరంబునఁగల దుర్గమంబగు లంకానగరంబు నావాసంబుగాఁజేసికొని యాదోషాచరులు మమ్ముఁగడగండ్ల పాలొనరించుచున్నారు. మధుసూదనా! వారిఁజీఁకి మాకు మేలొనర్పఁగూర్పుము. శరణార్థులమగు మమ్ము రక్షింపుము. సర్వేశ్వరా! నీవే మాకు దిక్కు. వరి గర్వంబునఁ గన్నుగానకయున్న యా దుష్టరాక్షసులయు వారి బంధుమిత్రపరి వారములయుఁ గమలంబులఁబోని ముఖంబులను జక్రంబున ఖండించి దండ ధరునియండనుండ నంపుము, భయభ్రాంతులమైన మాకభయప్రదాతవై సూర్యుండు మంచువిరియించుమాడ్కి మా భయంబు లయంబునఁ బోఁగొట్టుము. నీ శరణాగతరక్షకత్వము సార్థకతనొందఁజేయుము."

అని ప్రార్థించిన మునిగణ, సురనికరంబులఁగని వనమాలికాధరుండగు జనార్దనుండు కనికరించి యభయమిచ్చి "దేవతలారా! ఈశ్వరవరదర్పితుఁడైన సుకేశుని, వానిపెద్ద కొడుకగు మాల్యవంతుని, మాల్యవంతుని తమ్ములను గూడ నే నెఱుఁగుదును. అతిక్రాంతమర్యాదులగు నా రాక్షసాధములను నేన పరిమార్చెదను. సంక్రుద్ధులైయున్న మీ రెల్ల విగతజ్వరులై సుఖయింతురుగాక" యని పలుకఁ బ్రభవిష్ణువైన యావిష్ణువు సుధామధురవాక్యముల వీనులార విని సంతోషితస్వాంతులై కరంబులు శిరంబులఁ గీలించి మురహారిని గొనియాడి నిజావాసంబులకుఁ జనిరి. అంత దేవతలుచేయు యత్నంబు మాల్యవంతుఁడు విని వీరులైన తనయనుజులఁ గాంచి యిట్లనెను.

మాల్యవంతుఁడు దేవతలపై దాడివెడల నాలోచించుట.

సోదరులారా! అమరులును జడదారులును గలిసి శంకరుని యంకమున కేగి మనల వధింప నెంచుచు ముక్కంటితో "దేవా! వరదాన బలోద్ధతులు ఘోరాకారులు నగుసుకేశసుతులు మితిమీఱిన కడంకతో మమ్ముఁ జీటికిమాటికి గాటంబుగ బాధించుచున్నారు. ఆ ముగ్గురక్కసులచేఁ దిరస్కృతులమై శక్తితొలంగి తలదాచుకొనఁ జోటులేక యటమటించుచున్న మా యిక్కట్టులు బాపుము. మాకు క్షేమంబు చేకూర్పుము. పరదాహకవీరుఁడవగు నీవు హుంకారమాత్రముననే యానక్తంచరులను దగ్ధంబు గావింపుము."

అని వినయంబున మనవిచేసికొనిన యదితితనయుల మనవుల విని యంధకారి తలయూఁచి చేతులు విదిర్చి యిట్లనియె.

"సుపర్వులారా! ఆ సుకేశపుత్త్రులు నాకు భక్తులగుటఁ బుత్త్రతుల్యులు కావుట బవరంబున వారు వధింపరానివారు. అయినను వారి మరణ

రహస్యంబు మీకు వాకొందును. వినుఁడు. నా చెప్పిన చొప్పునఁ జనుఁడు, మనుఁడు. శంఖచక్రగదాధారియై పీతాంబరుఁడై జనార్దనుఁడై నారాయణుఁడై శ్రీమంతుఁడై యింపెసలారు శ్రీహరిని మీరు శరణంబునొందుఁడు; ఆతండె మీ కష్టంబులు గట్టెక్కింపఁగలఁడు.'' అని సాదరంబుగ వచించిన యీశ్వరుని రహస్య వాక్యంబుల కభినందించి వారు శ్రీకృష్ణమందిరంబునకుఁ జని సర్వంబును నివేదించిరి. వారికెల్ల నుల్లంబు చల్లఁబడ ఫుల్లాబ్జాక్షుఁడు "సురారుల మడియింతును, మీరు విగతజ్వరులుకండు" అని యభయ మొసఁగెను. తమ్ముఁగుఱ్ఱలారా! భయభీతులైన దేవతల రక్షించుపొంటె హరి మనలఁ జంపఁ బ్రతిజ్ఞ చేసియున్నాఁడు, కానఁ గర్తవ్యంబు నూహింపుఁడు. విష్ణుఁడు సామాన్యుఁడు కాఁడు, హిరణ్యకశిపునిఁ బరిమార్చినాఁడు; నముచినిఁ ద్రుంచినాఁడు; కాలనేమినిఁ గాలుప్రోలికనిచినాఁడు; సంహ్రాదుని సంహరించినాఁడు; రాధేయుని మడియించినాఁడు; లోకపాలుని ఖండించినాఁడు; యమళార్జునుల నాశముచేసినాఁడు; హార్దిక్యునిఁ బొలియించినాఁడు; శంభుని నఱికినాఁడు; నికుంభుని సమయించినాఁడు; జలజాక్షునిచేఁ బొలిసిన యీపొలదిండి జోదులెల్ల యుద్ధంబున నెన్నండు నపజయం బెఱుంగరు వీరందఱు శతక్రతువు లొనర్చిన మేటులు; అందఱును మాయావిదులు; అందఱును సర్వశాస్త్రపారంగతులు; అందఱును శత్రుభయంకరులు. అట్టి జగాజట్టులగు వీరెల్ల శ్రీమన్నారాయణునిచేఁ గోటానఁగోట్లు జన్యంబున ససైన్యంబుగ మడసిరి. కానఁ గార్యగతి తలంచి యెల్లరకు క్షేమము నొడఁగూర్ప నిప్పుడ యత్నింపుఁడు; మనల జయింపనెంచిన వనజాక్షుని జయించుట సుకరంబుగాదు; సరికదా! పై పెచ్చు దుఃఖకరంబు."

అని వచియింప నూఁకొని సుమాలియు, మాలియు నశ్వనీదేవతలింద్రునకుఁ జెప్పినట్లు జ్యేష్ఠభ్రాతతో నిట్లనిరి. "అన్నా! మనము కొదువలేకుండ వేదములు చదివితిమి; దానములు చేసితిమి; జన్నము లొనర్చితిమి; అష్టైశ్వర్యములఁ దులఁదూఁగితిమి; నిరామయమయిన యాయువును బొందితిమి. కాన నిర్భయులమై శస్త్రతరంగయుతమై యచంచలమై యక్షోభ్యంబైన దేవసాగరమునుజొచ్చి త్రచ్చి స్వధర్మమును న్యాయమార్గమున స్థాపింతము. జితారులమగు మనకు సాటియెవ్వరు? మృత్యుభయ మెక్కడిది? కృష్ణుఁడు గాని రుద్రుఁడుగాని యింద్రుఁడుగాని యముఁడుగాని మఱియెవ్వరుగాని మనలఁజెనకవణఁకుదురు. రాక్షసేశ్వరా! అధోక్షజుఁడు మనపైఁ గినియుటకుఁ గారణంబు గానరాదు. అమరులు ప్రేరేచుటచేత నే యాతని చేతంబు ప్రజ్వలించెను. కాన మానవంతులమైన మనమెల్ల నొక్కటిగాఁ గూడి దాడివెడలి యీ బెడదకు హేతుభూతులైన యాదేవతల హింసింతము" అని నిశ్చయించి

తమ యుద్ధయత్నంబు చాటఁబఁచి, జంభుఁడు, వృత్రుఁడు, బలుఁడునను రాక్షసులవలె వెలింగి సస్సైన్యులై క్రోధంబు లినుమడింపఁ గదనంబుసేయ బయలువెడలిరి.

## మాల్యవంతుఁడు దేవతలపైకి యుద్ధమునకేఁగుట.

రామా ! మహాకాయులు మహాబలులు నగు నారాక్షసులందఱు యుద్ధోద్యోగము చక్కఁగా నిర్వర్తించి, రథంబుల నెక్కియు నడగొండలంబోని మదపుటేనుఁగుల నధిరోహించియు గుఱ్ఱములపైఁ గూర్చుండియుఁ గంచరగాడిదలపై నధివసించియు నావుల నధిష్ఠించియు నొంటెలపై నుపవిష్టులై శింశుమార (పెద్దచేఁప), భుజంగమ, మకర, కచ్ఛప, మీన, విహంగమ, సింహ, శార్దూల, వరాహ, సృమర, చమరంబుల నారోహించియుఁ గ్రిందుమీఁదును గానక యమందగమనంబుల లంకానగరంబును వీడి సురలోకంబు మీఁదికి దాడి వెడలిరి. అంత లంకాపురంబునఁగల భూతంబులన్నియు రానున్న లంకానాశనమును గాంచి భయపడి కలఁగుండుచెందెను. అర్ణవంబుల నాపోశనంబు పట్టఁజనునట్లు తూర్ణంబుగఁ జనుచున్న యా శతసహస్రరాక్షసవర్గంబుతోపాటు లంకయందలి దైవతంబులుఁగూడ వెడలిచనెను.

## లంకలో నుత్పాతములు పొడసూపుట

వారట్లు బయలువెడలఁగానె భూమ్యాకాశములయందుఁ గాలప్రేరితములై, భయావహంబులగు పెక్కు ఉత్పాతంబులు రాక్షసుల వినాశంబును, భృశంబును సూచించుచుఁ బొడసూపెను. మేఘములు ఎముకలతోడి వేఁడి నెత్తురు గురిసెను. సముద్రములు మేరమీఱెను. పర్వతములుఱ్ఱూఁతలూఁగెను. వేలకొలంది భూతంబులు ప్రళయకాలపర్జన్య గర్జానుకారులగు అట్టహాసంబులు సేయుచు, నృత్యంబులు సల్పుచు నెగుఱఁదొడంగెను. నక్కలు వెఱ్ఱి చూపులతో దారుణంబుగ నఱచెను. గ్రద్దలు పిండుగట్టి నోళ్లనుండి నిప్పుకలు గ్రక్కుచు నా రక్కసుల శిరంబులకు సూటిగా మాటిమాటికి మింటిపైఁ గుమ్మరిసారివలెఁ దిరుగసాగెను. రక్తపాదంబులు కపోతములు, శుకపికశారికలు ద్రుతగతి నిటునటు పఱచెను. కాకులు కావు కావుమని యఱచెను. పిల్లులు గొల్లుమనెను; ద్విపాదజంతువులుగూడ వానీడి యేడ్చెను. ఆ మహోత్పాతంబులఁగాంచియు బలగర్వితులగు నా పూర్వదేవతలు లక్ష్యపెట్టక మృత్యుపాశబద్ధులగుట వెనుకడుగు వేయక యుద్ధమునకు సన్నద్ధులై సాగిపోయిరి. యజ్ఞంబులకు నగ్నిభట్టారకులువలె నా రాక్షసులకు మాల్యవంతుఁడు, సుమాలి, మాలి యనువారు నాయకులై ముందు నడచిరి. యాచకులు దాతనాశ్రయించునట్లు రాత్రించరులెల్ల మాల్యవంతంబునుబోలు నామాల్యవంతు

నాశ్రయించిచనిరి. ఆ పౌలదిండిమూఁక లెల్ల మాలికి వశపడి భూనభోంతరములు బోరుకలంగ నఱచుచు విజిగీషామనీషతో దేవలోకంబు మీఁది కుఱికెను.

## విష్ణువు దేవతలకుఁదోడై రాక్షసులఁ బాఱఁదోలుట.

రాక్షసుల యుద్ధసన్నాహము దేవదూతలవలన విని నారాయణుఁడు తన మనంబును రణంబున లగ్నంబుచేసి కవచంబుదొడిగి, దివ్యబాణసంయుతం బగునంబులపొదినిఁదాల్చి, శార్ఙమెక్కిడి బిగించి, తరవారిగైకొని, సంకుమూఁది, చక్రముగొని, గదధరించి, సుపర్ణుఁడగు గరుత్మంతు నధిరోహించి, నిశాచరవీరులఁబోర నుగ్రమూఁచంబు గావింపఁజనెను. బంగరురంగులు చెంగలింప నింగిఁ జను వైనతేయునిపైఁగూర్చున్న పీతాంబరధరుండును, శ్యామలకాయకాంతికలితుండును నగుమహావిష్ణువు మేరుధరాధరశిఖరాగ్రంబున మెఱయు మెఱపుతోడి మేఘంబుమాడ్కి దేజరిల్లెను. అంతఁ జెంతలంజేరి దేవర్షిసిద్ధసాధ్య యక్ష నాగ గంధర్వులు కైవారంబుసేయ శంఖ చక్ర గదాసి పాణియై మురవైరి సురవైరుల నెదిర్చెను. అత్తఱి గరుడుని ఱెక్కలగాలిచేఁ దూలినబలంబును, వ్రీలిన జెండాలును, జీలిన శస్త్రములును గలదియై రాక్షసానీకంబు చలోపలంబగు నీలాచలంబువలెఁ జలించెను. అంత నిశాటులు చుట్టువాలు దాల్పును జుట్టుముట్టి ప్రళయాగ్నులవలె నిప్పులు గ్రక్కువేనవేలు మేటి యాయుధంబులు రక్తమాంసంబులు గురియఁ గృష్ణునిపైఁ బ్రయోగించిరి.

ఇది యాఱవ సర్గము

---

## ఏ డ వ స ర్గ ము

అంబుదంబులు గొండలపై వర్షించినట్లు రాక్షస మేఘంబులు నారాయణ పర్వతముపై బాణవర్షమును గురిసెను. నీలాకారులైన నక్తంచరోత్తములు ఆయుధవర్షంబు గురియుచుండఁగా మెఱుఁగుచామనచాయమేనివాఁడగు శ్రీమహావిష్ణువు వర్షదభ్రపరివృతంబగు కాటుకకొండవలెఁ గన్పట్టెను. మిడుతలు గేదారంబును, దోమలు భూధరంబును, ఈఁగలు అమృతఘటంబును, మొసళ్లు సముద్రమును జొచ్చునట్లు రక్షోధనుర్ముక్తంబులగు వజ్రానిల మనోజవంబులగు శరంబులు విలయకాలమునందలి లోకంబుల చందంబున శ్రీహరియందుఁ బ్రవేశించెను. గిరివర నిభులగు యాతుధానవరులలో రథికులు రథములతోడను, గజయూథపులు వేదండతండంబులతోడను, అశ్వారోహకులు ఆజానేయంబులతోడను, పదాతులు శరశక్త్యృష్టితోమరం

బులతోడను అంబరచరులై పోరుచుఁ బ్రాణాయామంబులు బ్రాహ్మణునకుఁ బోలె హరికి నూపిరియాడకుండఁ జేసిరి.

జలచరంబులచే నావరింపఁబడిన జలధిభంగి నిశాచరావృతుండైన విష్వక్సేనుఁడు దుర్ధర్షుఁడై శార్ఙ్గము నెక్కిడి యాయాశరులపై శరజాలంబులు గురిసెను. వజ్రముఖంబులును మనోజవంబులును నైన వాఁడి బాణములను గోదండంబున సంధించి యాకర్ణాంతమ్ముగా లాఁగి చతుర్భుజుఁడు పుంఖాను పుంఖంబులుగ విడుచుచుండఁ గౌణపగణంబులు గాలికిం దూలు మేఘంబుల పోలికఁ బటాపంచలై గుట్టలు మెట్టలుగా నేలంగూలుచుండ విశ్వంభరుఁడు పాంచజన్యంబు నొత్తెను. త్రిలోకభయంకరంబగు నాశంఖారావంబు హృద య విదారణంబుచేయ సింహగర్జనంబు విని పఱచు మాతంగంబులమాడ్కి రాక్షసానీకంబులు సంత్రాసమొంది దిక్కుమొక్కు గానక పిక్కబలిమిచూప లేక యక్కడనే యొక్కుమ్మడి మూర్ఛిల్లెను. జవసత్వంబు లుడిగి గుఱ్ఱములు మొగ్గతిల్లెను. గంధగజంబులు నిర్గంధంబులై కూలఁబడెను. యోధులు స్యంద నంబులనుండి చిందఱవందఱయై క్రిందికి జాఱిరి. కొంతవడి యిట్లు నిశ్చేష్టి తులైయుండి వెండియు దండిమగలగు కఱకుమొఱకురక్కసులు చెలరేఁగి హరిపైఁ దలపడి వజ్రాయుధంబుచేఁ గొట్టఁబడిన గుట్టలవలె వాని వాఁడి ములుకులచే నేలమట్టము గావింపఁబడిరి. కాయంబుల గాయంబులనుండి రక్తంబు సంతతధారగాఁ గాఱుచుండ నారాక్షసులు స్వర్ణగైరికాదిధాతు వులతోడి పర్వతంబులవలెఁ బరిఢవిల్లిరి. ముకుందుని చిందంబు నాదంబును ధనుష్టంకారంబును వైష్ణవరావంబులగుట రాక్షసారావంబులఁ దలకడచి మొరసెను. ఆభీకరారావంబును విని కనలి తనపైఁ గేతెంచు క్షణాదాచరులను వనజాతాక్షుఁడు కంఠంబులు దునిమియు, శరంబులు నఱికియు, ధ్వజంబులు రజంబు చేసియుఁ గోదండంబులు ఖండించియు, శతాంగములు నుగ్గునూచము గావించియుఁ బతాకలు సించియుఁ దూణీరంబులు దుమ్ముధూళిచేసియుఁ జీకాకుపఱచి, చండభానునినుండి వేఁడిమయూఖంబులును సముద్రమ్మునుండి భయంకరతరంగమ్ములును, మహీధ్రంబునుండి మదనాగంబులును జల ధరంబులనుండి జలధారలును వెలువడునట్లు చాపంబునుండి నారాచంబులు వెడలింప నవి శరభమ్ములు సింహమ్ములను, సింహమ్ము లేనుఁగులను, ఏనుఁ గుఁబు వ్యాఘ్రంబులను, వ్యాఘ్రంబులు చిఱుతపులులను, జిఱుతపులులు కుక్కలను, గుక్కలు పిల్లులను, బిల్లులు పాములను, బాములు ఎలుకలను దఱిమి నట్లు రాక్షసులను దఱిమి తఱిమి కొట్టెను. ఆతూపుల యేపునకోపలేక వెఱ చఱచి వీఁపుచూపి కొందఱు భూతలంబున బోర్లపడిరి. అది కాంచి మధు సూదనుఁ డింద్రుఁ డంబుదంబును బోలెఁ దాను శంఖంబును బూరించెను.

రాక్షస బలంబాయులిర్పన కులికిపడి యదరుగుండె బెదరు చూపునై లంకాభి ముఖంబై పఱచెను. అట్లు పఱచు నెఱచిదిండిమూఁకలఁ గాంచి యీసురే కెత్త సుమాలి శరాలిఁ గురియుచు హరి నరికట్టెను.

## విష్ణువు సుమాలితోఁ బోరుట.

మంచు సూర్యునిఁ గప్పినట్లు బాణంబుల సుమాలి వనమాలినిఁ గప్పి నంతనే నలుదెసలకుఁ బాఱిన మానుషాదులు ధైర్యమ్మూని సత్త్వసంప న్నులై క్రమ్మఱి రణరంగమ్మునకుఁ జనుదేర వారిఁ దిలకించి మేనంబుల కించి సుమాలి రోషంబు రూపంబు నొందిన చందంబున మండిపడుచుఁ దన సైనికులఁ బునర్జీవితులఁ జేయు చాడ్పున సింహనాదంబుచేయుచు, శుండా లంబు తుండంబు నెత్తినట్లు లంబమానాభరణంబగు తన కరంబు నెత్తి తటి త్తోయదంబువలె నొత్తిలి యఱచెను. ఆయార్భటి చెవులఁ బడినతోడనే కృష్ణుఁడు తోఁకఁ ద్రొక్కిన త్రాచువలె రోఁజుచు నుజ్జ్వలితకుండలంబగు సుమాలి శిరంబును దునుమ శరంబును బ్రయోగించెను. దాన మానవాశ నుఁడు నేల కొరగెను. అదికని బెదరి వాని తత్తడులు తత్తరంబునఁ బలాయ నంబు చిత్తగింప లేక చరణంబులు గుదియ వణఁకుచు మండలాకారంబుగ భ్రమించుచుండ సారథియుఁ జిత్తంబుత్తల పాటున బిత్తరింప గిరగిరఁ దిరుగు చుండె. సుమాలియు వాని వెంబడిన పరిభ్రాంతేంద్రియాశ్వుండగు మాన వుని మాడ్కి దిర్దిరం దిరుగుచుండెను. కొండొక వడికాయశ్వము లాయరద మును వెన్నుని తేరున్న యెడకుఁ గడువడి నీడ్చుకొని పోయెను.

## విష్ణువు మాలిని వధించుట.

అంతలో మాలి రోషాక్రాంత స్వాంతుఁడై విల్లంబులఁగైకొని పుండరీ కాక్షు నెదిర్చి పేర్చి స్వర్ణఖచిత బాణపరంపరలు ప్రయోగింప నవి పక్షులు క్రౌంచపర్వతముఁ జొచ్చినట్లు హరింజొచ్చెను. మాలియేయు శతసహస్రశరం బులకు నొచ్చియుఁ బచ్చవిల్తుని తండ్రి యాధులకు వశంపడని జితేంద్రియుని తెఱంగునఁ గలంకచెందక వెలింగెను.

మార్వీరావంబు గావించి మాలిపై వజ్రవిద్యుత్ప్రభంబులగు విశిఖం బులు తండోపతండంబులుగా భండనరంగంబెల్ల గగ్గోలు చెంద నీడుటయు నవి మాలి దేహంబు సొచ్చి పాము లమృతంబు నానినట్లు వాని నెత్తురు కుత్తు కబంటిగాఁ బీల్చెను. అంత శంఖచక్రగదా ధారియగు విష్ణుశ్రవుఁడు మాలిని విముఖుంజేసి కిరీట మూడఁదట్టి జెండా యెగురఁగొట్టి విల్లు భల్లన విఱిచి తేజులతేజ బూజుపట్టఁజేసెను. విరథుఁడైన మాలి గదాపాణియై కొండకొన నుండి దుముకు క్రోల్పులివలెఁ గృష్ణునిపై కుఱికె యముఁడు ఈశ్వరుని

ఇంద్రుఁడు భిదురంబుతోఁ గుధరంబును గొట్టినట్లు గరుత్మంతుని నిటల తటంబున గదగొని శక్తికొలఁది మోఁదెను. ఆతాఁకునకు గరుడుఁడు వితాకుచెంది శ్రీకృష్ణుని యుద్ధపరాఙ్ముఖునిఁ జేసెను. అదికాంచి దితిసుతులు ఉబ్బున బొబ్బలిడుచు బ్రహ్మాండంబులు వగుల మహానాదంబు గావించిరి. ఆఘోరారావంబు చెవిసోఁకినంతనే యుపేంద్రుఁడు దండితభుజంగంబుభంగి మండిపడి విపక్షశిక్షాదక్షత మెఱయఁ బక్షిరాజుపై నడ్డముగాఁ గూర్చుండి వెడమోమై మాలిం దూలింపఁ జక్రంబు నిర్వక్రపరాక్రమంబునఁ బ్రయోగించెను. కాలచక్ర నిభంబైన విష్ణుచక్రము నైజతేజంబున మార్తాండ మండలంబును గ్రేణిసేయుచుఁజని మాలి శిరంబునుబడ నఱకెను. వెంటనే భయంకరమైన తచ్ఛిరంబు తొంటి రాహుశిరంబును దలఁపించుచు నెత్తురులు గ్రక్కుచు నేల పైఁ బడెను. అంత దేవతలు మోదమానమానసులై సాధువాదంబులు గావించి నారాయణునిఁ గొనియాడి సింహనాదంబు గావించిరి.

రాక్షస సేన పాఱిపోవుట.

నేలఁగూలిన మాలినిఁ జూచి సుమాలియు, మాల్యవంతుఁడును శోక సంతప్త హృదయులై బలఁగముతో లంకాపట్టణమునకుఁ బాఱిరి. ఇంతలో వైనతేయుఁడు తెప్పిఱిల్లి కనుఁగొలంకుల నిప్పుక లుప్పతిల్ల ముంగలికుఱికి నిజ పక్షవాతాహతిని యాతుధానులఁ జెల్లాచెదరు చేసెను. అధోక్షజుండును మెఱుపుతోడి మేఘంబు పిడుగులు గురిసినట్లుగా వాఁడి యలుగులను పిడుగులచే విరయఁబాఱిన జుట్టులతోఁ బాఱుచున్న రాక్షసులనెల్లఁ జీల్చి చెండాడెను. గొడుగులు పడ ఆయుధంబులు చెడ రూపములు వెడరూపులుగాఁ గ్రేవులు ప్రోవులై జాఱ దీనదృష్టులఁ దేఱిచూచు నున్మత్తులవలె నారాక్షసులు పరిపరివిధంబులఁ బరిభ్రమించిరి. సింగంబుల బారిఁబడిన యేనుఁగులవలె నారాక్షస గజంబులు బెదరి చెదరి యఱచుచుఁ బఱచెను. హరిబాణచ్ఛిన్నంబులగు రాక్షస కాలమేఘంబులు తమ శరజాలంబుల జాఱవిడుచు గాలిఁ దూలిన కాలాంబుదంబులవలెఁ బరువిడెను. మఱియు మురహరుని బాణపుఁ బ్రేటుల శిరంబులు వ్రీల, జక్ర ప్రహారంబులఁ దలలెగుర, గదా ఘాతంబుల నంగంబులు భంగంబులొందఁ గృపాణఘాతంబులఁ జేతులు గండె తుండెములుగా రాక్షసరాజులు భిన్నగాత్రులై వజ్రాహతిం గూలు మహీధరంబులవలె గాలిం గూలు తరుషండంబులుబలె నేలం గూలిరి. నిరంతర దృష్టుల వారింగాంచి దేవతలు పరితుష్టాంతరంగులైరి. కొందఱు రాక్షసులు చక్రముచే ముఖమ్ములు దెగియుఁ గొందఱు గదచే ఱొమ్ములు విఱిగియుఁ గొందఱు నాఁగేటి కోలచేఁ గంఠములు ద్రుంపఁబడియుఁ గొందఱు రోఁకళ్లచేఁ దలలు పగిలియు, గొందఱు బాడిసలచేఁ జెక్కఁబడియుఁ గత్తులచే నుత్తరింపఁబడియుఁ గోలలచేఁ

జీల్చఁబడియు గగనంబుననుండి సాగరజలంబులం బడిరి. మణిహారములుఁ గుండలములు వ్రేలుచుండఁగా, రాక్షసులు నల్లని మబ్బులఁ బురుడించుచు నిలాతలంబునఁ బడుచుండఁగాఁ గ్రిందికిఁబడు నీలాచలంబులవలెఁ జూపట్టిరి.

ఇది ఏడవ సర్గము

---

## ఎ ని మి ద వ స ర్గ ము

తనచేఁ గొట్టఁబడి పరువిడు రాక్షసబలమును వెనుకొని చంపుచున్న పురుషోత్తమునిఁ గాంచి మాల్యవంతుఁడు గట్టునుదాఁకి వెనుకకు మరలు సంద్రంబు చందంబున వెనుకకుఁ దిరిగి కోపంబునఁ గనులెఱ్ఱవాఱ నిగ యల్లల నాడ నిట్లనియె.

### మాల్యవంతుఁడు విష్ణుని నిష్ఠురములాడుట.

నారాయణా! సనాతనమైన క్షత్రధర్మంబు నీ యెఱుంగనిది కాదు. యుద్ధంబు సేయనొల్లక పుల్లగిల్లి విఱిగి పాఱుమమ్ము ప్రాకృతునివలెఁ జంప దగునా? సమర పరాఙ్ముఖులై చనువారిని వెనుకొని చంపువాఁడు సుకృతం బెంత యొనర్చినను స్వర్గంబును బడయఁ జాలఁడు. శంఖచక్రధరా! నీకు యుద్ధ మొనర్ప శ్రద్ధగలదేని ఇదిగో నేను సిద్ధముగా నున్నాను నీబలము చలము చూపుము. చూచెదను గాక యని మాల్యవంతం బనుపర్వతంబు పోలిక నిలిచి పొలిచిన మాల్యవంతునిఁ గనుఁగొని బలశాలియగు శౌరి యిట్లనియె.

ఓయీ! మీకు జడిసి భయంబుపేరిమిఁ బఱచు దేవతలకు అభయం బిడి మిమ్ము నాశంబు గావింప నేను బ్రతిన పూనియుంటిని. నేనాడిన మాట వీడు మూఢుఁడను గాను. కాన మీమానము ప్రాణము గొనక తీరదు. దేవ కార్యంబు నాకుఁ బ్రాణంబులకంటెఁ బ్రియంబు. మీరు పాతాళమున కేగినను మిమ్ముఁ బట్టి గిట్టింపక మానను. అని రక్తాంబురుహాలోచనుఁడై పలికిన రోచిష్ణుండగు కృష్ణున కలిగి రాక్షసేంద్రుఁడు క్రోధఘూర్ణమానమానసుఁడై శక్తిగొని మురహరు నురమ్ము వగులనేసెను. అది ఘల్లు ఘల్లురను ఘంటా రావంబున బయలువెడలి మేఘంబునందలి మెఱపు తెఱఁగున వెన్నుని వెడఁద యెడఁద నడుగక వెలుఁగొంద శక్తిధర ప్రియుండగు పద్మాక్షుఁడు ఆ శక్తినే గొని వాని యక్కుచెక్కలు వాఱవైవ నది కుమారస్వామి ప్రయోగించిన శక్తి చాడ్పునఁ దుఱంగలించుచు మహేంద్రునిశక్తి కాటుకకొండ నగల్చినట్లు హారకాంతుల మెఱయు నారాక్షసునివక్షంబు తాఁకివాలు కొండ

కొమ్మునట్లు పఱియవాపి చనెను. ఆశక్తి క్రేటునఁ గవచంబు వగుల మాల్యవంతుఁడు మూర్ఛితుఁడై కొండొక వడికిఁ దెప్పిఱి యచలంబగు నచలంబువలె నిలిచి యనుపముండ్ల మునుమ్మెనవాలుగొని కృష్ణుని వక్షఃస్థలంబున బిట్టుగొట్టి ఖండనంబునం గల యఖండానురక్తింజేసి యుపేంద్రునిఁ బిడికిట పోటులఁ బొడిచి పొడిచి విడిచి వింటిమేర దూరంబు వెనుకకుఁ జనెను. అంత నాకసంబున నుండి సాధువాదములు చెలరేగెను. దాన మేనుప్పొంగ నావేల్పుగొంగ గరుడునిఁ గూడ వీడని కినుకమైఁ జావమోఁదెను. అంత వినతానందనుఁడు సక్రోధుఁడై ఱెక్కల నొక్కమాఱు వీచెను. ఆగాలి తాఁకున నారక్కసుఁడు సుడిగాలింబడి తిరుగుడుపడుచు నెగిరిపోవు చొక్కాకులువలె దిక్కు తెలియక నెగిరి పోయెను. పక్షిరాట్పక్ష వాతాహతిని భీతిచెంది పాఱి చన్న యన్నను గాంచి సుమాలి వెఱచఱచి బలాలిని వెంటఁగొని లంకాభిముఖుఁడై చనెను.

## రాక్షసు లోడిపోయి లంకకుఁ జనుట.

గరుడుని ఱెక్కగాలి తాఁకునఁ బిక్కబలిమి చూపిన మాల్యవంతుఁడుఁ గూడ నగ్గలంబగు సిగ్గునఁ దలవాంచి తన బలములతోఁ దానును గింకవీడి లంకకుఁ బోయెను. ఇవ్విధంబున నారాక్షసులు కమలేక్షణుఁడగు హరిచే ననిమొనఁ దమ రాక్షసనాయకులు మడియుటఁజేసి పలువిధంబుల బన్నంబు లొంది భయార్దితులై మార్కొని యాలంబు సేయఁజాలక లంకను వీడి తమ పూఁబోడులఁ గూడి పాతాళంబున కరిగిరి. రామా! సుమాలి యను రాక్షసునితోఁ గూడిమాడియున్నవారెల్ల ఆసాలకటంకట వంశంబునఁ బుట్టి పేరు కీర్తులు గాంచిన వీరవరులు సుమా! నీచేఁ జంపఁబడినవారు పౌలస్త్యులను రాక్షసులు. సుమాలియు మాల్యవంతుఁడును మాలియు నసువారు రావణానుచరులు; వీరందఱు రావణునికంటెఁ బరాక్రమమునను, బలంబునను మేటులు. దేవకంటకులైన సురారులను జంపువాఁడు శంఖచక్రగదాధారియగు నారాయణుఁడు దక్క నిక్కంబుగ మఱొక్కఁ డెవ్వండు గలండు? రామా! ఆ నారాయణుఁడవు నీవ. నీవ దేవుఁడవు, చతుర్భుజుఁడవు, సనాతనుఁడవు. రాక్షస నాశనంబు గావింప నవతరించితివి. నీవజయ్యుఁడవు. ప్రభువవు, అవ్యయుఁడవు. ధర్మములడుగంటిన ప్రతికాలమందును నీవవతరించి ధర్మ సంస్థాపనంబు సేయ దస్యులను వధించుచుందువు శరణన్నవారినిఁ గాపాడుచుందువు.

రాజేంద్రా! రాక్షసోత్పత్తి యంతయు నున్నదున్నట్లుగా నీకుఁ జెప్పితిని. ఇఁక నిరుపమానంబగు రావణ జన్మప్రభావంబును, వాని సంతాన చరిత్రంబు సర్వంబును నివేదించెదను. సావధానమతివై యాకర్ణింపుము.

విష్ణుభయార్దితుఁడైన సుమాలి సరాక్షసుఁడై చిరకాలంబు రసాతలంబున వసియించెను. బలవంతుఁడైన కుబేరుఁడు పుత్త్రపౌత్త్ర సమన్వితుఁడై లంకాపురమందు నివసించుచుండెను.

ఇది యెనిమిదవ సర్గము

---

## తొమ్మిదవ సర్గము

### సుమాలి తన పుత్త్రికను దోడ్కొని భూలోకంబునకు వచ్చుట

అంతఁ గొంతకాలంబునకు నీల జీమూతకాయుఁడును, దీప్తకాంచన కుండల మండితుఁడును నగు సుమాలి పాతాళంబుననుండి మర్త్యలోకంబునకుఁ జనుదెంచి యెల్లయెడల నుల్లాసంబునఁ జరింపఁదలంచి పద్మమును విడిచిన పద్మాలయవలె భాసిల్లు కన్యకామణియగు తన కూఁతుఁ దోడ్కొనివచ్చి భూమండలంబున విహరించుచున్న తఱిని బుష్పకారూఢుఁడై తండ్రిఁగాంచఁ గోరి యేతెంచుచున్న పౌలస్త్యతనయుఁడగు కుబేరునిఁగాంచెను. సుమనసులతోఁ దులదూఁగుచు స్వేచ్ఛావిహారము చేయుచున్న పావకతుల్యుఁడగు నా కుబేరునిఁ గనినతోడనే మహామతియగు సుమాలి చాల విస్మయముసెంది మానవలోకంబును వీడి పాతాళంబున కేఁగి రాక్షసుల కెట్లు మే లొనఁగూర్తును ? ఏక్కార్యంబు మాకు శ్రేయోదాయకమగును ? మే మెట్లు వృద్ధిగాంతుము ? అని వితర్కించి కైకసియను తన తనయనుఁ గనుఁగొని యిట్లనియెను.

"అమ్మా ! నీకుఁ బెండ్లియీడు వచ్చినది. యౌవనము మీఱిపోవుచున్నది ! తిరస్కృతిచెందుదు మేమోయను భీతిచే నితరులెవ్వరును నిన్నుఁ బ్రతిగ్రహింపకున్నారు. కుమారీ ! మే మందఱము నీకై ధర్మపాశబద్ధులమై యున్నాము. నీవో సర్వగుణసమన్వితవు, సాక్షాల్లక్ష్మివై వెలుఁగొందుచున్నావు. మానవంతులకుఁ గన్యాపితృత్వముకన్న దుఃఖకర విషయంబులేదు.

బిడ్డా ! నిన్ను నెవ్వరు వరింతురో యను చింత నా స్వాంతంబునుగలంచివైచుచున్నది. కన్యక పితృవంశమువారిని మాతృవంశమువారిని భర్తృవంశమువారినిఁగూడ నెట్టి యపకీర్తినిముంచునోయను సంశయమునఁ బడఁద్రోయును. కానఁ బుత్త్రీ ! నీవు మునివరుఁడును బ్రజాపతికులదీపకుఁడును బౌలస్త్యుఁడును నగు విశ్రవసుని స్వయముగా వరింపుము. వాని యనుగ్రహమునకుఁ బాత్రమవై నీవు భాస్కరసమతేజులును ధనేశ్వరతుల్యులునునగు పుత్త్రరత్నంబులఁగాంచఁ గలవు. దీని నందియము లేదు.

## కైకసి విశ్రవసు నాశ్రమంబునకు వచ్చుట.

అని సుమాలి సుధామధురమ్ముగాఁ బలికినపలుకు లాలించి కైకసి తండ్రియందలి గౌరవంబున పేర్మిం జేసి విశ్రవసుఁడు తపంబున్న యాశ్రమంబునకు దారుణంబైన సంధ్యాకాలంబునఁ జని నాల్గవ యగ్నిహోత్రునిఁబోని వాని చరణంబుల చెంగట నధోముఖియై నిలిచి పాదాంగుష్ఠమున మాటిమాటికి నేలపై గీటులువెట్టుచుండెను. తనమేని మెఱుంగులచేఁ బెఱగతితల వెలిఁగించుచుఁ దనచరణ సన్నిధిని నిలిచిన పూర్ణచంద్రనిభాననయు సుశ్రోణియు నగు నా కైకసినిఁగాంచి పలుకులఁ దేనియ లొలుక నిట్లనియె. ఓసుభగురాలా! నీ పుట్టుకఁజేసి యెవ్వని జన్మంబు ధన్యంబయ్యెను? ఎందుండి యిందుల కేతెంచితివి? నీ వలచిన కార్యంబెద్ది? నీ రాకకుఁ గతంబేమి? దాఁపఱికమ్ము సేయక నిజము చెప్పుము! అని సంయమీంద్రుఁడు ప్రశ్నింప నా కన్యహస్తపల్లవంబులుమోడ్చి యల్లన నిట్లనియె. మానీంద్రా! దివ్యశక్తిచేతనే నీవు నావచ్చిన కార్యంబు తెఱంగు నెఱుంగఁ గలవు. అయినను వచియించెదను. నన్నుఁ దండ్రియాజ్ఞను ద్రోసిపుచ్చక వచ్చినదాననుగా నెఱుంగుము. కైకసియని ననుఁ జెలులు పిలుచుచుందురు. మఱి మిగిలిన విషయము చెప్పనేల? నీవ గ్రహింపఁగలవు అన విని ముని యోగంబు నూని యామె యభిప్రాయంబు నెఱింగికొని యిట్లనియె. 'పూజ్యురాలా! నీ తలంపెఱింగితిని. తనయులఁగాంచు నభిలాషచే నీవు నా యంకమునకుఁ బొంకముగా నరుగుదెంచితివి. సరే మంచిది. అట్లే కానిమ్ము, అని యథావిధిగా నామెను బెండ్లియాడి రతులం దేల్చి పదంపడి యిట్లనియె.

చక్కెర బొమ్మా! వినుము! నీవు దారుణసమయమున నన్నుఁగవయ వచ్చితివి గాన నీకు దారుణులు దారుణాకారులు దారుణాభిజనప్రియులు క్రూరకర్ములు నగు రాక్షసులు జనియింతురు.

## రావణ కుంభకర్ణ విభీషణ జననము

అని పలికిన విశ్రవసునకు మ్రొక్కి కైకసి 'బ్రహ్మవాదీ! నీ వలననే నిట్టి బెట్టిదులగు దురాచారులఁ బుత్త్రులుగాఁ బడయనొల్లను. నా యెడ ననుగ్రహము చూపుము' అని ప్రార్థింప మునిశ్రేష్ఠుఁడగు విశ్రవసుఁడు పూర్ణచంద్రుఁడు రోహిణినిఁబోలెఁ గైకసిం గాంచి "శుభాననా! నీ కడగొట్టుపట్టి నా వంగసమునకుఁ దగినవాఁడును ధర్మాత్ముఁడును గాఁగలఁడు" అని వచించి నంతఁ గొంతకాలమ్మునకుఁ గైకసీ బీభత్సాకారుఁడును, మహాభయంకరుఁడును, రాక్షసరూపుఁడును దశశీర్షుఁడును మహాదంష్ట్రుఁడును నీలాంజనచయో

పముఁడును, దామ్రోష్ఠుఁడును, వింశతిభుజుఁడును, మహాస్యుఁడును, దీప్త మూర్ధజుఁడును నగు కొడుకును గనెను.

అతఁడు పుట్టినంతనే నక్కలు నిప్పులు గ్రక్కియఱచెను. మాంసాహారులగు మృగములు అపసవ్యముగా గుంపులుగట్టి తిరిగెను. మేఘములు నెత్తురు గురిసెను. గాడిదలు ఘోరారావము గావించెను. వేఁడివెలుఁగు మింటవెలుఁగఁడయ్యెను. ఉల్కలు రాలెను. భూమి కంపించెను. గాడ్పులు దారుణంబుగా వీచెను. అక్షోభ్యంబగు సముద్రంబు సంక్షుభితం బయ్యెను.

అంత పితామహసముఁడగు, వాని తండ్రి వానికిఁ బదితలలతోఁ బుట్టుటం జేసి దశగ్రీవుఁడని పేరు పెట్టెను. పిమ్మటఁ గుంభకర్ణుఁడు జన్మించెను. వాని ప్రమాణమింతింతని చెప్ప శక్యంబుగాదు. పదపడి వికృతాననయగు శూర్పణఖ జనించెను. ఆ వెనుక ధర్మాత్ముఁడైన విభీషణుఁడు కనిష్ఠసుతుఁడై యుదయించెను. సత్వమూర్తియగు నాతఁడు పుట్టినతోడనే గగనంబుననుండి పూలవానగురిసెను. దేవ దుందుభులు మొరసెను. ప్రాణప్రదములైన దేవతల సాధువాదములు విననయ్యెను. మహాతేజస్వులగు వారందఱు నా మహారణ్యముననందే ప్రవృద్ధిగాంచుచుండిరి. వారిలోఁ గ్రూరుఁడగు దశగ్రీవుఁడు లోకభీకరుఁడయ్యెను. కుంభకర్ణుఁడు ప్రమత్తుఁడై దుష్టుఁడై ధర్మయుక్తులగు మహర్షులను ముల్లోకంబులవారిని భయపెట్టుచు భక్షించుచు విచ్చలవిడిఁ జరింపఁ దొడఁగెను. విభీషణుఁడు ధర్మాత్ముఁడై నిత్యము ధర్మమునే యూఁది స్వాధ్యాయనిరతుఁడై మితాహారుఁడై జితేంద్రియుఁడై తేజరిల్లెను. అంతఁ గొంతకాలమునకు మహాతేజస్వియగు కుబేరుఁడు పుష్పకారూఢుఁడై తండ్రిని గాంచ నచ్చటికేతెంచెను.

రామా! నిజతేజంబున వెలుఁగొందుచున్న యా కిన్నరపతినిఁగాంచి కైకసి రాక్షసీ బుద్ధి దీపింప దశగ్రీవునితో నిట్లనియె. కుమారా! తేజోవృతుఁడగు నీ యన్న వైశ్రవణునిఁ జూడుము. అట్టి దిట్టకనుజుఁడవై నాకుఁ బుత్త్రుఁడవైన నీవెట్టి యధమస్థితియందున్నావో కన్నారఁగాంచుము. నను గన్నతండ్రీ! వైశంబ నీపరాక్రమంబు దీపింపఁజేసి కుబేరునితోఁ దులఁదూఁగు యత్నంబుఁ జేయుము. అని పలికిన తల్లిమాటల కుల్లంబు జల్లనఁ బ్రతాపవంతుడగు దశగ్రీవుఁడు రోషంబు రేకెత్త తల్లీ! నేను అచిరకాలంబులోనే మాయన్నకన్న మిన్ననుగాని తుల్యుఁడనుగాని యయ్యెదను. ఇది సత్యము. నీవు మనోవ్యధను వీడుము. అని ప్రతిజ్ఞచేసి తమ్ములనుగూడి దుష్కరతపంబుసేయ దృఢమనస్కుఁడై మనోరథంబు నీ డేర్చుకొననెంచి గోకర్ణమను నాశ్రమంబునకుఁ జనెను.

అక్కడ నుగ్రవిక్రముండగు నా దశగ్రీవుఁడు తమ్ములంగూడి నిరుపమాన తపం బాచరించి బ్రహ్మను సంతోషపెట్ట నతఁడు ముదంబంది రావణునకు జరాపహంబులగు వరంబుల నొసంగెను.

ఇది తొమ్మిదవ సర్గము

---

## పదవసర్గము

### అగస్త్యుఁడు శ్రీరామునకు రావణాదుల తపోవిధంబుఁ దెలుపుట.

అంత శ్రీరాముఁడు అగస్త్యునిఁ గాంచి బ్రహ్మర్షీ! వనంబున నా యన్నదమ్ములు ఘోరనియమంబు నూని యత్తఱి నెట్టి తపంబాచరించిరి? ఆనతీయవే! యని ప్రార్థింప నగస్త్యుఁడు సంప్రీతమానసుండై రామునిఁ గాంచి యిట్లనియె. రామా! ఆయన్నదమ్ములు ముగ్గురు నచ్చటనే యే ఋతువుల నేయేధర్మంబు లుండునో నాయాధర్మవిధుల ననుసరించి తపం బాచరించిరి.

కుంభకర్ణుఁ డట్లు తపంబునం దాసక్తుఁడై ధర్మపదస్థితుఁడై గ్రీష్మకాలంబున నిత్యము పంచాగ్నిమధ్యమున నిలిచియు వానకారున వీరాసనస్థుఁడై జలధరజలంబులఁ దడిసియు హేమంతంబున నెల్లవేళల నీటినడుమ నుండియుఁ దపంబొనర్చెను. ధర్మనిష్ఠాగరిష్ఠుఁడై సన్మార్గంబు వీడక యతఁ డట్లు తపంబు సేయుచుండఁగాఁ బదివేలేండ్లు గడచిచనెను.

ధర్మాత్ముఁడైన విభీషణుఁడు ధర్మపరుఁడై శుచియై యొంటికాలిపై నిలిచి యైదువేలేండ్లు తపం బాచరించెను. అతని నియమంబు సమాప్తిచెందఁగానే యచ్చరలాడిరి. గంధర్వులు పాడిరి. పూలవాన గురిసెను. దేవతలు కలఁతనొందిరి. అంతతో నాఁగక విభీషణుఁడు సూర్యగతి ననుసరించి తిరుగుచుఁ జేతులుఁ దలయుఁ బైకెత్తి వేదాధ్యయనంబున మనంబు లగ్నంబు సేసి నందనవనంబున నింద్రునిచందంబునఁ దపంబు మఱియైదువేలేండ్లు గావించెను.

రావణుఁడుగూడ నిరాహారుఁడై పదివేలేండ్లు ఘోరతపంబుసేసెను. వేయేండ్లు నిండఁగానే యతఁడు తనతలను అగ్నియందాహుతి యొనర్చెను. ప్రతిసహస్రవర్షంబులకు నతఁడొక్కొక్క తలచొప్పున నిప్పున వేల్చుచుండెను. ఇట్లు తొమ్మిదివేలేండ్లు గడచినవి. పదియగు వేయేండ్ల తుదను అతఁడు తన పదియవ శిరంబును గరవాలంబున కెరగావింప నుండఁగా దేవతలతోఁగూడ బ్రహ్మ యచ్చటి కరుదెంచి రావణునకుఁ బ్రత్యక్షమై "తండ్రీ! రావణా! నీ తపంబునకు మెచ్చితిని. నీ కే వరంబుగావలయునో శీఘ్రంబుగఁగోరుము.

నీకోరినవరంబు నిక్కడ యిచ్చెద. నీ వింక వ్యర్థపరిశ్రమము వీడుము" అన దశగ్రీవుడు ప్రహృష్టాంతరంగుడై తలవాల్చి పలుమోములవేల్పునకు మ్రొక్కి హర్షగద్గదవాక్యముల నిట్లనియె.

### బ్రహ్మ రావణునకు వరంబులిచ్చుట.

భగవానుడా! ప్రాణులకు నిరంతరము మరణభయంబుదక్క నన్యభయంబులేదు. మృత్యువున కెనయగు శత్రువులేదు. కాన నాకమరత్వ మొసంగుము.

అన విని విరించి 'ఓయీ! నీకు సర్వామరత్వమీయ సాధ్యంబు గాదు. వేఱొక్కవరంబు గోరుము.' అని వచింప దశగ్రీవుడు చేతులుజోడించి జోతలుసేసి యెదుట నిలిచి ప్రజాధ్యక్షా! శాశ్వతా! సుపర్ణనాగయక్షులకుంగాని దైత్యగంధర్వరాక్షసులకుంగాని, దేవతలకుంగాని వధింపరానివాడనై యెసంగువరంబు నాకనుగ్రహింపుము. ఇతర ప్రాణులంగూర్చి నాకు విచారము లేదు. తృణతుల్యులగు మనుష్య ప్రభృతులు నాకొక లెక్కగాదు. అని వినయముతోం బలుకంగానె చతురాననుడు వానిం గాంచి రాక్షసపుంగవా! అట్లేయగుంగాక. నీవలన బ్రీతుడనైతిని. మఱొక్కమేలు నీకొడంగూర్తును. చేకొనుము. తొల్లి నీచే నగ్నియందు వేల్వంబడిన నీ శిరంబులు తొంటియట్ల మొలిచి పొలుచుంగాక. మఱియు నీవు మనంబునం గోరిన రూపంబు నీకుం జేకుఱుంగాక యని పలికినతోడనే మున్నగ్నియందు హోమము సేసిన దశగ్రీవుని తలలు యథాప్రకారముగా మొలతెంచెను.

### బ్రహ్మ విభీషణునకు వరంబు లిచ్చుట.

పిమ్మట సురజ్యేష్ఠుడు విభీషణుని వీక్షించి బిడ్డా! ధర్మాత్మా! విభీషణా! నీ తపంబునకు మెచ్చితిని. నీకు వరమిచ్చెదను వెచ్చరం గోరుము. అని పలుక షోడశకళాకలితుడగు చంద్రునివలె సర్వగుణసంపన్నుడై వెలుంగు విభీషణుడంబుజగర్భునకు నమస్కారంబు గావించి భగవానుడా! లోకగురుండవైన నీవు నా తపంబునకు మెచ్చి ప్రీతుండవైతివేని నాకంతకన్న నేమి కావలయును? కృతకృత్యుడనైతిని. నా జన్మము తరించినది. దయామయా! నా కోరువరంబు నాలింపుము. ఎట్టి ఘోరాపదలయందైన నా మనంబు ధర్మంబు దప్పకుండుంగాక. నేర్వకుండంగనె బ్రహ్మాస్త్రము నాకు స్ఫురించుంగాక. ఈ లోకంబున నేనే యే యాశ్రమంబులం జరించుచుందునో యాయా యాశ్రమంబులందు నాకుం గలుగు నయ్యై బుద్ధులు ధర్మబద్ధములై నెగడుంగాక. నేనా యా ధర్మములనే పాలించెదనుగాక. ఓ పరమోదారా! ఇదియ నా వాంఛితార్థము. ఇదియ నాకుం బ్రియంబు అనుగ్రహిం

వుము. నీవ నాకేడ్గడ. ధర్మానురక్తులకు లోకంబున దుర్లభంబెద్దియు లేదు గదా ! అని సవినయంబుగా విన్నవింపఁ బ్రజాపతి యత్యంత ముదంబు నొంది బిడ్డా ! నీ వెంతయు ధర్మిష్ఠుఁడవు, నీ కోరినవరంబు లన్నియు సఫలంబులగుఁ గాక. రాక్షసయోనిని జనించినవాఁడవయ్యు నీ వధర్మంబున బుద్ధి చొరనీయవు. కాన నీ కమరత్వ మొసఁగితిని.

## బ్రహ్మ కుంభకర్ణునకు నిద్ర నిచ్చుట.

అని నెనరుతోఁ బల్కి కుంభకర్ణునకు వరమీయఁబోవు తమ్మిచూలికి సురలెల్ల కరములుమోడ్చి నమస్కరించి తండ్రీ ! నీవు కుంభకర్ణునకు వర మీయవలదు. ఈ పాపాత్ముఁడు లోకుల నెట్లు చీకాకుపఱచుచున్నాఁడో నీ వెఱింగినదే కదా ! ఈ దురాత్ముఁడు నందనవనంబునకుఁ జని యచ్చరమచ్చె కంటుల నేడ్గురనొక్క గ్రుక్కను మ్రింగినాఁడు. దేవేంద్రానుచరులఁ బదు గుర భక్షించినాఁడు. పెక్కండ్ర ఋషులఁ దన పొట్టనుబెట్టుకొన్నాఁడు. చాల మంది మానవులఁ జక్కిలంబుల మాడ్కినమిలి మ్రింగినాఁడు. వరములొందక మున్న యింతలింతలు సేసిన వీఁడు వరములొందినచో ముల్లోకంబు లొక్క పెట్ట నాహారంబు పట్టకుండునా ? అమేయప్రభామహితా ! వరమనుమిష చే వీనికి నిద్రనొసఁగుము. ఇట్లొనర్తువేని లోకంబులు సుఖంపడును. వాఁడు క్రశిమంబునొందును. అని వాకొనఁ బద్మసంభవుఁడు పద్మాక్షియుఁ బద్మ మాలినియునగు తన దేవేరిని సరస్వతినిఁ దలఁచెను. తలంచినంతనే వాగ్దేవి విరించిచెంత నిలిచి చిగురుఁగేలు మోడ్చి దేవా! యిదిగో వచ్చితిని. నా చేయుపనియేమి ! ఆనతిమ్ము అని యడుగ లోకేశుఁడు వాణీ! నీవు రాక్షసేంద్రుఁడైన కుంభకర్ణుని నొరవసించి 'నా కోరిన మాట నాతని నోరినుండి పలికింపుము' అన నామె యట్లేయని కుంభకర్ణుని వదనంబుఁ బ్రవేశింప నది కాంచి కాంచనగర్భుఁడు 'కుంభకర్ణా ! మహాబాహూ ! నీ కేవరము కావల యునో కోరుము' అన విని వాఁడు 'దేవా ! పెక్కేండ్లు నిద్రింపవలయునని నే నభిలషించుచున్నాను. కాన నాకీవరము దయచేయుము' అని ప్రార్థింప హంసవాహనుఁ డట్లేయగుఁగాక యని పలికెను. అది విని దేవతలు సంతసించి చంకలెగురవైచిరి. అంత సరస్వతీదేవి వాని ముఖంబును వీడిచనెను. బ్రహ్మ యు దేవతలఁగూడి నిజ నివాసంబున కరిగెను. తన్ను విడిచి సరస్వతి చని నంతనే దుష్టాత్ముఁడైన కుంభకర్ణుఁడు తెలివినొంది దుఃఖాక్రాంతస్వాంతుఁడై అయ్యో ! ఇప్పుడెట్టి ముప్పువాటిల్లినది ! నాయాస్యమునుండి యిట్టి వాక్య మెట్లు జాఱినది ! ఇక్కడఁగూడిన దేవతలచేతనే నేను మోసపోతిని. ఏమి చేయుందును ! ఎందుఁజొత్తును ! సమయము దాఁటినది ! చేయికాలిన పిమ్మట నాకులు పట్టుకొననేల యని వగచెను.

రామా! ఇట్లు తన తన తేజంబుల వెలుఁగొందునా యన్న దమ్ములు లబ్ధవరులై శ్లేష్మాంతక వనంబునకేగి యచ్చట సుఖముండిరి.

ఇది పదియవ సర్గము

---

## ప దు నొ క ం డ వ స ర్గ ము

### సుమాలి రావణాదులఁజూడ భూలోకంబునకు వచ్చుట.

రామా! సుమాలి రావణాదులు వరములొందిరని విని మనమున హర్షించి భయమువీడి మంత్రులగు మారీచుఁడు, ప్రహస్తుఁడు, విరూపాక్షుఁడు, మహోదరుఁడు ననువారును అనుచరులును సుసంరంభులై తోడరాఁ బాతాళంబునుండి బయలుదేఱి భూలోకంబున కరుదెంచి దశగ్రీవునిఁ గౌఁగిలించుకొని బిడ్డా! అదృష్టవశంబున నీ కోరినకోరిక నెఱవేఱినది. త్రిభువనశ్రేష్ఠుఁడగు బ్రహ్మవలన వరంబు నందితివి. ఎవనికి భయపడి మేము లంకనువీడి పాతాళమునకుఁబోతిమో యా విష్ణుకృతమైన మహాభయంబునుండి తలంగితిమి. మేము చక్రిచే నోటువడి వీడు వాడ వీడి నిలువ నీడలేక కాలికిబుద్ధిచెప్పి రసాతలంబుఁ బ్రవేశించితిమి. రాక్షసోచితంబైన యీ లంకాపట్టణము మనకాణాచి. నీ యన్నయగు కుబేరుఁడు తనబుద్ధి బలమునఁజేసి మనసగరము నాక్రమించుకొనెను. మహాబాహూ! సామమునఁగాని దానమునఁగాని దండమునఁగాని క్రమ్మఱ మననగరము నాక్రమింపుము! దెబ్బకు దెబ్బగాఁ బగదీర్పుము. మనకార్యంబు నెఱవేర్పుము. కుమారా! నీవు లంకాధిపతివై నిస్సంశయముగ మా కందఱకు విభుఁడవై దుఃఖసముద్రమున మునిఁగియున్న రాక్షస కులమును సముద్ధరింపుము. బిడ్డా! ఈ రక్కసికొలంబునకెల్ల నీవకుదురు. నీవ నాథుఁడవు. నీవ ప్రభుఁడవు. నీవ స్వామివి. నీవదిక్కు. అని తన నోడి కారంబు ప్రకటించుచుఁ బలుక దశగ్రీవుఁడు మాతామహునితో తాతా! కుబేరుఁడు మాకు నన్నయగుట పితృసముఁడుగదా! వానిఁగూర్చి నీవిట్లు వలుకఁదగునే! యని తిరస్కరింప వాని మనోగతాభిప్రాయము నెఱింగి సుమాలి మాఱుమాటాడక మిన్నకుండెను.

అంతఁగొండొక కాలంబునకు నందేయుండి యెద్దియేని మాట్లాడుచున్న దశగ్రీవునిఁగాంచి ప్రహస్తుఁడు సవినయంబుగా సకారణంబుగా నిట్లనియెను.

### ప్రహస్తుడుఁ లంకను గైకొనుమని రావణునకు బోధించుట.

దశగ్రీవా! మహాబాహూ! నీవిట్లుపలుక్కఁదగదు. శూరులకు సౌభ్రాత్రము లేదు. నేనొక్క చక్కనిమాట చెప్పెదను. చెవియొగ్గివినుము. అదితియు

దితియు నక్కచెల్లెండ్రు సుమీ! ఆ చక్కనిచుక్క లిరువురు కశ్యపప్రజాపతి యిల్లాండ్రు. అదితి త్రిభువనేశ్వరులైన యాదిత్యులను గనెను. దితి దైత్యులను గాంచెను. కాననమ్ములు, సముద్రమ్ములు, పర్వతమ్ములు, పట్టణములుగల యీ యిలాతలమెల్ల దైత్యులది. మహావీరా! నీవు లంకాధినాథుల వంశమునఁ బుట్టిన మేటిరత్నమవు. ప్రభవిష్ణువైన విష్ణువు బవరంబున రక్కసుల జక్కాడి యవ్యయమైన యీ జగత్త్రయంబును దేవతల కొసంగెను. నీ వొక్కఁడవె యీ విపర్యయము గావించుటలేదు. ఇది సురాసురులు త్రొక్కిన త్రోవయె కాని యన్యముగాదు. దాయల నన్నదమ్ములని నీతులాడరాదు. సందియముదక్కుము నా పలుకూఁదుము. అని వచించిన ప్రహస్తుని మాటలకలరి రావణుఁడు ముహూర్తకాలము యోజించి నల్లెయని యంగీకరించి యానందంబు వెల్లి విరియ నాఁడె రాత్రించరనికరపరివృతుఁడై చని తనవనంబును జేరి త్రికూటాద్రి పైఁగూర్చుండి వాక్యకోవిదుఁడైన ప్రహస్తుని ముఖంబున దౌత్యంబు నెఱపనెంచి ప్రహస్తా! నీవు శీఘ్రముగా నైరృతపుంగవుఁడగు కుబేరునిపాలి కరిగి నామాటగా సామపూర్వకముగా సట్టులనుము.

## రావణుఁడు ప్రహస్తునిఁ గుబేరునొద్దకుఁ బంపుట.

సౌమ్యుఁడా! యీ లంకాపురి యింతకుమున్ను మహాత్ములైన రాక్షసులది. అనఘా! నీవిందుఁ బ్రవేశించుట న్యాయముగాదు. కాన అతుల విక్రమా! మాపట్టణము మాకొసంగుము. అట్లొసంగితివేని నాకుఁ బ్రీతికలిగించిన వాఁడవగుదువు అని చెప్పి పుచ్చఁ బ్రహస్తుఁడు బయలుదేఱి చని కుబేర రక్షితంబగు లంకాపురంబుఁ బ్రవేశించి పరమోదారుఁడైన ధనదునికడకరిగి సువ్రతుఁడా! నేను నీ తమ్ముఁడగు రావణునిచేఁ బంపఁబడితిని. ధనేశ్వరా! నేను నీ కడకు దూత భావము వేష్టించి వచ్చితిని. సర్వశాస్త్రవిశారదా! దశాననుఁడు నీతో నాడుమనిన మాటలు వాక్రుత్తును. అవధరింపుము. తొల్లి యీ లంకానగరము భీమపరాక్రములైన సుమాలి ప్రముఖ రాక్షసవీరులచే ననుభవింపఁ బడినది. దాని నిప్పుడు నీవనుభవించుచున్నావు. కాన తమపట్టణము తమ కొసఁగుమని దశగ్రీవుఁడు సామంబుగ యాచించుచున్నాఁడు. కావున వారిసొత్తువారి కిచ్చి పుచ్చుట విహితంబు.

## కుబేరుఁడు లంక విడిచిపోవుట.

అని విన్నవింప విన్నాణియైన కుబేరుఁడు వానిఁ గాంచి 'ఓయీ! నిశాచర శూన్యమైన యీ లంకాపట్టణము నాకుఁ బితృపాదులొసంగిరి. దానమానాదిగుణభాసితులగు యక్షులతో నే నిందువసించుచున్నాను. దనుజాగ్రణీ! నీవు వేగంబుగాఁజని దశగ్రీవునిఁగని నిష్కంటకమును, అవిభక్తమును

నైన నా యీ లంకారాజ్యమును ఇందలి ధనమునెల్లను నుల్లంబు పల్లవింప హాయిగా నేలికొనుమనుము.' అని చెప్పి తన తండ్రియొద్ద కరిగి యెఱఁగి 'తాతా! దశగ్రీవుఁడు నా యొద్దకు దూతనంపినాఁడు పూర్వము రాక్షస గణముచే ననుభవింపఁబడిన లంకానగరము గ్రమ్మఱఁ దన కిమ్మనినాఁడు. కావున నే నిప్పుడేమి చేయవలయునో యానతిమ్ము' అని చేతులు జోడించు కొని నిలిచిన వానిఁగని మునిమణియైన విశ్రవుఁడు పుత్త్రా! నా మాట వినుము. ఇంతకుమున్నె మహాబాహువైన దశగ్రీవుఁ డీ విషయము నాతోఁ జెప్పియున్నాఁడు. పెక్కుమాఱు లీ కార్యంబు నీకుఁ దగదని ఛీకొట్టితిని. కాని యా దుర్మతి నామాట లోకచీరికిఁగొనఁడయ్యెను. నేను గోపించి 'ధ్వంసమై పోదువ'నికూడ శపించితిని. శ్రేయోదాయకంబును, ధర్మ్యంబును నైన యొక్క మాట చెప్పుచున్నాను; విను. ఆమూఢుఁడు వరంబులంది మత్తిల్లియున్నాఁడు. పిన్న పెద్ద యంతర మెఱుంగకున్నాఁడు. నా శాపంబు కతంబున దారుణ ప్రకృతిగలవాఁడు గూడ నైనాఁడు. కాన నాయనా! నీవు కైలాసనగంబున కరుగుము. పరివారముతోఁగూడ లంకనువీడుము. కైలాసంబుననే నివాస మేర్పఱచుకొనుము. నదీమతల్లియైన గంగానది యచ్చటనె ముచ్చటగాఁ బాఱుచుండును. కాంచనమయంబులు, సూర్యకాంతి సంకాశములునైన పద్మములా నదీ జలంబులఁ దేలియాడుచుండును. తెల్లగలువలు నల్లగలువలు ఇతరములగు సుగంధిపుష్పములు నందుఁ గనువిందొనర్చుచుండును. గంధర్వుల తోడను, అప్సరసలతోడను, నాగులతోడను, గిన్నరులతోడనుగూడి సుపర్వులానదీ జలంబుల విహారశీలురై నిరంతరము క్రీడించుచుందురు. ధనదా! నీవు దశాననుఁడు వరంబులందుట యెఱిఁగియున్నాఁడవు. కావుట వానితో వైరంబు పెట్టుకోవలవదు. అని చెప్పఁ గుబేరుఁడు తండ్రియందలి గౌరవంబునఁ జేసి యాతనియాజ్ఞ శిరంబునఁ దాల్చి భార్యయుఁ బౌరులు, మంత్రులు, వాహనములు, ధనములు మున్నగువానితోఁ గైలాసంబున కేఁగెను.

### రావణుఁడు లంకను జేరుట.

అతఁ డట్లు చనఁగానె ముప్పదియామడ నిడివిగల యా లంకాపట్టణము నిర్జనము నిర్భయమునై యుండెను. అంతఁ బ్రహస్తుఁడు సంతసించి మంత్రులతో దనుజులతోఁ బరివేష్టించియున్న దశగ్రీవునిఁగాంచి దశకంఠా! ధనదుఁడు లంకను విడిచి పోయెను. లంకానగరము శూన్యమయ్యెను. మమ్ముఁ దోడ్కొని వేడ్క దైవాఱ నీవందుఁ బ్రవేశింపుము. అక్కడ ధర్మపరిపాలనంబు సాగింపుము అని హెచ్చరింపఁగా విని మహాబలుఁడు దేవారాతియు నగు దశకంఠుఁడు సభ్రాతృబలవాహనుఁడై కుబేర పరిత్యక్తంబును సువిభక్త

మహోపథంబునున్నైన లంకాపురంబును దేవేంద్రుఁడు స్వర్గంబునువలెఁ బ్రవేశించెను.

అట్లు దశాననుఁడు లంకంజొచ్చి పట్టాభిషిక్తుఁడై రాక్షసులతో నందు హాయిగా నివసించుచుండెను. నల్లనిమబ్బుల యుబ్బును గెల్చు రక్కసులచే నావీడు ఈడులేక పొలుపొందుచుండెను.

అంత నక్కడఁ గుబేరుఁడు తండ్రిమాటయందలి గౌరవంబునఁజేసి చంద్రునివలె స్వచ్ఛమైన యా కైలాసగిరియందు సుందరభవనయుతంబగు పట్టణమొక్కటి నిర్మించి యందు నమరావతియందు నింద్రుఁడువలె వెలుఁగొందుచుండెను.

ఇది పదునొకండవ సర్గము

---

## పండ్రెండవ సర్గము

### రావణునకు మయుఁడు మండోదరీ వృత్తాంతము చెప్పుట.

రాక్షసేంద్రుఁడగు రావణుఁడు దమ్ములతోఁగూడనట్లు పట్టాభిషిక్తుఁడై చెల్లెలగు శూర్పణఖకు వివాహముచేయనెంచి కాలకేయుఁడగు విద్యుజ్జిహ్వుఁడను దానవేంద్రునకొసంగి పెండ్లిచేసి వేఁటయందలి తమకంబునఁ దిరుగుచునట, దితిసుతుండును, గన్యాసహాయుండును నగు మయునిఁగాంచి నీ వెవ్వరవు ? ఒంటరిగా నీ నిర్జనప్రదేశంబున నీ మృగాక్షితోఁగూడ నేలవసించుచున్నావు ? అని ప్రశ్నింప, మయుఁడు దశగ్రీవునితో ఓయీ ! నా వృత్తాంతమంతయు యథాతథముగాఁ జెప్పుచున్నాను. వినుము. హేమయను నప్సరస కలదని నీ వింతకుమున్నే వినియుందువు. పౌలోమిని శతక్రతువునకుఁబోలె దేవతలు నా కామె నొసంగిరి. ఐదువందలయేండ్లనుండి నే నామెను వీడక విషయసుఖంబు లనుభవించుచుంటిని. దేవతాకార్యంబునకై యామె యెందేనిఁజని పదునాల్గేండ్లాయెను. ఆ హేమకొఱకు నీ పురంబు సర్వంబు హేమమయంబు గావించితిని. వజ్రవైడూర్యములచే నలంకరించితిని. నా మాయామాత్రముచేతనే యీ నిర్మాణమంతయు జరిగెను. ఆమె లేని యయ్యెడ నేను నివసింపలేక దీనుఁడనై దుఃఖాక్రాంతస్వాంతుఁడనై యా నగరంబును వీడి నా యీ కూఁతునిఁగొని యీ యడవికివచ్చితిని. హేమాగర్భసంజాతయై పెనుపొందుచున్న యీయామెకు వరాన్వేషణంబుచేయుచు నిందరుగుదెంచితిని. మానకాంక్షులందఱకుఁ గన్యాపితృత్వము దుఃఖహేతువు గదా ! కన్య పుట్టిన యింటివారిని, మెట్టినయింటివారినిఁగూడ నిత్యంబును సంశయంబున ముంచును.

ఆ హేమయను భార్యవలన నా కిరువురు కుమారులుగూడఁ గలిగిరి. అందు మాయావి మొదటివాఁడు. దుందుభి రెండవవాఁడు. తాతా! నీవు నిజమడుగుటచే నా యీ వృత్తాంతమంతయు నీ కెఱింగించితిని. నీ వెవ్వరవో నే నిప్పు డెఱుఁగఁ గోరుచున్నాను. అన విని దశకంఠుఁడు అడఁకువతోఁ మయు నితో నేను మునియు పౌలస్త్యపుత్త్రుఁడును తృతీయబ్రహ్మయునగు విశ్రవసుని పుత్త్రుఁడను. నన్ను దశగ్రీవుఁడందురు. అన విని మయుఁడు దశాస్యుఁడు బ్రహ్మర్షియగు విశ్రవసుని కుమారుఁడని తెలిసికొని హర్షపులకితగాత్రుఁడై తనకూఁతు నతనికిచ్చి వివాహంబు చేయనెంచి,

మయుఁడు రావణునకు మండోదరి నిచ్చి పెండ్లిచేయుట.

యీమె చేతి నాతని చేతితో గ్రహింపఁజేసి కిలకిల నవ్వుచు దశముఖునితో రాజా! యీమె నాకూఁతురు. ఈమెతల్లి హేమ యను నప్సరస. మండోదరి యను పేరుగల యీ కన్యకామణిని బత్నిగాఁ బరిగ్రహింపుము. అన దశవదనుఁడు వల్లెయని యంగీకరించినంత మయుఁడు మునివరశాపగతి నెఱిఁగియు బితామహకులుఁ డగుటచే శంకింపక పంకజపాణి యగు తన తనయ నొసంగి యగ్నిసన్నిధిని యథావిధిగా వివాహ మొనర్చెను. రావణుఁడు బ్రహ్మకులంబునఁ బుట్టినవాఁడని యెఱింగి తన కూఁతునిచ్చుటయే గాక మహాద్భుతంబును, అమోఘంబును నగు నొక శక్తినిగూడ వాని కొసంగెను. ఆశక్తిచేతనే తొల్లి రావణుఁడు లక్ష్మణుని మూర్ఛ నొందించెను.

రావణుఁడు తన సోదరులకు వివాహములు సేయుట.

లంకేశ్వరుఁడగు రావణుఁ డిట్లు భార్యా సమేతుఁడై లంకను జొచ్చి వైరోచనుని దౌహిత్రియగు వజ్రజ్వాలను గుంభకర్ణునకును శైలూషుఁడను గంధర్వరాజు కుమారికయగు సరమను విభీషణునకును నిచ్చి వివాహంబు లొనర్చెను. ఈ సరమ మానససరోవర తీరమున జనించెను. ఇట్లుండ నొక వర్షాకాలమున నాసరస్సు ఉప్పొంగఁగా నామె తల్లి ఓ సరోవరమా! నీవు పొంగవలదు. అని ప్రార్థించెను. దానంజేసి యీమె సరమయను పేరఁ బ్రఖ్యాతిఁగాంచెను. (సరః=ఓ మానస సరస్సా! మా=ఉప్పొంగ వలదు.)

రావణ, కుంభకర్ణ, విభీషణులు మండోదరీ, వజ్రజ్వాలా సరమలతో నందనవనంబున గంధర్వులవలె విహరించుచుండిరి.

అంత మండోదరి మేఘనాదుఁడను పుత్త్రునిఁ గాంచెను. వానినే మీ రింద్రజిత్తనుచున్నారు. పుట్టుట తోడనే యీయింద్రజిత్తు మేఘ మురిమి నట్లఱచుటచే లంకాపట్టణ మంతయు జడీకృతమయ్యెను. అదిగాంచి రావణుఁ

డాతనికి మేఘనాదుఁడని పేరు పెట్టెను. రామా! పవిత్రమగు నారావణాంతః పురంబున నాబాలుఁడు దారుచ్ఛన్నంబగు నగ్నివలె దాదులచే రక్షింపఁ బడుచుఁ దల్లిదండ్రులకు నుల్లాసంబు పెల్లుగాఁ గల్గించుచు వృద్ధిచెందెను.

ఇది పండ్రెండవ సర్గము

---

## పదుమూఁడవ సర్గము

### రావణుఁడు లోకములను బాధించుట.

అంతఁ గొంత కాలమునకుఁ జతుర్ముఖుని వరంబునంజేసి నిద్రాదేవి కుంభకర్ణు నావహింపఁగా నాతఁడు సుఖాసీనుఁడై యున్న యన్ననుగాంచి, రాజా! నన్ను నిద్దుర తద్దయు బాధించుచున్నది. కాన నాకొక నిద్రాలయము గట్టింపుము. అని ప్రార్థింప రావణుఁడు విశ్వకర్మంబోలు శిల్పుల రావించి కుంభకర్ణుఁడు నిద్రింప నాలయంబు నిర్మింప నియోగించెను. ఆ కారువులు ఒక యామడ వెడల్పును రెండామడలు పొడవును గలిగి, శుభ్రంబును మనోజ్ఞంబును నిరాబాధంబునునై విరాజిల్లు నిద్రాగృహంబును నిర్మించి కుంభకర్ణున కొసంగిరి. అది కైలాసనగంబును నగం జాలి, కాంచనమయ ములు స్ఫటికమయంబులు చిత్రచిత్రితములు నగు స్తంభములు వైడూర్య సోపానములు, కింకిణీ జాలకములు, దంతతోరణములు, వజ్రస్ఫటిక వేదికలు గలిగి యత్యంత మనోహరంబై సర్వసుఖప్రదంబై హృదయాహ్లాదం బొన వించుచుండెను.

మేరుధరాధరదరీ గృహంబువలె సర్వర్తు సుఖదంబైన యాగృహంబును జొచ్చి కుంభకర్ణుఁడు నిద్రాసక్తుఁడయ్యెను. పెక్కువేల సంవత్సరములు గడచి నను అతఁడు నిద్రనుండి మేల్కాంచఁడయ్యెను. కుంభకర్ణుఁ డిట్లు నిద్రించు చుండఁగా రావణుఁడు నిత్యంబును వేల్పులను బట్టి గొట్టుచు, ఋషులను గట్టుచు, యక్షులను జెఱఁబెట్టుచు, గంధర్వులను మొట్టుచు నందనవనంబును బోని యుపవనంబులఁ బ్రభంజనుని భంగిఁ జిందఱవందఱ చేయుచు నేఱుల నేనుఁగువలెఁ జొచ్చి కలంచుచుఁ గొండల వజ్రంబువలెఁ జెండి పిండిపిండి చేయుచు సర్వనాశకుఁడై చరించుచుండెను.

### కుబేరుఁడు రావణునకు నీతి దెలుప దూత నంపుట.

ధనేశ్వరుఁడైన కుబేరుఁడు రావణుఁ డట్లు బయులు వెఱసి చరించు చుంట యెఱింగి, నిజకులోచిత వృత్తంబు చిత్తంబునఁ దలంచి, తన సౌభ్రా

త్రంబు ప్రదర్శింపనెంచి, సోదరుఁడగు రావణుని హితంబు గోరి దూత నొక్కరుని లంకకుఁ బంపెను. తొలుత నాదూత ధర్మాత్ముఁడైన విభీషణుని దర్శింప నాతఁడు దూతను గుశలంబడిగి తన జ్ఞాతుల క్షేమంబు విచారించి యతని రాకకుఁ గారణంబడిగి తెలిసికొని వానిని దోడ్కొనిపోయి పేరోలగం బున్న యన్నయగు రావణునిఁ గాన్పించెను. అంత నాదూత; ప్రతాపదీపి తుండై మేలిమెత్తలు గల యుత్తమపర్యంకమున నుపవిష్టుఁడై యున్న రావ ణునిఁ గాంచి జయశబ్దపూర్వకముగాఁ బూజించి ముహూర్తకాలంబు మిన్న కుండి రాజా! నీయగ్రజుఁడగు యక్షేశ్వరుఁడు నన్నిటకు దూతగా నంపి నాఁడు. వాని మానిత సందేశము మీయిరువురకుఁ బరస్పర గౌరవప్రదము. మీవంశ ప్రతిష్ఠకుఁ దార్కాణము. కాన సావధానముగా వినుము. ఇంకనుక నీనడవడి పులుగడిగిన ముత్తెమువలె స్వచ్ఛమై మెచ్చఁదగినదియై యున్నది. ఇఁకముందు గూడ సాధ్యమగునేని సాధువర్తనుఁడవై చరియింతువు గాక. నీవు నందనవనమును గంచు మించు చేసితివనియు సాధుల వేధించితివనియు నీపేరు విన్నమాత్రాన దివౌకసులు వడువడునడంకుచు నీదుశ్చేష్టితము లాఁపఁ దలంపు గొన్నారనియు విన్నాను. ఎన్నియో మాఱులు నన్నుఁగూడ నీవు మన్నింపక యెల్లిదమొనర్చితివి. బాలుఁడు దుడుకుఁబోకలఁ బోవ వానిఁ బాలిం చుట బంధు ధర్మంబు గదా!

తమ్ముఁడా! నేను దపంబు గావింప హిమవత్సానుతలంబున కరిగి జితేంద్రియుఁడనై కర్కశవ్రతదీక్ష నూనియుంటిని. అటఁ బార్వతీ సమేతుఁ డైన శివుఁడు నాకుఁ బ్రత్యక్షమయ్యెను. అప్పుడు నాకన్ను భవానిపైఁబడెను. నిరుపమాన సౌందర్యవతియగు నా సతి యెవ్వతెయో యని యాశ్చర్యపడి శుభదృష్టితోనట్లు చూచితినిగాని యన్యభావంబునఁ గాంచలేదు. అయిన నేమి! ఆ దేవి ప్రభావంబున నా కుడికన్ను దుమ్ములో బ్రుంగిన దీపము వలెఁ గమలి పింగళత్వము నొందెను. అంతట నే నా చోటువీడి కొండొక విశాల రమణీయ గిరితటంబున కరిగి యందు నెనిమిదివందలయేం డ్లుగ్రతపంబు గావించితిని. అదికని భూతేశుఁడు సంప్రీతచేతస్కుఁడై నన్నుఁ జేరవచ్చి ఓయీ! నీవు ధర్మజ్ఞుఁడవై సుస్థిరుఁడవై యొనర్చిన వ్రతంబునకు నే నెంత యు సంతసించితిని. ఈ వ్రతమొకప్పుడు నేను సలిపితిని. నాఁటికి నేఁడు నీవు సలిపితివి. నీవును నేను దక్క నీ దుష్కరవ్రతమును జేసినవాఁడు మఱొ క్కఁడులేఁడు. దుస్సాధ్యమగు నీ వ్రతమును దొల్త నుత్పాదించినవాఁడను నేన. నీ తపస్సువలన నేను నీకు వశుఁడనైతిని. నాతోడి సఖ్యం బభిలషించి నాకు మిత్త్రుఁడవుగమ్ము. హైమవతీప్రభావంబున నీ కుడికన్ను పూఁడిపోవుటం జేసి నీవు ఏకాక్షిపింగళుఁడను పేరఁ బ్రసిద్ధిగాంచుము.

అని సాదరమేదురవాక్యంబులఁ బలికిన శర్వాణీధవునితోఁ జెలిమిచేసికొని స్వస్థానమునకు వచ్చుటతోడనే నీవు పాపాత్ముఁడవై పోరానిపోకలఁ బోవుచున్నావనివింటిని. సురలును మునివరులును నీ వధోపాయంబు నన్వేషించుచున్నారఁట కాన మనవంశ గౌరవమ్ము వమ్మొనర్చు నధర్మపథమ్ము విడువుము.

## రావణుఁడు కుబేరదూతను వధించుట.

అని పలికినతోడనే విని రావణుఁడు గన్నుల నిప్పులు గ్రక్కుచుఁ జేతులు పెనవెట్టుచుఁ, బండ్లు పటపట గొఱుకుచు దూతనుగాంచి ఓరీ నీచా! ఈ సందేశమునుబంపిన వానిధోరణి తెలిసినది. నీవుగాని నిన్నుఁ బుత్తెంచినవాఁడుగాని యిఁక మనఁజాలరు. ధనరక్షణపరాయణుఁడగు కుబేరుఁ డిట్టి హితవు గఱపఁదగినవాఁడె! మహేశ్వరిమైత్రిని గూర్చి వాకొననేల? నీవాడిన పోఁడిమి మాలిన మాటలు నేను సహింపఁజాలను. వాని చర్యలకెల్ల నింతకాలము సైఁచితిని. నా కన్నయై పుట్టుటఁజేసి వాఁడు చావునకుఁ దప్పినాఁడని యెఱుంగుము. వాఁడు చెప్పిపుచ్చిన నుడులు నా చెవినిఁబడినదాది నాకు బాహువీర్యము నెఱపి లోకత్రయంబు నేకార్ణవంబుసేయ బుద్ధిపొడముచున్నది. ఇప్పుడే యితర దిక్పాలురు మువ్వురపని పట్టించి మీ యేలికను యమాలయంబునకుఁ బాలికాఁపును జేసెదను. అని తన కరవాలంబును దటాలునదూసి రావణుఁడు దూతను దునిమి వానిమేను దుష్టులగు రాక్షసుల కెరగావించి కృతస్వస్త్యయనుఁడై ముల్లోకంబులఁ గొల్లగొట్ట నిశ్చయించుకొని కుబేరుఁడున్న యెడకుఁ జనెను.

ఇది పదుమూఁడవ సర్గము.

---

# పదునాల్గవ సర్గము

## రావణుఁడు కుబేరుని జయింపఁ బోవుట.

సమరోల్లాసులు బలోన్మత్తులు వీరాధివీరులు నగు మహోదర ప్రహస్త, మారీచ, శుక, సారణ, ధూమ్రేక్షణులను మంత్రులతోఁగూడి రావణుఁడు ముల్లోకంబులను గోపంబున దహించువాఁడు వోలె దాడిసాగించి ముహూర్తకాలంబులోఁ బట్టణములు నదులు వనములు పర్వతములు దాఁటి హుటాహుటిని కైలాసపర్వతమునఁ బ్రవేశించెను. యక్షులు వానిఁగాంచి రణోత్సాహియై చనుదెంచినవాఁడని నిశ్చయించుకొనిరి. కాని వానియెదుట నిలువ సాహసింపలేకపోయిరి. రావణుఁడు తమ ప్రభువునకు సోదరుఁడగుట యెఱిఁగిన

వారు కావుటఁ గుబేరునొద్ద కేఁగి సర్వమును నివేదించిరి. అంతటఁ గుబేరుఁడు రావణు నెదుర్కొనుఁడని తన సైనికుల కాజ్ఞయిడఁగా వారందఱు మిన్నందిన సంతసముల మేనులు పొంగఁబొలికలనికిఁదరలి చనిరి. అత్తఱి వియత్తలంబున కుప్పొంగు సముద్రసంక్షోభమ్మువలెఁ గుబేర సేనాసంక్షోభమ్ము కైలాసమ్ము నుఱ్ఱూఁత లూఁగించెను. పిమ్మట యక్షరాక్షసులకు సంకులసమరము జరిగెను. రావణుని మంత్రులు నొచ్చివిచ్చిరి. అది కని దశగ్రీవుఁడు క్రోధఘూర్ణమానమానసుఁడై సింహనాదమొనర్చి శత్రువుల నెదిర్చి నంత

## యక్షరాక్షస యుద్ధము.

ఘోరవిక్రములైన వాని సైనికులలో నొక్కొక్కఁడు వేయిమంది జక్కుల నుక్కడంచెను. అంత యక్షులు గదా పరిఘ శక్తి తోమరములతోఁ దనను మోఁదుచున్నను లెక్కసేయక రావణుఁడు శత్రుసేనలఁ జొరఁబడ యక్షసేనలు వర్షించు మేఘములమాడ్కి బాణమ్ములఁ గురిసి రావణున కుక్కిరిబిక్కిరిచేసి యరికట్టిరి. వారిధరధారలచే మహీధరంబుపగిది యక్షుల బాణమ్ములచే సమాహతుండయ్యు రావణుఁడు బెగ్గడిల్లక కాలదండసమానంబగు గదను బైకెత్తి యక్షులను బలిగొనుచు సేనామధ్యంబునకుఁ జొచ్చి గాలితోఁ గూడియున్న యగ్ని గడ్డి దుబ్బులను వికీర్ణశుష్కేంధనములను ఏర్చు కరణి యక్షసేనలను మాఁడ్చివైచెను. వాయువు జీమూతమ్ముల నెగురఁగొట్టు నట్టు రావణ మంత్రులగు మహోదర శుకాదులు యక్షుల నంతరిక్షంబున కెగురఁగొట్టిరి.

కొందఱు కరవాలంబుల కెరయై సమరభూమి నొరగిరి. కొందఱు వాఁడి యగు తమదంతములఁ బెదవులు గొఱికికొనుచు నేలంగూలిరి. కొందఱు వాలు దొఱఁగి భీతిగదిరి యొండొరులఁ గౌఁగిలించుకొని నీటితాఁకునఁ గూలు నేటి గట్లవలెఁ గూలిరి.

చచ్చి స్వర్గమును జేరు సైనికులతోడను, భూతలంబున సంగరంబొనరించు వీరులతోడను, అనిఁ గాన వచ్చిన మునులతోడను, రోదసీకుహరంబు నిండిపోయెను.

మహాబలశాలురగు తన యక్షవీరులు రణంబున నిహతులగుట గాంచి ధనాధ్యక్షుఁడగు కుబేరుఁడు మఱికొంతమంది యక్ష సైనికుల రాక్షసులపై కనిపెను. వారికి బాసటగా నొక జగాజట్టినిఁ గూడఁ బంపెను.

రామా! ఇంతలో నధిక సేనాబలయుతుఁడగు సంయోధకుఁడను యక్షుఁడు కుబేరప్రేరితుఁడై చని శత్రుసేనలపైఁ గొప్పరించెను. విష్ణుచక్రముతోఁ

గొట్టినట్లు సంయోధకంటకుఁడు మారీచుని గొట్టఁగా నతఁడు పుణ్యము తఱఁగినవాఁడు నాకంబునుండి జాఱిపడినట్లు కొండకొననుండి పుడమింబడి తెప్పిఱిల్లి కొండొకతడవు విశ్రమించి సంయోధకంటకునితోఁ దలపడ వాఁడోడి పాఱి చనెను. రావణుఁడు కాంచనచిత్రాంగంబును, వైదూర్యరజతోక్షితంబును, ద్వారపాలక సంరక్షితంబును నగు తోరణాంతరంబునఁ బ్రవేశింప సూర్యభానుఁడను ప్రఖ్యాత ద్వారపాలుఁడు లోనికిఁ జొచ్చుకొని వచ్చు దశగ్రీవుని నిరోధింప నతఁడు వానిని సరకుగొనక ముంగలికి నభంగురగతిని సాగి చనుచుండ నాయక్షుఁడు తోరణంబు పెఱికి రావణుని క్షతగాత్రునిఁ గావింప నతఁడు గైరికాది ధాతువులచే నిండిన కొండవలె రక్తసిక్తాంగుఁడై విరాజిల్లెను.

రామా! రావణుఁడు శైలశిఖరసన్నిభంబగు తోరణమ్మునఁ దాడితుండయ్యు బ్రహ్మవరంబునంజేసి మారణంబు గాంచలేదు. సరిగదా యాతోరణంబునే గొని యాయక్షుని శిక్షింప నాతఁడు తోడనే భస్మీభూతదేహుఁడయ్యెను.

అప్పుడు రక్కసుని యుక్కును వీక్షించి జక్కులు దిక్కుతోఁపక యాయుధంబులు తొఱంగి విహ్వలచిత్తులై గిరిగహ్వరంబులను, నదీ జలంబులను డాఁగిరి.

ఇది పదునాల్గవ సర్గము

---

## పదునైదవసర్గము

అంతఁ గుబేరుఁడు భీతిగదిరిపాఱునసంఖ్యాకమగు యక్షసేనను వీక్షించి సంక్షుభితహృదయుఁడై మహాయక్షుఁడగు మాణిభద్రునిఁ గాంచి యక్షేంద్రా! మాణిభద్రా! దుర్వృత్తుఁడు, పాపచిత్తుఁడు, మత్తుఁడు నగు రావణునిఁ జంపుము. కదనంబున నదవదచెందియున్న జక్కులకు దిక్కగుము. అని పలుక మహాబలుఁడు, నజయ్యుఁడునగు మాణిభద్రుఁడు చతుస్సహస్ర యక్షబలంబులు వెంటనంటిరా రణరంగంబునకుఁ జని గదల నదరఁగొట్టియు రోఁకళ్లవీఁకఁ జఱచియుఁ బ్రాసంబులఁ ద్రాసమ్మునొందించియు, శక్తుల భవముక్తినొసంగియుఁ దోమరమ్ముల తామసమ్ములడంచియు, ముద్గరమ్ములగాద్దదికస్వరమ్ములొదవ నదిమియు విపక్షశిక్షయొనర్చుచు సంకులసమరంబు గావించుచు డేగవలె లాఘవంబుగఁ దిరుగుచుఁ గొట్టురా రాక్షసాధమా! గట్టిగాఁ గొట్టు. ఇంతేనా నీ మగతనంబు అనియుల్లసం బాడుచు నెల్లరక్కసులను జెల్లాచెదరు గావించెను,

ఆ తుములసంగ్రామమునుగాంచి గంధర్వులతోడి దేవతలును, బ్రహ్మవేత్తలగు మహర్షులును, మిక్కిలి యక్కజంపడిరి.

ప్రహస్తుఁడు జక్కుల నొక్క వేవురఁ జక్కాడెను. మహోదరుఁడు అనింద్యచరిత్రులగు మఱివేయిమంది యక్షుల మ్రందించెను. దురాత్ముఁడగు మారీచుఁడు తోఁకత్రొక్కినత్రాచువలె మండిపడుచు నొక్కవ్రేల్మిడిన రెండువేలమంది యక్షులం బడఁగొట్టెను.

రామా! యక్షులుచేయు ధర్మయుద్ధమెక్కడ? రాక్షసులొనర్చు మాయాయుద్ధమెక్కడ? మాయావిదులగుటచేతనే రాక్షసులు యక్షులను దలకడచిరి. ఆ భీకరయుద్ధమ్మున మాణిభద్రుఁడు ధూమ్రాక్షునితోఁ దలపడెను ధూమ్రాక్షుఁడు ముసలమ్మున మాణిభద్రుని రొమ్మునవగులఁ గినుకమై వ్రేసెను. వ్రేటువడియు సతండు వీటఁబోనినెఱమగంటిమిమై గదగొని ధూమ్రాక్షుని నెత్తిపగులఁగొట్టెను. ఆ దెబ్బచే నాతఁడు గిరగిర తిరిగి క్రిందఁ బడెను.

నెత్తురు జొబ్బిల్ల వ్రేటువడి నేలఁగూలియున్న ధూమ్రాక్షునిఁ జూచి రావణుఁడు నేయిపోసినయగ్నివలె భగ్గున మండి మాణిభద్రునిపై దుమికెను.

ప్రళయాగ్నివలె దండిగామండుచుఁ గోపంబెసరేఁగఁ బైఁబడవచ్చుచున్న రావణుని యక్షుఁడు శక్తిత్రయంబున బిట్టుగాఁ గొట్టెను. దెబ్బతిని లేచి రావణుఁడు మాణిభద్రుని ముకుటస్థలంబునఁ దాఁకెను. ఆ దెబ్బచే మాణిభద్రుని మకుటమొక్క పార్శ్వంబున కొఱగెను. కాని యా తాఁకునం జేసి యాతఁడు వీక చెడఁడయ్యెను. కంపింపఁడయ్యెను. కావున నది మొదలా మాణిభద్రుఁడు పార్శ్వమౌళియని ప్రసిద్ధిగాంచెను.

## కుబేరుఁడు రావణుని నిష్ఠురము లాడుట.

రామా! మహాత్ముఁడైన యా మాణిభద్రుఁడు యుద్ధవిముఖుఁడు కాఁగానే యా పర్వతమం దెల్లడల మొల్లంబగు కలకలంబు వెల్లెసంగెను. యుద్ధమున మాణిభద్రుఁడు పరాజితుఁడయ్యెననియుఁ బెక్కురు జక్కులు రూపఱిరనియు విని కుబేరుఁడు సర్వయక్షపరివృతుండై సరవాహనుండై శుక్రప్రోష్ఠపదయుక్తుఁడై, శంఖపద్మసమావృతుఁడై చివ్వకుఁ గాలుద్రవ్వుచుఁజని దవ్వున నిలిచి శాపంబుకతంబున విభ్రష్టగౌరవుండై యనిమొనఁ జరించు తన సోదరుని రావణునిఁగాంచి తన బుద్ధివైశద్యము తేటపడ స్వీయవైతామహకులార్హముగ నిట్లనియెను.

ఓరీ ! దుర్మతీ ! నేను నీకు దుష్టచేష్టలు చేయవలదని చెవికి నోరు గట్టుకొని చెప్పినను విననొల్లకున్నావు. నీవు నరకమునకుఁ జనిన పిమ్మట అయ్యో ! ఇట్టి పాపంబులుచేసినకతంబున నిట్టి ఫలంబు లనుభవించుచు న్నాను గదా ! కట్టా ! యెట్టి కట్టిఁడినై తినని బిట్టువగచి నిజస్థితి తెలిసికొందువు. ఎవఁడు దుర్మతియై మోహంబునకువశుఁడై విసంబుద్రావి యొడలెఱుంగకుం డునో యా మూఢుఁడు తన కర్మఫలంబు పరిణామవేళ నెఱుంగుచున్నాఁడు. కాన నాయనా ! ఇట్టి దుష్కార్యము లొనర్పకుము. పాపంబు మూట గట్టికొనకుము. అని యెన్నివిధంబులు బోధించినను నీవు నీ స్వభావ మును విడువకున్నావు. కాన నీ వొనర్చిన స్వల్పధర్మమునుగాంచి దేవతలు నిన్ను మెచ్చుకొనరు. తల్లిదండ్రులను అన్నదమ్ములను గురువులను అవమా నించినవాఁడు యమలోకమునకుఁ జని నానాయాతనలఁబడునాఁడు తనపాప ఫలంబులఁ గాంచఁగలఁడు. శరీర మశాశ్వతంబని యెఱుఁగక యెవఁడు తపంబు సేయనొల్లఁడో యా మూఢుఁడు చచ్చిన వెనుకఁ దనగతిఁదలఁచి పరితప్తుఁ డగును. ధర్మమువలన రాజ్యము లభించును. ధనముచేకూరును. సౌఖ్యము కలుగును. అధర్మమ్మున దురితమ్మదక్క అన్యమ్మలభింపదు. కాన సుఖంబు కోఱకు ధర్మంబు వహింపవలయును. పాపంబు విడువవలయును. పాపంబునకు ఫలంబు దుఃఖంబు మాత్రమే. దాని నాచరించువాఁడు దాని ఫలంబు నీజన్మం బుననే యనుభవింపవలయును. కాన మూఢుఁడు ఆత్మాపఘాతార్థము పాపంబు నొనరించుచుండును. దుర్బుద్ధియగు వాని కెవ్వనికిని సుబుద్ధి యొకి యంతటఁ గలుగదు. యెవఁడెట్టి కర్మంబొనర్చునో వాఁడట్టి ఫలం బొందకమానఁడు. తా మొనర్చిన పూర్వపుణ్యకర్మంబులంజేసి నరులు బుద్ధిని, రూపంబును, బలం బును, ధనంబును, బుత్రులను మాహాత్మ్యంబును బొందుచుందురు. అన్నిం టికి స్వబుద్ధియే కారణము. దుర్బుద్ధివై నరకమునకేగు నీతో మాటలాడ రాదు. నీ తోడనేగాదు నీ వంటి దుర్వృత్తులెవరితోడను భాషింపరాదు. ఇది సుజనుల నిర్ణయము.

## రావణ కుబేర యుద్ధము.

అని కుబేరుఁడు పలికినంత రావణమంత్రులగు మారీచాదులందఱు విని గుమిగూడి యుద్ధవిముఖులై చనిరి. అంత మహాత్ముఁడగు నా యక్షేంద్రుఁడు గదగొని దశగ్రీవుని తల పగుల నడచెను. గదా ఘాతంబున నొచ్చియు రావ ణుఁడు మడమ త్రిప్పలేదు. చలింపలేదు. అంత రావణ కుబేరు లొండొరుల ఘోరంబుగాఁ గొట్టుకొనిరి. ఒక్కఁడును జలింపలేదు. అలసటచెందలేదు. ఉత్తలపాటునొందలేదు. కాని మచ్చరములు మాత్రము పెచ్చుపెరిఁగెను. అంతఁ గుబేరుఁ డాగ్నేయాస్త్రమ్మను రావణునిపైఁ బ్రయోగించెను. రావ

ణుఁడు వారుణాస్త్రముచే దానిని బ్రతిహతియొనర్చి రాక్షస మాయంబూని శతసహస్రరూపంబులందాల్చి బహువిధంబుల గర్జించి యొకసారి వ్యాఘ్రమై, యొక మాఱేకలమై, యొకతేప వారిధరమై, యొకతడవ సముద్రమై, యొక మరి భూధరమై, యొకతూరి హ్రదమై, యొకపరి యక్షుఁడై, యొక యెడ దైత్యుఁడై కుబేరునకుఁ గన్పట్టుచు బిట్టులియుచుఁ జీకాకు పఱచెను గాని నిజ రూపంబున వానికిఁ గానరాఁడయ్యెను.

రావణుఁడు కుబేరుని జయించి పుష్పకంబును గొనుట.

రామా! అంతఁ గొండొకవడికి దశాననుఁడు పెనుగద యను మహా స్త్రమును గొని జక్కులఱేని నెత్తినడుచక్కిని గొట్టెను. కుబేరుఁ డాదెబ్బచేఁ దలపగిలి విహ్వలుఁడై మొదలు నఱకిన యశోకవృక్షమువలెఁ రక్తధార లొలుకఁ గ్రిందఁబడెను. అంత నప్పుడక్కడఁ బద్మము మున్నగు నిధులు కుబే రుని చుట్టుముట్టిగి యోదార్చుచు నందనవనమ్మునకుఁ గొంపోయెను

రాక్షసేంద్రుఁడైన రావణుఁ డట్లు ధనదుని జయించి ప్రహృష్ట చిత్తుఁడై, జయలక్ష్మి లక్షితంబై, ముక్తాజాలప్రతిచ్ఛన్నంబై సర్వకాల ఫల ప్రదద్రుమయుతంబై, కాంచన స్తంభ సందీపితంబై, వైడూర్యమయ తోరణ భాసితంబై, మనోజవంబై, కామగమనంబై, కామరూపంబై, ఖచరంబై, మణికాంచన సోపానంబై, తప్తకాంచన వేదికాలసితంబై, దేవాపవాహ్య మై, యక్షయంబై, దృష్టిమనస్సుఖంబై, బహ్వాశ్చర్యమై, భక్తిచిత్రంబై, బ్రహ్మనిర్మితంబై, సర్వకామసంకలితంబై, మనోజ్ఞంబై, యనుత్తమంబై, నాతిశీతోష్ణంబై, సర్వర్తుసుఖదంబై, శుభంబై, వీర్యనిర్జితంబై, యెసంగు కుబేరుని పుష్పక విమానంబును గైకొని గరువమ్సేకమ్మున ముల్లోకమ్ములు జయించినవానివలెఁ ద్రుళ్లిపడుచు, విజయోత్సాహంబు వెల్లిఖరియ, వెండి కొండనుండి క్రిందికిందిగి విమలకిరీటహార భాసురుండై దివ్యవిమానారూఢుఁడై సదస్సును బొందిన యగ్నిచందంబున విరాజిల్లెను.

ఇది పదునైదవ సర్గము

---

## ప దు నా ఱ వ స ర్గ ము

కైలాసప్రాంతమునఁ బుష్పకము చనకుండుట.

రామా! రాక్షసాధిపుఁడగు రావణుఁడు సోదరుఁడగు కుబేరుని జయించి, కుమారస్వామిని గన్నచోటగుటచేఁ బవిత్రమై కాంతిపుంజరంజి తమై, రెండవ సూర్యునివలెఁ బ్రకాశించుచున్న శౌద్రమూర్తియగు శరవ

ణంబును బొడగాంచి యందు రమ్యప్రదేశ భాసితంబగు నొక్కపర్వతంబు నధిరోహింప నతని విమానమాయున్న యాకాశంబుననుండి యిటునటు గదలక నిలిచెను. అదికని రావణుఁడు తన మంత్రులఁగాంచి ఈపుష్పకము కదలుట లేదు. వలసినచోటునకుఁ బోవుటకుఁగదా యిది కుబేరునిచే నిర్మింపఁ జేయఁబడినది. ఏమిటికి నా యీవిమానము వలసినచోటునకు వెడలుట లేదు. ఈ పర్వతాగ్రమున వసించుచున్న యెవ్వనొక్కనిచే నిది యిట్లాఁపఁబడ లేదు గదా అని ఆలోచనా పూర్వకంబుగఁ బ్రశ్నించినంత బుద్ధికోవిదుఁడగు మారీచుఁడు దశగ్రీవునితో "రాజా! పుష్పకము గదలకపోవుటకుఁ గారణము లేకపోలేదు. ఇది కుబేరునకుఁ దక్క నన్యునకు వాహనము కాదేమో! ధనాధ్యక్షుఁడు లేకుండుట నిది కదలుటలేదు కాఁబోలు." నని యోజించి పలుకుచున్నంతలోఁ గృష్ణపింగళుఁడును, వామనుఁడును, ముండియు, ప్రహ్వాభుజుఁడును, బలశాలియు, ఈశ్వరానుచరుఁడును నగు నందీశ్వరుఁడు రావణుని చెంత కరుదెంచి జంకు గొంకు లేక "రావణా! తొలఁగి పొమ్ము, తొలఁగి పొమ్ము. శంకరుఁ డీశైలంబునఁ బార్వతితోఁ గ్రీడించుచున్నాఁడు. సుపర్ణనాగయక్షులకు, దైత్యదానవ రాక్షసులకుఁ దక్కుంగల సర్వభూతకోటికిఁ గూడ నీపర్వతంబు చొరరానిది. ఇది యీశ్వరాజ్ఞ. అని వచింప విని రావణుఁడు క్రోధఘూర్ణమానమానసుఁడై, కంపితకుండలుఁడై, రోషారుణనేత్రుఁడై, పుష్పకంబునుండి దిగి ఎవఁడురా శంకరుఁడు అని శైలమూలమున కరిగి దీప్త శూలధారియై రుద్రుని చెంగట రెండవ రుద్రునివలె వెలుఁగుచున్న నందీశ్వరునిఁ గాంచి వాని వానరముఖంబును వెక్కిరించువాఁడై మొఱకుఁ దనంబున మేఘముఱిమినట్లు పకపక నవ్వె

## నందీశ్వరుఁడు రావణుని శపించుట.

భగవంతుఁడైన నందీశ్వరుఁడు క్రుద్ధుఁడై యపరరుద్రుఁడై రావణునిఁగాంచి ఓరీ దశాననా! నన్నుఁగాంచి వానరాకారుఁడనని మూతి విఱిచి తిరస్కరించితివి. అశనీపాతసంకాశమగు నపహాసమును గావించితివి. తత్ఫలంబుగా నీవు మద్వీర్యసంపన్నులును, మద్రూపసమతేజోభాసితులును నఖదంష్ట్రాయుధులును, శూరులును మనోజవంబుగల వారును యుద్ధోన్మత్తులును బలోద్రిక్తులును బర్వతంబులమాడ్కి నెల్లెడలఁ బ్రసరించువారును నగు వానరులు నీ కులనాశనమునకై యుద్భవింపఁగలరు. వారు నీత్రుళ్లు దుల్లఁగొట్టుదురు. నీపొడవడగింతురు. నీమంత్రులను, బుత్రులను గూడ రూపుమాపుదురు. ఓరీ నిశాచరా! యిప్పుడు నేన నిన్ను చంపనోపుదును. కాని నీ వింతకుమున్న దుష్కర్మములుచేసి చచ్చియున్నావు. చచ్చినవానిని జంపుట మగపాడి గాదు. అని పలుకఁగానే దేవదుందుభులు మొరసెను. పూలవాన

మరిసెను. మహాబలుఁడైన రావణుఁడు నందివాక్యంబులు లక్ష్యంబు చేయక యాపర్వతము నూఁది "ఓ బసవన్నా! నే విహారము చేయుచున్న నా పుష్పక విమానము గమనమును నీయాజ్ఞంజేసి యీపర్వత మాఁగినది. కాన నీ కొండ నూడఁబెఱికెదను. భవుఁ డేప్రభావంబున నిత్యమును రాజువలెఁ గ్రీడించుచున్నాఁడో తెలియవలెను. పాప మతఁడిప్పుడు ఉపస్థితమైన భయస్థానమును గూడ గుర్తెఱుంగకున్నాఁడు." అని పలికి చేతులారఁబట్టి యాపర్వతము నుఱ్ఱూఁతలూఁపెను.

## రావణుఁడు కైలాసమును బెల్లగించుట.

అచలంబు చలనంబు నొందఁగానె దేవగణంబులు గంపించెను. పార్వతియుఁ జలించి మహేశ్వరునిఁ గౌఁగిలించుకొనెను. అంత మహాదేవుఁడు నవ్వుచు నారావణునిచెయిదిని గని పాదాంగుష్ఠముచే నాపర్వతమును లీలగా నదిమి పట్టెను తోడనే రావణుని చేతులు మహీధ్రంబు క్రిందఁబడి నలిఁగెను. అదికని యతని సచివులు ఆశ్చర్య నిమగ్నులైరి. రావణుఁడు రూపొందిన కోపంబునఁ జేతులబాధ కాఁగలేక తన్నుకొనుచు ముల్లోకంబులు కంపించునట్లు మొఱ్ఱోయని యఱచెను.

ఆధ్వని విని మనుష్యులదిరిపడి ప్రళయకాలము దాపరించెనని తలంచిరి. దేవతలు తొట్రుపాటుగాంచిరి. సముద్రము లల్లకల్లోలమయ్యెను. భూధరంబులు గ్రక్కదలెను. గుహాముఖంబులు మాఱుమ్రోఁగెను. ఏనుఁగులు చేష్టలు దక్కి బిక్కమొగంబులతోఁ బెక్కుగతుల మొఱవెట్టెను. భూమియా కంపించెను. నాగులు గంధర్వులు నులికిపడిరి. యక్షులు విద్యాధరులు సిద్ధులు ఇదియేమి యని యొండొరులఁ బ్రశ్నించుకొనిరి.

అంత రావణు మంత్రులు ఆక్రోశించుచున్న తమయేలిన వానినిగాంచి "దశాననా! మహాప్రభూ! నీలకంఠుఁడు నుమాపతియునగు మహాదేవుని సంతోషపెట్టుము. అతఁడు దక్క నిక్కడ వేఱొక్కదిక్కుగానము స్తోత్రపూర్వకముగా నామహానుభావునకు నమస్కారంబు లర్పించి వానినే శరణంబు నొందుము. దయామయుఁడైన శంకరుఁడు సంతసించి నిన్ననుగ్రహింపఁ గలఁడు."

## శివుఁడు రావణునకు వరంబు లిచ్చుట.

అని పలికినంతనే రావణుఁడు వృషభధ్వజుని సామగానములతోడను బలువిధ స్తోత్రములతోడను నమస్కార పూర్వకముగా నుతింపఁదొడఁగెను. అతఁ డిట్లేడ్చుచుండ వేయేండ్లు గడచెను. అంత మహాదేవుఁడు ప్రీతుఁడై కొండకొనను గూర్చుండి రావణుని కరంబులు విడఁజేసి వాని కిట్లనియె.

"దశాననా! నీవీర్యమునకును శౌర్యమునకును ముదమొందితిని. భూధరమ్ము క్రిందఁబడి నీ చేతులు నలిగిపోవుచుండ నీవు కఠోరారావము గావించితివి. దానంజేసి లోకత్రయంబును భయపడి పాఱినది కాన వీరాగ్రణీ! నీవు 'రావణుఁడ'ను బిరుదమునఁ బ్రసిద్ధిఁగాంచుము. దేవదానవ యక్షులు మహీతలంబునఁగల యితరులు లోకరావణుఁడవైన నిన్ను రావణుఁడని పిలుతురు గాక; పౌలస్త్యా! నీయిచ్చవచ్చిన చోటునకుఁ బోయిరమ్ము. నాయాజ్ఞకుఁ దిరుగు లేదు."

పరమేశ్వరుఁ డిట్లు పలుకఁగానె లంకేశ్వరుఁడు జంకులేక స్వయముగా నీశ్వరునితో "మహాదేవా! నాకుఁ గరుణించితివేని వరం బిమ్ము. ఇదే నిన్ను యాచించుచున్నాను. నేను దేవగంధర్వ దానవులచేతను రాక్షసులచేతను గుహ్యకులచేతను నాగులచేతను బలవత్తరులయిన యితరులచేతను జావు లేకుండ బ్రహ్మవలన వరంబు పొందియుంటిని. మనుష్యులల్పులగుట వారిని గణింపలేదు. వారిని నేనూరక పొలియింపఁగలను. త్రిపురాంతకా! బ్రహ్మ వరంబునఁ జేసి దీర్ఘాయువుగూడ నాకు లభించినది. అందుఁ గొంతగతించినది. కాన మిగిలిన యాయువును నీశస్త్రంబును నాకు దయచేయుము." అని ప్రార్థింప భూతపతియగు శంకరుఁడు భక్తవశంకరుఁడై దివ్యదీధితులనీను చంద్రహాసమను ఖడ్గంబును, ఆయుశ్శేషంబును గూడ వాని కొసగి ఓయీ రావణా! యీఖడ్గంబునెడ నీవవజ్ఞ చేయఁదగదు. అవజ్ఞ చేసితివేని ఇది తత్క్షణంబు నన్నుఁ జేరును. దీన సందియము లేదు. అని వాకొన రావణుఁడు మహాప్రసాదంబని నమస్కరించి సాక్షాన్మహేశ్వరునిచేఁ దాను రావణుఁడను బిరుదము గాంచినందులకు లోలోన మురియుచుఁ బుష్పకంబెక్కి చని యందందుఁ గల వీరవరులగు క్షత్త్రియుల బాధింపఁదొడఁగెను. యుద్ధదుర్మదులును, శూరులును, తేజస్వులును నగు కొందఱు క్షత్త్రియులు వాని శాసనమునకుఁ దల యొగ్గక ధిక్కరించి యెదిర్చి సపరివారంబుగా నశించిరి. మఱికొందఱు ప్రాజ్ఞులు రావణుఁడు దుర్జయుఁడగుట యెఱిఁగి బలదర్పితుఁడైన వానికి 'జితాస్మి' యని శరణంబు సొచ్చిరి.

ఇది పదునాఱవ సర్గము

---

## పదునేడవ సర్గము

### రావణుఁడు వేదవతితో సంభాషించుట.

రామరాజా! అంత మహాబాహువైన రావణుఁడు భూసంచారము చేయుచు హిమవత్పర్వతవనాంతరములఁ జొచ్చి విచ్చలవిడిఁ ద్రిమ్మరుచు;

ఋషిప్రోక్తవిధివిధానము ననుసరించి కృష్ణాజిన జటాధరయై దేవతాస్త్రీ వలెఁ బ్రకాశించు నొక కన్యక నయ్యెడఁ బొడఁగాంచి చెఱకువిలుకానిబారి కగ్గమై రూపసంపన్నయు సుమహావ్రతయునైన యామె నిట్లు ప్రశ్నించెను.

"సుభగా! ఎందుల కిందు వసియించుచున్నదానవు? నెఱజవ్వనంబున నివ్వటిల్లు నీరూపరేఖావిలాసంబున కీ జటావల్కలధారణాదులు దగవు. నీ నిరుపమాన సౌందర్యము పూరుషులకుఁ గామోన్మాదకరంబుగానున్నది. నీ యట్టి చక్కనిచుక్క యిట్లు తపింపరాదు. మంగళాంగీ! నిన్నుఁ గన్నెగాఁగన్న పుణ్యాత్ముఁడెవ్వఁడు? అరాళకుంతలా! నిన్ను భార్యగాఁ బడసిన ధన్యాత్ముఁ డెవ్వరు? భీతహరిణేక్షణా! నీ వెవ్వరిచే నుపభోగింపఁబడుదువో యా నరుఁడే సుకృతి. వాని జన్మమె ధన్యము. కాంతా! నీవేమిటికిట్లు శ్రమపడు చుంటివి! మఱుఁగుపఱుపక యెఱిఁగింపుము." అనియిట్లు రావణుఁడు పలుక యశస్వినియుఁ దపోధనయునగు నా కన్య వానికి నాతిథ్యమొసఁగి యిట్లనియె.

వేదవతి తన వృత్తాంతమును రావణునకుఁ దెలుపుట.

ఓయీ! నాతండ్రి కుశధ్వజుఁడు. అతఁడు బ్రహ్మర్షి. అతుల ప్రభా మహితుఁడు. బృహస్పతిసుతుఁడు. శ్రీమంతుఁడు. బుద్ధినిఁ దన తండ్రియగు బృహస్పతికి దీటగువాఁడు. నిత్యము వేదాభ్యాసముసేయు నా మహాత్మునకేను వాఙ్మయినైన కన్యకగా జనించితిని. కాన వేదవతి యను పేరు వడసితిని. దేవతలు గంధర్వులు యక్షులు రాక్షసులు పన్నగులు మున్నగు వారందఱు మా తండ్రియొద్దకువచ్చి నన్నిచ్చి తమకుఁ బెండ్లిచేయుమని ప్రార్థించిరి. కాని రాక్షసేశ్వరా! నన్ను మా తండ్రివారి కొసఁగ నంగీకరింపలేదు నిశామయా! వినుము! తత్కారణము చెప్పుచున్నాను. సురోత్తముఁడును త్రిలోకాధిపతి యునగు శ్రీ మహావిష్ణువే తనకల్లుఁడు కావలయునని యెంచి ధర్మాత్ముఁడైన నా తండ్రి నన్నితరుల కీయ నొడఁబడఁ డయ్యెను. అది యెఱిఁగి బలదర్పితుఁ డైన దంభుఁడను రాక్షసరాజు లగ్గిమీఁది గుగ్గిలమై భగ్గుమని మండి నిద్రించుచున్న మాతండ్రినిఁ బాపంబని తలంపక చంపెను. అంత మహాభాగయైన మాయమ్మ దిక్కులేనిదై మాతండ్రి మృతకళేబరమును గౌఁగిలించుకొని చిచ్చుఱికెను. నేను నా తండ్రి మనోరథంబు సత్యంబు గావింపఁ బ్రతిజ్ఞచేసి నారాయణునిగూర్చి తపంబుచేయుచున్నాను. ఆ నారాయణునినే హృదయంబునఁ బెండ్లియాడితిని. నేను మరణించినను నా తండ్రికోర్కె నెఱవేర్పవల యునని ప్రతిజ్ఞగైకొని యీఘోరతపం బాచరించుచున్నాను. రాక్షస శ్రేష్ఠా! నా పుట్టుపూర్వోత్తరమంతయు నీకుఁ బూసగ్రుచ్చినట్లు చెప్పితిని. విన్నావుగా? నారాయణుఁడే నా భర్త. పురుషోత్తమునిఁ దక్కనే నన్యునిఁ

జేపట్టను. నారాయణ పరిప్సచే నే నీఘోరనియమంబు నూఁదితిని. పౌలస్త్య నందనా! నిన్ను నే నెఱుఁగుదును. చాలునిఁక దయచేయుము. ముల్లోకంబులఁ బ్రవర్తిల్లు నెల్లవృత్తాంతంబులు నేను దపోబలంబున నెఱుఁగఁజాలుదును.

అన విని రావణుఁడు విమానాగ్రమునుండి డిగి కందర్పశరపీడితుఁడై నియమనిష్ఠాగరిష్ఠయైయున్న యా కన్నెతోఁ గ్రమ్మఱ నిట్లనియె—

రావణుఁడు వేదవతిని దురుక్తులాడుట.

సుశ్రోణీ! నీ తలఁపుతీరు తలఁప గర్వితవుగాఁ గన్పట్టుచున్నావు. కాకున్న నినువంటి జవ్వనులు ముదుసళ్ళవలె జపతపంబులఁ గాయంబు నాయాసపెట్టఁ జూతురె? నీయందచందములు తీరుతియ్యములు నీ వెఱుంగక పలుకుచున్నావు. ఎంత వెఱ్ఱిదానవు. త్రైలోక్య సుందరమైన నీ యౌవనము మీఱి పోవుచున్నది ఆవల నీవనుభవించు సౌఖ్య మేమున్నది? నేను లంకాధిపతిని. నన్ను దశగ్రీవుఁడంద్రు. నా వైభవంబు దలంచి నాకు భార్యవై యథాసుఖముగా భోగమ్ములనుభవింపుము. కోమలీ! నీ వెవ్వనినో వెన్నుఁడని యెన్నుచున్నావు. వాఁడెవఁడైన నేమి? వీర్యముననఁగాని, తపస్సుననఁగాని, భోగముననఁగాని, బలముననఁగాని, వాఁడు నాకు సాటిగాఁడు కాన అంగనా! నన్నువరింపుము. అని దురుక్తులాడు రావణునిఁగాంచి అనవద్యమతియగు వేదవతి "ఓరీ రావణా! యట్లనకుము! త్రైలోక్యాధిపతియు సర్వలోక నమస్కృతుఁడు నగు విష్ణువును నీవు దక్క బుద్ధిమంతుఁ డెవ్వఁడును దిరస్కరింపఁడు" అని పలుక రావణుఁడామె శిరోజములొడిసి పట్టుకొనెను. అంత వేదవతి క్రుద్ధయై రావణహస్తగతమ్ములగు నిజస్నిగ్ధకేశమ్ములను స్వహస్తమ్మె కరవాలమ్ముగాఁ జేసి రెండు ముక్కలుగాఁ గత్తిరించి,

వేదవతి రావణుని శపించి యగ్నిలోఁ జొచ్చుట.

రోషమ్ముచే మహాశనివలె మండుచు రావణునిఁ జూపులచేతనే దహించునదివలెనై మరణంబునకు వేగిరపడుచు నగ్నిని బ్రజ్వలింపఁజేసి వానిఁగాంచి "ఓరీ పాపాత్మా! రావణా! యీ వనంబున నీచే నేను బ్రధర్షితనైతిని. కాన నేను నిన్నుఁ జంపుటకై మరల జన్మించెదను. పాపనిశ్చయుఁడైన పురుషునిఁ జంపుటకు స్త్రీకి శక్యంబుగాదు. నిన్ను శపించెదనేని నాతపంబంతయు బూడిదఁబోసిన పన్నీరై పోవును. నేను హోమము దానము చేసియుండితినేని అయోనిజనై ధర్మాత్ముని కాత్మజనై జనించి సాధ్వినై నెగడెదను." అని పలికి మండుచున్న యగ్నినిఁ జొచ్చెను. తోడనే దేవతలాకసంబుననుండి యెల్లయెడలఁ బెల్లుగాఁబూల జల్లు గురిసిరి.

రామా ! ఆ వేదవతియే జనకుని పుత్త్రియై యిలాతలంబునఁబుట్టి నిఖిలనాథుఁడవు, సనాతనుఁడవు విష్ణుఁడవునగు నిన్ను భర్తగాఁ బడసెను. ఎవతె కోపాతిశయంబునఁ దొల్లి నిర్జర విరోధియగు రావణుఁడు మడిసెనో వాఁడె, యమానుష తేజోమహితుఁడవై, మేరునగధీరుఁడవై యాలసుందరికే పతివైన నీచే మరలఁ జచ్చెను. రామా ! ఇట్లామహాభాగ మర్త్యలోకమునందుఁ బాలంబున వేదియం దగ్నిశిఖవలె జనించెను. కృతయుగమున వేదవతియనఁ బుట్టిన యామెయె త్రేతాయుగమున నా రాక్షసుని వధించుటకై మహాత్ముఁడగు జనకునకు మైథిలకులంబున జన్మించెను. సీతయందుఁ (నాఁగేటిచాలు) బుట్టుటచే మనుజులీమెను సీతయని పిలుతురు.

ఇది పదునేడవ సర్గము

---

## ప దు నె ని మి ది వ స ర్గ ము

### రావణుఁడు మరుత్తుయజ్ఞశాలకుఁ బోవుట.

రామా ! వేదవతి యగ్నినిఁ బ్రవేశించినంతనే రావణుఁడు పుష్పకవిమానమ్మునెక్కి ధరామండలంబంతయుఁ గ్రుమ్మరుచు ఉశీరబీజమను ప్రదేశమున దేవతలఁగూడి యజ్ఞంబు చేయుచున్న మరుత్తనెడు రాజును దర్శించెను. బృహస్పతికి సాక్షాద్భ్రాతయగు సంవర్తుఁడను బ్రహ్మర్షి సర్వదేవగణ పరివృతుఁడై యాజన్నము చేయించుచుండెను.

వరదానమునఁజేసి దుర్జయుఁడైయున్న రావణునిఁగాంచి దేవతలు భయపడి తిర్యగ్రూపములు దాల్చిరి. ఇంద్రుఁడు నెమిలియయ్యెను. యముఁడు కాకి యయ్యెను. కుబేరుఁడు తొండయయ్యెను. వరుణుఁడు హంసమయ్యెను. పెఱదేవతలుగూడ నిట్లు తలకొక రూపంబుదాల్చియుండఁ గుక్కవలె నశుచియైన రావణుఁడు ఆ యజ్ఞవాటికఁ బ్రవేశించి సవనదీక్షితుఁడైన యా రాజును గాంచి యుద్ధము చేయుదువా ? జితోస్మియనియందువా ? యని మూదలింప మరుత్తు నీ వెవ్వఁడవని ప్రశ్నింప రావణుఁ డపహాసమొనర్చి "రాజా ! నీయ కుతూహలభావమునకు సంతోషించితిని. ధనదుని తమ్ముఁడనైన రావణుఁడనగు నన్నే యెఱుఁగవా ? బాగు బాగు ! ముల్లోకంబుల నన్ను మీఱినమల్లుఁడెవ్వఁడున్నాఁడు. నా బలమెవఁడెఱుఁగఁడు. నా యన్నయగు కుబేరుని జయించి యీ విమానమును లాగుకొంటిని, తెలిసినదా ? యిప్పుడు నే నెవ్వఁడనో" అన విని మరుత్తు అనురాజు రావణునితో ఓయీ ! జ్యేష్ఠభ్రాతను యుద్ధమున జయించిన నీవు ధన్యుఁడవు సుమా ! ముల్లోకంబుల నీవంటి శ్లాఘ్యపురుషుఁడు లేఁడు సుమ్మా !

అధర్మసహితమగు కార్యము శ్లాఘాపాత్రముగాదు. జననిందిత కార్యమును గొనియాడరాదు. అన్నను జయించితినను దుర్మార్గకష్టంబు బొనరించి నిన్ను నీవే గొప్పవాఁడనని కొనియాడుకొనుచున్నావు. బళే మొనగాఁడవు! మున్ను నీవే ధర్మకార్యం బాచరించి వరంబులు వడసితివి? నీవిప్పుడు స్వాయముగాఁ జేసితినని చెప్పుకొనిన ఘనకార్యమేదియు నేను వినలేదే! మూఢాత్మా! నిలు, నిలు, ఇఁక నీవు బ్రతికి బయటఁబడజాలవు. ఇప్పుడే నిన్ను వాఁడి బాణముల కెరచేసి యమసదనమున కంపెదనని శరశరాసనంబులు గైకొని యలుక రెట్టింపఁ బోరుసలుప బయలుదేఱ సంవర్తుఁడను మహర్షి దారికడ్డమువచ్చి స్నేహయుక్తముగ మరుత్తునితో నిట్లనియె.

సంవర్తుఁడు మరుత్తుని శాంతింపఁజేయుట.

"రాజా! నామాట వినఁదగినదేని వినుము. సంగరంబుసేత నీకుఁ దగదు. మాహేశ్వరంబైన యీ సత్రంబు సమాప్తినొందదేని కులంబును దగులవెట్టును. యజ్ఞదీక్షితునకు యుద్ధంబు జోలియేల? దీక్షితునకుఁ గ్రోధిత్వమెందులకు? రాక్షసుఁడు దుర్జయుఁడు. నిశ్చయంబుగా నీవే జయింతువని యెట్లు చెప్పఁగలవు." అని నుడివిన గురువాక్యము లాలించి మరుత్తు యుద్ధవిముఖుఁడై శరశరాసనంబులు విడిచి స్వస్థుఁడై యజ్ఞంబు సమాప్తంబు సేయనరిగెను.

అంత రావణుఁడు తాను గెల్చితిననియు శత్రువు వోడెననియుఁ దలంచి దశదిశలఁ జాటఁబంచి సింహనాదంబు గావించెను. మఱియు నా యజ్ఞంబు గాంచవచ్చిన మహర్షులనందఱను జంపి భుజించి నెత్తురులాని తృప్తిగాంచక తిరిగి భూమండలమ్మునఁ దిరుగ నరిగెను.

ఇంద్రాదులు మయూరాదులకు వరంబు లిచ్చుట.

రావణుఁడు మగిడిపోఁగానే దివౌకసులును, ఇంద్రసహితులును నగు దేవతలు తమతమ యథారూపంబుల ధరించి యాయాయిసత్త్వములఁ గాంచి యిట్లనిరి.

ఇంద్రుఁడు నీలపింఛములుగల మయూరంబును గాంచి 'విహంగమరాజా! ధర్మజ్ఞా! నీవు నాకొనరించిన యుపకారంబునకు సంతసించితిని. నా యీవేయికన్నులు నీపురియందు వెలయుఁగాత! నేను వర్షించుచుండ నీవెలమికి నెలవగు హర్షంబు పొందుదువు గాక! నీకు సర్పభయంబు పొరయకుండుఁ గాక! యని పలికినంతనే తొల్లినల్లనై యున్న యెల్లమయూరంబుల బర్హంబులును బలువన్నెలుగలవై పొలిచెను. అంత యమధర్మరాజు ప్రాగ్వంశమందున్న కాకినిఁ గాంచి పక్షీ! నీకుఁ బ్రీతుఁడనైతిని సంతసించిన నామాట

వినుము. నామూలంబునఁ బ్రాణులితరములైన వివిధరోగంబులఁ బాల్పడి బాధ పడుచుందురు. నీయెడ నేను బ్రీతుండనగుటఁ జేసి యారోగము లెవ్వియు నిన్నంటరావు. సందియము లేదు. ఎంతవఱకు మనుష్యులు నిన్నుఁ జంపకుం దురో యంతవఱకు నీవు జీవించియుందువు. నాకలోకంబున నున్న యేమాన వులు ఆఁకలిబాధచే నకనకలాడుచుందురో వారెల్ల నీవు భుజించిన మాత్ర మున బంధుమిత్రులతోఁ దృప్తిగాంచఁగలరు. అని యముఁడు కాకంబులకు వరం బిచ్చెనంత. వరుణుఁడు గంగాతోయవిహారియగు హంసను గాంచి సౌమ్యుఁడా! మనోహరంబును, జంద్రమండలసన్నిభంబును, ఉగ్రంబును, శుద్ధఫేనసమప్రభంబును, నగు వర్ణంబు నీకుఁ గలుగుఁగాక! నాశరీరంబునుఁ (నీటిని) బొంది నిత్యకాంతుఁడవై నెగడెదవు గాక! సాటిలేనిమేటిప్రేమకుఁ బాత్రమవగుదువు గాక! యని వరుణుఁడు హంసలకు వరం బీయఁగానే నీల కాంతికలితంబులగు వాని పక్షాగ్రములు, పక్షమూలములు తృణాగ్రములఁ బోలె నిర్మలంబులై పొలిచెను. నాఁటినుండి హంసంబులు తమతొంటి చామనచాయలు దొఱఁగెను.

అంతఁ గుబేరుఁడు కొండయందున్న తొండనుగాంచి కృకలాసమా! నీవలన నేను బ్రీతుఁడనైతిని. నీకు బంగరురంగు నొసంగుచున్నాను. నావరం బున నీశిరంబు హాటకమయంబై, సద్రవంబై, యక్షయంబై నిత్యంబును బ్రకాశించుఁ గాక!

అని యిట్లాయజ్ఞోత్సవంబున దేవతలాయాతిర్యక్కులకు వరంబు లొసంగి తమ యేలికం గూడి మరలివచ్చి తమ తమ యునికిపట్టులు చేరిరి.

ఇది పదునెనిమిదవ సర్గము

---

## పందొమ్మిదవ సర్గము

### అనరణ్యుఁడు రావణునితో యుద్ధమొనర్చుట.

అంత రాక్షసాధిపుఁడైన దశాననుఁడట్లు మరుత్తుని జయించి యుద్ధ కాంక్షియై రాజనగరంబులకేగి మహేంద్రవరుణోపములగు రాజులఁగాంచి నాతో యుద్ధమొనర్పుఁడు. లేదా యోడితిమని కాలిక్రిందనుండి దూరి పొండు. ఇదే నా నిశ్చయము. వేఱొక్క రీతిని మీరు తప్పించుకొనఁజాలరు. విడుమరఁ గాంచఁజాలరు. అన విని ధర్మనిశ్చయులును, మహాబలులును, బార్థివులును, ప్రాజ్ఞులును నగు రాజులు అభీరులయ్యును నొండకళ్లతో నాలోచించుకొని శత్రువు వరబలోద్ధతుఁడై యుండుట యెఱిఁగి నిర్జితాస్మ (ఓడితిమని) యని పలికిరి.

అట్లు పలికిన వారిలో ముఖ్యులు దుష్యంతుఁడు, సురథుఁడు, గాధి, గయుఁడు, పురూరవుఁడు అనువారు. అంత రాక్షసాధిపుఁడైన రావణుఁడు ఇంద్రునిచే నమరావతివలె ననరణ్యునిచే రక్షింపఁబడుచున్న యయోధ్యాపట్టణమును జేరి పురందరసమబలుఁడగు నా రాజునిఁ గాంచి చేరఁజీరి నాతో యుద్ధ మొనర్పుము లేదా యోడితిననుము. ఇది నా శాసనము. అన ననరణ్యుఁడు వాని తిరస్కారవాక్యమాలించి బిట్టలిగి రాక్షసరాజా! నీతో నేను ద్వంద్వయుద్ధ మొనర్తును నిలు. వైళంబసన్నద్ధుఁడవు గమ్ము. నేనును సంసిద్ధుఁడనై వత్తును. అని మున్నే వాని వృత్తాంతము సమస్తము విన్నవాఁడగుటఁ బదివేల యేనుఁగులు, లక్షగుఱ్ఱంబులు పెక్కువేల రథంబులు కాల్బలమ్ములు ధోడ రా నేల గోడివడునట్లు రణరంగంబున కరిగెను.

అంత ననరణ్యమహారాజునకును, రాక్షసరాజునకును అద్భుతంబును, ఘోరంబును నగు పోరు జరిగెను. రావణ బలంబును దాఁకి, యనరణ్యుని బలం బెల్ల నగ్నియందు వేల్వఁబడిన హవ్యంబు మాడ్కి నశించెను. పెద్దయుంబ్రొద్దు యుద్ధంబుచేసి నిర్వక్రపరాక్రమంబు నెఱపి ప్రజ్వలించు వహ్నిఁ జొచ్చి చచ్చు మిడుతలవలెఁ బావకునియందు వేల్చు వేలిమివలె ననరణ్యుని సేనలు నిరవశేషంబుగ నశించెను. మహార్ణవంబునఁ జొచ్చి నశించు వనాపగాశతంబును బోలె శత్రుసేనఁ జొచ్చి రూపఱిన తన సేనఁగాంచి యనరణ్యుఁడు క్రోధమూర్ఛితుఁడై యింద్రధనుస్సునుబోని తన ధనస్సును స్వయముగ నెక్కిడి నారిసారించి యారావణునిపైఁ గవిసెను. ఆ రణంబున రావణ మంత్రులగు మారీచ శుకసారణ ప్రహస్తులు బన్నంబునొంది లేడులవలె తల కొకదారిగఁ బాఱిరి.

అంత నిక్ష్వాకుకులనందనుఁ డగు ననరణ్యుఁడు రాక్షస రాజైన యా రావణుని నడునెత్తిపై నెనమన్నూట బాణములు నాటెను.

మేఘంబులనుండి విడువఁబడు వారిధారలు పర్వతశిఖరంబును పగులఁ గొట్ట లేనట్టు లారాజచంద్రుఁ డేయు బాణంబులు రావణునకుఁ గించిత్తైన హాని కలిగింప వయ్యెను.

అంత రావణుఁడు క్రుద్ధుఁడై తన యఱచేతితో ననరణ్యుని శిరంబున మోఁద నతఁడు విహ్వలాంగుఁడై వేపమానుఁడై వజ్రదగ్ధంబగు నరణ్యంబున నేలఁగూలు సాలంబువలె రథంబుననుండి భూమిపైఁ బడెను. అదికని రావణుఁడు రాజా! నీవు నాతోఁ బోరి యేమి ఫలంబొందితివి? నాతో ద్వంద్వయుద్ధముచేయు మొనగాఁ డీ ముల్లోకముల నెందును లేఁడు. నీవు భోగలాలసుఁడవై నాబలంబు నాలింపవైతివి. అన విని

### అనరణ్యుఁడు రావణుని శపించుట.

అనరణ్యుఁడు అసువు లసురుసురుగా నిట్లనియె. రావణా! నేనిపుడేమి చేయఁగలను. కాలము మీఱరానిది. ఆత్మస్తుతిపరాయణుఁడవైన నీచే నేను నిర్జింపఁబడ లేదు. నేను కాలముచేతనే విపన్నుఁడనై తిని. నీవు కారణ మాత్ర మవు. ప్రాణంబులు వోవు నీసమయంబున నిన్ను నేనేమి చేయఁగలను? యుద్ధమునుండి పాఱిపోవుచున్నతఱి నన్ను నీవు గొట్టలేదు. మాయిక్ష్వాకు కులంబును నిందించుటఁజేసి నీతో రెండుమాటలాడుచున్నాను వినుము. నేనే దానము లొనర్చినవాఁడనేని హోమంబులుచేసినవాఁడనేని, సుకృతం బులుపొనరించినవాఁడనేనిఁ దపంబు గావించినవాఁడనేనిఁ బ్రజలను రక్షిం చినవాఁడనేని నావాక్యంబు సత్యంబగుఁ గాక! రావణా! మహాత్ములైన యీయిక్ష్వాకులకులంబున దశరథునకు రాముఁడు పట్టియై పుట్టి నిన్ను మట్టువెట్టుఁ గాక! అని శపించినంతనే దేవదుందుభులు జలధరంబులు వ్రాలె మొరసెను. సుమవర్షము కురిసెను.

అంత నారాజు స్వర్గం బలంకరించెను. అనరణ్యుఁడు స్వర్గతుఁడు కాఁగానే రావణుఁ డచ్చోటు విడిచి చనెను.

ఇది పందొమ్మిదవ సర్గము

---

## ఇ రు వ ది య వ స ర్గ ము

### నారదుఁడు రావణునకు మనుష్యవధ మానుమని చెప్పుట.

అంత రాక్షసాధిపుఁడైన రావణుఁడు భూమింగల మానవులకెల్ల భీక రుఁడై చనుచు నాకాశమార్గమున మునిసత్తముఁడైన నారదునిఁగాంచి యభి వాదనం బాచరించి కుశలంబడిగి తమ రాకకుఁ గారణం బేమని ప్రశ్నిం చెను. అది విని దేవర్షియగు నారదుఁడు మేఘంబుల మాటుననుండి పుష్పకా రూఢుఁడైన రావణుని కిట్లనియె. సౌమ్యా! నిలు. ఊర్జితంబులగు నీ యభి జనోపేత పరాక్రమంబులకు సంతసించితిని నీ వొనర్చిన దైత్యనాశనంబునకు గంధర్వోరగ తిరస్కారమునకు విష్ణువుతోడి పోరాటమునకు నమందానందంబు నొందితిని. రాక్షసోత్తమా! యిత్తఱి నీతోనించుక సంభాషించుచున్నాను. వినవలతువేని వినుము. వినిన పిమ్మట నించుక యోచించి నీకుఁ బోలినయట్లు చేయుము. దేవతల కవధ్యుఁడవైన నీవు మానవలోకంబునేల పోరిపుచ్చెదవు? మృత్యుముఖంబునఁబడి యప్పుడే యీ లోకంబు దనంత తాను హతమయ్యెను. దేవదానవ దైత్యయక్ష రాక్షస గంధర్వులకు వధ్యుఁడవుగాని నీచే మానవ

లోకంబు బాధింపఁబడుట యుక్తంబుగాదు. శ్రేయంబన నేమో యెన్నఁడు నెఱుఁగనదియు వ్యసనావృతంబైనదియు, జరావ్యాధిశతయుతంబైనదియు నగు మానవలోకంబు నెవ్వఁడు చంపఁబూనును ? ఏ మూలఁ జూచినను అనిష్టము లచేఁ గష్టములు గుడుచుచుండు మానవలోకంబుతోఁ యుద్ధంబుసేయ బుద్ధిమంతుఁ డెవ్వఁ డిష్టపడును ? ఆఁకలి దప్పులచేత, జరాభారాదులచేతను సదా క్షీయమాణమును విషాదశోకసమ్మూర్ఛంబును నగు నీ లోకంబును నీవు నాశనము చేయకుము. రాక్షసేశ్వరా ! ఇవ్విధంబున మూఢాతిమూఢమై విచిత్రార్థమై వెలయు నీ మానవలోకంబు నీ విప్పు డొక్కమాఱు పరికింపుము. ఇం దొక్కఁడును గతి గానకున్నాఁడు. కొందఱు జనులు సంతసంబున నృత్తగీత వాద్యంబులఁ గాలంబుపుచ్చుచున్నారు. మఱికొందఱు అశ్రుధారాపూరిత నయనాసులై తల్లులయు దండ్రులయు సుతులయు స్నేహంబుల నెంచియు, భార్యలయు బంధువులయు చక్కఁదనంబులఁ దలపోసియు నేడ్చుచున్నారు. ఇట్లు మోహంబునఁ జిక్కి స్రుక్కి నీ జనంబు నాశనమై తన క్లేశంబును దా నెఱుఁగకున్నది. మోహనిరాకృతమైన ఈ మానవలోకంబు నేల కాఱియ వెట్టెదవు ? చాలు. మానుము. సౌమ్యుఁడా ! నీచే నిక్కంబుగ మానవలోకము జయింపఁ బడినది. సందియంబు లేదు. ఈ మానవులందఱు తప్పక యమపురంబున కేగవలసిన వారే. పరపురంజయాంకా ! నీవు యముని నిగ్రహింపుము. వాఁ డొక్కఁడు జయింపఁ బడెనేని సర్వంబును జయింపఁబడినట్లే.

## రావణుఁడు నారదునితోఁ దాను యముని జయింపఁ బోయెదననుట.

అని పలికిన నారదున కభివాదనంబొనర్చి వికావిక నవ్వి రావణుఁ డిట్లనియె. మహర్షీ ! సమరప్రియా ! నే నిదే విజయార్థంబు రసాతలంబున కేగ నమకట్టితిని. లోకత్రయంబును జయించి నాగులను, దేవతలను వశవర్తులను జేసికొని రసాలయమగు సముద్రమును నమృతార్థమై మథించెదను. అన విని నారదుఁ డతనికిట్లనియె. శత్రునాశంకరా ! రావణా ! యమపురి కేఁగు మార్గమున నేకదా నీవు రసాతలంబున కేఁగవలయును. ఆ యమపురంబున కేఁగు మార్గంబు కడుంగడు దుర్గమంబు. ఆ మార్గముగుండఁ జనుట దుర్ధర్షుఁడవైన నీకుఁ దక్క నన్యులకు శక్యంబుగాదు. అన విని రావణుఁడు శారదనీరద గాత్రుఁడగు నారదునిఁగాంచి యిట్లనియె. మౌనీంద్రా ! నీ చెప్పిన చొప్పునఁ జేసితినిగా దలంపుము. ఇది యెంతభాగ్యము. నీ వేకారణంబునఁజేసి యీ మానవలోకంబునెడ కృపాళుండవై యుంటివొ యీ కారణంబునఁజేసియే నేను యమవధోద్యోగినై యాసూర్యపుత్రుఁడున్న దక్షిణదిక్కునకుఁ బోవుచున్నాను. రణార్థి నగునేను మున్నె లోకపాలుర నలువురను జయించెదనని క్రోధం బినువడింపఁ బ్రతినఁ బూనియుంటిని. కాన నిదే యమపురంబుపై

జయత్రయాత్ర సాగించుచున్నాను. ఇంక క్షణకాలములో యముని మృత్యువున కెరచేసెదనని పలికి రావణుఁడు నారదమునీంద్రునకు నమస్కారంబు గావించి సంతోషితస్వాంతుఁడై మంత్రులఁగూడి దక్షిణాభిముఖుఁడై చనెను.

అంత మహాతేజస్వియగు నారదుఁడు ముహూర్తకాలంబు ధ్యాననిష్ఠాగరిష్ఠుఁడై యుండి విధూమపావకుఁడువోలె విరాజిల్లి యిట్లు చింతించెను.

**నారదుఁడు రావణుఁడెట్లు యముని జయించునని యోచించుట.**

చరంబులును అచరంబులును ఇంద్రాదిదేవతలును గల యీ లోకత్రయంబును యముఁడే కదా యాయువుడిపి నశింపఁజేయును. అట్టి వానిని రావణుఁడెట్లు జయింపఁగలఁడు. ఎవఁడు తన తన చేసిన దాన ధర్మాదులకు సాక్షియై రెండవయగ్నివలెఁ దేజరిల్లుచుండునో యే మహాత్మునిచే లోకంబులు చైతన్యంబులు కలిగి చరించుచుండునో యెవనికి వెఱచి ముల్లోకంబులు నెల్ల యపుడు గోడుగుడుచుచుండునో యా వైవస్వతుని రావణుఁడెట్లు స్వయముగ జయింపఁగలఁడు. ఎవఁడు సుకృతంబును, దుష్కృతంబును నాచరించు వారికి విధాతయు దాతయునైనవాఁడో యెవనిచేఁ ద్రిలోకంబునవారు జయింపఁబడిరో యా శమనుని నీరావణుఁడు జయింపఁగలఁడా! లేక వేఱొండుపాయము యోజించుకొని జమునిపై దాడివెడలునా? చూడ వేడుక వొడముచున్నది. కాలునిమందిరమును గాంచఁ బోయెదను. యమ రావణుల యుద్ధంబు గన్నులారఁగాంచి తనియుదునుగాక! అని వితర్కించుకొనుచు నారదుఁడు యమపురంబునకుఁ జనెను.

ఇది ఇరువదియవ సర్గము

---

## ఇరువదియొకటవ సర్గము

అలఘువిక్రమా! రామా! బ్రాహ్మణశ్రేష్ఠుఁడగు నారదుఁ డట్లాలోచించి యీ వృత్తాంతమంతయు యథాతథముగా యముని కెఱిఁగించువాఁడై వాని మందిరమునకుఁ జని

**రావణునుద్దేశము నారదుఁడు యమునితోఁ జెప్పుట.**

యక్కడ నగ్నిపురస్కృతుఁడును బ్రాణికోటు లొనర్చిన సుకృత దుష్కృతములకుఁ దగినట్లుగా సుఖదుఃఖము లాపాదించువాఁడునునై యున్న యమునిఁగాంచెను. దండధరుఁడు తన్నుఁ జేరవచ్చిన దేవర్షియగు నారదునిఁ గాంచి యర్ఘ్యమొసఁగి పూజించి దేవగంధర్వసేవితా! దేవర్షి! తమకు క్షేమమే కదా! ధర్మమున కెట్టి హానియుఁ గలుగదు కదా! తమ రాకకుఁ

గారణమేమి? యానతిండని యడుగ నారదుఁడు 'ధర్మరాజా ! చెప్పుచున్నాను వినుము. విని నా చెప్పిన విధానము నాచరింపుము. రావణుఁ డను రాక్షసుఁడు దుర్జయుఁడవగు నిన్నుఁ దన పరాక్రమమున నిర్జింపవచ్చుచున్నాఁడు. ప్రభూ ! యీ కారణంబును నీకుఁ దెలుప నేను దొందరతొందరగా నిందరు దెంచితిని. దండాయుధధారివైన నీ కిప్పుడేమి కీడుమూఁడునో కదా ! అని పలుకుచున్నంతలో దవ్వుల నుదయసూర్యునివలె వెలుఁగుచు వచ్చుచున్న రావణుని విమానముదోఁతెంచెను.

## రావణుఁడు యమలోకంబున బాధింపఁబడు జీవులను జూచుట.

కొండొకవడికి మహాబలుఁడైన రావణుఁడు పుష్పకవిమానప్రభలచే నా ప్రదేశమండలి చీకటియంతయుఁ బటాపంచలు గావించి యముని సమీపమున కరుదెంచి యందందుఁ దనతనసుకృత దుష్కృత కర్మఫలంబుల ననుభవించుచున్న ప్రాణులను రౌద్రమూర్తులు ఘోరరూపులు భయానకులునైన యమసైనికులను, యమానుచరులను యమకింకరులచేఁ జంపఁబడువారిని గట్టి వెట్టఁబడువారిని గుయ్యో మొఱ్ఱోయని యేడ్చువారిని బాధకాఁగలేక వ్రేఁగువారిని బురుగులచే భక్షింపఁబడువారిని భీకరశ్వానములఁ బీఁకఁబడువారిని జెవులు చిల్లులుపడునట్లు భూనభోంతరాళములు పగులునట్లు బొబ్బరించువారిని నెత్తుటినీళ్లచేఁ జిత్తములు గలచు వైతరణిని దాఁటువారిని వేఁచిన యిసుకలో మాటిమాటికి వేఁపఁబడువారిని అధర్మంబు లాచరించుటఁ జేసి యసిపత్రవనమునఁ గోయఁబడువారిని కౌరవనరకమ్మునఁ బడువారిని ఉప్పుటేఱున మునిఁగి తేలువారిని మంగలికత్తులచేఁ గడికండలుగాఁ జేయఁబడువారిని దప్పిగొని నీళ్లోనీళ్లని యఱచువారిని ఆఁకలిచే నంగలార్చువారిని బీనుఁగులవలె నున్న వారిని బక్కచిక్కినవారిని దిక్కు మొక్కు లేనివారిని వెలువెలఁబోవు వారిని వ్రేలాడులలవెంద్రుకలవారిని మురికిమేనులవారిని దిస్సమొలవారిని అటునిటు పఱచువారిని దొప్పలు దోరలుగాంచి మఱియొకయెడఁ దమ సుకృతంబులకు ఫలంబులుగా వ్యోమయానంబులఁ గూర్చుండి నృత్తగీత వాద్యములఁగనుచు వినుచు నానందమునఁ దొప్పదోఁగువారినిఁ గని యింకొకచోటున గోదానంబులు చేయుటఁ జేసి గోక్షీరంబులు గ్రోలువారిని అన్నదానమొనర్చుటచే రాజాన్నమ్ము లారగించువారిని గృహదానములు గావించుటను మేలియిండ్ల వసించువారిని కాంచన మాణిక్య ముక్తాఫలములు దానముసేసిన కతమున సర్వభూషణ భూషితాంగులై యున్నవారిని వివిధధర్మంబు లాచరించి వానికిఁదగిన ఫలంబు లనుభవించుచు వెలుంగుచున్నవారిని వీక్షించి, తత్క్షణంబ పాపకర్మఫలం బనుభవించుచు సంకట పడుచున్నవారినిఁ జేరి మీ రిఁక హాయిగాఁ జరింపుఁడని విడిచిపుచ్చెను.

## యమభటులు రావణునితోఁ బోరుట.

రావణునిచే విడుగరగాంచిన ప్రాణులందఱు అప్రతర్కితంబును అవిచింత్యంబునునైన సుఖంబు ముహూర్తకాలం బనుభవించిరి. అదికని యాప్రేతంబులనుగాచు యమభటులు గోపాటోపమ్మునఁ గసిమసఁగి రావణుఁదాఁకి హాల హాల ధ్వనులు గావించుచు నీఁటెలతోడను గుదియలతోడను శూలంబులతోడను సమ్మెటలతోడను జిల్లకోలలతోడను జెట్టులతోడను గుట్టలతోడను బల్లెములతోడను ఎడతెఱపిలేకుండ బుష్పక విమానము సిల్లులు వడఁగొట్టిరి. ఆ వ్రేటులకుఁ బుష్పకము బీఁటలువాఱెఁ మేఘచ్ఛన్నంబగు మేరు ధరాధరశృంగంబుభంగిఁ బ్రకాశించెను. అంత యమభటులు మధుకరముల వలె విమానమున నుఱికి యందలి తోరణములు మేడలు మిద్దెలు వేదికలు దుత్తునియలు గావించిరి. బ్రహ్మమహాత్మ్యంబునఁ జేసి యది వెంటనె తొంటి యట్ల యక్షయంబై పరిపూర్ణమై వెలుఁగొందెను. అంత మహావీరులైన రావణ మంత్రులును మహారాజైన రావణుఁడును యథాక్రమమ్మునగా యథాబల మ్మునగా యమభటులతో యుద్ధమ్ము సేయ నాకృతాంతయోధులు శస్త్రపరంపర లచే సామాత్యుఁడగు రావణునిఁ జావమోదిరి. మేనులనుండి నెత్తురు జోట జోటకాఱుచున్నను దశగ్రీవునిసచివులు పిఱికికండ లేనినెఱమగంటమితో దండధరమంత్రులతోఁ దలపడిరి. ఒండొరులకుఁ బోరు ఘోరంబుగఁ బెద్దయుం బ్రొద్దు ప్రవర్తిల్లెను. యముని మంత్రులు రావణామాత్యులను గీటునం బుచ్చి, రావణునే శూలంబులఁ గాఁడనేసిరి. ఆ ప్రహారంబుల మేనెల్ల జల్లెడ వలెఁ దూఁటులువడ రక్తదిగ్ధాంగుఁడై రావణుఁడు ఆరంబూచిన యశోకంబు వలె విమానంబున విరాజిల్లి శూలంబులు గరవాలంబులు గదలు తోమ రమ్ములు బాణమ్ములు రోఁకళ్లు రాళ్లు చెట్టులు గుట్టలు నస్త్రబలంబున నంతక బలంబుపై నంతతధారాయుతంబగు వర్షంబువలెఁ గురిసిన నా యమభటులు వానినెల్ల నడిమిమార్గమునఁ బడఁగొట్టి మేఘమ్ములు పర్వతమ్మునుబోలె రావ ణునిఁ జుట్టుముట్టి బిట్టుగొట్టి విడిచిరి. అంత రావణుఁడు మైమఱువు దొఱఁగి కనలి రక్తధారలఁ దోఁగి తోఁగి పుష్పకమ్ము వీడి పుడమిపై నిలువఁబడెను.

## రావణుఁడు పాశుపతాస్త్రంబున యమకింకరుల దహించుట.

ముహూర్తకాలంబున లబ్ధసంజ్ఞుఁడై విల్లంబులుదాల్చి క్రోధమూర్తియై రెండవ యమునివలెఁ బొలిచి పాశుపతంబను దివ్యాస్త్రంబును గార్ముకంబున సంధించి యాకర్ణాంతమ్ముగా లాగి నిలు నిలుఁడని యదలించి రుద్రుఁడు త్రిపురంబులపై వైచినట్లాశస్త్రంబును వైవస్వతయోధులపైఁ బ్రయోగిం చెను. విధూమజ్వాలామండల రూపంబగు నాశరంబు మండువేసవి నరణ్యం బుల దహించు కారుచిచ్చువలె మండఁ దొడంగెను. జాలామాలియగు నా

పాశుపతాస్త్రము రణంబున రాక్షసానుగతంబై విజృంభించి పొదలను వ్రాంకులను బూదిచేసి ముందునకుఁ బాఱెను. యమచమూసముదయంబు లాపాశుపతాస్త్ర తేజంబున దగ్ధంబులై దావాగ్నిచేఁ గాలిన వృక్షంబులవలెఁ గదనరంగంబునఁ గూలి నీఱయ్యెను. అంత భీమవిక్రముఁడగు నా రావణుఁడు మంత్రులతోఁ గూడ భూమి యదురునట్లు సింహనాదంబు గావించెను.

ఇది యిరువది యొకటవ సర్గము

---

## ఇరువదిరెండవసర్గము

### యముఁడు రావణునితో యుద్ధమునకై వెడలుట.

వైవస్వతుఁడైన యముఁడు రావణుఁ డొనర్చిన సింహనాదంబు నాలించి శత్రువిజయంబును నిజబలసంక్షయంబును సంభవించెనని భావించి క్రోధపర్యాకులేక్షణుఁడై సారథింగాంచి రథంబు త్వరితంబుగాఁ దీసికొని రమ్మని యాజ్ఞాపించెను. వెంటనే సూతుఁడు మహాస్వనయుతంబగు శతాంగంబును గొని వచ్చి యెదుట నిలుపఁగా యముఁడు తేజంబుమీఱ దాని నధిరోహించెను. అంతలో నవ్యయంబైనయీ త్రైలోక్యంబు దేనిచే హరియింపఁబడునో యా మృత్యువు పాశ, ముద్గరహస్తములతో యముని యెదుట నిలిచెను. మఱియు యముని దివ్యాయుధంబైన కాలదండంబుగూడ మూర్తిమంతంబై నిజతేజంబున నగ్నివలె మండుచు నా యుత్తమస్యందనమ్మునఁ వాని ప్రక్కనె నిలిచెను. కాలపాశంబులును వాని కెలననే నిరవకాశంబుగఁ బ్రతిష్ఠితములయ్యెను. ముద్గరంబు వహ్నితుల్యంబగు మూర్తిని దాల్చి వానిని భజించెను.

అత్తఱి సర్వలోక భయంకరుఁడును క్రోధమూర్తియునైన యమునిఁ గాంచి లోకత్రయంబును సంక్షోభించెను. దేవతలు భయపడి నడునడు నడంకిరి.

అంత సూతుండు రక్తకాంతుల నీను గుఱ్ఱమ్ముల ఛే యని యదలించి తోలుచు సింహగర్జనంబు సేయుచుండ ముహూర్తమాత్రంబుననె హరిహయోపమంబులగు నావారువంబులు మనోవేగంబునఁ బఱచి యముని రణరంగమ్మునకుఁ గొంపోయెను.

వికృతంబును మృత్యుసమన్వితంబును సర్వలోక భయావహంబును నగునాయమరథంబును గాంచి క్రోధమూర్తులును బలవంతులును అతి భయంకరులును నగురావణు మంత్రులు సత్వంబు దొఱంగి నష్టసంజ్ఞులై

భయార్తితులై 'మన మిచ్చట యుద్ధంబు సేయ సమర్థులముగాము'ని యను కొనుచు నలుదెసలకుఁ బఱచిరి.

## యమ రావణ యుద్ధము.

లోక భయంకరమైన యామరదమునుగాంచి రావణుఁడు కలఁగలేదు, భయమందలేదు. జముఁడు దశగ్రీవుని సమీపంబున కరిగి క్రోధం బుద్దీపింప శక్తితోమరంబులంగొని వాని యాయంబులెల్లఁ గాఁడనేసెను. మర్మంబులు భేదింపఁబడియు రావణుఁడు వజ్రపుఁ దాఁకునకుఁ గదలని యచలంబు మాడ్కి ఘోరంబైన యావ్రేటులకు నదరుగుండె బిక్కబెదురులేక స్వస్థుఁడై నిలిచి యంతకుని తేరిపై మేఘుఁడు వారిధారలు గురిసినట్లు శరవర్షంబు గురిసెను. మహాఘోరంబులును నానావర్ణంబులును నగు నంబుధరంబులు భూధరంబును బోలె రావణుని బాణంబులు యమునిఁ గప్పి వైచెను. దశకంఠుని మార్గణంబులను శత్రుసంహారకుఁడగు యముఁడు ముక్కలుసేసి వేఱొక్క సాయకంబు రావణునిపైఁ బ్రయోగించెను. ఆవాఁడి నారసమున ఱొమ్మునవగుల రావణుఁడు మాఱుపోరు సలుపఁ జాలఁడయ్యెను. శత్రునాశంకరుఁడైన యమునితో రావణుఁ డేడురాత్రులు నానాయుధంబులతో నాయోధనంబు సేసి భంగంబు నొందలేదు. విజయంబు గాంచలేదు. అంతఁ బరస్పర విజయాకాంక్షులును బ్రవిదారణంబున నెన్నండును వెనుకంజ వేయనివారును నగు యమ రావణుల కిరువురకు ఘోరంబగు తుములసంగ్రామంబు సంఘటిల్లెను.

అత్తఱి దేవగంధర్వసిద్ధర్షులు బ్రహ్మను మున్నిడుకొనివచ్చి యమ రావణయుద్ధంబు గాంచ వియత్తలంబున నిలిచిరి. రాక్షసముఖ్యుఁడైన రావణునకును బ్రేతాధిపతి యగుయమునకును బ్రవర్తిల్లిన యాసమీకము లోకమ్ములకుఁ బ్రళయకాలము దాపురమైనట్లు తోఁచెను.

అప్పుడు రావణుఁడు వజ్రాయుధమును బోలు కోదండంబు నెక్కిడి మృత్యువును నాలుగు శితివిశిఖంబులను సూతుని నేడువాఁడియలగులతోడను యముని శతసహస్ర శరంబులతోడను మర్మంబులు భేదిల్లఁగడువడిఁ గొట్టెను. అంతఁ గ్రోధోద్దీపితుఁడైన యమునివదనగహ్వరముననుండి వెలువడు నిట్టూర్పులనుండి జ్వాలామాలాభీలంబగు వహ్నిపొడమి లోకంబుల కెగఁబ్రాఁకెను. శత్రువును రూపుమాప వెలుఁగుచు బయలు వెడలిన క్రోధజన్యంబగు నాయగ్నినిఁ గాంచి దేవదానవ రాక్షసులు విస్మయము చెందిరి.

అది కని మిత్తియుఁ గాలుఁడును సంతసంబునఁ జంకలెగురవైచి యుద్ధమునకు సిద్ధపడిరి. అప్పుడు మృత్యువు కినుక రెట్టింప దుంతరాత్మను (యముని) గాంచి యిట్లనియె.

యమదేవా! నన్ను శీఘ్రముగా విడువుము. నేనీదే యా శత్రువును సమరముఖమున నిహతునిఁ గావింతును. ఇంక నారాక్షసుని రూపుచూ పట్టదు. ఇది నాకు నిసర్గమగు మర్యాద. శ్రీమంతుఁడగు హిరణ్యకశిపుఁడు, నముచి, శంబరుఁడు, సంహ్రాది, ధూమకేతువు, బలి, వైరోచనుఁడు, శంభుఁడు, వృత్రుఁడు, బాణుఁడు, కార్తవీర్యుఁడు, నరకుఁడు, మధుకైటభులు, రాజర్షులు, శాస్త్రవేత్తలు, గంధర్వులు, ఉరగులు, ఋషులు, పన్నగులు, దైత్యులు, యక్షులు, అప్సరసలు, సద్రుమంబును, సార్ణవంబును, సగ్రావంబును, సాప గంబును నగుసీధరణీచక్రమెల్లయు దురాసదులైన లాఁతిబలవంతులును నాచూపు సోఁకినంతన ప్రళయకాలమున మలమల మాఁడిరి. మహారాజా! సర్వధర్మజ్ఞా! నన్ను విడువుము. ఇదిగో నిప్పుడే వీనిని సంహరింతును. నా కంటఁ బడినవాఁ డెట్టి జెట్టియైన బ్రతికి బయటఁ బడలేఁడు. ఇది నా బలము గాదు. నానిసర్గశక్తి. నాకంటికగ్గమైనవాఁడు ముహూర్తకాలమైన జీవింపఁ జాలఁడనుట పునరుక్తిగాదు.

యముఁడు రావణునిపై యమదండమును వైవఁ బూనుట.

అని పలికిన మృత్యు వాక్యంబు లాలించి ప్రతాపశాలియగు యముఁడు 'మిత్రీ! ఇదిగో నేనే రావణునిఁ బరిమార్తును' చూడుమని కనులెఱ్ఱఁ జేసి యలుకమైనమోఘమైన కాలదండమ్మును గేలంగీలించి యిటునటు ద్రిప్పెను. అంతలో వాని పార్శ్వమునఁ బ్రతిష్ఠితములై యున్న కాలపాశము లన్నియు నిప్పులు గ్రక్కుచుండ ముద్గరమ్ము మూర్తిమంతంబై యెదుట నిలిచెను. ఏముద్గరము దర్శనమాత్రముచేతనే సకలప్రాణుల ప్రాణములు హరించునో యది దేహులను దాఁకినచోఁ బ్రాణులను వ్రేసినచో నెట్లగునో వేఱ వివరింప నేల? బలవంతుఁడైన యాయమునిచే విడువఁబడిన వెంటనే రావణుని దహించు నదివలె నాముద్గరము జ్వాలామాలలచేఁ బరివృతమై వెలుఁగఁ జొచ్చెను. కాలదండమ్మునూని చనుదెంచు యమునిఁ గాంచినంతన యంద ఱును జిందఱవందఱ చెంది పఱచిరి. వేల్పులుగూడఁ జలించిరి.

దండము వైవవలదని బ్రహ్మ యముని వారించుట.

యముఁడు దండంబు నెత్తి రావణుని మీఁద వైవఁ దమకింప బ్రహ్మ తానై వచ్చి వాని యెదుట నిలిచి యిట్లనియె.

వైవస్వతా! మహాబాహూ! నిర్వక్రపరాక్రమా! వలదు వలదు. ఆఁగుమాఁగుము. ఈ దండంబున రావణునిఁ జంపకుము.

దేవోత్తమా! వీనికిఁ జావులేకుండ నే వరమొసంగియుంటిని. నా వరంబు నీవు వ్యర్థంబుగాకుండఁ జూడవలయును. నామాట బొంకొనర్చిన

దేవుఁడుగాని మనుష్యుఁడుగాని మఱియెవ్వఁడుగాని ముజ్జగంబుల బొంకొనర్చిన వాఁడగును. ఇందు సందియంబు లేదు. కోపంబు ప్రధానంబుగా నీవ దండంబు ప్రయోగించితివేని ఇది రౌద్రాకారంబుతో లోకత్రయభయావహంబై ప్రజలనెల్ల మిత్రామిత్రులనక నిశ్శేషంబుగ రూపుమాపును. ప్రజానాశనంబు సేత కీ దండం బమోఘమైనది. మృత్యుపురస్కృతంబుగా నీకాలదండంబును మున్ను నేన సృజియించితిని. కాన సౌమ్యుఁడా! ఈ దండంబున నారాక్షసుని తల పగుల నేయకుము. దీని వ్రేటువడిన యెవ్వఁడును క్షణకాలమైన జీవింపఁడు. ఈదండంబు ఘాతంబున నీరాక్షసుఁడు చచ్చినను జావకున్నను రెండువిధం బులనుగూడ నావచనం బసత్యమై చనును. కాన రావణునిపై నెత్తిన యీ దండంబు నివారింపుము. నీవు లోకంబుల రక్షింపఁ దలంచితివేని ఇత్తఱి నావచనంబులు గుఱుచ సేయకుము. అని ధర్మాత్ముఁడైన బ్రహ్మ పలుకఁగానె విని యముఁ డిట్లనియె.

స్వామీ! యిదిగో దండమును మరల్చితిని. మఱి విడువను. నీవు మాకు రాజవుగదా! వరదర్పితుఁడైన రాక్షసుని నేను జంపరాదేని యుద్ధ రంగమున నిలిచి యేను జేయునదేమియును లేదు. కాన నీరాక్షసునికిఁ గాన రాకుండ నంతర్ధాన మొందుదును. అని పలికి యమధర్మరాజు సరథుఁడును సాయుధుఁడునునై యంతర్హితుఁడయ్యెను. రావణుఁడును యముని జయించితి నని తనపేరును నలువలంకులఁ జాటి పుష్పక విమానము నెక్కి యమపుర మ్మును వీడి చనెను.

ఆయముఁడును దేవతలతోఁ గూడి బ్రహ్మను ముందిడుకొని ప్రహృష్టుఁడైన నారదమునీంద్రునితో నిష్టాగోష్ఠి నెఱపుచుఁ ద్రిదివంబున కరిగెను.

ఇది యిరువది రెండవ సర్గము

---

## ఇరువది మూఁడవ సర్గము

### రావణుఁడు నివాతకవచులతో సంధి చేసికొనుట.

దశగ్రీవుఁడైన రావణుఁడు త్రిదశపుంగవుఁడైన యముని జయించి యాత్మశ్లాఘనపరాయణుఁడై స్వసహాయులను గాంచెను. రక్తసిక్తాంగుఁ డును బ్రహారజర్జరీకృతకాయుఁడును నగుఁరావణునిఁగాంచి రాక్షసులెల్లఁ బరమాశ్చర్యంబు నొందిరి. మారీచప్రముఖులు జయజయ నినాదంబులు సెలంగ రావణుని స్తవంబుసేసి వానిసాంత్వనవచనంబులఁ బరితృప్తిఁగాంచి పుష్పకం బధిరోహించిరి.

అంత రావణుఁడు పాతాళంబున కేఁగఁ ఘోర దైత్యోరగగణాధ్యుష్టం బును వరుణరక్షితంబును నగు పయోనిధినిఁ జొచ్చి వాసుకిపాలితంబగు భోగవతీపురంబును జేరి నాగులను వశపఱచుకొని ప్రహృష్టాంతరంగుఁడై మణివతి యను పురికిఁ జనెను. అక్కడ లబ్ధవరు లగు నివాతకవచులను నుక్కుతును కలంబోని రక్కసులు గలరు. వారిఁజేరి రావణుఁడు యుద్ధ మొనర్పుఁడని పిలిచెను. వారందఱు బలవంతులు పరాక్రమవంతులు యుద్ధదుర్మదులు నగుట వెఱపఱవక నానాప్రహరణధారులై కయ్యమునకుఁ జెయ్యిసాఁచిరి.

శూలములతోడను త్రిశూలములతోడను గుదియలతోడను అడ్డకత్తులతోడను గత్తులతోడను గొడ్డళ్లతోడను క్రోధమూర్తులై రాక్షసులును దానవులును ఒండొరుల భేదించుకొనుచుఁ బోరు ఘోరంబుగా సాగించు చుండ నొక్కయేఁడు గడచనెను. కాని యందెవ్వరును గెలుపును గాని యోటమినిగాని గాంచరైరి.

అంత నవ్యయుండైన బ్రహ్మ దేవయానంబు నధిరోహించి ద్రుతగతి నచ్చుటికి విజయముచేసి నివాతకవచులను యుద్ధము చేయవలదని నివారించి పెద్దతనంబు దీపింప నొద్దికతో విదితార్థంబులగు వాక్యంబుల నిట్లనియె.

ఈ రావణుని మిమ్ములను యుద్ధంబున జయింప సురాసురులకైన శక్యంబుగాదు. మీ రీరావణునితోడి నెయ్యంబు తియ్యంబు కలిమిఁ గూడి మాడి మనుఁడు. అవిభక్తులైయుండు స్నేహితులకు సర్వార్థంబులు సేకూరును. ఇందు సందియంబు లేదు.

అని చతురాననుఁడు సాదరంబుగా వాక్రువ్వ రావణుఁడు అగ్ని సాక్షికంబుగా నివాతకవచులతోఁ జెలికారంబు నెఱపి ప్రీతుఁడై మునుదంబోదవ యథార్థంబుగా వారి యర్చలనంది తన పురంబునందువలె నంద యొక యేఁడు వసించి ప్రియంబంది వారియొద్ద తొంబదితొమ్మిదిమాయలు గ్రహించి త్రిపురాన్వేషియై (వరుణపురము) రసాతలంబునఁ బరిభ్రమించి

రావణుఁడు కాలకేయుల జయించుట.

కాలకేయాభిరక్షితంబైన అశ్మనగరంబును జేరి బలోత్కటులగు కాలకేయుల నక్కడనే యుక్కడఁగించి యంత నాఁగక బలగర్వితుఁడును బలవంతుఁడును శూర్పణఖాభర్తయుఁ దనకు మఱఁదియు సమరంబున నమర విరోధులనెల్ల నాల్కచేఁ జప్పరించువాఁడును నగువిద్యుజ్జిహ్వుని గడియలో మడియించి మఱియు నాల్గువందలమంది పొలదిండుల లయంబునొందించి తెల్లయొాగడపలఁ గెడపఁజాలునదియు వెండికొండ గండుమీఱునదియు నగు వరుణాలయంబును గాంచెను.

## రావణుఁడు వరుణనగరంబుపైఁ బోవుట.

గోవులకు వృషభేంద్రులకుఁ దల్లియై యెల్లయపుడు పెల్లుగా నేది పాలు గురియునో దేనిపాలుగాఁబుటచే సాగరంబు క్షీరోదంబయ్యెనో యెందుండి ప్రజాహితుఁడును శీతరశ్మియునైన చంద్రుండుదయించెనో దేనిక్షీరంబులు గ్రోలి క్షీరపులను పరమర్షులు జీవించుచుందురో దేవతలకు సుధయుఁ బితృదేవతలకు స్వధయు నెందుండి యుత్పన్నమగుచుండునో దేనిని సురభియని లోకులు వాకొనుచుందురో పరమాద్భుతయగు నాగోమాతను గాంచి రావణుఁడు ప్రదక్షిణ మాచరించి మహాఘోరంబును బహువిధబలగుప్తంబును దోయధారాశతాకీర్ణంబును శారదాభ్రనిభంబును నిత్యోత్సవము పచ్చతోరణమునైనదియు నగువరుణుని గృహరాజంబుఁగాంచి యచ్చటి సేనాధ్యక్షులను బరిమార్చి పోరున వారిచేఁ దాడితాంగుఁడై యుద్ధభటులఁగాంచి ఓరీ! మీరు వైళంబచని యుద్ధార్థియై రావణుఁడు వచ్చియున్నాఁడు. పోరనైన పోరుఁడు లేదా యోడితిమని కాలుక్రిందనుండి దూరనైన దూరుఁడని నేచెప్పినట్లుగా మీఱేనితోఁ జెప్పుఁడు.

## వరుణపుత్త్రులు రావణునితోఁ బోరుట.

అని రొప్పి ద్వారపాలకులను బంపునంతలో మహాత్ముఁడగు వరుణుని పుత్త్రులును బౌత్త్రులును గోపుష్కరాఖ్యదళాధిపతియుతులై వీర్యగుణోపేతులై సబలులై సామర్థులై యుదయసూర్యులఁబోని కామగమనంబులగు రథంబులనెక్కి నిక్కి పెంపెక్కి రణంబున కరుదెంచిరి. అంతఁగనువారి తనువులు పులకరింపఁ బోరు ఘోరంబుగ జరిగెను. మహావీరులైన రావణ మంత్రులచే క్షణకాలములో వారుణసేనయంతయుఁ గృతాంతనిశాంతమ్మున కనుపఁబడెను. శత్రుశరజాలంబులచే నార్దితంబులై యుద్ధమ్ము సాలించి వెనుకకు మరలిన తమబలమ్ములఁగాంచి వరుణసుతులందఱు భూమిపైనుండి పుష్పకారూఢుఁడై యున్న రావణునిఁగాంచి శీఘ్రగాములగు రథమ్ముల నధిరోహించి వడివడి నాకసమ్మున కరిగిరి. తుల్యస్థానమునొందిన యాయిరువాఁగులకు దేవదానవులకువలెఁ దుములంబగు నాకాశయుద్ధము భీకరమ్ముగ జరిగెను. అంత వరుణసూనులు పావకసన్నిభంబులైనయమ్ములఁ జిమ్మి రావణుని యుద్ధవిముఖునిఁజేసి మిన్నందిన యానందంబున వివిధారావంబులు గావించిరి. అంత వీరుఁడగు మహోదరుఁడు అతిక్రుద్ధుఁడై తిరస్కృతుఁడైన తన రాజును గాంచి మృత్యుభయంబును వీడి యుద్ధకాంక్షియై పొలికలను నలుకెలంకులఁ దేఱిపాఱచూచి గదాధారియై యెదురేఁగి వాయువేగంబును గామగమనంబునుగల వరుణతనయుల హయంబులను యోధులను బుడమిఁబడఁగొట్టి వారిని విరథులఁజేసి భూనభోంతరాళములు బోరుకలంగ సింహనాదంబు

చేసెను. వరుణనందనులు రథంబులు గూలియు నశ్వంబులు నచ్చియు సారథులు దొఱఁగియుఁ బిఱుతివియక మింటికెగసి స్వప్రభావంబులఁ జేసి వగనొందక వింజ్లక్కిడి నారిసారించి శరవర్షంబు గురిసి మహోదరుని దారితగాత్రునిఁ జేసి మేఘమ్ములు భూధరమ్ములఁ జీల్చురీతిని దారుణమ్ములును వజ్రకల్పమ్ములును గోదండవిముక్తమ్ములును నైనసాయకమ్ములు గోపమ్ము రూపమ్మునొందిన రూపున రావణునిపైఁ బ్రయోగించి చీల్చి చెండాడిరి.

అంత రావణుఁడు కాలాగ్నివలె మండిపడి లేచి మహావేగంబుగ శరవర్షంబు గురిసి వారి మర్మంబుల నొవ్వనాడెను. కాని యావరుణుని కాల్బలంబు లంతమాత్రకుఁ జింత యావంతయుఁ గాంచక వెనుదీయక యుండెను. అది గాంచి రావణుఁడు విచిత్రంబులగు ముసలమ్ముల విసరియు భల్లమ్ముల వేసియుఁ బట్టసమ్ములఁ గొట్టియు సత్తుల మొత్తియు శతఘ్నులఁ గాల్చియుఁ దోమరమ్ములఁ ద్రామియు నఱవఱ లొసర్ప షాష్టిహాయనమ్ములగు కుంజరమ్ములవలె నాకాల్బలమ్ములన్నియుఁ బుడమింబడి విహ్వలత్వంబునఁ బరితపించుచుండఁగాంచి మహాతేజస్వియగు రావణుఁడు హర్షమ్మునఁ బొంగి నింగి యదరునట్లు లంబుధరమ్మువలె గర్జించి ధారాపాతమ్ముల నంబుదంబులట్లు ఘోరంబులైన నానావిధాయుధంబులఁ గొట్టి యేనుఁగులఁ బీనుఁగులఁ గావించెను. అంత వారుణసైనికులెల్ల నేలఁబడి లేచి రణమ్మునొఱంగి స్వజనమ్ములఁ గూడి కడువడి నిజనిలయమ్ముల కరిగిరి.

రావణుఁడు వారిఁగాంచి ఓరీ! మీరు పోయి మీ యేలికయగు వరుణునితోఁ బరాక్రమమ్ము సూప నిదే సమయమనియు విక్రమమ్ము ప్రదర్శింపుమనియు నా మాటగాఁ జెప్పుఁడన విని భయంకరుఁడును మంత్రియు నగు ప్రహస్తుఁడు రావణునితో మహారాజా! నీ వెవరిని యుద్ధమ్మునకుఁ బిల్చుచున్నావో యా జలేశ్వరుఁడైన వరుణుఁడు సంగీతంబు వినుటకై బ్రహ్మలోకంబున కేఁగెను. వీరాధివీరా! రాజు లేనప్పుడీవృథాశ్రమమ్ము నీ కేమిటికి? వీరుగో ఆతనిసుతులు నీచేఁ బరాజితులైనవారు.

అన విని రావణుఁడు తన జయంబు నలుదెసలఁ జాటఁబంచి యరుసంబు రేకెత్తఁ బేరెలుంగున నఱచి వరుణాలయంబును విడిచి చనెను. మున్ను తానే మార్గమ్మునఁ జనుదెంచెనో యా మార్గమ్మునసనే యాతఁడు లంకాభిముఖుఁడై మింటి బాటంబట్టి చనెను.

ఇది యిరువది మూఁడవ సర్గము

## ఇరువదినాల్గవసర్గము

### రావణుఁడు నానాస్త్రీలను జెఱపట్టుట.

దురాత్ముఁడగు రావణుఁడు సంహృష్టుఁడై యట్లు తిరిగి వచ్చుచు మార్గమధ్యంబునఁగల రాజకాంతలను దానవకన్యలను జెఱపట్టి యీడ్చి తెచ్చి పుష్పకంబు నింపివైచెను. కన్యగాని స్త్రీగాని యెవ్వతెయైనసరే కంటికందముగాఁ గనిపించినఁజాలు నా దుర్మార్గుఁడు వారిబంధువులఁ జంపి వారిని విమానంబునఁ బడవైచికొనిపోవఁ దొడంగెను. ఇట్లే పన్నగకామినులు మానుషసుందరులు రాక్షసాంగనలు దైత్యయువతులు దానవకాంతలు రావణునిచేఁ జెఱపట్టఁబడిరి. భయశోకాశివాశ్రువులచే నా యా కాంతలందఱు అనవద్యంబులగు నదులు సముద్రంబునుబోలె నావిమానంబును నింపిరి. మఱియు నాగగంధర్వ కన్యలును రాజర్షితనయలును దైత్యదానవమృగాక్షులును విమానంబునఁ గూర్చుండి పరిపరివిధంబుల విలపింపఁ దొడఁగిరి. నిడుద పెన్నెఱివేణులుగల నెలంతలును బూఁబోఁడులును బూర్ణచంద్రనిభానన లును బీనస్తనులును వేదీమధ్యసమప్రభలును రథకూబరసంకాశమనోహర శ్రోణులును సురకాంతాతుల్యలును దప్తకాంచననిభప్రభలును దరుణులును సుమధ్యలును నగు స్త్రీరత్నములెల్ల శోకాయత్తలై విహ్వలలై దుఃఖార్తలై వేపమానలై యగ్నిజ్వాలాతుల్యంబులును శోకాగ్నిభయ సంభవంబులును నగుబాష్పజలంబులు సంతతధారగా విడవఁదొడఁగిరి. వారి వేఁడినిట్టూర్పుగాడ్పులచే నెల్లెడలఁ బ్రజ్వరిల్లిన యగ్నిహోత్రమోయనునట్లు సన్నిరుద్ధాగ్నియై పుష్పకంబు చూపట్టెను.

యావనమధ్యస్థులగు నాస్త్రీలందఱు దశగ్రీవునకు వశపడి శోకాకులలై దీనవక్త్రేక్షణలై సింగంబుల కగ్గంబైన మృగంబుల ననుకరించుచుండిరి.

### చెఱఁబడిన స్త్రీలు విలపించుట.

అయ్యో! వీఁడు నన్ను భక్షించునేమోయని యొక్కతె యేడ్వ వీఁడు నన్ను ముక్కలుసేయునేమోయని మఱియొకర్తుక విలపించెను. తల్లులఁదలఁచి కొందఱు తండ్రులనెంచి కొందఱు అన్నదమ్ముల స్మరించి కొందఱు భర్తల నెన్ని కొందఱు సుతులఁ దలపోసి కొందఱు స్త్రీలందఱు గుమిగూడి దుఃఖశోకసమావిష్టలై యేడువఁదొడఁగిరి.

అయ్యో! నన్నువిడిచి నా బిడ్డఁడేమయ్యెనోయని యొకరిత పలవింప అయ్యో! నా తల్లియు, సోదరుఁడును నన్నుఁ దొఱఁగి శోకసాగరమున మునిఁగి యేమగుచున్నారో యని వేఱొకతుక వాపోయెను. అక్కటా! దైవ

తుల్యుఁడైన నాథర్తను విడిచి నేనేమిసేయుదును. ఎట్లు బ్రతుకుదును. అని యొకర్తుక రోదనముసేయ ఓ మృత్యువా! నిన్ను యాచించుచున్నాను. నన్ను యమసదనము చేర్పుమని మఱియొకర్తు శోకించెను. కటకటా! నేను దొలి బాముస నేమి పాపంబు చేసితినో కదా! లేకున్న నీదురాత్మునిచే దుఃఖ సాగరమునఁ ద్రోయఁబడుదునే యని యొకర్తె పలవింగా రామా! నాయీవ నటకు నత్తతి నంతుగాంతునా! బుద్బుదప్రాయమైన నిస్సారమైన యీజన్మంబు కాల్పనా! అని యింకొకర్తి వెగచెను. ఓహో! యీ మానుషలోకంబున ధర్మపరుఁడే లేఁడా! ఔరా! యీ లోకంబునఁ బుట్టను వక్కను మచ్చుఁ గావఁ గానరాఁడా యని మఱియు నొక్కతి యంగలార్చెను.

సూర్యుఁ డుదయించుచునే నక్షత్రముల రూపుమాపినట్లు దుర్బలులైన మాపతుల బలవంతుఁడైన రావణుఁడు పరిమార్చినాఁడు. ఔరా! యీ దుర్మార్గునిఁజంపు నుపాయమే లేదా! ఆహా! దుండగీఁడయ్యు వీఁడెంత మొండి కెత్తినాఁడు.. ఇంచుకైన జుగుప్స లేదేవీనికి. ఈ నీచున కిట్టిపరాక్రమ మర్హముకాదు. పరదారలఁబట్టి పల్లార్చుట వీనికిఁ దగదు.

## చెఱఁబడిన స్త్రీలు రావణుని శపించుట.

దుర్మతియగు నీరావణుఁడు పరాంగనలమైన మమ్ము ననురాగమునఁ జెఱుప నెంచెను. కాన వీఁడు పరకాంతాకారణమున మరణంబు పొందుఁగాక! యని పతివ్రతలగు నారీమతల్లులు శపించిరి అంత దేవదుందుభులు మొరసెను. పూలవాన గురిసెను.

రావణుఁడు పతివ్రతాశాపహతుఁడై ప్రభ చెడి యాసాధ్వీతిలకంబుల విలాపంబులు పెడచెవినిబెట్టి నిశాచరులు సాహోనినాదంబులు సలుపుచుండ లంకాపట్టణముఁ బ్రవేశించెను.

అంతలో నతనితోఁబుట్టు వైనశూర్పణఖ కుయ్యో, మొఱ్ఱోయని యేడ్చుచువచ్చి వానిపాదంబులం బడి యెద్దియేనిఁ జెప్పదొరఁకొనెను.

## శూర్పణఖ రావణుని నిష్ఠురము లాడుట.

అంత రావణుఁడు తోఁబుట్టువును లేవనెత్తి యోదార్చి మాంగళ్యవతీ! యేల యీలీల వాపోయెదవు? చెప్పు త్వరగాఁ జెప్పుము. అన విని యామె బాష్పపరిరుద్ధనేత్రయై యిట్లనియె. రాజా! బలవంతుఁడవైన నీవు నన్ను విధవను జేసితివి. జీవచ్ఛవంబనైతిని. మహాబలపరాక్రమసంపన్నులై ప్రసిద్ధిగాంచిన కాలకేయు లనుదైత్యులను రణంబున నిహతులఁజేసితివి. అంత నాఁగక నీవు నాకు సోదరుఁడవయ్యును శత్రుసముఁడవై ప్రాణంబుల

కన్న మిన్నయైన నాభర్తను నాప్రాణనాథుని వధించితివి. కాని కడగొట్టు చెలియలినైన నన్నైనఁ దలంచితివిగాదుగదా! కోపం బెంతలెంతలు చేయింపదు? అన్నన్నా! అన్నవైన నీవే యిట్లు నన్ననాథను జేసితివా? నీవంటి యన్నలున్న అన్నుల నెన్నఁదగదే. దుఃఖభాజనంబైన వైధవ్యశబ్దంబు నా కొసంగితివి. అనుభవించుచున్నాను. దురములయందైనను అల్లుర నెవ్వరును దునుమరు గదా! నీకట్టి కనికరమే లేదు గదా! మహారాజా! మఱఁదినిఁ జంపి సిగ్గులేక యేమొగంబున నలువురిలోఁ దలయెత్తి తిరుగుచున్నావు?

## రావణుఁడు శూర్పణఖ నోదార్చుట.

అని యిట్లు నోరునెత్తి బాదుకొని యేడ్చు చెల్లెలిని గాంచి రావణుఁడు సాదరంబుగ నోదార్చుచు నిట్లనియె.

బిడ్డా! ఊఱడిల్లుము. భయపడకుము. నీకోరినవెల్లఁ గొనుము. ఎందును లోటులేకుండ నిన్ను సర్వవిధంబుల గారవించెదను. సంతోషములో సంచరించుము. యుద్ధప్రమత్తతో జయాకాంక్షినై శరముల విరఁజిమ్మితిని. కాని భద్రాంగీ! వీరు మావారు వారు వెఱవారు అని యెఱుఁగనైతిని. యుద్ధదుర్మదుఁడనై యనిసేయునేను జామాతను గుర్తింపలేక పోతిని. కావుననే చెల్లెలా! నీభర్తను నేను జంపి పాపంబాడిగట్టుకొంటిని. కడచిన దానికి వగవనేల? ఇత్తఱి నీకేది హితవో యది యొనర్తును. ఐశ్వర్యయుక్తుఁడగు నీసోదరుఁడైన ఖరునియొద్దకుఁ జనుము. అతఁడు పదునాల్గువేల రాక్షసులకుఁ బ్రభువు. నీయాజ్ఞల శిరసావహించును. దాన సన్మాన ప్రయాణ కార్యముల నెల్ల నతఁడు సమకూర్చును. దండకావనము సంరక్షింప శూరుఁడగు నీఖరుండిప్పుడ చనుచున్నాఁడు. మహాబలుఁడైన దూషణుఁడు వీనికి సేనాధ్యక్షుఁడుగా నున్నాఁడు. ఈ దండకావనము రాక్షసుల కునికిపట్టు కాఁగలదు. సందియము లేదని తొల్లి శుక్రాచార్యుఁడు కోపమ్మునమె శపించియున్నాఁడు. అట్టి దండకావనమునకు నాపినతల్లి కొడుకును, నీకన్నయు నగుఖరుఁడు ప్రభువు కాఁగలఁడు. నీవేది చెప్పిన నది కాదనక తలలో నాలుకయై చేయఁగలఁడు. కాన నీ వాతనియొద్ద నుండుమని చెప్పి రావణుఁడు కామరూపులగు పదునాల్గువేల రాక్షస సైనికులను ఖరున కొసఁగెను. ఖరుఁడు ఘోరదర్శనులగు నా రాక్షసులఁ గూడి యకుతోభయుండై శీఘ్రంబుగ దండకాటవి కేఁగి నిష్కంటకమ్మగ రాజ్యమేలెను. శూర్పణఖగూడ దండకావనమున నన్నయుండనే ప్రీతితో నుండెను.

ఇది ఇరువదినాల్గవ సర్గము

## ఇరువదియైదవసర్గము

### రావణుఁ డింద్రజిత్తునుజూడ నికుంభిలకుఁ బోవుట.

మహాత్ముఁడైన రావణుఁడట్లు ఘోరంబైన దండకావనంబును ఖరున కొసంగి భగిని (చెల్లెలి) నూఱార్చి హృష్టుఁడై స్వస్థతఁగాంచిన పిమ్మట సానుచరుఁడై లంకయందలి నికుంభిలయను నొకయుపవనమునకుఁ జని యచ్చట యూపశతాకీర్ణమై సౌమ్యమై చైత్యోపశోభితంబగు శ్రీలచే వెలుఁగొందుచున్న జన్నంబును గన్నులారఁ గాంచి యందుఁ గృష్ణాజినధారియై కుశకమండలుధరుండై దైవాఱుచున్న యరిందముఁడైన మేఘనాదుఁడను తన కొడుకునుగాంచి దగ్గఱకేఁగి చేతులారఁ గౌఁగిలించుకొని నాయనా! యేమిటిది? ఏకార్యము చేయుచున్నావు? ఏదీ నాకుఁ దెలియఁజెప్పుము. చెవులుదనియ విందును. అన విని మహాతపస్వియు ద్విజశ్రేష్ఠుఁడును గురువును నగుశుక్రాచార్యుఁడు యజ్ఞసమృద్ధికై రాక్షసశ్రేష్ఠుఁడైన రావణున కిట్లనియె.

రాజా! నీకు సర్వము నివేదించుచున్నాను. వినుము. నీ కుమారుఁడు అగ్నిష్టోమము అశ్వమేధము బహుసువర్ణకము రాజసూయము గోమేధము మాహేశ్వరము పాశుపతము అను నేడు బహువిస్తరమ్ములగు యజ్ఞంబులు గావించెను. పురుషులకు దుర్లభంబగు మాహేశ్వరయాగంబుసేయు నవసరంబున సాక్షాత్పరమశివునివలన నీనందనుఁడు అద్భుతవరంబులందినాఁడు. కామగమనంబును గగనచరంబును ధ్రువంబును నగు స్యందనంబును జీఁకటినుత్పాదించు తామసియను మాయను గ్రహించినాఁడు. రాక్షసేశ్వరా! ఈ మాయచేతనేకదా సంగ్రామంబుసేయు నీసుతుని గమనంబు సురాసురులకుఁ గూడఁ దెలియ శక్యంబుగాదు. సౌమ్యా! అక్షయబాణతూణీరంబులను అరిదుర్జయంబగు చాపంబును శత్రువిధ్వంసనచణంబగు బలవదస్త్రంబును నీ సుతుండు పడసెను. రావణా! యీ వరంబులెల్ల నొంది నీసుతుఁడు ఈ యజ్ఞసమాప్తి కాలంబున నీరాకకై వార్చియున్నాఁడు. అన విని రావణుఁడు మీరొనర్చిన యీకార్యమున శుభంబులేదు. ఇంద్రప్రముఖదేవతలను మీరు హవ్యద్రవ్యంబులఁ బూజించిరి. శత్రువులఁగూర్చి యజించుట యెంత యవివేకము? కానిండు. అయినదేమొ యైనది. అదియైన మేలె. లెండు. పోదము మనయింటికి. అని రావణుఁడు కొడుకుతోడను విభీషణునితోడనుగూడి చని సర్వలక్షణసంపన్నలు రత్నమూర్తులు నానాభూషభూషితలు నైజతేజోవిరాజమానలు నగు దేవదానవ రాక్షసస్త్రీలు భయశోకాదులచేఁ గాళ్లుసేతులు విలవిలఁబోవ నశ్రుధారాపూరితనేత్రలై యేడ్చుచుండ విమానమునుండి దించెను.

విభీషణుఁడు రావణునితో మధుఁడు కుంభీనసి నపహరించినవార్తఁ దెలుపుట.

శోక సమాకులలై యున్న యీ నారీరత్నములఁగాంచి ధర్మాత్ముఁడగు విభీషణుఁడు తన యన్నతలంపెఱింగి యిట్లనియె. రావణా! యంశంబును జెఱచునవియు నర్థంబును హరించునవియుఁ గులమును నాశముచేయునవియు నగు నిట్టి సమాచారములచే జ్ఞానులఁ దిరస్కరించుట యగునని యెఱింగియు నీవు స్వమతానుసారంబుగా నిట్టి విచేష్టితము లొనర్చుచున్నావు.

రాజా! నీ వీపరాంగనల జ్ఞాతులను దిరస్కరించి వీరిని బలత్కారముగాఁ దీసికొనివచ్చినట్లే నిన్నుఁ ద్రోసిరాజని మధుఁడు కుంభీనసిని హరించినాఁడు. అని విభీషణుఁడు పలుక నాలించి రావణుఁడు ఏమిటిది! ఎవఁడు వీఁడు? మధుఁడని వాకొనుచున్నావు. నే నెఱుంగనే వానిని? అన విభీషణుఁడు కరము కనారిలి యన్ననుగాంచి యిట్లనియె.

అన్నా! విను. నీయీపాపకర్మంబునకుఁ దగిన ఫలంబు దాపరించినది. వినియుందుగా మన మాతామహుఁడగు సుమాలికి జ్యేష్ఠభ్రాత మాల్యవంతుఁడని. వాఁడు చాల విఖ్యాతిఁగన్నవాఁడు. వృద్ధుఁడు ప్రాజ్ఞుఁడునైన నిశాచరుఁడు. మన తల్లికి అక్కగారు పుష్పోత్కట. మనతల్లికిఁ బెదతండ్రి ఆర్యకుఁడు. ఆయార్యకుని కూఁతు కూఁతురే (పుత్రికా పుత్రిక) కుంభీనసి. అనలోద్భవయగు నీకన్య మనకుఁ బినతల్లికూఁతురు. కావుటఁజేసి యీమె మన యన్నదమ్ము లందఱకు ధర్మముగాఁ జెల్లెలు.

మహారాజా! అట్టి మన చెల్లెలు కుంభీనసిని బలశాలియగు మధుఁడు హరించినాఁడు. నీ కుమారుఁడు యజ్ఞముసేయుచున్నాఁడు. నేను నియతుండనై నీళ్లలోపలనున్నాను. కుంభకర్ణుఁడు నిద్రపోవుచున్నాఁడు. ఇఁకఁ జెప్పెడిదేమి? రాక్షసశ్రేష్ఠులగు మన మంత్రులనెల్ల దిరస్కరించి మడియించి నీ యంతఃపురగుప్తయగు నాకన్యను వాఁడు హరించి చనినాఁడు. నే నిదియంతయువిన్నాను. కాని శాంతినూనియుంటచే వానిఁజంపనైతిని. ఆమె కన్నదమ్ములమైన మనచే నామెతగిన వరునకీఁబడవలయును. కాని మన కాపుణ్యాము దక్కలేదు. దుర్మతీ! యీ పాపకర్మఫలంబీ లోకమందే కట్టికుడుపును.

రావణుఁడు మధునిమీఁదికి దండయాత్ర పోవుట.

అని పలికిన విభీషణవాక్యంబు లాలించి రావణుఁడు సంతప్తజలంబగు సంద్రంబు పోలికఁ దన దౌరాత్మ్యంబునఁ బై కెగిరిపడి కనలునఁగను లెఱ్ఱ చేసి సేనానాయకులఁ గాంచి యిట్లనియె. వైళంబ నారథంబు సిద్ధము చేయుండు. శూరులు నడుములు బిగియించి కదనమున కాయత్తపడుఁడు. నాసోద

రుఁడగు కుంభకర్ణుఁడు నిశాచరముఖ్యులు గూడ నానాప్రహరణములను దాల్చి వాహనంబుల నధిరోహింపుఁడు. రావణుఁ డసిన భయమ్మొలేని యా మధుని నీక్షణంబ సమరతలంబునఁ బరిమార్చి నెయ్యురంగూడి యుద్ధకాంక్షినై యింద్రలోకంబు మీఁదికరిగి దానిని జయించి పురందరుని వశపఱచుకొని మరలి వచ్చి త్రైలోక్యైశ్వర్య శోభితుండనై విహరించెదను.

అని రావణుఁడు పలుకఁగానె నాలుగువేల యక్షౌహిణుల రాక్షస సేనలు యుద్ధమునందలి కాంక్షచే భయంకరమ్ముగాఁ దొడలు నఱచుకొనుచు బయలు వెడలెను.

ఇంద్రజిత్తు ముందును రావణుఁడు నడుమను కుంభకర్ణుఁడు వెనుకను నుండి సైన్యమును సైనికులను గొని దాడివెడలిరి. ధర్మాత్ముఁడైన విభీషణుఁడు ధర్మంబు లాచరించుచు లంకయందే యుండెను. ఆమహాభాగు లందఱుఁ గొందఱు రథంబులెక్కియుఁ గొందఱు గజంబు లారోహించియుఁ గొందఱు కంచరగాడిదల నధిరోహించియుఁ గొందఱు లొట్టియల నధివసించియుఁ గొందఱు గుఱ్ఱముల నాసీనులయ్యుఁ గొందఱు పాములఁ గూర్చుండియు నాకాశంబు నిరవకాశంబు సేయుచు మధుపురంబుపైఁ జనిరి. అత్తఱి వేల్పులపైఁ బగ పూనియున్న వేలకొలంది రేయిద్రిమ్మరు లనిచేయ నేఁగు రావణుని వెన్నంటి చనిరి.

కుంభీనసి మధుని రక్షింపుమని రావణుని వేఁడుకొనుట.

మధుపురంబు సొచ్చి రావణుఁ డెందుఁ బరికించినను మధుఁడు కాన రాఁడయ్యెను. చెల్లెలగపడెను. రావణుఁ డామెయొద్ద కేఁగెను. ఆమె భయపడి చేతులు జోడించి రావణుని పాదములపైఁబడి మ్రొక్కె. నాతఁడామెను భయ పడవలదని లేవనెత్తి నీకేమి కావలయునో కోరుకొమ్మ. ఒసఁగెదననిన నామె మహాబలా ! రాజేంద్రా! నీవు నాకుఁ బ్రసన్నుఁడవైతేని మానదుఁడవగు నీ విప్పుడు నాభర్తయగు మధునిఁ జంపకుము. భయంబు లన్నిటికంటెను దుస్స హాభయంబు వైధవ్యంబు. కులస్త్రీలకు వైధవ్యభయంబునకు మించిన భయంబు వేఱొండు లేదు. మహారాజచంద్రా! సత్యవాక్పరిపాలకుఁడవు గమ్ము. కాళ్లపైఁబడి యాచించుచున్న నన్నుఁగాంచి నీవు 'భయపడకు' మని స్వయముగాఁ బలికితివి: నీమాట నీవు నిలువఁబెట్టుకొనుము. అని విన్నవించుకొన విని రావణుఁడు నవ్వి చెల్లెలింగాంచి 'నీభర్త యెందున్నాఁడో త్వరగాఁ జెప్పుము. వాఁడుగూడ సురలోకంబుజయింప నేఁగుచున్న నాతోరాఁగలఁడు. నీయందలి కారుణ్య సౌహార్ద్రంబులం జేసి నీమగఁడగు మధుని వధింపమానితిని. అన విని యామె నిద్రించుచున్న తనభర్తనులేపి మందహాససుందరవద నారవిందయై యిట్లనియె.

'నాథా! వీఁడు. ఇదిగో మహాబలుఁడైన మాయన్న దశగ్రీవుఁడరుదెంచి యున్నాఁడు. సర్వలోకజయకాంక్షియైన మాయన్న మీసాయ మర్థించుచున్నాఁడు. కాన బంధువర్గమ్ముతో బాసటయై చనుఁడు. నెయ్యుఁడై కొలువ వచ్చినవానిఁ గృతార్థునిఁ జేయుట యుక్తము.' అని భార్య పలుకఁగా విని మధుఁ డట్లే యని చెప్పి యథాన్యాయంబుగా రావణుని కడ కేఁగి వాని దర్శించి శాస్త్రోక్తవిధినిఁ బూజించెను.

వీర్యవంతుఁడైన రావణుఁడు మధుగృహంబునఁ బూజలఁగైకొని ప్రొద్దు గ్రుంకుటం జేసి యా రేయి యందే వసించి వేగినవెంటనె కైలాసంబున కేఁగి కుబేరాలయంబున మహేంద్ర వైభవంబుతో దండువిడిసెను.

ఇది యిరువదియైదవ సర్గము

---

## ఇరువదియాఱవ సర్గము

### రావణుఁడు మధునితోఁ గైలాసప్రాంతమున విడియుట.

వీర్యవంతుఁడైన యా దశగ్రీవుఁడు సైన్యసమేతుఁడై వెండికొండ దండ దండు విడిసియుండఁగా సూర్యుండు అస్తంగతుండుగాఁగా నాతండందె వసించెను. ఆ కైలాసమునుబురుడించు చంద్రుఁడుదయింపఁగానె నానా ప్రహరణాయుధయుతంబైన సైన్యమంతయు సుఖనిద్ర చెందెను. మహావీరుఁడైన రావణుఁడు శైలశిఖరంబున నిషణ్ణుఁడై చంద్రకిరణోప శోభితంబులగు నా కొండయందలి సుందరతరగుణంబులఁ గాంచెను.

దివ్యంబులైన కొండగోఁగువనంబులతోడను గడిమియడవులతోడను ఫుల్లాబ్జంబులతో నుల్లసిల్లు మందాకినీజలంబులతోడను సంపెఁగతీవలతోడను అశోకవృక్షములతోడను సురపొన్న మ్రాఁకులతోడను మందారతరువులతోడను రసాలసాలములతోడను గలిగొట్టుచెట్టులతోడను లొద్దుఁగ మ్రానులతోడను ప్రేంకణపుభూజములతోడను ఏఱుమద్దిమహీజములతోడను కేతకీనగంబులతోడను నందివర్ధనశాఖులతోడను నారికేళానోహకమ్ములతోడను మోరటిభూమిజమ్ములతోడను బనసపాదపమ్ములతోడను మఱియు ననేకేతరతరుషండంబులతోడను మండితంబైన యావనాంతరంబునఁ

### రావణుఁడు వెన్నెలకాఁకను వేఁగుట.

ధ్వమమనంబులకుఁ దుష్టియుఁ బుష్టియుఁ వృద్ధిచేయు స్థలంబులఁ జేరి కిన్నరులు తమకలకంఠకంఠులతో సమముగా నానందంబు వెల్లివిరియ గానంబుచేసిరి. మధుపానమత్తులైన విద్యాధరులు మధురక్తాంతలోచనులై

తమకాంతలఁగూడియాడుచుఁ బాడుచుఁ గాలంబుపుచ్చిరి. కుబేరనిలయంబున గానంబుచేయుచున్న యప్సరోగణమ్ముల మధురస్వనమ్ములు మన్మథ ఘంటారావమ్ములువోలె వీనులవిందొనరించుచుండెను. గాలితాఁకున వృక్షంబు లిటునటుఁ గదలుచుఁ దేనెలొలికెడు నామనితావిపూల నాపర్వతంబెల్ల గుమగుమలాడునట్లు గురిసెను. ఇప్పప్రూపుష్పాదులఁ గూడినసెత్తావి మొత్తంబు గుత్తగొని సౌఖ్యప్రదుఁడగు గంధవాహుఁడు రావణునకుఁ గామం బగ్గలంబుగా వీచెను.

కిన్నరాంగనా మధురగేయంబు లాలించి మొల్లంబులగులతాంతమ్ముల సువాసన లానియాని చల్లని పిల్లగాలుల సోఁకునకుఁ జొక్కిచొక్కి సుందరతర పర్వతకందరసంపదలఁగాంచికాంచి యత్యంతమనోహరంబులగు రేలసోరు తిలకించి తిలకించి వెన్నెల తిన్నఁదనంబునకు మేనం బులకించి పులకించి మహావీర్యుఁడగు నారావణుఁడు పూవిల్తుబారికగ్గంబై నిట్టూర్చియూర్చి శశాంకుని వంకఁజూచెను.

రంభ యలంకరించుకొని రావణ సేనామధ్యమ్మునకుఁ జనుట.

అంతలో నక్కడకు దివ్యాభరణభూషితయు సర్వాప్సరోంగనాశిరోభూషణంబును బూర్ణచంద్రనిభాననయు దివ్యచందనవిలిప్తాంగియు మందారపుష్పాలంకృతశిరోజయు రతోత్సవకృతారంభయు దివ్యపుష్పవిభూషితయుఁ గనువిందై పీనమై రతిప్రాభృతమై (ప్రేమకుఁగానుక) యుత్తమమై మేఖలాదామభూషితమైపొలుచు జఘనంబును వహించునదియు నాఱుఋతువుల నలరారుపూలనుండి పుట్టినవియుఁ బదనుగలవిగా మెదిచినవియు నగుబొట్టులఁబెట్టుకొన్నదియు నగురంభ హ్రీకాంతి ద్యుతిమతి శ్రీలకు మాఱటమూర్తియై భాసిల్లుచు నల్లనినీటిమబ్బునకుద్దియగు పుట్టంబు ముసుంగిడుకొని నెమ్మొగంబు కలువలరాయనికీడుగాఁగాఁ గనుబొమ్మలు మరువిండ్లకు జోడుగాఁగా నూరువు లేనుఁగుతొండముల ననుకరింపఁగాఁ జేతులు పల్లవంబులవలెఁగోమలంబులుగాఁగాఁ దన సేనామధ్యంబుననుండి చనుచుండుటఁగాంచి రావణుఁడు పుష్పబాణపీడితుండై చని యామె కెంగేలుగొని యిట్లనియె.

రంభా రావణ సంవాదము.

నితంబినీ! నీ వెచ్చటికేఁగుచున్నావు? ఏసిద్ధిని స్వేచ్ఛముగా భజించుచున్నావు? ఇపుడెవని యదృష్టము ఫలించినది? ఎవఁడు నిన్నుఁ దనివుదీర ననుభవింపనున్నాఁడు? పద్మోత్పలగంధియగు నీ వదనామృతంబును సుధారసంబువోలె నాని యెవ్వండి త్తఱిఁదృప్తియారఁ గాంచనున్నాఁడు. ఒచ్చెంబు లేని యచ్చపునల్లకలువలఁబోని గన్నులుగల పూర్ణచంద్రనిభంబగు నీ యీ

ముఖామృతంబును దేవేంద్రుఁడమృతంబునుం బోలెఁ ద్రావువాఁడెవ్వఁడు ? పిఱికిదానా ! నిట్టలుద్రోచుచు నెఱవ్రులుకల మేరలన్నియు బిగియెక్కి పంచారించు నీమేలిమిపసిండి పాలిండ్లగిండ్లవనిఁ గ్రుమ్మినను. హాటకచక్రమునకు దీటై కాంచనకాంచీనేపితమై గురుతరంబై స్వర్గసుఖదంబగు నీజఘనతలంబు నిప్పుఁ డెవ్వఁడెక్కనోకదా !

సుందరీ ! నన్నుమించు మగవాఁడెచ్చటను లేఁడు సుమా ! ఇంద్రుఁడు కానీ, యుపేంద్రుఁడు కానీ, అశ్వినీదేవతలు కానీ నన్నుఁబోలరు సుమా ! ననువీడి యోపువుఁబోఁడీ ! నీవన్యునెవనిఁ గవయఁబోయెదవు? అది యందమా? చందమా? వరారోహా ! పవిత్రమైన యీశిలాతలంబునఁ గొండొక సేపు విశ్రమింపుము. నన్నుమించిన మన్నీఁడీ ముజ్జగంబుల నేఁడును లేఁడు సుమా! అట్టి దశాననుఁడు నిన్ను దోసిలియొగ్గి యడఁకువదోఁప నాసక్తితో యాచించుచున్నాఁడు. కాదని కినుకింపకుము. మగలకెల్ల మగండను నేనే. త్రిలోకంబులకు విధాతను నేనే. నన్ను భజింపుము. అని రావణుఁడు తన తలఁపు నెఱిఁగింపఁగానే రంభ గడగడ వడఁకుచు నిట్లనియె.

రావణా ! అనుగ్రహింపుము. ఇట్లనుట నీకుఁ దగదు. నీవు నాకుఁ గురుఁడవు. పరులు నన్నుఁ బరాభవించిరేని నీవు ప్రాపై రక్షింపవలయునుగాని యిట్లాచరింపఁదగదు. న్యాయముగా నేను నీకుఁ గోడలిని. ఉన్నదున్నట్లుగా సత్యంబు వచించితిని. అని స్పర్శమాత్రంబునన రోమహర్షణంబునొంది చరణానతాస్యయైయున్న రంభనుగాంచి రావణుఁడిట్లనియె.

ఇంతీ ! నీవు నాకొడుకునకు భార్యవా ? ఓహో ! అట్లైన నాకుఁ గోడలివే. అన విని రంభ యిట్లనియె. ఔను రాక్షసపుంగవా ! న్యాయముగ నేను నీసుతునకుభార్యను. నీకగ్రజుఁడు కుబేరుఁడు. వానికిఁ బ్రాణములకంటెఁ బ్రియతరుఁడైన నలకూబరుఁడను కుమారుఁడు గలఁడు. అతఁడు త్రిలోకంబులఁ బ్రసిద్ధికెక్కినవాఁడు. అతఁడు ధర్మగుణంబున బ్రాహ్మణుఁడు. పరాక్రమమున క్షత్త్రియుఁడు. క్రోధంబునఁ బ్రళయాగ్నిహోత్రుఁడు. క్షాంతిగుణంబున పృథ్వీసముఁడు. అట్టికుబేరునిపట్టితో నోడఁబాటుచేసికొనియుంటిని. వానినుద్దేశించియే నేనిట్లు కై సేసికొంటిని. నా మనంబు వానియందుఁ బోలె నన్యులయందనురక్తంబుగాదు. కాన ధర్మంబు తలంచి రాజేంద్రా ! నన్నువిడిచిపుచ్చుము. ధర్మాత్ముఁడైన నలకూబరుఁడు నాయందలి తమకంబునఁ గనిపెట్టుకొనియుండును. నీసుతునకు నీవు విఘ్నంబు గలిగించుట పాడిగాదు. కాన నన్ను విడువుము. రాక్షసేశ్వరా! సత్పురుషులుపోయిన త్రోవను బొమ్ము. నీవు నాకు మాన్యుఁడవగునట్లే నేను నీపలాలనీయను సుమా ! అని

యట్లు రంభ పలుకఁగా రావణుఁడు విసీతుఁడట్లు యిట్లు ప్రత్యుత్తరం బిచ్చెను.

రంభా ! నీవు నాకుఁ గోడలినంటివి. ఒక మగనాలికేగదా యాక్రమము చెల్లును ? దేవలోకమునందలి మర్యాదలు, వావులు నాకుఁ దెలియనివికావు. భోగపుబోటికి వావులేటికి ? అప్సరసలకు నొక్కమగఁడని లేఁడు. ఆదితేయుల కొక్కమగువయని లేదు.

రావణుఁడు రంభను జెఱచుట.

అని పలికి యా క్రూరరాక్షసుఁడు కామమోహోద్రిక్తుఁడై యామె నొకశిలాతలంబునఁ బండుకొనఁబెట్టి మన్మథయుద్ధంబున దాక్షితంజేసి విడిచెను.

అట్లు వానిచే విడువఁబడినదయై యా రంభ జండలురాల నగలుజాఱ మదపుటేనుఁగుచేఁ గలఁపఁబడిన నదివలె నాఁటలపాటుగాంచి కురులు ముంగురులు చెదరఁ గరపల్లవంబులు వణంకుచుఁ గాలిచేఁ గదల్పఁబడిన పూఁదీవ వలె నల్లలనాడుచు సిగ్గుపడుచు, భయపడుచుఁ గేలోడ్చికొని నలకూబరు నొద్దకేఁగి వానిపాదంబులపైఁ బడెను. మహాత్ముఁడైన నలకూబరుఁడు దీనావస్థ చెందియున్న యామెనుగాంచి యేమే భద్రా ! యిట్లు కాళ్లపైఁబడితివి ? అని ప్రశ్నింప నామె వెచ్చనూర్చుచు వణఁకుచుఁ గరములు మోయిలించి యున్న దున్నట్లుగా వానితో నిట్లు చెప్పఁదొడఁగెను.

రంభ రావణు నకృత్యంబు నలకూబరునితోఁ జెల్పుట.

ప్రాణనాథా ! దశగ్రీవుఁడు దుర్వారసైన్యంబులతోఁ ద్రివిష్టపంబుపైఁ జనువాఁడై యిందు దండు విడిచినాఁడు. శత్రునాశంకరా ! నేను నీయొద్దకు వచ్చుచు వాని కంటఁబడితిని. నన్నుఁగాంచి వాఁడు పట్టుకొని నీ వెవ్వరవని ప్రశ్నించినాఁడు. ఉన్నయథార్థమంతయు నేను వానికి నివేదించితిని. కాని కామమోహాభిభూతాత్ముఁడగు నారావణుఁడు నా మాటగీటునఁబుచ్చెను. దేవా ! నేను నీ కోడలినంటిని. కరుణింపుమంటిని. నా ప్రార్థనంబువాఁడు వెను కకు నెట్టి తిరస్కరించి నన్నిట్టి యవస్థకుఁదెచ్చెను. నా యీ యపరాధంబు మన్నింప నీవేయర్హుఁడవు. సౌమ్యుఁడా ! స్త్రీలకుఁ బురుషులతోఁ దుల్యమగు బలంబు గలుగదుగదా ! అని రంభపలుకఁగా నలకూబరుఁడు మిక్కిలి పరాభూతయయిన యామె స్థితిని విని కొండొకసేపు ధ్యానంబునూని క్షణకాలములో నారావణుని చెయిదిని దెలిసికొని కాల్చినట్లుగాఁ గన్నులెఱ్ఱవాఱఁ గరంబులతో జలంబులు గైకొని,

నలకూబరుఁడు రావణుని శపించుట

యథావిధిగా నాచమనంబుగావించి మహాదారుణంబుగా రావణునిట్లు శపించెను. అండజయానా! యీ నీచుఁడు తన్నొల్లని నిన్ను బలాత్కరించి తిరస్కరించెను. ఇంకను ఇట్లే యితఁడు తన్నొల్లని కాంతలఁ గవయగలఁడు. ఎప్పుడీ కామార్తుఁడు తన్నొల్లని పల్లవపాణినిఁ బరిభవించునో యప్పుడే వాని తల వేయిచెక్కలగుఁగాక! అని జ్వలితాగ్ని సమప్రభుఁడైన నలకూబరుఁడు శపియింపఁగానే దేవదుందుభులు మ్రోఁగెను. ఆకసంబుననుండి పుష్పవృష్టి కురిసెను.

బ్రహ్మముఖ్యులగు సకలదేవతలు నపారానందంబు నొందిరి. లోకంబు గతియు రావణుని చావును దెలిసికొని ఋషులును, పితలును అనుత్తమప్రీతినిఁ గాంచిరి. గగుర్పాటొదవించు నాశాపంబువిని రావణుఁడు తన్నొల్లని కాంతలకూటమిఁ గోరకయుండెను.

తమ మనంబులకుఁ బ్రియంబైన నలకూబరశాపం బాలించి రావణునిచే లాగికొని రాఁబడిన పతివ్రతా స్త్రీలందఱు మనంబుల ఘనంబగు ముదంబు నొందిరి.

ఇది యిరువదియాఱవ సర్గము

---

## ఇ రు వ ది యే డ వ స ర్గ ము

రావణుఁ డింద్రపురిపై దాడివెట్టుట విని దేవతలు యుద్ధమునకు సన్నద్ధులగుట.

అంత మహాతేజస్వియు నిశాచరుఁడును నగు రావణుఁడు కైలాసంబును దాఁటి యింద్రలోకమును జేరెను.

నేల యీనినట్లుగా నెల్లయెడల నిండి చనుచున్న యారాక్షస సేనల యురవడి నుప్పతిల్లిన చప్పుడు తరిగొండనుద్రచ్చఁబడు పాలసంద్రంబు నులివువలె దేవలోకంబునం దెసరేఁగెను.

ఇంద్రుఁడు రావణుఁ డరుదెంచెనని విని యాసనంబుననుండి యులికిపడి లేచి తనచుట్టు మూఁగియున్న దేవతలను ఆదిత్యులను రుద్రులను విశ్వేదేవులను మరుద్గణంబులను దక్కిన సుపర్వసమూహంబులను గాంచి దురాత్ముఁడైన రావణుఁడు మనలఁ గెలువ వచ్చినాఁడు. మీరందఱు యుద్ధమునకు సిద్ధముగుండు అని పలుకఁగానే దేవతలందఱు తమ యేలికయగు మహేంద్రుని యాజ్ఞ నౌదలఁదాల్చి తమజేని మీఱిన జోదులై యుద్ధశ్రద్ధా సమన్వితులై మహాబలసంపన్నులై రావణుతోఁ దలపడ సిద్ధముగా నుండిరి. ఇంద్రుఁడు

రావణు రాకకుఁ గడునడలి ధృతిసడలి దీనుఁడై మహావిష్ణువుచెంత కరిగి యిట్లు మొఱవెట్టుకొనెను.

### ఇంద్రుఁడు విష్ణువుఁ జూడఁ బోవుట.

తండ్రీ! ఆపన్నశరణ్యా! ఏమిచేయుదును? మహావీర్యపరాక్రమ సంపన్నుఁడును బలశాలియు రాక్షసుఁడునగు రావణుఁడు జన్యంబున దేవతలఁ గెల్వవచ్చినాఁడు. అతని బలంబునకు హేతువు వరంబుకాని యన్యంబుకాదు. బ్రహ్మవరం బమోఘంబును బాలనీయంబును నగుం గదా! మున్ను నీబలం బూఁతగా నేను నముచిని వృత్రుని బలిని నరకుని శంబరుని ఎట్లు దగ్ధంబు గావించితినో యట్లే వీనిఁగూడ జంపునట్లను గ్రహింపుము. దేవదేవా! మధుసూదనా! నీవుదక్క నన్యులు నాకు దిక్కులేరు. సచరాచరాత్మక మైన యీ జగత్త్రయంబునకు నీవే గతి. నీవే పరాయణము. నీవే నారాయ ణుఁడవు. శ్రీమంతుఁడవు. పద్మనాభుఁడవు. సనాతనుఁడవు. నీవే జగములెల్ల స్థాపించితివి నీవే నన్ను వేల్పులకేలికను జేసితివి. సచరాచరంబైన యీ జగత్త్రయంబు నీచే సృజింపఁబడినది. యుగాంతవేళ నీ జగంబంతయు నీయంద లయంబొందుచున్నది. మహానుభావా! నీవు స్వయముగా రావణుఁగెల్చు తత్త్వంబు యథాతథంబుగా నాకుఁ దెల్పుము. మహాప్రభూ! నీవు చక్రంబు చేపట్టి రావణునితోఁ బోరి నాకుం గూర్తువే? అని యింద్రుఁడు పలుకఁగా విని విష్ణుఁ డిట్లనియె.

### విష్ణు వింద్రునితోఁ దాను యుద్ధంబునకు రానని చెప్పుట.

ఇంద్రా! భయపడకుము. కార్యంబుతీరు వచియించెద వినుము. ఈ దుర్వృత్తుని జయింప సురాసురులకు శక్యంబుగాదు. వరదానంబునంజేసి దుర్జయుఁడై యున్నవీనిని యుద్ధంబునఁ బోకార్పరాదు. వీఁడు తనపుత్త్రు నితోఁగూడి బలోత్కటుఁడై ఘనకార్యం బొక్కండు తప్పకచేయును. ఇది నా ధీబలంబునఁ గంటిని. సురేశ్వరా! నీవు నన్ను రావణునితో యుద్ధంబు సేయుమని యర్థించితివి. నేనా రాక్షసుఁడైన రావణునితో మాఱొడ్డి పోరను. విష్ణుఁడనైన నేను సమరంబున శత్రువును సంహరింపక నెన్నఁడును వెనుకంజవేయను. రావణుఁడు లబ్ధవరుఁడగుట నానియమం బిత్తఱి నెఱవేఱుట దుర్లభంబు. నా ప్రతిజ్ఞ వినుము. నేనే యీరావణుని మృత్యువునకుఁ గారణము గాఁగలను. నేనే నేల ప్రొద్దెఱింగి వీనిని వీని కొడుకునుగూడ వధింతును. దేవతలను సంతోషపఱతును. దేవరాజా! శచీపతీ! నీకు నేను యాథార్థ్యము దెలిపితిని. మహాబలా! భయంబుదక్కి దేవతలఁగూడి రావణునితో యుద్ధమ్ముచేయుము.

## దేవరాక్షస యుద్ధము.

అని విష్ణువానతిచ్చినంతనే రుద్రులు ఆదిత్యులు వసువులు మరుత్తులు అశ్వనీదేవతలు పురంబు వెలువడి రాక్షసులతో మార్కొన యుద్ధసన్నద్ధులై శీఘ్రగమనంబులఁ జనిరి.

ఇంతలో రేయి గడవ వెలవెలవేగెను. అంత నెల్లయెడలఁ బెల్లుబ్బి యుద్ధముచేయఁ జనుదెంచు నక్తంచరసేనల వీరసింహనాదంబులు విననయ్యెను. క్షణములో నారాక్షసవీరులు పెచ్చుపెరిఁగి యొకళ్లొకళ్లఁజీరుచు సంగ్రామాభిముఖులై పఱచిరి.

దుర్జయంబును నక్షయంబును నగుసోఁకుమూఁకను గాంచి త్రిదశవాహినులు గలగుండు చెందెను. పదపడి యిరువాఁగులకు నిర్హ్రాదంబును ఘోరంబును నగు సంకులసంగ్రామము జరిగెను. నానావిధాయుధంబులు గొని యొండొరులు మోఁదుకొనిరి.

ఇంతలో రావణునాజ్ఞ నౌఁదలఁదాల్చి శూరులును ఘోరదర్శనులును రాక్షసులును నగు వాని మంత్రులు మారీచుఁడు ప్రహస్తుఁడు మహాపార్శ్వుఁడు మహోదరుఁడు అకంపనుఁడు నికుంభుఁడు శుకుఁడు సారణుఁడు సంహ్లాదుఁడు ధూమకేతుఁడు మహాదంష్ట్రుఁడు ఘటోదరుఁడు జంబుమాలి మహాహ్రాదుఁడు విరూపాక్షుఁడు సుప్తఘ్నుఁడు యజ్ఞకోపుఁడు దుర్ముఖుఁడు దూషణుఁడు ఖరుఁడు త్రిశిరుఁడు కరవీరాక్షుఁడు సూర్యశత్రుఁడు అతికాయుఁడు మహాకాయుఁడు దేవాంతకుఁడు నరాంతకుఁడు నను వారు మల్లచఱచుచు నార్చుచు రణస్థలి కరుగుదెంచిరి. వీరందఱను దలకడచి రావణుని మాతామహుఁడగు సుమాలియలవుఁ జలముమెఱయ దేవసైన్యంబులఁ జొచ్చి ప్రభంజనుఁడు మేఘములఁ జెదరఁ గొట్టినట్టుపలు తెఱంగులవాఁడియమ్ములఁ దేవగణమ్ములఁ బాఱఁద్రోలెను. ఏటువడి సురలు సుమాలికి వెఱచి తప్పలుదూలి సింగంబునకు వెఱచిపఱచు మెకంబుల తెఱంగున దశదిశలకుఁ బఱచిరి. ఇంతలో వసువులలో నెనిమిదవవాఁడగు సావిత్రుఁడను విఖ్యాతపురుషుఁడు పలువిధంబులగు పోటుముట్టులతో బిట్టుమెఱయు దేవతానీకంబులఁ గలుపుకొని భుజంబులుప్పొంగఁ గేసరి క్షుద్రమృగంబులనుబలె శత్రుసేనలను భయపెట్టుచు రణరంగంబుఁ జొచ్చెను. అత్తఱి మేటిజోదులగు త్వష్ట పూషుఁడు నను నాదిత్యులు కవచధారులై నిర్భీకులై సేనలతోఁగదనభూమిం బ్రవేశించిరి.

అంతఁ గీర్తిఁగోరి వెనుదీయక పోరు సక్రోధులగు రాక్షసులకును దేవతలకును ఆయోధనంబు పెద్దయుఁబ్రొద్దు జరిగెను. ఉక్కుటునకలఁబోని రక్కసులు నిర్జరులను క్రూరనారాచంబుల జర్జరితాంగులంజేసిరి. దేవతలు పుయిలోడక

బయలుమెఱసిన బలిమికలిమిని దమతేజంబు దీపింప రాక్షసులనెదిర్చి యోహారి సాహారి విశిఖంబులు వర్షించి వారినెల్ల యమసదనంబున కతిథులను గావించిరి.

రామా! ఇంతలో సనమానబలశాలియగు సుమాలి వివిధాయుధంబులు చేకొని యుద్ధభూమినిజేరి దైవతబలంబులనెల్ల క్రొవ్వాడిబూపుల వాయువు మేఘంబులవలె విధ్వంసంబుచేసెను. దారుణంబులగు వాని బాణంబులయేటులకును శూలంబుల పోటులకును ప్రాసంబుల పాటులకును నిలువలేక కలవరించి దేవతలు పలుత్రోవలఁ బఱచిరి.

సుమాలికి వెఱచి పఱచు సుపర్వులఁగాంచి యష్టమవసువగు నా సావిత్రుఁ డెదురుతిరిగి తన రథానీకములంగూర్చుకొని పాలికలనంతయు దానవైు వీరవిహారంబుచేయుచున్న సుమాలినిఁ దనతేజంబువెంపునను విక్రమంపులావునను ఉరికట్టెను. అత్తఱి నయ్యిరువురకు రోమహర్షణంబు కలిగించు యుద్ధమ్ము జరిగెను. సుమాలియు సావిత్రుఁడును ఒకరికొకరు తీసిపోకమడమ త్రిప్పక పెనంగిరి.

అంత శూరుండైన వసువు, సుమాలి పన్నగరథంబును నిశితశరంబుల నేసి క్షణములో ముక్కలుముక్కలుచేసి వానిని దుదముట్టింప వాఁడిమొన గలిగిన కాలదండంబువ్రోలెఁ గ్రాలుచున్న గదను గేలంగీలించి బలిమికొలఁది సుమాలి నెత్తిపై నెత్తివైచెను. సుమాలి నెత్తినిమొత్తిన కట్టెనిప్పునుబోలిన యాగద ప్రళయభయంకరముగ గర్జిల్లుచుఁ గొండలపిండుపై నింద్రుఁడువైచిన బెడిదంపుఁ బిడుగు వడుగున మెఱసెను.

పిడుగుపాటునఁ బుడమింబడి మాఁడిన మహావృక్షంబువ్రోలె నా సుమాలి రణరంగంబునఁగూలి కాలి బూడిదకాఁగా వానియెముకలుగాని, తలగాని, మాంసముగాని మందునకైనఁ గానరాలేదు.

సుమాలి పడుటఁగాంచి రక్కసులందఱు నొక్కుమ్మడి గుమిగూడి పరస్పరము నఱచుచుఁ బఱచిరి. సావిత్రుఁడు వారిని వెన్నంటి తఱిమి తఱిమి బిట్టదల్చుచుఁ గొట్టుచున్నను నెదురుతిరిగి పోరలేక పాఱిరేకాని నిలువలేరైరి.

ఇది ఇరువదియేడవ సర్గము

---

## ఇరువదియెనిమిదవసర్గము

### జయంత మేఘనాదుల యుద్ధము.

సావిత్రుఁడను వసువుచే సుమాలి హతుఁడై భస్మమైయుంటయు శత్రుశరపీడితమై తనసైన్యంబు దైన్యంబునొంది పరువిడుటయుఁ గాంచి

రావణకుమారుఁడగు మేఘనాదుఁడు బలంబుకలిమిఁ గ్రోధంబ ప్రతిహతంబుగ రాక్షససేనలనెల్లఁ బురికొల్పి మరలించి యగ్నివర్ణంబును గామగమనంబును నైనరథంబునెక్కి యెరగలివలెఁ దుఱఁగలించుచుఁ జని యనిమొన నిలిచిన విరోధి వరూథినీజాలంబులఁ దాఁకెను.

వివిధాయుధంబుల ధరించి తమ్ము చిందఱవందఱసేయ రణరంగంబుఁ జొచ్చు మేఘనాదునిఁ గాంచినంతనే దేవతలందఱు గనుకని దెసలకెగఁబడి పాఱిరి. కాని యొక్కఁడును నెదుర్కొఁబడి నిలిచి పోలిచి పోరినపాపంబునఁ బోలేదు.

అట్లు దిగులొంది పరువెత్తు వేల్పులఁగాంచి శతమఖుఁ డిట్లనియె.

ఆదిత్యులారా! భయపడకుఁడు, భయపడకుఁడు. పాఱిపోవకుఁడు పాఱి పోవకుఁడు. రణంబుచేయ మరలిరండు. అపజయంబననేమో యెఱుఁగని నా కుమారుఁడిదే యుద్ధంబుసేయ నేతెంచుచున్నాఁడు. అని తనసేనల నింద్రుఁడు హెచ్చరించుచున్నంతలో వానిసూనుఁడగు జయంతుఁడు కరంబు విస్మయంబు గొల్పు నరదంబునెక్కి సంగ్రామరంగంబున కరుదేరఁ ద్రిదశులు వానిని వారించుచుఁ దాము మేఘనాదునితో యుద్ధంబుసేయ సిద్ధపడిరి.

అత్తఱి జయంతమేఘనాదులకును దేవరాక్షసులకును దుల్యంబగు యుద్ధంబు జరిగెను. అంత మండోదరీసుతుఁడు జయంతుని సారథియు, మాతలి పుత్రుఁడునగుగోముఖునిపైఁ గాంచనాలంకృతంబులగు బాణంబులు పుంఖానుపుంఖంబులుగఁ గురిసెను. శచీసుతుఁడుగూడ మేఘనాదు సూతునిఁ గూడ వాఁడితూపుల నుక్కిరిబిక్కిరిచేసి క్రుద్ధుఁడై మేఘనాదునిఁగూడఁ గాఁడనేసెను. అంతఁ గ్రోధమూర్తియు మహాతేజస్వియు బలశాలియునగు రావణపుత్రుఁడు విస్ఫారితేక్షణుఁడై యింద్రనందనునిపై శరవర్షముగురిసెను.

అంత మేఘనాదుఁడు కోపోద్దీపితుఁడై సారవంతంబులై నిప్పులుగ్రక్కు శతఘ్నులు తోమరమ్ములు, ప్రాసమ్ములు, గదాఖడ్గమ్ములు, పరశ్వధమ్ములు, ముసలమ్ములు, పర్వతశిఖరమ్ములు గొని సురసేనలను నుగ్గునూచమ్ము గావించెను.

మేఘనాదుఁడట్లు ప్రళయతాండవముచేయుచు శత్రుసంహారము గావించుచుండఁగ మాయాతిమిరముచే లోకులందఱు మిక్కిలి చిక్కులు పొందిరి. శస్త్రజీవులగు దేవతాసైనికులును జయంతుఁడునుగూడ బహుభంగు లుగ నలజడి పాలైరి. రాక్షసులును, దేవతలును ఒండొరుల గుఱుతెఱుంగఁ జాలక యక్కడకక్కడకుఁ దాఱుమాఱై కలయఁబాఱిరి. ఆకటికిచీకటిలోఁ 'దారి తెన్నుఁ'గానక మతిభ్రమించి దేవతలు దేవతలను, రాక్షసులు రాక్షసు

లను జెండాడుకొనిరి. అది కాంచి మఱికొందఱటు సేయుటకును దోఁపక వీఁపు సూపి పఱచిరి.

ఇంతలో శూరుఁడును వీరుఁడును శచీదేవికిఁ దండ్రియునగు పులోముఁడు దైత్యసేనామధ్యస్థుఁడై యున్న తన దౌహిత్రుఁడగు జయంతుని బట్టుకొని యెత్తుకొనిపోయి సాగరమును జొచ్చెను. దేవతులు జయంతునిఁగానక కరమ్ములన నురమ్ములను శిరమ్ములను గరమ్ము దారుణమ్ముగా మోఁదు కొనుచు సంతసంబు సుంతయు లేక వగచి బాధనొంది దిగులుచెంది యథా యథలై చనిరి.

అదికని మేఘనాదుఁడు ఘనంబగు మోదంబుపొంది తన బలంగమ్ములఁ గూర్చికొనివచ్చి దేవతలనంటఁ దాఁకి పేర్చి కోయని యార్చెను.

### ఇంద్రుఁడు యుద్ధమునకు వెడలుట.

అంత నింద్రుఁడు తనకొడుకు కానరాకపోవుటయు దేవతలు పాఱిపోవు టయుఁగాంచి మాతలిని రథంబు దోకొనిరమ్మని పనుప నతఁడు దివ్యంబును మహాభీమంబును వాహ్యామానంబును మనోజవంబును నగు స్యందనంబును దక్షిణంబ గొనివచ్చి చెంత నిలుపఁగా నింద్రుఁడా శతాంగంబు నెక్కి కయ్యమ్ము సేయ బయలు వెడలెను. అయ్యెడ వాయు సంచలితములై గర్జిల్లుచు విద్యుల్లతా కలితజీమూత సంఘమ్ము లింద్రునకు ముంగలిగా నడచెను. గంధర్వ లొక్కచోఁగూడి పలుతెఱంగులగు వాయిదంబులు నేలయు నింగియుఁ దాళ ములుగావించి వాయించిరి. అప్సరస్సంఘమ్ములు లాస్యమ్ము చేసిరి. రుద్రులు వసువులు ఆదిత్యులు సాధ్యులు మరుద్గణంబులు నానాయుధంబులు ధరించి సుత్రామునకు బాసటయై చనిరి. హరిహయుఁ డాలంబు సేయఁజను నయ్యెడ గాడ్పులు పరుషమ్ముగా వీచెను. భాస్కరుఁడు కాంతివిహీనుఁడై గనుపట్టెను. పెద్దపెద్దయుల్కలు రాలెను.

ఇంతలోఁ బ్రతాపదీపితుఁడగు రావణుఁడు రోమహర్షణకరంబులును సుమహాభోగంబులును నైనపన్నగంబులచేఁ జుట్టఁబడినదియుఁ దత్కాల వ్యాళ నిశ్వాసదహన దందహ్యామాన రణస్థలంబును విశ్వకర్మ నిర్మితంబును నైన దివ్యరథంబు నెక్కి శూరులును శరశరాసనధారులును నిశాచారులును నైన దైత్యులంగూడి సమరాభిముఖుండై చని మహేంద్రు నెదిర్చి తన తన యునిఁ గాంచి యాలంబు సాలింపుమని వారించి తానే శత్రుంజయుండై పోరఁదొడంగెను. తండ్రి యాజ్ఞను గొని మేఘనాదుఁడు దురంబు సాలించి కూర్చుండెను. క్షణకాలములో దేవదానవులకుఁ బోరుఘోరమ్ముగా జరి గెను. ఒకళ్లొకళ్లపై మేఘంబులవలె శరవర్షంబులు గురిసిరి.

## కుంభకర్ణుఁడు దేవతలతోఁ బోరుట.

అంత దుష్టాత్ముఁడైన కుంభకర్ణుఁడు నానాప్రహరణమ్ములఁ దాల్చి యుద్ధ మెవ్వరితోఁ జేయవలయునో యను నెఱుక లేకయె కంటికగ్గమైన యెల్ల రను మార్కొని కోఱలతోడను జేతులతోడను గాళ్లతోడను శక్తులతోడను దోమరములతోడను సాయకములతోడను జావఁగొట్టి చెవులుమూసి ప్రళయ కాల రుద్రులగు రుద్రులతోఁ దలపడి పోరి క్షతగాత్రుఁడయ్యెను. అలుగుల వల్లఁ గలిగిన కలుగులనుండి నల్లవెల్లుగఁ గాఱుచుండఁ గుంభకర్ణుఁడు ఉఱుము లతో మెఱుములతోఁ గురియు ఘనాఘనంబులవలెఁ జూపట్టెను.

## సురసహాయుఁడై యిందుఁడు రాక్షసులఁ జంపుట.

అంత మరుద్గణమ్ములు వాఁడిములుకులు గొని రాక్షసచమూతతినెల్ల నొక్క త్రేల్మిడిన రణంబు తొఱఁగి పరువిడునట్లు తటతటమికొట్ట నందుఁ గొందఱు నేలకొరగిరి. కొందఱు వాహనంబులఁ గఱచి పట్టుకొని కూలిరి. కొందఱు రథమ్ములను గజమ్ములను గాడిదలను ఒంటెలను బాములను గుఱ్ఱ మ్ములను మొసళ్లను ఏకలమ్ములను దయ్యాపుమొకపుమెకమ్ములను జేతు లతో గట్టిగాఁ గౌఁగిలించుకొని యీలకఱచి యట్టె యుండిరి. కొందఱు దేవ తల నారాచంబులఁ జచ్చిరి.

ప్రమత్తులై నిహతులై భూతలంబునఁ బడియున్న యారాక్షసుల రణ సంప్లవమ్ము చిత్రకర్మమ్ము విధమ్మునఁ బ్రకాశించెను.

శోణితోదకనిష్యందయుఁ గంకగృధ్రసమాకులయు శస్త్రగ్రాహవతియుఁ గూలంకషయునై రణస్రవంతి ప్రవహించెను.

ఇంతలోఁ బ్రతాపవంతుఁడగు రావణుఁడు దేవతలచేఁ బరిమార్పఁ బడిన తన బలంబులనెల్లఁ బరికించి కనలున వెలిఁగి యుప్పొంగుచున్న సైన్య సాగరమున మునిఁగి దేవతలను దుదిముట్టించుచు దేవేంద్రు నెదుర్చ నగ వైరియుఁ బగసాధింప గుణారావంబునఁ బదిదిక్కులు మాఱుమ్రోయునట్లు విల్లెక్కిడి యల్లెలాగి సూర్యాగ్నులవలె వెలుఁగుచున్న యలుఁగులఁగొని రావణు తల పగులనేయ రావణుఁడు గూడ చండకోదండంబు నెక్కిడి కాండకాండ మ్ములఁ బరపి పాకశాసనునకుఁ దలమున్కలు చేసెను. అట్లు రావణ దేవేం ద్రులు బెక్కువర్షంబులు యుద్ధంబుచేయఁగా లోకంబంతయుఁ గాఱు చీఁక టులు గ్రమ్మి నెనుమిట్టిది పల్లంబిది యని తెలియరాకుండెను.

ఇది యిరువది యెనిమిదవ సర్గము

---

# ఇరువదితొమ్మిదవ సర్గము

## రావణుఁడు దేవసేనామధ్యమునఁ జొచ్చి యుద్ధంబు చేయుట.

అట్లు సమరాంగణమంతయు నంధకారబంధురముకాఁగా దేవదానవులు బలోన్మత్తులై యొడళ్లెఱుంగక యొండొరులఁ ద్రుంచుకొనుచుయుద్ధము చేసిరి. ఆ సంగరంబున దేవతలబారి కగ్గమై పడియుపనంతు రాక్షససేన మాత్రము మిగిలెను. తక్కిన రక్కసి మూఁకయెల్ల జమునింటి నలంకరించెను. ఆకాఱుచీఁకువాలునఁ బోరుచున్న దేవరాక్షసు లొకరినొకరు గుఱుతింపఁజాలకుండిరి.

మహాబలుఁడైన యింద్రుఁడును రావణుఁడును రావణియు మాత్రమా కటికిఁయిరులున మూర్ఛాగతులుగాక యుండిరి.

అంత రావణుఁడు రణరంగంబునఁ జచ్చిపడియున్న తనచమూసమూహమునెల్లఁగాంచి చండతరకోపమ్మున మండిపడి బ్రహ్మాండభాండం బదురునట్లు మహానాదంబు గావించి యరదంబు నోగఁబగరకుఁ ద్రోపడరాని యటు గొంజితనమ్మున మెఱయుచున్న సూతునిఁగాంచి కినుకమై సారథీ! నన్ను శత్రు సేనామధ్యమునకు సత్వరమ్మగాఁ దోకొనిపొమ్ము. దైత్యేతరులైన యాదిత్యులనెల్ల ఘోరాతిఘోరములైన నానాశస్త్రములఁ దెగనఱకి యముని పోలికిఁ బ్రాఁతకాఁపులఁ జేసెదను.

నేను ఇంద్రునిఁ గుబేరుని వరుణుని యమునిఁగూడ వధించి త్రిదశులఁ బొలియించి పాతాళమునకు స్వర్గమునకు నధిపతినై క్రాలెదను. విషాదము నొందకుము. రథము త్వరగాఁ దోలుము. ఇప్పటికే నిన్ను రెండుమాఱు లెచ్చరించి చెప్పినాను. పోనిమ్ము. తొరగారథము పోనిమ్ము. నన్ను సేనామధ్యమునకుఁ జేర్పుము. మనమున్నది నందనవన ప్రదేశము. నన్ను నీ విప్పుడు దయార్ద్రయున్నయెడల గ్రద్దనఁ దీసికొనిపొమ్ము.

అనిపలికిన తనయొకిమీఁడగు రావణుమాటల నాలించి సారథి మనోజవంబులగు తురగంబుల శత్రుమధ్యంబున కరుగ వీఁపుదట్టి ఛే యని యదలించెను.

అట్లు చనుదెంచు రావణునిపూనిక నెఱింగి దేవేంద్రుఁడైన శక్రుఁడు రథస్థుఁడై సమరస్థులైన దివౌకసులతో దేవతలారా! నాకుఁదోఁచిన మాట యొక్కటి చెప్పుచున్నాను వినుఁడు.

## ఇంద్రుఁడు రావణుని బంధింపఁ బ్రయత్నించుట.

మన మీయుక్కరిదైన రక్కసుని రావణునిఁ జంపకుండ బ్రతికియుండఁగానే మెలఁకువగ బంధింపవలయును. వీఁడతిబలసైన్యంబులఁ బవనజవం

బగు రథంబుతోఁ బర్వదినంబున నుప్పొంగు సముద్రంబు చందంబునఁ బొంగుచు వచ్చుచున్నాఁడు. వరదానంబున నిర్భయుఁడైయున్న వీనిఁజంప మనకు శక్యంబుగాదు. కానఁ బట్టికొని బంధింతము. మీరు పోరున హెచ్చరిక గలిగి యుండుఁడు. బలిచక్రవర్తి నణఁగఁద్రొక్కి యెట్లు ముల్లోకంబు లనుభవించుచున్నానో యట్లే యీ పాపాత్ముని రోధించి సర్వసుఖంబు లవ్వారిగా ననుభవించెదను. అని పలికి యింద్రుఁడు రావణునిఁ దొలంగి మఱియొక్కవలనున కరిగి యరిభయంకరంబుగ సమరంబు చేయుచుండెను. మహావేగంబుగ దేవతలు శస్త్రవర్షంబు గురియుచున్నను రావణుఁడు లక్ష్యపెట్టక యుత్తరదిక్కున నుండి నిరాతంకముగ సేనామధ్యమునఁ జొచ్చెను. శతక్రతువైన యింద్రుఁడు దక్షిణ పార్శ్వమునుండి సేనలోనికిం జొచ్చికొనివచ్చెను. అంతలో రాక్షసాధిపుఁడైన రావణుఁడు నూఱామడల దవ్వుగలుగఁ జనుదెంచి దేవబలంబుల నెల్ల శరవర్షంబున ముంచివైచెను. అంత దేవేంద్రుఁడు ప్రణష్టంబైన తనబలంబునుగాంచి చిత్తంబునఁ దత్తరపాటు లేక రావణునిఁగవిసి వానిని వెనుకకు మరల్చెను. ఇంద్రునిచే రావణుఁ డరికట్టఁబడియుండుటంగాంచి దానవరాక్షసులు అయ్యో! చచ్చితిమి. చచ్చితిమి. అని బిగ్గరగా నఱచిరి.

### మేఘనాదుఁడు మాయచే నింద్రుని బంధించుట.

అదివిని మేఘనాదుఁడు రథంబధిరోహించి క్రోధమూర్ఛితుఁడై మహాదారుణంబైన యాసైన్యమునఁజొచ్చి యీశ్వరదత్తంబైన మహామాయనూని భూతకోటికిఁ గానరాకుండ సేనలపై శరవర్షంబు గురియుచు దేవతలను విడిచిపుచ్చి దేవేంద్రునొక్కరునె వీకమైఁ దాఁకెను. కాని దేవేంద్రుఁడుమాత్రము మేఘనాదుని గానలేఁడయ్యెను. మేఘనాదుఁడు సురుఁగుటఁజేసి పాకశాసనుఁడైన మహేంద్రుఁడు రుద్రవసుసాధ్యాదిత్యదిక్పతులఁగూడి దైత్యనాథుఁడగు రావణునిపైఁ గవిసి వాని రథంబును, అశ్వంబులను, సారథిని మాటిమాటికి గాటంపు వ్రేటులఁ గాఱియవెట్టి రథస్థుఁడైన రావణునిఁ బ్రాణముల తోడనే పట్టుకొని సింహనాదంబు గావించెను.

అట్లు రావణుఁడు పట్టుపడఁగానే దేవతలందఱు మహానాదంబు గావించిరి. ఇంద్రుఁడు రావణునిఁ బట్టుకొని స్వర్గలోకంబునకుఁ గొంపోయెను.

అదిగాంచి రాక్షసులు పిక్కబలిమిచూపి పఱచుచు దిక్కులదగు నట్లార్తనాదంబు గావించిరి. అదివిని మేఘనాదుఁడు మహాభయంకరముఁగ నఱచి భుజంబుసఱచి శరవేగంబుతో దేవేంద్రుఁడున్న రణస్థలికుఱికెను. బొందలంబు (కవచము) వీడియున్న తన్ను మహాబలపరాక్రమసంపన్నులగు దేవతలు గొట్టుచున్నను మాఱుపోరకూరకుండి వాఁడిబాణముల మాతలిని

హయంబులనుమోఁది తిరుగ దేవేంద్రునిపై బాణవర్షము గురిసెను. అంత బిడౌజుఁడు రథంబువిడిచి, మాతలినివఱచి యైరావతంబునెక్కి మేఘనాదుని నెదుర్కెను. మాయాబలశాలియగు రావణసుతుఁ డదృశ్యుఁడై యాకసంబున నుండి యింద్రుని మాయాపరిక్షిప్తునిఁ జేసి ఘోరనారాచంబులఁ గొట్టి యతఁడు పరిశ్రాంతుఁడు కావుటెఱింగి తనమాయచే వానిని బంధితుం జేసి తనసైన్యమును జుట్టుముట్టఁ జేసి యింద్రునిఁబట్టిన మోదంబుతోఁ దండ్రిని వీక్షించెను.

మేఘనాదునిచే రణరంగంబుననుండి బలిమిమెఱయ బంధించి తీసికొని పోఁబడుచున్న మహేంద్రునిఁగాంచి యమర్త్యులందఱు సమితింజయుఁడను, మాయావియునైన మేఘనాదుఁడు కానరాకున్నాఁడు. మాయావిద్యావిదుఁడయ్యును దేవేంద్రుఁడు బలవంతముగ మాయచే నపహరింపఁబడినాఁడు. ఇఁక నేమి కానున్నదో కదాయని చింతించుచున్నంతనంతలో సురగణంబు లన్నియు రోషంబున రావణుని శస్త్రవర్షంబున గాసిల్లఁజేయ నతఁడలసిసొలసి వసువులనుగాని, యాదిత్యులనుగాని, మరుద్గణంబులనుగాని చెనకి రణంబున నాఁగుటకుఁగాని పోరుటకుఁగాని శక్తుఁడు గాఁడయ్యెను.

రావణుఁడు యుద్ధముచాలించి మేఘనాదునిఁ బ్రశంసించుట.

పోటుముట్టులవ్రేటుల మేనెల్ల తూఁటుతూఁటులుగ నసురసురై యున్న తండ్రినిఁగాంచి మేఘనాదుఁడిట్లనియె. నాయనా! రమ్మిఁక పోదము; యుద్ధము చాలింపుము. మనము జయమొందితిమి. ఇదినిజమ్మిఁక జ్వరంబుతొలంగి స్వస్థుఁడవుగమ్మిఁక. వీఁడుగో చూడు, సకలసురనికరమ్మునకు రాజై త్రైలోక్యప్రభువై వెలుఁగు దేవేంద్రుఁడు నాచేఁబట్టువడినాఁడు. దేవతలందఱు దర్పంబులువీడి చప్పఁబడినారు. శత్రువును నిజతేజంబునఁ గెల్చి ముల్లోకంబులను యథేష్టముగ ననుభవింపుము. వృథాశ్రమమేల? ఇపుడు కదనంబొనర్చుట కేవలము నిష్ఫలము; బృందారకులు రణము మానిచనిరి.

అన విని రావణుఁడు స్వస్థచిత్తుఁడయ్యెను. అంత నుత్తమతేజస్వియుఁ ద్రిదశశత్రువును, బ్రసిద్ధుఁడును, నిశాచరేంద్రుఁడును నైన రావణుఁడు యుద్ధకర్మంబు పోవిడిచి, తనసూనుని బ్రియతమంబగు మానితవాక్యంబు నాలించి లాలించి, మేలెంచి యిట్లనియె.

సెబాసు! నాయనా! నీవు నాకలోకేశ్వరుని బద్ధునిఁ జేసి త్రిదశుల నిర్జించితివి. నీబలంబునేమని యగ్గింతును. నీ నిరూపమాన బలపరాక్రమంబులచే మన కులగౌరవంబు పెంపొందించితివి. తండ్రీ! నీవు దేవేంద్రుని నీరథంబునఁ

గూర్చుండఁబెట్టుకొని సేనలంగూడి లంకానగరమునకుఁ జనుము. నేనుగూడ మంత్రులనుగూడి మంతునకెక్కిన సంతసంబున నీవెనువెనుక నే వత్తును.

అని తండ్రి యానతీయఁగానే మేఘనాదుఁడు మేఘవాహనుని బంధించి పట్టుకొని, బలమును, వాహనంబులను వెంటఁబెట్టుకొని నిజనివాసంబున కరిగి యుద్ధంబుచేసి, యలసటగాంచియున్న తన రాక్షససైనికులనెల్ల నిండ్లకు నేఁగఁబనిచెను.

ఇది యిరువదితొమ్మిదవ సర్గము

---

## ము ప్ప ది య వ స ర్గ ము

### బ్రహ్మ లంకకుఁబోయి రావణమేఘనాదులఁ బ్రశంసించుట.

అతిబలుండైన యైరావణవాహనుఁడు రావణసుతునిచే నోటువడుటఁ గాంచి దేవతలందఱు మిక్కిలిపొక్కి బ్రహ్మయొద్ద కరిగి ప్రజాపతీ! భగవ ద్వరంబునఁజేసి యీ దేవేంద్రుఁడు మేఘనాదునిచేఁ బట్టుపడినాఁడు. త్రిలోకాధినాథా! నీవు రాక్షసేశ్వరుఁడగు రావణుని అవధ్యునిఁజేసితివి. మహాత్ముఁడగు నీశ్వరుఁడు మేఘనాదునకు మాయ నొసంగియున్నాఁడు. మాయచే బలవత్తరుండైన మేఘనాదుని దేవేంద్రుఁ డేమిచేయఁగలఁడు? సర్వేశ్వరా! దేవా! నీవరంబుకలిమి మేఘనాదుని దేవతలు జయింపఁజాలరు. కాన విరించీ! నీవే దేవేంద్రుని విడిపింపుము. జగత్పతీ! ఇదిమొదలు బలవిక్రమ సంపన్నుఁ డగు లంకేశ్వరుఁడు మమ్మేలఁగలఁడు. కాన నీభక్తుఁడగు దేవేంద్రుని విడిపింపుము. అని వేఁడఁగా సురేశ్వరుఁడైన బ్రహ్మ లంక కేఁగి పుత్త్రులతోడను, సోదరులతోడను గూడియున్న రావణుని సమీపించి గగన తలంబునన నిలిచి మంచిమాటలతో నిట్లనియె.

నాయనా! రావణా! సంతోషించితిని. మాయురే! బవరంబున నీపుత్త్రు విక్రమాదార్యములు మెచ్చుఁగూర్చెడిని. వాఁడు నీకుఁ దుల్యుఁడననేల యధికుఁడే కావచ్చు. ముల్లోకములు నీవు స్వీయతేజంబున జయించితివి. నీసుతునిబలిమిం జేసి నీప్రతిజ్ఞకూడ నెఱవేఱినది; నేను సంతసించితిని. రావణా! అతిబలుఁడును వీరుఁడునునగు నీపుత్త్రుఁడు నేఁటినుండి యింద్రజిత్తను పేర విఖ్యాతిఁ గాంచఁగలఁడు. రావణా! నీకొడుకు కడిఁది బలిమి కలిమిని నీవు త్రిదశులను లోఁబఱచుకొంటివి.

కాన వీఁడు బలవంతుఁడును, శత్రుంజయుఁడును నగును. కావున మహాబాహూ! పాకశాసనుఁడగు మహేంద్రుని విడిచిపుచ్చుము, వీని మోక్షము

వలనఁ బ్రీతులై దివౌకసులు వరంబులుగూడ నొసంగెదరు. అన విని సమితింజయుఁడును, మహాతేజస్వియునగు నింద్రజిత్తు శతధృతినిఁగాంచి దేవా ! పులోమజాభర్త విడుగరకై నాకమరత్వ మనుగ్రహింపుము. అన విని పద్మోద్భవుఁడు ఇంద్రజినిఁగాంచి ఓయీ ! భూలోకంబున నే ప్రాణికిని సర్వామరత్వంబు లేదు. నలుగాలివియు ఖేచరములుఁ దక్కంగల తేజుగలవియు వృక్షగుల్మక్షుపలతాతృణోపలపర్వతములును మున్నగునవెల్ల మన్నగునవె. అన్ని జంతువులు భయకారణమున్న భయపడుచున్నవి. కాన నీలోకంబున నన్నింటికి నన్నింటి వలన వెఱపు గలుగుచున్నది. పక్షులకుఁ జతుష్పాద జంతువులకుఁ దేజంబుగల భూతంబులకుఁగూడ భయంబు తప్పదు. చెట్లకు ఎండుటాకులకుఁ బడుట యన్న భీతి. స్థావరజంగమంబులెల్ల మరణించునవే కాని స్థిరంబుగానుండవు. అని శతానందుఁడనిన యీయవ్యయవాక్కు లాలించి యింద్రజిత్తు ఇట్లనియె.

బ్రహ్మ మేఘనాదుఁడు కోరిన వరమిచ్చి యింద్రుని విడిపించుకొనిపోవుట.

"చతురాననా ! వినుము శతక్రతువిమోక్షణంబునం జేసి నాకిష్టసిద్ధియేనిఁ గలుగునట్లు చేయుము. నేను నిత్యంబును మంత్రపూర్వకంబుగ హవ్యంబులతో నగ్నియందు వేలిచి శత్రుజయకాంక్షినై యుద్ధంబునకుఁ దరలునపుడు గుఱ్ఱములఁ బూన్చిన వేఁడివెలుఁగుఁదేరా చిచ్చునుండి బయలువెడలి వచ్చి నా ముంగలనిలుచుఁగాక; నేను దానినెక్కి సంగరంబొనర్చుచుండ నాకమరత్వము సిద్ధించునుగాక ఇదియే నాకవశ్యము గావలసినవరము. జపంబుగాని, వేలిమిగాని పూర్తిగాకుండ నేను సంగ్రామంబునకుఁ గడఁగితినేని నాకు నాశనంబు గలుగుఁగాక; జనులందఱు తపస్సుచేసి యీ యమరత్వమును బొందెదరు. నేను పరాక్రమంబున నీయమరత్వంబును బొందెదనుగాక." అని మేఘనాదుఁడు కోరఁగానే బ్రహ్మ యట్లే యగుఁగాక యని పలుకఁగా నింద్రజిత్తు దేవేంద్రుని వదలి వైచెను; దేవతలు త్రిదివంబునకరిగిరి.

రామా ! యింతలో నింద్రుఁడు దీనుఁడై, యమరద్యుతిహీనుఁడై, చింతాపరీతాత్ముఁడై ధ్యానతత్పరుఁడయ్యెను. అట్లున్న వానింగాంచి దేవుఁడైన ప్రజాపతి యిట్లనియె.

బ్రహ్మ యింద్రునితో నతఁడు బద్ధుఁడగుటకుఁ గారణముఁ జెప్పుట.

శతక్రతూ ! ఏల యేడ్చెదవు ? నవ్వుచుఁ జేసి యేడ్చుచు ననుభవింపవలయునన్న సామెత నీవు వినలేదా ? మున్ను నీవొనర్చిన పాపంబునకిది ఫలంబు. అనుభవింపకతీరునా ? అమరేంద్రా ! తొల్లి నాచేఁ బెక్కుమంది ప్రజలు సృష్టింపఁబడిరి. ఎల్లగతుల వారెల్లనొకేవర్ణ,యొకేభాష,యొకేరూపుగలవారు.

వారిదర్శనంబున గాని లక్షణంబునఁగాని విశేషమేమియుఁ బొడగట్టదయ్యెను. అయ్యెడ నేను ఏకాగ్రచిత్తుఁడనై నా చేసిన యాప్రజాసృష్టినిగూర్చి బాగుగా యోజించితిని. క్రొత్తఁదనంబు లేదయ్యెను. అదికాదని మిన్నగా నూతనసృష్టి చేయఁదలంచి నాసృజించిన ప్రజలవిశిష్టమైన ప్రత్యంగమును దీసి చక్కనిచుక్కయగు నొక స్త్రీని నిర్మింపఁదలంచి రూపగుణంబుల నిట్టిదని రూపింపరాని చక్కఁదనంబు నిక్కయగు నహల్యను సృజించితిని. హల మన వైరూప్యము. ఆవైరూప్యమునుండి పుట్టినదే హల్యము. అట్టి హల్యము (విరూపత) లేని దగుట నామెకు నే నహల్యయని పేరిడితిని. దేవేంద్రా! అట్లు నిర్మించి యీయామె నెవనికిత్తునా యని నేను జిత్తంబున నుత్తలపడఁ జొచ్చితిని. పురందరా ! నీవున్నతస్థానంబున నుండుటంజేసి యీసుందరి నాకుఁ గాక మఱియెవ్వరికిఁ దగునని యెంచి నీవీమెను మనంబునఁ బత్నిగాఁ గోరితివి. నేనామెను మహాత్ముఁడైన గౌతమునియొద్దఁ బెక్కేఁడు లిల్లడగా నుంచితిని. అతఁడెట్టి పాపము బొంతకుఁబోక యతిపవిత్రముగాఁ గాపాడి క్రమ్మఱ నామె నాకడకుఁ దెచ్చెను. అంత నేనా మహాముని మనస్థైర్యము నెఱింగి వాని తపస్సిద్ధికిమెచ్చి యచ్చపలాక్షి నాతనికిచ్చి పెండ్లి చేసితిని. ధర్మాత్ముఁడైన గౌతమమహాముని యామెంగూడి క్రీడించుచుండెను, ఆమె గౌతమున కొసఁగఁబడుటఁజేసి దేవతలు నిరాశులైరి నీవలిగి కామపరవశుఁడవై వాని యాశ్రమమున కరిగి యగ్నిశిఖవలె వెలుఁగుచున్న యారాజీవాక్షినిఁ గాంచితివి. కాంచి కామార్తుఁడవై మన్యువేగంబున నామెను బలాత్కరించి మిథునకర్మంబునకుఁ బాల్పఱచితివి. ఆశ్రమంబున నీవట్టి పాపకార్యంబున కొడిగట్టుట చూచి పరమతేజస్వియైన గౌతముఁడు కోపించి దురదృష్టవంతుఁడవగు నిన్నుఁ గాంచి "ఓరీ వాసవా ! నీవు నాధర్మపత్నిని నిర్భయుఁడవై చెఱచితివి. కాన సమరాంగణంబున శత్రువుచేఁ జిక్కి స్రుక్కెదవు గాక" అని యాతఁడు నిన్ను శపించెను. మఱియు "ఓదుర్బుద్ధీ ! దురాత్మా ! దేవేంద్రుఁడవైన నీకే యిట్టి చెడ్డతలంపు పుట్టినది. కాన నీక మనుష్యులందఱకుఁగూడ నీబుద్ధి నిస్సంశయముగాఁ బొడమక మానదు. ఏబలవంతుఁడు జారత్వమను నధర్మము గావించునో యందు సగము తత్కర్తయు సగము నీవును ననుభవింతురు గాక! పురందరా ! నీవిట్టి యధర్మంబు నాచరింతివి. కావున నీకు స్థావరంబగు స్థానంబు లభింపకుండుఁ గాక! దుర్మతీ ! నీవేకాదు; ఎవ్వఁడెవ్వఁడు సురేంద్రుఁడగుచుండునో వాఁడువాఁడు నీవలె భ్రష్టుఁడగుఁ గాక!" యని యపుడు ముని నిన్నుశపించి భార్యనుగాంచి దూఱినాడి "దుష్టురాలా ! నీసౌందర్యమ్ము వమ్మ్ముగా నాయాశ్రమ సమీపంబునఁ బడియుండుము. రూపయౌవనసంపన్నవై యుండియు నీవు చంచలత్వము నొందితివి. కాన నీవొక్కతవె యందగత్తెవు గాకుందువు గాక ! ఏరూపంబు

గాంచి నీవు మిడిసిపడుచున్నావో యారూపంబు సర్వజనసామాన్యమగుం గాక! ఇందు సందియంబులేదు." అని గౌతముండు శపింపఁగా నామె గౌతమ మునీంద్రునిఁగాంచి "నాథా! యింద్రుండు నీరూపంబు దాల్చి నన్నిట్టి యాగడమునకుఁ బాల్పఱచెను. నేనుఁ దెలియక పొరఁబడితిని. కాని బ్రహ్మర్షీ! కామాంధకారంబున నీదోషంబున కొడిగట్టలేదు. నాయజ్ఞానము సైఁచి నన్ననుగ్రహింపుము." అని ప్రార్థింపఁగా గౌతముఁ డిట్లు ప్రత్యుత్తరంబిచ్చెను

పడఁతీ! యిక్ష్వాకువంశమందు మహారథుఁడును, మహాతేజస్వియునగు రాముఁడను ప్రసిద్ధనాముఁడు ప్రభవించును మానుషవిగ్రహంబూనియున్న యావిష్ణుమూర్తి బ్రాహ్మణార్థమై యీవనంబున కరుదెంచును. నీవతని నెపుడు దర్శింతువో యపుడ పవిత్రురాలవగుదువు. నీచేఁ గావింపఁబడిన యీదుష్కృతము నాతఁడే పాపఁగలఁడు. నీవాతని కాతిథ్యమొసఁగి వెండి నాయొండకు రాఁగలవు. వరవర్ణినీ! అట్లు రామానుగ్రహ పాత్రురాలవైన పిమ్మట నీవు నన్నుఁగూడి మనఁగలవు. అని చెప్పి యామునిపుంగవుఁడు నిజాశ్రమంబున కరిగెను. బ్రహ్మవాది పత్నియైన యహల్య నినుఁగూడిన పాపంబుకతంబున శిలారూపమును దాల్చి యధికతపంబాచరించెను. అది మొదలుకొని ప్రజ లెల్లరుఁ జక్కఁదనంబుల కిక్కలైరి.

ఇంద్రా! యా మునిశాపంబువల్ల నిదియెల్ల సంభవించెను. మహాబాహూ! నీవు చేసిన యా దుష్కృతమును నొక్కసారి స్మరియింపుము. వాసవా! యా పాపఫలంబుగా నీవు శత్రువుచేఁ జిక్కితివి. కాని యన్యంబునఁగాదు. ఇంద్రా! నీవు సమాహితుఁడవై వైష్ణవ యజ్ఞంబు శీఘ్రంబుగాఁ గావింపుము. దాన నీవు గల్మషంబు దొలంగి త్రిదివంబును జేరవచ్చును. దేవేంద్రా! నీ కొడుకుగూడ రణంబున నిహతుఁడు గాలేదు. అతఁడు మాతామహునిచేఁ గొంపోఁబడి సముద్రజలంబుల సుఖమున్నాఁడు. అన నది విని దేవేంద్రుఁడు వైష్ణవ యాగం బాచరించి తిరిగి తన నాకం బాక్రమించి దేవతల యథారీతిని బరిపాలించెను.

రామా! నా చెప్పిన యింద్రజిత్తు బలమును వింటివిగదా! ఇంద్రునిఁ బట్టి కొట్టిన యాజగజెట్టికిఁ దక్కిన బక్కమానిసుల లెక్క యేమి?

అని వచించిన యగస్త్యులవాక్యంబులు విని రామలక్ష్మణులును, వానర రాక్షసులునుగూడఁ బరమాశ్చర్యంబు నొందిరి. రామపార్శ్వగతుండై యున్న విభీషణుఁడా పల్కులాలించి మునీంద్రా! ఎన్నఁడోకన్న యాశ్చర్యకరమగు నింద్రజిత్పురాతన వృత్తాంతము మాకు స్మృతికిఁదెచ్చి ముదంబొద వించితివి. అన నగస్త్యుఁడు రామునిఁగాంచి రామా! నీ విది యంతయుఁ

గంటివి. వింటివి. దేవేంద్రునంతటివానిని జయించి లోక కంటకుండై యెనఁగు నింద్రజిత్తు తనకుఁ జేదోడు వాదోడుగాఁగా రావణుఁడేరిని జీరికిఁగొనక యుండెను.

అని చెప్పి కుంభసంభవుండైన యగస్త్యుఁడూరకుండెను.

ఇది ముప్పదియవ సర్గము

---

## ము ప్ప ది యొ క ట వ స ర్గ ము.

### రావణుఁడు కార్తవీర్యార్జునుఁ గెలువఁబోవుట.

అంత మహాతేజస్వియగు శ్రీరామచంద్రుఁడగస్త్య మునిచంద్రునకు మ్రొక్కి విస్మయాకలితుండై ద్విజోత్తమా! క్రూరుండైన రావణరాక్షసుఁడు భూలోకంబునఁ బర్యటనంబుచేసెనో యత్తఱి లోకంబు శూన్యమయ్యెనా? గొడ్డుపోయెనా? రాజుగాని, రాజమాత్రుఁడుగాని యయ్యెడ నెవ్వఁడును నెక్కడను లేకుండెనా? ఉన్నచో నాసన్నుఁడైన రావణు నెవఁడేని నదల్చి యెదిర్చిపోరెనా? అక్కటా! రాచఱికంబు బీఱువాఱెనా? రాజులు పరాక్రమ హీనులైరా? నిర్జితులైరా? బహిష్కృతులైరా? అనతీయవేయన విని భగవంతుఁడగు నగస్త్యుఁడు నవ్వుచు బ్రహ్మ యీశ్వరునితోఁ బల్కినట్లు రామునితో నిట్లనియె.

రాజశ్రేష్ఠా! రామప్రభూ! యీరావణుఁడిట్లు రాజులను బాధించుచుఁ బుడమియెల్ల గ్రుమ్మరుచుఁ బావకతుల్య ప్రతాపశాలియగు నర్జునుఁడేలు మాహిష్మతీపురంబున కేఁగెను. అది వహ్నిసాన్నిధ్యము స్వర్గపురసమ ప్రభము శరకుండస్థితపావకమునై విరాజిల్లుచుండెను.

### కార్తవీర్యార్జునుఁడు నర్మదయందు స్త్రీలతోఁ గ్రీడించుట.

రావణుఁడు మాహిష్మతీపురంబున కరిగిననాఁడె 'హైహయాధిపతియు' బలశాలియుఁ, బ్రభువునునైన యర్జునుఁడు జలక్రీడలాడఁ బూఁబోఁడులఁగూడి నర్మదానదికిఁ జనెను. రావణుఁడు హైహయేశునిఁగానక వానిమంత్రులను గాంచి మీరాజగు నర్జునుఁ డెక్కడనున్నాఁడు. త్వరగాఁ జెప్పుఁడు. రావణుఁడ నగు నేను వానితో యుద్ధముచేయ వచ్చితిని. వేగరులగువారు వేగంబుగా నేఁగి నారాక వాని కెఱిఁగింపుఁడు. అని యదలించి పలుక విపశ్చితులగు నా మంత్రులు తమఱేఁడూర లేఁడని యెఱిఁగింపఁ బురజనులవలన నర్జునుఁడు నర్మదానది కేఁగెనని విని యటనుండి మరలిచని, హిమవత్పర్వతంబును బురుడించునదియు, నభ్రంబుగతి మింటెనంటునదియు, భూమిను ద్భేదించి పుట్టినది వలెఁ గన్పట్టునదియు, అంబరంబును ముద్దుఁగొనుచున్నదియు, వేయిశిఖరం

బుల వెలయుచున్నదియు, సింగంబుల కాటపట్టగు గుహలు కలదియుఁ, జఱి యలఁబడుచుండు శీతలజలంబుల యట్టహాసమ్ముగలదియు, స్త్రీలతోఁగూడి విహరించు దేవదానవ గంధర్వాప్సరోరగ కిన్నరులకుఁ గ్రీడారంగమైనదియు, నపరస్వర్గమైనదియు, మహోన్నతమైనదియుఁ, బటికపుఱాలవలె స్వచ్ఛమైన నీళ్లుగల సెలయేళ్లు తటములనుండి జాఱుచుండఁ బడగలువిప్పి నాల్కలు గ్రోయు పాపఱేనివలెఁ జూపట్టునదియు నగువింధ్యధరాధరంబుఁ దఱియఁజని కాంచుచుఁ గదలుచున్న కలువలుగలిగి పడమటికడలిఁ గలియఁబాఱుచు వడదాఁకి డప్పిగొనియున్నదున్నలు సవరపుమెకములు సింగంబులు పులులు ఎలుఁగులు ఏనుఁగులు వడిఁ దననీళ్లల దూఁకి కలఁపఁగా, మత్తిల్లి కోలకోలఁ గూయు జక్కవలు, కొంగలు, అంచలు, నీటికోళ్లు, బెగ్గురులు గలయ నాడుచుండఁగా ఫుల్లద్రుమకృతోత్తంసయు, చక్రవాకస్తనియు, విస్తీర్ణ పులినశ్రోణియు, హంసావళీమేఖలయు, పుష్పపరాగానులిప్తాంగియు, జ్వలత్ఫేనామలాంశుకయు జలావగాహసంస్పర్శయు, నీలోత్పలశుభేక్షణయు, నదీమ తల్లియు నగునర్మదంగని, పుష్పకవిమానంబునుండి సత్వరంబుగ డిగి ప్రియు రాలితోఁ గ్రీడించునట్లు దానినీరంబులఁ దనివుతీర దానమాడి నానాకుసుమ శోభితంబైనదాని రమ్యపులినస్థలంబున సచివులతో సుఖోపవిష్టుండై నర్మదను గంగాస్రవంతిగాఁ బొగడి దాని దర్శించుటచేఁ గలిగిన యానందంబుచే సవిలాసంబుగా నవ్వుచు నమాత్యులగు మారీచ శుకసారణులఁ గాంచి యిట్లనియె.

చూచితిరా! మంత్రులారా! ఈ సూర్యుఁడు తనసహస్రకిరణంబులచే జగంబంతయుఁ గాంచనమయంబుగాఁ జేసియు నిచటఁ గూర్చుండియున్న నాకు వెఱచి, నభస్థలి నాశ్రయించి తీక్ష్ణతాపకరుఁడయ్యు శీతకరుఁడై చెన్నొందుచున్నాఁడు. నాకు జడిసి యనిలుఁడుగూడ నర్మదాజలశీతలుఁడై సుగంధయుతుఁడై శ్రమఁబాపువాఁడై సుఖావహుఁడై మెల్లగా వీచు చున్నాఁడు. నదీమతల్లి యగు నీనర్మదయు నర్మవర్ధనియై లీనమీనవిహం గోర్మియై భయముతోఁగూడిన యంగనవలె నన్ను సేవించుచున్నది. మీరు ఇంద్రతుల్యులగు రాజులతో సమీకంబునఁ బోరి, క్షతగాత్రులై యున్నారు. హరిచందనరసంబువలె మీ గాయంబులనుండి యస్రములు స్రవించినవి. కాన శర్మదయైన యీ నర్మదను మీరు మహాపద్మప్రము ఖంబులగు మత్తగజంబులు గంగానదియందువలె మునకలువెట్టి మీ పాపంబులు తలఁగుఁడు. నేనుగూడ శరత్కాలచంద్రచంద్రికానిభంబగు నీయీయిసుక తిన్నెయందు నీశ్వరునిఁ బూవులుకాన్కగాఁ బెట్టి మెల్లఁగాఁ బూజచేయుదును. అని యిట్లు రావణుఁడు పలుకఁగానె ప్రహస్త శుక సార

ణులును మహోదరధూమ్రాక్షులును నర్మదానదిం జొచ్చి స్నానంబులాడిరి. వామనము అంజనము పద్మము మున్నగు దిగ్గజంబులచే గంగానది కలఁగినట్లు రావణ వారణంబులచే నర్మదానది కలఁకఁబాఱెను. అంత నా రాక్షసమంత్రులు నర్మదాపవిత్రజలంబుల స్నానంబుచేసి గట్టెక్కి రావణునకు శివపూజకై పూవులఁదేర నరిగి క్షణకాలంబులో శుభ్రాభ్ర సదృశప్రభంబై హృద్యంబై నర్మదాపులినభాగంబునఁబూవులు గుట్టలు మెట్టలుగాఁ బోసిరి. మంత్రు లిట్లు పూవులు రాసులుగాఁ బోసినంతనే రాక్షసేశ్వరుఁ డగు రావణుఁడు మహా గజంబు గంగానదిం జొచ్చినట్లు నర్మదానది నవగాహనం బొనరింపఁ జని యందు శాస్త్రోక్తకవిధినిఁదోఁగి, యను త్తమజప్యంబున జపంబుచేసి నర్మదా జలంబులనుండి పైకివచ్చి

## రావణుఁడు శివలింగపూజ చేయుట

తడిబట్టవిడిచి తెల్లనిపాడిబట్టగట్టి శివపూజకై ప్రాంజలియై చనుచుండ మహాబలులైన వానిమంత్రులు మూర్తిమంతంబులగు పర్వతంబులవలె మధురంబుగా నాడుచుఁ బాడుచు వానివెంట నంటిపోయిరి.

రావణు డెచ్చటెచ్చట కరుగుచుండునో నచ్చటచ్చటకు బంగారు లింగంబు గొనిపోవుచుండును. వాలుకావేదిమధ్యంబునం దా లింగంబును స్థాపించి రావణుఁడు అమృతగంధంబులుగలవగు గంధములతోడను పుష్ప ములతోడను బూజించి, సత్పురుషార్తిహరుఁడును, వరప్రదుఁడును, శివుఁడును, చంద్రమరీచి భూషణుఁడును నగు మహాదేవు నర్చించి, యెదుటనిలచి, చేతులు త్రిప్పి యాడి, పాడెను.

ఇది ముప్పదియొకటవ సర్గము

---

## ము ప్ప ది రెం డ వ స ర్గ ము

### అర్జునుఁడు తనభుజములచే నర్మద నడ్డగించుట.

ఏ నర్మదాపులినస్థలంబుల రాక్షసేంద్రుఁడగు రావణుఁడు వామదేవు నకుఁ బూవులుకానుక పెట్టుచున్నాఁడో యాస్థలంబున కనతిదూరంబుననే జయ శీలురలో శ్రేష్ఠుఁడును మాహిష్మతీపతియుఁ బ్రభువునునైన యర్జునుఁడు నారీ మణులఁగూడి జలక్రీడలు సలుపుచుండెను. ఆకాంతారత్నంబుల నడుమనున్న యర్జునుఁడు ఆఁడేనుఁగులమధ్యముననున్న కుంజరంబువలె విరాజిల్లెను. ఆ యర్జునుఁడు తన వేయిచేతుల మేటిబలంబు పరికింపఁగోరి నర్మదానదీవేగంబును దనయన్ని బాహులతోడను నరికట్టెను. కార్తవీర్య భుజాసక్తమైన యానదీ నిర్మలజలంబు ఎదురెక్కి గట్లనురాయుచు నక్రమకర మీన పుష్ప కుశసంస్తర

సహితంబుగా వానకారునందలి వరదవలెఁ బొంగిపొరలెను. రావణపూజఁ జెఱుపఁగా గార్తవీర్యుఁడంపె నేమోయను నట్లా నీటివేగము దశముఖుని పుష్పోపహారమెల్ల గంగపాలుచేసెను.

**నర్మద యెదురెక్కి పాఱి రావణు పూజాద్రవ్యంబుల ముంచుట.**

సగము పూర్తియైన శివపూజా నియమంబునుజూచి రావణుఁడు ప్రతికూలయగు ప్రియకాంతఁ గాంచినట్లు నర్మదనుజూచెను. పశ్చిమాభిముఖంబై సముద్రపుఁ బోటువలె వృద్ధిగాంచునా యేటినీటియురవడి పూర్వదిశాభి ముఖంబగుటయు నందలిపక్షులు బెదరి కలగుండుపడుటయు నది తొల్లిటి స్వభావశాంతిఁ దాల్చి నిర్వికారంగనవలెఁ బొలుపారుటయుఁ గాంచి రావణుఁడు నదీవేగ ప్రభవకారణంబును గనుఁగొనుటకై సద్దుకల్గునట్లుగాఁ గుడిచేతి వ్రేలితో శుకసారణులను రమ్మని సైఁగచేసెను.

**శుకసారణులు నర్మద యెదురెక్కి పాఱుకారణము రావణునితోఁ జెప్పుట.**

రావణు నాజ్ఞగొని యన్నదమ్ములు వీరులునగు శుకసారణులు పశ్చిమాభిముఖులై యాకాశమార్గముగుండ బయలుదేఱి యర్ధయోజన దూరంబుమాత్రంబుచని యక్కడ ఆఁడువారిఁగూడి నీళ్లల వాలాడుచు బృహత్సాలసంకాశుఁడై తోయ వ్యాకులకుంతలుఁడై మదరక్తాంతనయనుఁడై మదనాకారుఁడై భూతలంబున హాటకగిరిని వేయుపదంబుల నిల్పునట్లుగా వేయిచేతులతో నది నరికట్టుచు నరిమర్దనుఁడై సమదవశాసహస్ర పరివృతుఁడగు రాజేంద్రునివలె బాలావరాంగనా సహస్ర పరివృతుఁడై క్రాలు నద్భుతాకారుఁడగు కార్తవీర్యార్జునునిఁగాంచి రావణునియొద్దకు వచ్చి యిట్లనిరి.

రాక్షసేశ్వరా! పెద్ద మద్దిమ్రానునుబోలు నొకరాజు నర్మదానదినిఁ దనకరంబుల నడ్డగించి నిజకాంతలఁగూడి యందుఁ గ్రీడించుచున్నాఁడు. వాని బాహుసహస్రముచే సన్నిరుద్ధజలమై నర్మదానది సాగరోద్గార సంకాశమై మాటిమాటికి నెదురొడ్డి పాఱుచున్నది.

**రావణుఁడు కార్తవీర్యార్జునునితోఁ బోరఁజనుట.**

అని శుకసారణులు విన్నింపఁగావిని రావణుఁడు అతఁడె యర్జునుఁడని యుద్ధలాలసుఁడై యర్జునాభిముఖుఁడై చనుచుండఁ బ్రచండవాయువులు దుమ్ముతోఁగూడి రియ్యురియ్యుమను ధ్వనితో వీచెను మేఘంబు లొక్కుమ్మడి నుఱుముచు రక్తబిందువులు గురిసెను. మహోదర మహాపార్శ్వ ధూమ్రాక్ష శుకసారణులు తోడ రా నంజనప్రభాకలితుఁడైన రావణుఁడుచని, భయంకరమైన నర్మదానదిని ననతిదూరంబునన కాంచెను. అప్పుడర్జునుఁడు

కరేణుసంవృతమైన కుంజరంబువలె స్త్రీజనపరివృతుఁడై రావణుని కంటఁబడెను.

అదికని రాక్షసేంద్రుఁడు రోసంబునఁ గనులెఱ్ఱఁజేసి బలోద్ధతుఁడై కార్తవీర్యుని మంత్రులఁగాంచి గంభీరవాక్యము లిట్లనియె.

అమాత్యులారా ! మీరు శీఘ్రంబుగాఁ జని మీరాజగు హైహయునితో రావణుఁడు యుద్ధార్థియై వచ్చెనని చెప్పుఁడు రావణవాక్యంబు లాలించి యర్జునమంత్రులు సాయుధపాణులై నిలిచి యిట్లనిరి.

బలే రావణా ! బలే ! యుద్ధముచేయు కాలము చక్కఁగా నెఱిఁగితివి ! ఎవఁడు, స్త్రీలఁగూడి క్రీడించుచున్న రాజుతో యుద్ధముచేయ నుత్సహించునో వాఁడు లోకంబున సత్పురుషులచే భ్రూణహత్యచేసినవాఁడుగా గణింపఁబడును. ఆఁడేనుఁగులతోఁ గూడియున్న మత్తమాతంగంబుతో శార్దూలంబు పోరినట్లు స్త్రీలతోఁ నగవెసఁగియున్న యర్జునునితో యుద్ధంబుచేయ నెట్లు వేడుకపడుచున్నావు.

## అర్జున రావణమంత్రుల యుద్ధము.

దశగ్రీవా ! సైరింపుము ! ఈ రాత్రి గడవనిమ్ము. నీవు మాఱేనితో యుద్ధంబుచేయవలతువేని తెలువాత నరుదెమ్ము. ఇప్పుడే నీకు యుద్ధంబుచేయ తలఁపుగలదేని యుద్ధతృష్ణతోఁ గూడికొనియుంటివేని రారమ్ము. ముందు మాతోఁబోరి మమ్ముఁగెల్వుము. పిమ్మట నర్జునిపైఁ గవియుదువుగాని; అనవిని రావణమంత్రులు కార్తవీర్యామాత్యులఁదాఁకిరి. ఆఁకలిగొనియున్న రక్కసిప్రగ్గడలు పార్థివసచివులను భక్షించిరి. అంత నర్మదాతీరమెల్ల హాలహలార్భటులతో నల్లకల్లోలమయ్యెను. బాణములతోడను తోమరములతోడను శూలములతోడను త్రిశూలములతోడను వజ్రకర్షణములతోడను రావణుని వీఁచమణఁచఁగోరి యెల్లయెడలఁ దామెమైపొలుచునర్జునానుయాయులును రావణుమంత్రులును గలియఁబడి పోరిరి.

హైహయాధినాథుయోధుల వేగంబు మొసళ్లు చేఁపలు పెద్ద చేఁపలుగల సంద్రంబు నులివువలె మహాదారుణమైపరఁగెను. రావణుని వజీరులైన ప్రహస్త శుకసారణులు రుషాకలితులై నిజబలంబు దీపింప కార్తవీర్య బలంబునుమాఁడ్చిరి.

రావణమంత్రులు తమ సేనను దహించుటఁగాంచి ద్వారపాలకులు సత్వరంబుగాఁజని నారీఘనులఁగూడి క్రీడించుచున్న యర్జునునకాయుదంతమంతయు నివేదించిరి. క్రీడాసక్తమానసుఁడైయున్న యర్జునుఁడు వారి మాటలు విని భయపడవలదని స్త్రీజనంబునకు ధైర్యంబుచెప్పి గంగాజలంబులనుండి లేచి

వచ్చు నంజనమను దిగ్గజంబువలె నర్మదాతోయంబులనుండి వెడలివచ్చెను. యర్జునపావకుఁడు క్రోధారుణిత విశాలనేత్రుఁడై ప్రళయకాలఘోరపావకుని వలెఁ బ్రజ్వరిల్లెను. హేమాంగదుఁడైన యర్జునుఁడు గడువడిగదగైకొని దివాకరుఁడు చీకటులఁ జోపినట్లు రక్కసుల నుక్కడంచెను.

కార్తవీర్యార్జునుఁడు ప్రహస్తునిఁబడ నడచుట.

బాహువిక్షేపకరణంబును గారుడవేగంబునునైన గదను రయంబుమైఁ గైకొనివచ్చు నర్జునుని భాస్కరుని వింధ్యమాఁగినట్లు ముసలాయుధుఁడును వింజంబువలెఁ జలింపనివాఁడును నగు ప్రహస్తుఁడు మార్గంబుననాఁగి మహోద్ధతుఁడై ఘోరంబును లోహబద్ధంబును నగు ముసలంబును చేతికోలఁదికార్తవీర్యునిపై విసరి మేఘంబుమాడ్కి పేర్చియార్చినవానిముంగట నాముసలంబు నగ్నియశోకపు సిగదండకుదుల్యమై పగతుని వెక్కిరించుచున్నట్లుండెను. తన్నుఁ జెనకవచ్చునారోఁకలిని. గార్తవీర్యార్జునుఁడు గజవిక్రముఁడై గదాపాణియై నిపుణంబుగఁదూలించి, అయిదువందల మూరలపొడువుగల పెనుగదను గిరగిర త్రిప్పుచు బ్రహస్తునిపై కిదూఁకి కడురయంబున గట్టిగాఁగొట్ట నాప్రహస్తుఁడు వజ్రివజ్రంబునఁగూలు మహాపర్వతంబుమాడ్కిఁ బుడమిపైఁబడెను. అట్లు నేలకొరగిన ప్రహస్తునిఁగాంచి మారీచ శుక సారణ మహోదరులు రణరంగమునుండి తలఁగిపాఱిరి. ప్రహస్తుఁ డీల్గుటయు మారీచాదిమంత్రులు పాఱిపోవుటయుఁజూచి రావణుఁడు కనిశరవేగంబునఁజని నృపసత్తముఁడైన యర్జునుఁదాఁకెను.

రావణ కార్తవీర్యార్జునుల గదాయుద్ధము.

సహస్రబాహువగు నాతేనికిని నిరువదికరంబులుగల యారాతుసునకును రోమహర్షణకరంబగు దారుణసంగ్రామంబు ప్రారంభమయ్యెను. ఉప్పొంగు సంద్రంబులవలెఁ బాఁతులు గదిలిన పర్వతములవలెఁ దేజోయుక్తలగు సూర్యులవలె మండుచున్న యగ్నులవలెఁ గరిణికై కలహించు నేనుఁగుల వలె నావుకై పోరాడు నాఁబోతులవలె గర్జిల్లుచున్న మేఘంబులవలె బలోత్కటములైన సింహంబులవలెఁ గోపోద్దీపితులౌ రుద్రయములవలె రావణార్జునులు పరస్పరంబు గదలతో బిట్టుగాఁగొట్టుకొనిరి. వజ్రపుదెబ్బలను బర్వతంబులు సహించినట్లు వారిదువురు నొండొరుల గదల వ్రేటులనోర్చికొనిరి. పిడుగులుపడునప్పు డుప్పతిల్లు ప్రతిధ్వనులవలె వారి గదా ఘాతములధ్వనులు దిక్కుల మాఱుమ్రోఁగెను. అర్జునుఁడు గదతో రావణుఱొమ్మునగులనేసిన నది మెఱుపు నభంబును గాంచనమయంబు గావించి నట్లొప్పెను. అట్లే మాటిమాటికి నర్జునోరస్సున రావణుఁడు వేసినగద మహాపర్వతంబునంబడిన యుల్క

వలె భాసిల్లెను. గదాఘాతంబుల నర్జునుఁడు ఖేదంబు నొందలేదు. రావణుఁడును శ్రమనొందలేదు. బలికిని దేవేంద్రునకుఁబలె వీరిరువురకు సమయుద్ధంబు జరిగెను. కొమ్ములతో గిత్తలు దంతములతో మాతంగములు గ్రుమ్మికొన్నట్లు వారొండొరుఁదాఁకి గదలతో నడిచికొనిరి.

అంతనా మహాయుద్ధమున నర్జునుఁడు తన శక్తికొలఁది యాగదతో రావణుని నడిటొమ్మునఁ గొట్టఁగా నాతనియురంబు వరదానకృతత్రాణం బగుటఁ బగులలేదు. కాని గదమాత్రము బెండువడి క్రిందఁబడి రెండుముక్కలయ్యె.

కార్తవీర్యార్జునుఁడు రావణు బంధించి పురికిఁ గొనిపోవుట.

అర్జునుని గద దెబ్బతిని రావణుఁడు వింటిబద్దమేర వెనుకకుఁజని తూలుచుఁ గూలఁబడెను. అర్జునుఁడు రావణుఁడు విహ్వలుఁడగుట యెఱిఁగి తటాలున నెగిరి గరుత్మంతుఁడు పన్నగంబును బట్టినట్లు వానిని బలవంతంబుగ దన వేయిచేతులతో నొక్కిపట్టి బలిచక్రవర్తిని వామనుఁడువలె బంధించెను. రావణుఁడు బంధింపఁగానే సిద్ధులు చారణలు దేవతలు 'మేలుమేలని' పలుకుచు నర్జునునితలపైఁ బూలవాన కురిసిరి.

పెద్దపులి లేడిని, సింహంబు ఏనుఁగును బట్టినట్లు లర్జునుఁడు రావణునిఁ బట్టి వార్షంబున మేఘంబువలె మాటిమాటికి సింహనాదంబు గావించెను. అంతకుఁ బూర్వము మూర్ఛిల్లియున్న ప్రహస్తుఁడు తెప్పిఱిల్లి యర్జునుని చేఁ గట్టఁబడియున్న రావణునిఁజూచి మండిపడి రాక్షసులఁదోకొని యర్జునునిపైఁ దూఁకెను. అట్లు దూఁకుచున్న రాక్షసుల వేగంబు తొలకరిసమయంబున సముద్రంబునఁ బుట్టు కాఱుమబ్బుల యురవడివలె భాసిల్లెను. విడువిడు. ఆఁగు ఆఁగుము. అని సారెసారెకుఁ బల్కుచు రాక్షసులు రోఁకళ్లు శూలంబులు హైహయునిపై విసరిరి. శత్రుసంహారియగు నర్జునుఁ డించుకేని వెఱవక యమ రారులేయు నాయుధంబులనడుమంతరమందె కడువడిఁబట్టి వానితోడనే వారిని వాయువు మేఘంబులనువలెఁ జెల్లాచెదరు చేసి, రావణునిఁబట్టి స్నేహితులతోఁగూడి బలినిబట్టి స్వర్గంబునఁ బ్రవేశించు సహస్రలోచనునివలె బ్రాహ్మణులు పౌరులు కుసుమాక్షతలు చల్లుచుండ దేవేంద్రవైభవంబుతో మాహిష్మతీనగరంబు చొచ్చెను.

ఇది ముప్పదిరెండవ సర్గము

---

# ముప్పది మూఁడవ సర్గము

## పులస్త్యుఁడు రావణుని విడిపించుకొనుట.

దేవతులు అర్జునుఁడు రావణుని గాలిని మూటగట్టినట్లు గట్టెనని తమలోఁదాము గగనతలంబునఁ జెప్పుకొనుచుండఁగా ధృతిమంతుఁడగు పులస్త్య మునీంద్రుఁడు విని పౌత్రునియందలి వాత్సల్యంబున వణఁకుచు వాయువేగ మనోవేగంబులఁ బోలు గమనంబుతో వాయుమార్గముగుండ మాహిష్మతీ నగరంబున నర్జునునిఁ గానవచ్చి హృష్టపుష్టజనావృతంబై యమరావతీ సంకాశంబై పొల్చునాపురంబును బ్రహ్మవలెఁ బ్రవేశించెను. పాదచారియగు రవినిఁబోలి చండతర తేజో దుర్నిరీక్షుఁడై వచ్చిన యాఋషిరాకఁగాంచి ద్వార పాలురు రాజున కెఱిఁగింప వారి మాటలంబట్టి యావచ్చినవాఁడు పులస్త్యమహర్షి యని తెలిసికొని అర్ఘ్యము మధుపర్కముగొని తన పురోహితుఁడు వెంటరాఁగా నింద్రుఁడు బృహస్పతి నెదురుకొనఁ జనునట్లుగా శిరంబునఁ గరంబులు గీలించి యర్జునుఁ డెదురేగి పులస్త్య బ్రహ్మనుగాంచి, యుదయభాస్కరునివలె వచ్చు చున్నవానికి నింద్రుఁ డీశ్వరున కెఱఁగినట్లుగా సంభ్రాంతుఁడై నమస్కరించి, అర్ఘ్యమును పాద్యము మధుపర్కమును గోవును నొసఁగి హర్ష గద్గదవాక్కుల నిట్లనియె. ద్విజేంద్రా! ఎంతతపంబొనరించినను లభ్యంబుగాని తమ దర్శనంబు నాకు లభించుటఁజేసి నా మాహిష్మతీపురంబు అమరావతికి సాటియయ్యెను. దేవగణంబులచే సతతంబు మ్రొక్కులుగొను మీ పాదారవిందములు మ్రొక్కఁగంటిని. ఇప్పుడు నాకుఁ గుశలంబయ్యె. ఇప్పుడు నానోము ఫలించె. ఇప్పుడు నాజన్మంబు సఫలంబయ్యె. ఇప్పుడు నాతపంబు పండె. ధన్యుఁడ నైతిని.

ఈరాజ్యము, ఈపుత్త్రులు ఈభార్యలు నేను ఎల్లవారము నీవారము. బ్రహ్మర్షీ! తామరుదెంచిన పనియేమి? మేమేకార్య మాచరింపవలయును. సెలవిమ్ము. మాకాజ్ఞాపింపుము. అని ప్రార్థించిన యర్జునునిఁగాంచి పులస్త్య మునీంద్రుఁడు పుత్రులు సుఖులా? భార్యలకు భద్రంబా? ధర్మంబు లుత్తంబు గాదు కదా! అగ్నులు లెస్సలా? భృత్యులు విధేయులేకాదా? అని కుశల ప్రశ్నంబుగావించి యిట్లనియె.

రాజేంద్రా! అంబుజపత్రవిశాలలోచనా! పూర్ణచంద్రనిభాననా! నీవు రావణుని జయించినజగాజెట్టివి. నీబలంబు నిరుపమానంబు. సముద్రం బును, వాయువును వేనికి వెఱచి కదలక మెదలకుండునో యాదుర్జయుఁడగు నాపౌత్రుఁడు నేఁడు నీచే బద్ధుఁడైనాఁడు. వాని కీర్తి పూర్వము నీచేఁ గ్రోలఁబడినది. నీకీర్తి దశదిశల వ్యాపించినది. నాయనా! నిన్ను నేను యాచించుచున్నాను. నామాటవిని మావదశాననుని విడిచిపెట్టుము. అని యడిగిన

పులస్త్యుల యాజ్ఞ శిరసావహించి యర్జునుఁడు మాఱుమాటాడక రావణుని సంతోషపూర్వకంబుగా విడిచిపుచ్చి బ్రహ్మపుత్త్రుఁడైన యాపులస్త్యుఁ డామునీంద్రుని దివ్యమాల్యాంబరాభరణాదులచేఁ బూజించి, మ్రొక్కి, అగ్నిసాక్షికంబుగా రావణుతో సహింసాత్మకమైన సఖ్యంబు నెఱపి మునియొద్ద సెలవుగైకొని యింటికిఁ జనెను. పులస్త్యుల పుణ్యమాయని విడుగరగాంచిన ప్రతాపవంతుఁడగు రావణుఁడు ఋషిచంద్రునిచేఁ గౌఁగిలించుకోఁబడి పూజ్యపాదులగుఁ దాతగారికి నాతిథ్య మొసఁగి లజ్జాభరంబున మొగము ముడుచుకొని లంకకుఁ జనెను. బ్రహ్మపుత్త్రుఁడైన పులస్త్యమునిపుంగవుఁడును రావణు నట్లు విడిపించి బ్రహ్మలోకంబునకుఁ జనెను. రామచంద్రా! రావణుఁ డట్లు కార్తవీర్యునిచే బద్ధుఁడై పులస్త్యుల వచనంబులఁ దిరుగ విడుదలఁగాంచెను. గుణభద్రా! రామభద్రా! ఇట్లే లోకంబున బలవంతులగు వారికంటె బలవంతులుందురు. ఆత్మాభివృద్ధిఁ గోరువాఁడెవ్వఁడును నొరుల కవజ్ఞ చేయఁడు. పిమ్మట నారాక్షస రాజగు రావణుఁడు సహస్రబాహువైన కార్తవీర్యార్జునుని మైత్రిఁబొంది తిరిగి రాజులతోఁ గదనంబు చేయ గర్వంబునఁ గన్నుగానక పృథివీచక్రమెల్లఁ గ్రుమ్మరుచుండెను.

ఇది ముప్పదిమూఁడవ సర్గము

---

## ము ప్ప ది నా ల్గ వ స ర్గ ము

### రావణుఁడు వాలితో యుద్ధంబుచేయఁ గిష్కింధకుఁ బోవుట.

అర్జునునిచే విడువఁబడిన రాక్షసాధిపుఁడైన రావణుఁడు అంత లవమానంబులు పొందియు నిర్విణ్ణుఁడు గాక సిగ్గులేక, తలయెత్తి భూమండలమునం దెల్లఁ దిరుగఁజొచ్చెను. రాక్షసుఁడుగాని మానవుఁడుగాని బలాధికుఁడున్నాఁడని విన్నఁజాలు వానియొద్దకేగి చివ్వకురమ్మని కావరంబునఁ బిల్చెడువాఁడు. అంత నొక్కనాఁడు వాఁడు వాలిపాలించు కిష్కింధానగరంబున కరిగి హేమమాలియైన వాలిని యుద్ధమునకు రమ్మనిపిలిచెను. వాలి మంత్రియు ప్రభువును దారాజనకుఁడును నైన తారుఁడు యుద్ధార్థియై వచ్చిన రావణున కిట్లనియె.

రాక్షసేంద్రా! నీకు బలంబున సాటియగుమేటి వాలి యూరలేఁడు. ఆ వానరుఁడు తక్క నన్యుఁడు నిన్నెవ్వఁడు ప్రతిఘటింపనోపును ?

రావణా! వానరశ్రేష్ఠుఁడును హేమమాలియునగు వాలి సంధ్యావార్చ నాల్గుసముద్రములకు నేఁగెను. ఇప్పుడే వచ్చును. మహాకూర్తకాల మాఁగుము. రాజా! వారితో పనిచేయవచ్చి చచ్చినవారి యీయెముకల ప్రోవు

లను జూడుము! శంఖంబులవలెఁ దెల్లఁగా నెల్లు ప్రకాశించుచున్నవో! రాక్షసాధిపా! నీవేమేని అమృతము త్రాగివచ్చితివా? వాలినిఁదాఁకునంతవఱకే నీజీవితము! పిమ్మట సున్న. రావణా! ఇప్పుడీ జగచ్చిత్రమును జూడుము. రెండుగడియలసేపు నిలువుము. ఈక్షణము దాఁటిన నీమనుగడయె దుర్లభము. అట్లు గాక యిప్పుడె చావఁగోరుదువా దక్షిణసాగరమునకుఁ బొమ్ము. అక్కడ భూమిపైఁ జరించు భాస్కరునివలె వెలుఁగు వాలినిఁ జూడఁగందువు అని పలికిన తారుని దూఱి యంజనాచలసన్నిభుఁడును రాక్షసేశ్వరుఁడును నగు రావణుఁడు పుష్పకవిమానము నెక్కి దక్షిణ వారినిధికిఁ జని, యచ్చట హేమాద్రితుల్యుఁడును, తరుణార్కనిభానుఁడును సంధ్యోపాసనాతత్పరుఁడును నైన వాలినిఁగాంచి, పుష్పకమునుండి దిగి, రయంబున వానినిఁబట్ట నెంచి, యడుగుల చప్పుడుగాకుండఁ బరువిడుచుండ వాలియు యదృచ్ఛమై నెట్టులో పాపాభిప్రాయుఁడగు నారావణునిఁజూచి తన్నుఁగాదనునట్లు తొట్రువడక యట్టెనిలిచెను. కుందేలును గాంచిన సింహమువలె పామునుగన్న గరుత్మంతునివలె వాలి పాపనిశ్చయుఁడైన రావణుని సరకుచేయక నన్నుఁ బట్టఁదలంచి వచ్చిన పాపబుద్ధియగు నీరావణునిఁ జంక నిఱికించికొని గరుఁడుని ముక్కునుండి వ్రేలు సర్పంబువలె వీఁడు నాచంకనుండి కాళ్లు చేతులు వ్రేలవైచి బట్టజాఱి విడిచి వ్రేలాడుచుండఁగా మూఁడు సముద్రముల మునుంతునుగాక'' యని మనంబునఁ దలఁచి, మౌనమువహించి, నైగమమంత్రముల జపించుచుఁ బర్వతరాజువలె నచలుఁడై యుండెను. అత్తఱి నాబలదర్పితులైన వానర రాక్షసు లిరువురు నొకరినొకరు పట్టుకొనవలయునని జతనంబులు చేయుచుండిరి.

## వాలి రావణుఁ జంక నిఱికి సముద్రముల ముంచుట.

అడుగుల చప్పుడునుబట్టి రావణుఁడు చేఁజిక్కెనుగా తలంచి వాలి పరాఙ్ముఖుఁడై యుండియు గరుత్మంతుఁడు పామును బట్టినట్లు తన్నుఁబట్టవచ్చిన యారావణునిఁబట్టి చంకను వ్రేలాడఁజేసి ద్రుతగతి నాకసంబున కెగిరి, గోళ్లచేఁ దన్ను మాటిమాటికి గీఱుచున్న వానిని వాయువు మేఘంబునుబలెలాగు కొనిపోవుచుండఁగా నంతలో రావణమంత్రులు తమయేలిక యవస్థఁగాంచి వానిని విడిపించువారై యఱచుచు వాలి వెంటఁబడఁగా మేఘములచే వెంబడింపఁబడిన మింటమెఱయు సూర్యునివలె నాతఁడు విభ్రాజిల్లుచుఁ జనుచుండ వారువానిని ఎయిదలేక వానిచేతులయుఁ దొడలయు వేగమునకు నలసినిలిచిపోయిరి. అవ్వాలిచనెడు మార్గంబుననున్న పర్వతేంద్రములు గూడ వానిధాకకాఁగలేక తెరువిచ్చి తొలఁగుచుండ రక్తమాంసమయ జీవుల

మాట వేఱచెప్పనేల? మహావేగుఁడైన వానరేంద్రుఁడు పక్షిగణములుగూడ తన్నుఁగూడలేనంత వడిగాఁబోవుచుఁ గ్రమముగా వారాన్నిధులనెల్ల సంధ్యోపాసననెఱపి, ఖేచరులెల్లఁ బొగడుచుండ రావణునిఁ జంకనిడుకొనియె పడమటి కడలికరిగి యందుఁ గ్రుంకి, సంధ్యవార్చి, జపముసలిపి, రావణుని వహించి యుత్తరసాగరమువఱకుఁజని సంధ్యావందనమునొనరించి రావణునిఁ బూనియె గాలివ్రాలె నెన్నోవేలయామడలు పయనంబుగావించి తూర్పు పాథోధికిఁజని యచ్చటఁగూడ సాంధ్యకృత్యముదీర్చి, రావణభార వహనంబునఁ జేసి యశ్రాంత పరిశ్రాంతిఁగాంచి, తిరిగివచ్చి కిష్కింధోపవనంబున డిగి చంకనుండి రావణుని విడిచి ఓహో రావణా! నీవా? ఎప్పుడు వచ్చితివి? చూడలేదే? యని పరిహాసించెను.

## రావణుఁడు వాలితో స్నేహము చేయుట.

అది విని కని రావణుఁడు తద్దయు విస్మయంబుచెంది, యలసటచే గ్రుడ్లు తేలవైచి, వాలితో నిట్లనియె.

వానరేంద్రా! మహేంద్రాభా! నేను రాక్షసేశ్వరుఁడను, రావణుఁడను, నీతోఁ గలహము గోరివచ్చి నీకుఁ జిక్కితిని. ఓహో! యేమి నీబలము! ఔరా! యేమి నీవీర్యము! మాయురే! యేమినీగాంభీర్యము! నన్నొక పసరంబువలెఁ జంకనిఱికించుకొని కంధిచతుష్కంబున ముంచితెచ్చితివి. ఇంచుకేని గాసిఁజెందవైతివి. నిన్ను మీఱు వీరు నేనెందునుఁ గనలేదు.

వానరోత్తమా! మనస్సు, వాయువు, గరుత్మంతుఁడునను నీమూఁడు భూతములకే యిట్టి వేగంబుగలదు. నీకేగలదు. ఇందు సందియంబులేదు. ప్లవంగపుంగవా! నీబలంబు నెఱింగితిని. నీతో సుస్నిగ్ధంబైన చిరసఖ్యంబును అగ్నిసాక్షికంబుగాఁ గోరుచున్నాను.

వానరేంద్రా! భార్యలు పుత్త్రులు పురము రాష్ట్రము భోగములు వస్త్రములు భోజనములు సర్వము పంచికొనక కుడిచి జీవింతము. అని రావణుఁ డాడఁగా రగిల్చిన యగ్నిచెంత నా నగచరనిశాచరవరులిరువురు నొండొరులఁ గాగిలించుకొని, సౌభ్రాత్రంబు వెలయించికొని సంతసంబున చేయి చేయి పట్టుకొని సింహంబులు గిరిగుహం జొచ్చినట్లు కిష్కింధానగరంబు ప్రవేశించిరి. అచ్చట రావణుఁడు సుగ్రీవునివలె నొకనెల వసియించి నంత లోకకంటకులగు వాని మంత్రులువచ్చి పయనంబుకమ్మన ముల్లోకంబుల నేపఁగడఁగి యాతఁడు అచ్చోటువీడిచనెను. ప్రభూ, శ్రీరామచంద్రా! ఇది తొల్లిటికథ. రావణుఁడు తొలుత వాలిచేఁ దిరస్కరింపఁబడి పిమ్మట నగ్నిసన్నిధిని భాతృత్వము నెఱపి

కొనెను. రామా! వాలి బలంబు అనుత్తమము. అనుపమము. అట్టివాలి యగ్నిలోఁబడ్డ మిడుతవలె నీచేదగ్ధంబు గావింపఁబడెను.

ఇది ముప్పదినాలుగవ సర్గము

---

## ముప్పదియైదవ సర్గము.

### శ్రీరాముఁడగస్త్యుని హనుమంతునిఁగూర్చి ప్రశ్నించుట.

అప్పుడు రాముఁడు ప్రాంజలియై దక్షిణాశాశ్రయుఁడైన మునినిఁ గాంచి, వినయోపేతుఁడై యర్థవంతంబులగు వాక్యంబుల నిట్లనియె.

స్వామీ! వాలియు రావణుఁడును సాటిలేని మేటిబలవంతులయ్యు హనుమంతునకు సాటిగారని నామదికిఁ దోఁచుచున్నది. శౌర్యము దాక్ష్యము బలము ధైర్యము ప్రాజ్ఞత నయసాధనము విక్రమము ప్రభావముననునివి హనుమంతునియందు నెలకొనియున్నవి. మహోదధినిఁగాంచి విచారపడుచున్న కపిసేన నోదార్చి మహాబాహువైన హనుమ శతయోజనవిస్తీర్ణముదాఁటి లంకాపురిని ధర్షణముచేసి రావణాంతఃపురంబు శోధించి సీతనుగాంచి మాట్లాడి యోదార్చెను. దళవాయులను మంత్రిపుత్త్రులను అడియరులను (సేవకులు) రావణపుత్త్రుఁడైన యక్షుని ససహాయుఁడై పొలియించెను. బంధవిముక్తుఁడై రావణునితో మాట్లాడి యగ్ని భూమిని గాల్చినట్లు లంకను భస్మంబుచేసెను. సంగరంబున హనుమానుఁ డొనర్చిన సాహసకృత్యములు కాలుఁడుగాని విబుధపాలుఁడుగాని గరుడవాహనుఁడుగాని నరవాహనుఁడుగాని యొనర్చెనని కనిగాని విని గాని యెఱుఁగము. ఈతని బాహువీర్యముచేతనే కదా! లంకను గెల్చి సీతను లక్ష్మణుని బ్రతికించుకొని, జయంబుగాంచి, రాజ్యంబున మిత్రబాంధవులతో నలరఁగంటిని. వానరాధిపతికి స్నేహితుఁడగు హనుమంతుఁడే లేనిచో సీతావృత్తాంతము నారసివచ్చు శక్తుఁడెవ్వఁడున్నాఁడు? హనుమంతుఁడు సుగ్రీవుని మేలుఁగోరుచు నాతని యొద్దనేయుండి వానికి వాలికిని వైరంబు సంభవిల్లినప్పుడేల పొదను దావాగ్నివలె వాలిని దహింపలేదు. తన ప్రాణసఖుఁడును వానరాధిపుఁడునైన సుగ్రీవుఁడు కష్టపడుచుండుటఁగాంచి యూరకొనుటఁజూడ హనుమంతుఁడు తనబలము తానెఱుఁగఁ డని తలంచెదను. భగవానుఁడా! మహామతీ! దేవపూజితా! యీ హనుమంతుని తత్త్వంబునెల్ల యథావిధంబుగా సవిస్తరముగాఁ నాకుఁజెప్పుము!, అని యడిగిన రాఘవుని సహేతుకంబగు వాక్యంబువిని ఋషిచంద్రుఁడు హనుమంతుని సమక్షమందె యిట్లు చెప్పెను. రఘుశ్రేష్ఠా! నీవు చెప్పినదెల్ల సత్యము. బలమందుఁగాని విద్యయందుఁగాని వేగంబునందుఁగాని బుద్ధియందుఁగాని హనుమంతునకు

నీడగువాఁడేడను నీరేడులోకంబులలేఁడు. తొల్లి ఋషితల్లజులొసంగిన యమోఘశాపంబుకతంబున బలవంతుఁడయ్యు అరిమర్దనుఁడయ్యు నితఁడు దన బలంబుఁ దానెఱుఁగఁడు.

రామా! మహాబలా! బాల్యమునఁ జేసి యీతండు చిన్ననాఁటఁ దన చేసిన ఘనకార్యంబు నెఱుఁగడు. ఆశక్తి వర్ణింపనేరికిని సాధ్యంబుగాదు. రామా! ఆచరిత్రంబువిన నీకు కుతూహలంబుగలదేని సావధానమతివై వినుము; చెప్పుచున్నాను.

## ఆంజనేయోపాఖ్యానము.

సూర్యుని వరంబునఁ జేసి స్వర్ణకాంతులనీను సుమేరువను పర్వతంబొకండుకలదు. అందు హనుమంతుని తండ్రియగు కేసరి రాజ్యంబు సేయుచుండెను. వానికి అంజనియను నిష్టభార్యకలదు. ఆమె వాయుదేవునివలన హనుమంతుఁడను నీయుత్తమ సుతునిఁగనెను. వరిముల్లువంటి వన్నెగల యీ సుతునిఁగాంచి అంజనాదేవి ఫలములుగొని తేర నడవికేఁగెను. ఈతఁడు తల్లి విడిచిచనుట సహింపలేక యాఁకలిపెల్లునఁ బీడితుండై తెల్లువనంబునందలి నిసుంగువలె బావురని యేడ్వసాగెను. అంతదాసనపుఁబూవువొలె మెఱయుచు నుదయించుచున్న సూర్యునిఁగాంచి ఫలభ్రాంతిచే నెగిరెను. బాలార్కునిఁబోలిన మూర్తిగల యీబాలుఁడు బాలార్కాభిముఖుఁడై బాలార్కునిఁ బట్టఁగోరి యంబరమధ్యంబునఁ జనుచుండ దేవదానవయక్షులు కడుంగడు విస్మయంబునొందిరి. ఈవాయుపుత్రుఁ డాకసంబున నెగిరినట్లు వేగవంతులైన వాయువుగాని, గరుడుఁడుగాని, వామనుఁడుగాని యెగురఁజాలరు. చిన్నతనంబునందే యింతటి వేగవిక్రమ శక్తులుగల్గిన యీతనికి యావనంబున నెంతటి బలంబును వేగంబును గల్గునోగదాయని యెల్లరు విస్మయంబు నొందసాగిరి.

అట్లెగిరి చనుచున్న తనపుత్రుని వెంబడించి వాయుదేవుఁడు ప్రొద్దు వేఁడిమికిఁ గొడుకు మాఁడకుండునట్లు తుంపురులచేఁ జల్లదనంబుగూర్చుచు రక్షించుచుండెను. ఆంజనేయుఁడు బహుయోజనసాహస్రంబునుదాఁటి చని తండ్రిబలంబువలనను తనబాల్యంబుకతంబునను సూర్యునిచెంత కరిగెను. ఇతఁడు పసిపాప. అన్నెము పున్నెము నెఱుంగఁడు. వీనివలన ఘనకార్యంబులు గానున్నవి. అనితలంచి సూర్యుఁడు వీనిని దహింపఁడయ్యెను. ఏనాఁడీతండు సూర్యునిఁ బట్టనేఁగెనో యానాఁడే రాహువు భాస్కరుని గ్రసింపనెంచెను. రామా! హనుమంతునిచేఁ జంద్రార్కమర్దనుఁడగు రాహువు సూర్యరథోపరి భాగంబుననుండి తఱుమఁబడి భయంబునఁదలంగి పాఱి యింద్రభవనంబున

కేఁగి దేవగణంబులతోఁ గూడినవానిం దర్శించి మోమున గంటువెట్టుకొని బొమముడిపాటుతో సరోషంబుగా నిట్లనియె. వాసవా! వృత్రబలారి! తొల్లి చంద్రసూర్యులను నాకు ఆఁకలిదీర్చుకొన నొసంగి యిప్పుడు మఱియొకని కేలయిచ్చితివి. ఈపర్వకాలంబున నేను సూర్యునిఁ బట్టఁబోయితిని. పులిమీఁదఁ బుట్రయన్నట్లు మఱియొక్క రాహువేతెంచి సూర్యునిఁబట్టుకొనెను. ఇంద్రుఁడా రాహుప్రార్థనంబాలించి సంభ్రమాన్వితుఁడై యాసనంబునుండి లేచి స్వర్ణమాలికను ధరించి కైలాసనగంబున కద్దియగునదియు, మదజలంబును గార్చునదియు, సింగారమ్ములకిక్కయైనదియు, నెత్తైనదియు, బంగరు గంటల యట్టహాసంబు గలదియునగు చౌదంతినెక్కి రాహువును మున్నిడుకొని సూర్యాంజనేయులున్న యెడకుఁ జనెను. రాహువు దేవేంద్రునివిడిచి యతి వేగంబుతో ముందరుదెంచెను. శైలకూటంబు వ్రాలెనట్లు పరుగిడివచ్చుచున్న రాహువును హనుమంతుఁడుగాంచి సూర్యునివిడిచి వానినే ఫలమనియెంచి గ్రహింపఁ దిరిగి యాకసంబున కెగిరెను. రామా! సూర్యునివిడిచి తన్నుఁబట్టఁ బఱతెంచివచ్చుచున్న వానరునిఁగాంచి రాహువు వెనుకకుఁదిరిగి ముఖశేషుఁడై పరాఙ్ముఖుఁడై యింద్రునే రక్షకునిగాఁ దలంచి యింద్రా! రక్షింపు ఇంద్రా! రక్షింపు మని భయభ్రాంతుఁడై వేమాఱులఱచెను. అట్లాక్రోశించు రాహువు స్వరంబును ముందుగనే విని గుఱుతించి యింద్రుఁడు భయపడకుము రాహూ! భయపడకుము. ఏను వీనిని బరిమార్తును. అని పలుకుచున్నంతలో నాంజనేయుఁ డైరావతంబునుగాంచి తొంటిఫలంబునకంటె పెద్దదనియెంచి దానిపై కెగిరెను. అట్లు ఐరావతంబుఁ బట్టఁగోరి పరువిడివచ్చు నాంజనేయుని రూపము వెలుంగుచున్న యింద్రాగ్నులమాడ్కి భయంకరంబుగాఁ దోఁచెను. అట్లు పరువిడివచ్చు హనుమంతుని శచీపతి నాతిక్రుద్ధుఁడై ముంజేతం గీలించిన కులిశంబునఁ గొట్టెను. ఇంద్రవజ్రాభితాడితుఁడై హనుమంతుఁ డొకపర్వతం బునం బడెను. దానంజేసి వానియెడమ హనువు భగ్నంబాయెను.

### వాయునిరోధంబున లోకంబులు బాధపడుట.

ఆ వజ్రపుదాఁకున విహ్వలుఁడైన కొడుకునుగాంచి పవనుఁడింద్రున కలిగి ప్రజలకు హానింజేయఁదలఁచి ప్రజాంతర్గతంబగు తన ప్రచారంబు చాలించి కొడుకును జేకొని యొక గుహలోఁ బ్రవేశించెను. ఇంద్రుఁడు వర్షంబునాఁపి యెల్లప్రాణులఁ గారించునట్లతఁడు సకల ప్రజా మలమూత్రా శయంబుల నిరోధించి యుచ్ఛ్వాస, నిశ్వాసములనరికట్టి కీళ్లుసడలించి, కొయ్యబాఱఁజేసెను. వాయుప్రకోపంబున వేదాధ్యయనంబు నిలిచిపోయెను. జన్నం బులు బన్నంబునొందెను. హోమంబులు రామంబులు గావయ్యెను. కర్మం బులు నిలిచిపోయెను. ధర్మంబులు స్తంభమయ్యెను. ముల్లోకంబులును నరకంబుగ

నున్నట్లుల్లాడెను. అంత ప్రజలు గంధర్వులు దేవతలు, మహోదర సమానోదరులై దుఃఖితులై సుఖంబుఁగోరి బ్రహ్మయొద్దకుఁ బరుగిడి మ్రొక్కి యిట్లనిరి. భగవానుఁడా! ప్రజానాథా! నీవు ప్రజలను నలుతెగలుగా సృజియించి మాయాయువులకు నీవాయువును బతిగాఁ జేసితివి. అతఁడే కారణంబుననోగాని మా ప్రాణంబుల కీశ్వరుండయ్యును నిప్పుడు అంతఃపురస్త్రీవలె నిరోధించి మాకూపిరాడ నీయకున్నాఁడు. పవనోపహతులమై మేమిత్తఱి నిన్ను శరణంబుసొచ్చితిమి. వాయునిరోధంబునలని దుఃఖంబు తొలగించి మమ్ముద్ధరింపుము. అనివేఁడగాఁ బ్రజాపతి విని వాయువు నిలిచిపోవుటకుఁ గారణంబు యోచించి తిరిగి యిట్లనియెను. ఏ కారణంబున వాయువు కోపించెనో? నిలిచిపోయెనో? అదియంతయుఁ బ్రజలారా! వినుఁడు. అది మీరువినఁదగినది. దేవేంద్రుఁడు రాహువుమాటవిని వాయుపుత్రుని వజ్రాయుధముచేఁ గొట్టి వాయువునకుఁ గోపంబొడఁగూర్చెను. ఆ వాయువు తానశరీరుండై శరీరులం బాలించుచుం దిరుగుచుండును. వాయువులేనిశరీరము కొయ్యఁబాఱును. వాయువే ప్రాణములు, వాయువేసుఖము. వాయువే యీ సర్వజగత్తు. వాయువులేనిదే సుఖంబులేదు. ఇప్పుడే జగత్తునకెల్ల నాయువైన వాయువు మిమ్ములవిడిచెను. మీరెల్ల నూపిరాడక కొయ్యవలె, గోడలవలె నున్నారు. మీకిట్టి రోగంబు నాపాదించిన వాయువున్నయెడ కరుగుదుమురండు. ఆదిత్యులారా! అతని యనుగ్రహంబునకుఁ బాత్రంబుగాక వినాశంబుపొందఁదగదు. అని బ్రహ్మ దేవగంధర్వ భుజంగ గుహ్యకులతోఁగూడి, సురేంద్రాభిహతుండై యున్న సుతుంగూడియున్న వాయుభట్టారకుఁ డున్నయెడకుంబోయెను. అంత నగ్నికాంచన నిభప్రభాయుతుండగు కొడుకును దొడపై నిడుకొనియున్న సదాగతినిఁగాంచి చతుర్ముఖుం డనుగ్రహించెను.

ఇది ముప్పదిమైదవ సర్గము

---

## ముప్పదియాఱవ సర్గము

### బ్రహ్మాదులు హనుమంతునకు వరంబు లిచ్చుట.

అంత జతురాననుు రాకఁగాంచి సదాగతి కొడుకునెత్తుకొని గ్రక్కున లేచి, నిలిచి సుతార్తితప్తుఁడై చలత్కుండలమాళియు ప్రక్తపనీయవిభూషణుఁడునై యనంతశక్తియుక్తుఁడగు బ్రహ్మపాదారవిందములకుఁ ద్రికరణశుద్ధిగా ముమ్మాఱు సాష్టాంగనమస్కారంబులు గావింపఁగా దేవుఁడైన పితామహుఁడు వాయువును లేవనెత్తి, వేదము లెఱింగినదియు లంబమానంబులగు నాభరణంబులచేఁ బ్రకాశించునదియు నగు నిజహస్తంబున శిశువును

నిమిరెను. అట్లు బ్రహ్మ సవిలాసంబుగా నిమిరి నంతనే జలసిక్తంబగు సస్యంబుమాడ్కి నా శిశువు పునర్జీవితుఁడయ్యెను. కొడుకు జీవించుటఁగాంచి గంధవహుఁడు మోదంబొంది, యథాపూర్వంబుగా నెల్లప్రాణులయందు నిరాతంకముగా సంచరింపఁదొడఁగెను. వాయుబాధనుండి విముక్తులై ప్రజలు శీతవాతవినిర్ముక్తములైన యంబుజములతోడి తామరతూఁడులవలె మోదంబునొందిరి. అంతఁ ద్రియుగ్మములు గలవాఁడును త్రికకుదములుఁ గలవాఁడును త్రిధామములు గలవాఁడును త్రిదశార్చితుఁడును దేవదేవుఁడు నునైన బ్రహ్మ కరువలికి మేలుచేయఁగోరి యిట్లనియె. ఓమహేంద్రేశ, వరుణ, ప్రజేశ, ధనేశ్వరులారా! మీరందఱు నెఱింగియున్నను మీకొక హితంబుప దేశించెద వినుఁడు. ఈ వాయుసుతుఁడు భవద్భావికార్యంబు దీర్పఁగలఁడు. కాన సమీరునకు సంతుష్టిగలుగునట్లు మీరెల్ల నీశిశువునకు వరంబు లొసఁగుఁడు. అని విరించి పలుకఁగానే శుభాననుఁడగు సహస్రనయనుఁడు ప్రీతి యుక్తుఁడై వాయునందనునకుఁ దామరపూలదండ నొసంగి, 'నాచే వ్రేయఁబడిన వజ్రహతిఁజేసి యీతనిహను విట్లు దెబ్బతినెను. ఇఁకమీఁద నీకపిశ్రేష్ఠుఁడు హనుమంతుఁడను పేరం బ్రఖ్యాతిఁగాంచును.' ఇంతేకాదు. మఱొక్కవరముకూడ వీనికొసఁగుచున్నాను. ఇదిమొదలీతఁడును వజ్రపు దెబ్బచే మృత్యువును బొరయకుండునుగాక! అని వరంబొసఁగెను. పదపడి చీఁకటులు పోకార్చు భగవానుఁడగు మార్తాండుఁడు నా తేజంబున శతాంశము వీనికిచ్చితిని. మఱియు నితఁడు శాస్త్రములుచదవు వయసువాఁడుకాఁగానే వక్తయగునట్లుగా శాస్త్రముల నేర్పెదను. శాస్త్రధర్మనమున వీనితో సదృశుఁడు మఱొక్కఁ డుండఁబోడు అని వరంబు ప్రసాదించెను. అది విని వరుణుఁడు వీఁడు నాపాశంబులఁగాని నీళ్లచేఁగాని వర్షాయుతశతంబునకైన మృతినొందఁడు. అని వరమిచ్చెను. అది విని యముఁడు కాలదండంబునఁ జావులేమియు అరోగతయు జన్యంబున విచారంబెఱుఁగక నిత్యసంతుష్టుఁడై నెగడుటయు వరంబులుగా ననుగ్రహించెను. అనంతరము తనగదచే రణంబున నాతఁడు చావకుండునట్లు వరదుఁడును నేకాక్షిపింగలుఁడును నగు కుబేరుఁడును, తనవలనఁగాని తన యాయుధములవలనఁగాని మరణము సంభవింపకుండునట్లు శంకరుఁడును వరంబులీయ సర్వబ్రహ్మదండములకు నవధ్యుఁడై దీర్ఘాయుష్మంతుఁడై మహాత్ముఁడై మనునట్లు బ్రహ్మవరంబు నిడినంత శిల్పిప్రవరుఁడును మహామతియునైన విశ్వకర్మ దివ్యములైన తనశరంబులచే సంయుగమున మడియకుండుటయుఁ జిరాయువును గలుగుఁగాతమని వచించెను. అంత సంతుష్టమానసుఁడై జగద్గురువగు చతుర్ముఖుఁడు సురవరాలంకృతుఁ డగు శిశువునుగాంచి వాయుభట్టారకునితో నిట్లనియె.

మారుతా ! నీ పుత్త్రుఁడైన మారుతి అమిత్రులకు భయంకరుఁడును మిత్రులకు అభయంకరుఁడును యుద్ధంబున నజేయుండునునై రావణ నాశకరములు రామప్రీతికరములు రోమహర్షప్రదములునగు కార్యములు యుద్ధమునఁబొనర్పఁగలఁడు అని యివ్విధంబున నాశీర్వదించి గంధవహునామంత్రించి యమరులందఱితోఁగూడి పితామహుఁడువచ్చిన దారిని నిజనివాసంబున కరిగెను. ఆ వాయుదేవుఁడుగూడ దత్తవరుఁడగు పుత్త్రుని దీసికొని యింటికివచ్చి యంజనాదేవికి జరిగిన వృత్తాంతమెఱింగించి యెందేనిఁజనియె.

## మునులు హనుమంతుని శపించుట.

రామా ! వరములబలిమి కలిమి వానరపుంగవుఁడగు నాంజనేయుఁడు సముద్రమువలెఁ బొంగి పొరలుచు నిర్భీకుఁడై ఋషులయాశ్రమంబులను జొచ్చి స్రుక్స్రువ భాండములఁ జితుకఁగొట్టి, యగ్నిహోత్రములనార్పి, వల్కల వితానంబులను జించి, యాసంయముల శాంతికి భంగంబు వాటిల్లఁజేసెను. ఆ మహాబలుఁడు శంభువరంబున సర్వబ్రహ్మదండములకు నవధ్యుఁడగుటనిట్లే పెక్కుపనులొనర్చెను.

ఋషిచంద్రులు బ్రహ్మవరంబెఱింగిన వారగుట శక్తిగల్గియు వాని యపరాధములుసైఁచి శాంతము దాల్చియుండిరి. వానిదుడుకుచేతలు విని తలిదండ్రులగు నంజనాకేసరులు మందలించినను వాఁడు హద్దుమీఱిచరించుచుండెను.

రఘుప్రవరా ! అంత భృగ్వాంగిరసవంశసంజాతులగు మునులత్యంతము కోపింపక మన్యువునూనక ప్లవంగమా ! యేవరబలంబుకలిమిని మమ్ము నీవు బాధించుచున్నావో యాబలంబు మాశాపంబునఁజేసి పెద్దకాలంబునకుఁగాని యెఱుంగకుందువుగాక. నీ కీర్తి యెప్పుడు పొగడఁబడునో యప్పుడు నీ బలము వృద్ధినొందఁగలదు. అని శపించిరి. అంతఋషివాక్తేజస్సుచే నైజతేజంబు కుంటువడ హనుమంతుఁడు ఆశ్రమపథంబుల మృదుభావంబున మెలఁగఁ జొచ్చెను. పదంపడి భాస్కరసమతేజుఁడును వాలిసుగ్రీవులకుఁ దండ్రియునగు ఋక్షరజుఁడనువాఁడు వానరులకెల్ల రాజై యుండెను. రామా ! అతఁడు చిరకాలము రాజ్యముచేసి కాలధర్మమునొందెను. అతఁడు మృతినొందఁగానె పితృపదమున వాలియు వాలిపదమున సుగ్రీవుఁడును మంత్రకోవిదులైన మంత్రులచే నభిషిక్తులైరి. అద్వైధంబును అచ్ఛిద్రంబును నాబాల్యంబునునగు సఖ్యంబును వాయువు వహ్నితోఁబలె హనుమ సుగ్రీవునితోఁ నెఱపెను. రామా ! ఋషి శాపంబువలననే యితఁడు వాలిసుగ్రీవులకు వైరంబుకలిగినపుడు సుగ్రీవుఁడు వాలిచేఁ దఱుమఁబడుచున్నను దనబలంబు తానెఱుఁగక వానితోపాటు

పరువిడువాఁడు. మునిశాపోపహతబలుఁడగుట మారుతియేనుఁగుచే నరికట్టఁబడిన సింహమువలె రణంబున స్నేహితునితోఁగూడ రిత్తమాసెసిరియైయుండెను. పరాక్రమమున నుత్సాహమున బుద్ధిని ప్రతాపమున సౌశీల్యమున మాధుర్యమున నయమున అనయమున గాంభీర్యమున చాతుర్యమున వీర్యమున ధైర్యమున హనుమంతునికంటె నధికుండు లోకంబునలేఁడు. తొల్లి యప్రమేయుఁడగు నీ కపీంద్రుఁడు సూర్యునితోడ వ్యాకరణంబు గఱచుచు వాని పిఱుందన యుదయాద్రినుండి యస్తాద్రివఱకుఁ దద్గ్రంథంబు వల్లించుచుఁ దిరిగెను. సూత్రములతోడ వృత్తియు నర్థంబును బదంబును మహార్థంబును సంగ్రహార్థంబును చక్కఁగానేర్చెను. శాస్త్రమందు విశారదత్వమున ఛందస్సునందు నితనికితండ సాటి. రామా! సర్వవిద్యలయందును దపోవిధానమందును ఈతఁడు బృహస్పతినిఁ దలకడచువాఁడు. నవవ్యాకరణవేత్త; నీ యనుగ్రంబున బ్రహ్మకూడనగును. ఈతఁడు జగములముంప నుప్పొంగు సముద్రుఁడు. లోకముల గాల్పఁగోరు వీతిహోత్రుఁడు. భువనంబుల నాశంబు చేయు యముఁడు. అట్టి వీనికుఁదు ఎవఁడునిలువఁ గలఁడు. రామా! సురలు వీనివలెనె నీకు బాసటకాఁపుటకు సుగ్రీవుఁడు మైందుఁడు ద్వివిదుఁడు నీలుఁడు తారుఁడు తారేయుఁడు నలుఁడు రంభుఁడు ననువారిని సృష్టించిరి. మఱియు నో రామా! గజుఁడు గవాక్షుడు గవయుఁడు సుదంష్ట్రుఁడు ఋషభుఁడు జ్యోతిముఖుఁడు అంగదుఁడు అనుఋతునాథులనుగూడ నీకై దేవతలు సృజించిరి. రామా! హనుమంతుని బాల్యమునుగూర్చి నీ వడిగిన వృత్తాంతమెల్ల వినిపించితిని.

అని వచించిన యాంజనేయచరితంబు నాలించి రాముండును లక్ష్మణుఁడును వానరులును రాక్షసులును పరమాశ్చర్యమునొందిరి.

## అగస్త్యాదులు శ్రీరామునిచే ననుజ్ఞగొనిపోవుట.

అంతనగస్త్యుఁడు రామా! యీ వృత్తాంతమెల్ల నీవువింటివి. నిన్ను మేముగంటిమి. నీతోనంటిమి. మంటిమి. ఇఁకఁబోయివత్తుము. అని పలికెను.

అన విని రాఘవుఁడు అగ్రతేజస్వియగు నగస్త్యునికి దోసిలొగ్గి మ్రొక్కి యిట్లనియె. మునీంద్రా! తమ దర్శనంబు లభించుటఁజేసి నాదేవతలు పితృపితామహులు ప్రపితామహులు బంధువులు నందఱును నిత్యసంతుష్టిని గాంచిరి. ఒక్కవిన్నపంబాలింపుఁడు. నేను కోరినప్పుడు తాము కాదనక దయతో నిందరుగు దేరవలయును. నేను వనములనుండి వచ్చితిని. పౌరులను జానపదులను దమతమ కార్యంబుల నిలిపి సత్పురుషులైన తమ యనుగ్రహంబునఁ గ్రతువుల నొనర్చెదను. మహాతపోవీర్యముగల తాము ఆయజ్ఞం

బుల నిత్యంబును సదస్యులై మమ్మనుగ్రహింపవలయును. తపంబుచే నిర్ధూత కల్మషులైన తమ్ము నేనాశ్రయించి కృతకృత్యుండనై పితృపాదుల యను గ్రహంబునకుం బాత్రమనగుదును. కాన మీరందఱుగూడ నీడకు ననిశంబురాం బ్రార్థితులు. నా విని సంశ్రితవ్రతులగు నగస్త్యాది మునులందఱు నట్లే యగుం గాక ! యని పలికి రాము నాశీర్వదించి, రాముని వీడి పయనమై యథాస్థానం బులకుం జనిరి. రాముం డాయర్థమునే విస్మితుండై చింతించుచుండెను. అంత భాస్కరుం డస్తంగతుండు కాంగానే నరవరోత్తముండైన రాముండు నృపవాన రులను వీడి సంధ్యావందన మాచరించి రాత్రికాంగానే యంతఃపురంబున కరిగెను.

ఇది ముప్పదియాఱవ సర్గము

---

## ము ప్ప ది యే డ వ స ర్గ ము

విదితాత్ముండగు శ్రీరాముండు పట్టాభిషిక్తుండైన యామొదటిరాత్రి పౌరహర్షవర్ధనిమై యిట్లు కడచెను. ఆరేయికడచి వేగంగానె నృపతిప్రబోధ కులు సౌమ్యులునగు వందిజనులు రాజగృహంబున కరుదెంచి కిన్నరులవలె సుశిక్షితులగుట నవ్యక్తరక్తకంఠులై సంతోషభరితులై సుఖనిద్ర చెందియున్న రాజు నిట్లు మేలుకొల్పిరి. "వీరా ! సౌమ్యా ! కౌసల్యా ప్రియవర్ధనా ! మేలు కొనుము ! నీవు నిద్రించిన జగంబు సర్వంబునిద్రించును. నీవు విక్రమంబున విష్ణుండవు. రూపంబున నశ్వులను బోలుదువు. బుద్ధిని బృహస్పతివి. బ్రహ్మకు నీడగు వాండవు. క్షమచే భూమికి దీటువత్తువు. తేజస్సున భాస్కరోపముండవు. వేగంబున వాయుతుల్యుండవు. గాంభీర్యమున సముద్రసమండవు. అప్రకంప్య తను స్థాణుండవు. సౌమ్యతను జంద్రుండవు. నిన్నుంబోలిన రాజులు మున్నె న్నండును బుట్టియుండలేదు. పురుషశ్రేష్ఠా ! నీవు అతిదుర్ధర్షుండవును ధర్మనిత్యుం డవును ప్రజాహితుండవును నగుటచేం గీర్తియు లక్ష్మియు నిన్నాశ్రయించి పెడంబాయకున్నవి. కాకుత్స్థా ! సిరియు ధర్మంబును స్థిరముగా నీయందే ప్రతి ష్ఠితములై యున్నవి. అని యిట్లు మఱికొన్ని మధురగుణంబులంగూడ వందులు గానంబుచేసి రాముని మేల్కొల్పిరి. వారిస్తోత్రములచే రాముండును తెల్లని పాన్పునుండి, మెల్లగాం బడకవీడి శేషశయ్యనుండి నారాయణుండువలె లేచం గాం బ్రాంజలులై వినయంబుదోప వేలకొలంది సేవకులు శుభ్రపాత్రము లతో జలంబులు తెచ్చి యొసంగం గాల్యంబులు దీర్చి శుచియై హుతాశనుని యజించి యిక్ష్వాకు సేవితంబును బవిత్రంబునునగు దేవాలయంబును జొచ్చి యందు దేవతలను పితృదేవతలను విప్రులను యథావిధిగా నర్చించి జనులతోం గూడి మోసాలకుం జనంగా మంత్రులు వసిష్ఠప్రముఖ పురోహితులందఱు

వెలుఁగుచున్న యగ్నులవలెఁ జేరవచ్చిరి. మహాత్ములగు క్షత్త్రియులును నానా జనపదేశ్వరులును దేవేంద్రుని దేవతలువలెఁ బరివేష్టించి కూర్చుండిరి. మహాశయులగు భరత లక్ష్మణ శత్రుఘ్నులు మువ్వురును హృష్టులై వేత్రయంబు జన్నంబునుబోలె నన్నను సేవించిరి. పెక్కుమంది కింకరులు ముదితాననులై చేతులు జోడించికొని ప్రక్కకొదిఁగి కూర్చుండిరి. మహావీరులును మహాతేజస్వులును గామరూపులును నగు సుగ్రీవాదివానరు లిరువదిమందియు, నలువురు రాక్షస మంత్రులతోఁగూడి విభీషణుఁడును గుబేరుని గుహ్యకులువలె శ్రీరామునిఁ గొల్చిరి. అట్లే వేదవృద్ధులును ఇలువడిగల మానవులును విద్వాంసులును శ్రీరామచంద్ర మహారాజు చరణంబులకు శిరంబులు సోఁక మ్రొక్కి సేవించిరి. అట్లు శ్రీమంతులగు ఋషిసత్తములతోడను మహావీరులైన రాజులతోడను వానరులతోడను రాక్షసులతోడను గూడి రామరాజు ఋషిజనపరివృతుఁడగు దేవేంద్రునిమాడ్కిఁ దేజరిల్లుచు వానికన్న మిన్నయై పేరెన్నికఁ గాంచెను.



శ్రీరామచంద్రుఁ డిట్లు పేరోలగంబున్నతఱి ధర్మసంయుక్తులును బురాణజ్ఞులును నైన మహర్షులు మధురములైన పురాణకథావ్యాసంగంబులు గావించిరి.

ఇది ముప్పదియేడవ సర్గము



---

## ముప్పదియెనిమిదవ సర్గము

### శ్రీరాముఁడు జనకాదిరాజులను వారివారి పురంబుల కనుచుట.

ఇట్లు మహాబాహువైన రాఘవుఁడు ప్రతిదినంబును పట్టణములను బల్లెలను జరుగు సర్వకార్యముల నారయుచు రాజ్యపాలనంబు సర్వజనసమ్మతిగాఁ జేయుచుండెను. అంతఁ గొన్నినాళ్లకుఁ మిథిలాధిపుడైన విదేహరాజగు జనకునిఁగాంచి రాముఁడు ప్రాంజలియై యిట్లనియె. మహారాజా! తామేమాకు గ్రక్కదలనిదిక్కు. తమచే మేము గాపాడఁబడితిమి. తమ భయంకరపరాక్రముననే నేను రావణుని సంహరించితిని. రాజేంద్రా! ఐక్ష్వాకులకును మైథిలులకును నందఱకును వియ్యములవలనఁ గలిగిన నెయ్యముల తియ్యములు ఎల్లవిధముల సాటిలేనివై యెసఁగుఁగాక! పార్థివేంద్రా! తమరిటకువచ్చి పెక్కునాళ్లాయెను. ప్రజలు తమరాకకై వేచియుందురు. ఈ రత్నంబుల స్వీకరించి స్వపురంబునకు విచ్చేయుఁడు. సహాయార్థంబు భరతుఁడు తమవెనుక రాఁగలఁడు.

అనవిని జనకుఁడట్లేయని రామునితో రామరాజా! నీ దర్శనముచేఁ దనిసితిని. నీ వినయమునకు ననయము ప్రీతుఁడనైతిని. నాకొఱకై తీసికొని వచ్చిన యీ రత్నములన్నిటినిఁ గూఁతుల కొసఁగెదను. అని పలికి ప్రహృష్ట

మానసుఁడై స్వపురికింజనెను. పిమ్మటఁ బ్రభువైన రాముఁడు మేనమామ యగు కేకయమహారాజును గాంచి మ్రొక్కి యిట్లనియె.

పురుషశ్రేష్ఠా! రాజా! ఈ రాజ్యము నేను భరతుఁడు లక్ష్మణుఁడు మీవారము. నీవే మాకుగతి. రాజైన మీతండ్రివృద్ధు, మీకై పరితపించుచుండును. కాన నేఁడే తాముపయనమగుట మేలు. అధికధనంబును వివిధ రత్నములనుగొని లక్ష్మణుఁడు మీకు బాసటగా బిఱుందన చనుదెంచును. అన విని యుధాజిత్తు రామా! అట్లే వెడలుదును. కాని రత్నములు ధనమును అక్షయమై నీయొద్దన యుండుఁగాక. యని రామునిచే వలఁగొనఁబడి రాజునకుఁ బ్రదక్షిణ మాచరించి యభివాదన మొనరించి వృత్రాసురునిఁ జంపి విష్ణుఁడు వెంటరా నరుగు వాసవునివలె లక్ష్మణుఁడువు తోడరాఁగా దరలిచనెను.

## రావణయుద్ధమునఁ దనకు దోడ్పడవచ్చిన రాజులను రాముఁడు సత్కరించి పంపుట.

పిమ్మటఁ గౌసల్యానందనుఁడగు రాముఁడు సింహాసనమునుండిలేచి స్నేహితుఁడును అదరుగుండె పిఱికికండ లేనివాఁడును గాశిరాజుననగు ప్రతర్ధునిఁ గౌఁగిలించుకొని యిట్లనియె. రాజా! భరతునితోఁగూడి నీవు ప్రీతియు నధికసౌహార్దంబును ఉద్యోగంబును జూపితివి. కానఁ గాశేయా! నీవిప్పుడు రమణీయంబును భవదభిరక్షితంబును సుప్రకాశంబును సుతోరణంబును నై విలసిల్లు వారణాసికి వెడలిరమ్మని యనిచె. యతఁడరిగిన వెంటనె మఱి మూఁడువందలమంది రాజులనుగాంచి నవ్వుచు మృదుమధుర వాక్యంబుల నిట్లనియె.

తమకు మాయెడఁగలప్రీతి యచంచలమైనది. అది తమతేజస్సుచే రక్షింపఁబడినది. మీరు ధర్మనిష్ఠగలారు. నిత్యసత్యవ్రతులు. తమ యనుగ్రహముచేతను ప్రతాపంబువలనను రాక్షసాధముఁడును దుర్బుద్ధియు దురాత్ముఁడునునైన రావణుఁడు చచ్చెను. నేను గారణమాత్రమను. పుత్రమిత్రబంధుయుతుఁడై రావణుఁడు యుద్ధమునఁ దమ పరాక్రమంబుచేతనే చచ్చెను. జనకరాజపుత్రిని రావణుఁడు హరించెనని విని భరతుఁడు మిమ్మందఱిఁ దోడ్కొనివచ్చెను. యుద్ధమునకై పూనివచ్చిన మహాత్ములు భూపతులునగు తమకందఱకు నిచ్చటఁ జాలకాలము గడచెను. కాన నిఁకఁ దాము తమరాజ్యంబులకుఁ బోయిరండు. అని పలుకఁగా నారాజులు మహానందభరితులై యిట్లనిరి.

## రాజులు శ్రీరామునిఁ గొనియాడి సెలవుగైకొని వెడలుట.

రామా! నీవు మా యదృష్టంబున జయంబు గాంచితివి. స్వరాజ్యము నార్జించి పట్టాభిషిక్తుఁడవైతివి. శత్రువును గసిమసంగితివి. సీత నుగ్రహింపఁ

గంటివి. శత్రునాశనము గావించి విజయంబు నొందివచ్చిన నిన్నుఁ గనులారఁ గాంచఁగలిగితిమి! ఇదియే మాకోరిక! ఇదియేమాకుఁ బరమప్రీతి. రామా! ఎంత ప్రశంసకేని నీవర్హుఁడవు. నీవు మమ్మేటికింతగాఁ బొగడితివి? వినయ భూషణు డవగు నీకు మమ్ముఁబొగడుట యుక్తమే! కాని మేము నిన్ను నీవలెఁ బొగడనేరము. కాని మాదొకకోరిక. మేమెట్లు నిన్ను మనంబులఁ బ్రీతితో నెలకొల్పికొంటిమో నీవును మమ్మట్లు నీమనంబున నెల్లప్పుడు నిలుపుకొనుము. పోయివత్తుము. మహారాజా! అనుగ్రహింపుము. అని పరమానందభరితులై రామున కభివందన మాచరించి రామునిచేఁ బూజితులై తమతమ దేశంబుల కరిగిరి.

ఇది ముప్పదియెనిమిదవ సర్గము

---

## ముప్పదితొమ్మిదవ సర్గము

### సకలరాజులు వారివారి రాజ్యంబులకుఁ బోవుట.

మహాత్ములును వీరులునునైన యాయారాజులందఱు భూమి గడగడ లాడునట్లుగా నలుదెసలంగల తమతమపురంబుల కరిగిరి భరతునియాజ్ఞచేఁ బ్రాప్త బలవాహనంబులైన యనేకచమూసమూహంబులు రాముని కొఱకై సంసిద్ధముగా నుండెను. అత్తఱి బలదర్పసమన్వితులయిన రాజు లిట్ల నుకొనిరి. "రామా! అని మొననున్న రావణుని మేము గాంచమైతిమి. భరతుఁడు మమ్మ నిరర్థకంబుగా మరలించుకొని వచ్చినాఁడు. రాక్షసుల నచ్చటిరాజులే శీఘ్రంబుగా సంహరించిరి. సందియము లేదు. రాముని భుజబలముచేతను, లక్ష్మణునిచేతిలావునను గాపాడఁబడుచుఁ జింతలఁ దక్కి సుఖంబుగా సముద్రపుటొడ్డున యుద్ధంబు చేయఁజాలమే!"

అని కొందఱనుకొనుచుండఁగా మహారథులైన మఱికొందఱు రాజులు వేనవేలుకథలను జెప్పుకొనుచుఁ దమతమ రాష్ట్రంబులం బ్రవేశించిరి. ముఖ్యములైనవియుఁ బ్రబుద్ధములైనవియు, సంతుష్టిగలవియు ధనధాన్యసమృద్ధి గలవియుఁ జలపూర్ణములైనవియు రత్నరాసులుగలవియు నగు తమతొంటిరాజ్యములను జేరి యా రాజులు రామునకుం బ్రియంబుసేయఁగోరి వివిధరత్నంబులను గానుకలుగాఁ బంపిరి. అంతియగాక గుఱ్ఱములను మదపుటేనుఁగులను శ్రేష్ఠములగు సుగంధద్రవ్యములను దివ్యాభరణములను మణులను ముత్యములను బవడములను రూపసమన్వితులగు దాసీలను గొఱ్ఱెలను మేఁకలను, రథంబులను గానుకలుగా నొసంగ మహాబలులైన భరత లక్ష్మణ శత్రుఘ్నులు వానింగైకొని యయోధ్యాపురంబున కరుదెంచి వానినెల్ల శ్రీరామచంద్రుని కర్పించిరి. వానిం గైకొని రాముఁడు కరంబు మోదంబొంది

### శ్రీరాముడు సుగ్రీవాంగదహనుమదాదుల బహూకరించుట.

తనకు సాయంబొనరించిన సుగ్రీవునకును విభీషణునకును దనకు జయ మొదవించిన తక్కుంగల కపిరాక్షసులకును నాయా రత్నాదులనన్నింటి నొసం గెను. బలవంతులగు వానరరాక్షసులందఱు రాముఁడొసఁగిన యా రత్నము లను, శిరంబులను భుజంబులను ధరించిరి. మహారథుండును ఇక్ష్వాకుకులతిల కుఁడునగు శ్రీరాముఁడు మహాబాహులగు హనుమదంగదులను గుఱువునఁ గూర్చుండఁబెట్టుకొని సుగ్రీవునితో నిట్లనియె. "సుగ్రీవా! అంగదుఁడు నీకు సుపుత్రుఁడు ఆంజనేయుఁడు మంత్రి. వీరు నీకు మంత్రాంగంబు నడపువారు. నాకు హితము చేయువారు. కావుట నిన్నుంబట్టి వీరు వివిధపూజలకు నర్హులు." అని పలికి తనమేనంగల యమూల్యాభరణంబులనెల్లఁ దీసి హను మదంగదులకుఁ దొడిగెను. అంత యోధపతులగు నీలుని నలునిఁ గేసరినిఁ గుముదుని గంధమాధనుని సుషేణుని, బనసుని, మైందుని ద్వివిదుని, జాంబ వంతుని, గవాక్షుని, వినతుని, ధూమ్రుని, వలీముఖుని, ప్రజంఘుని, సన్నా దుని, మహాబలుని, దరీముఖుని, దధిముఖుని, ఇంద్రజానుని శ్రీరాముఁడు కన్నుల కద్దుకొనుచు, మధురంబులగు ప్రియవాక్యంబుల నిట్లనియె. "మీ రెల్ల నాకు స్నేహితులు. మీరే నాశరీరము, మీరే నాసోదరులు, మీరే నన్ను వ్యసనాబ్ధినుండి యుద్ధరించితిరి. మీవంటిస్నేహితులు లభించుటచే సుగ్రీవుఁడు ధన్యుఁడాయెను. అని పలికి వారివారికిఁ దగిన భూషణంబులను నొసంగి గౌరవించెను. ఆవానరులు సువాసనగల మధువులానుచు మాంస ములు తినుచు, దుంపలారగించుచు ఫలంబులు భక్షించుచు సంతుష్టులై రాజభక్తిపరులై యుండ నొక్కమాస మొక్క ముహూర్తకాలంబువోలెఁ గడచెను. శ్రీరాముఁడును మహాబలులు మహావీర్యులు కామరూపులు నైన ఋక్షవానర రాక్షసులఁగూడి క్రీడించుచుండెను. ఇట్లుండ రెండవ శిశిరమాసంబుగూడఁ (ఫాల్గునమాసము) గడచెను. ఇవ్విధంబున నావా నరరాక్షసులు రమ్యమైన యిక్ష్వాకునగరంబున రాముఁడొనర్చిన ప్రీతికార్యం బులచే నపారానందాబ్ధి నోలలాడుచుండఁగాఁ గాలంబెల్ల సుఖంబుగాఁ గడచి చనెను.

ఇది ముప్పదితొమ్మిదవ సర్గము

---

## నలువదియవ సర్గము

### శ్రీరాముఁడు సుగ్రీవాదులను గిష్కింధకంపుట.

ఋక్ష వానర రాక్షసులిట్లుండఁగ మహాతేజస్వియగు రాముఁడు సుగ్రీ వునితో నిట్లనియె.

సుగ్రీవా! సౌమ్యుఁడా! సురాసురులకుం జయింప శక్యముగాని కిష్కింధకుంజనుము. నిష్కంటకమైన నీ రాజ్యంబును మంత్రులతోఁగూడి పరిపాలింపుము. మహాబాహూ! అంగదుని హనుమంతుని, నలుని, మామ యగు సుషేణుని, వీరుఁడై నతారుని బలవద్గ్రణియగు కుముదుని, దుర్ధర్షుఁడైన నీలుని, మహాబలుని, వీరుఁడగు శతవలిని, మైందుని, ద్వివిదుని, గజుని గవాక్షుని, గవయుని, శరభుని, గంధమాదనుని ఋషభుని, పరాక్రమోపేతుఁడగు జాంబవంతుని అధికప్రీతితో నన్నుఁబోలె నారయుము. ఈ మహాత్ము లందఱు నాకొఱకుఁ బ్రాణంబులర్పించిరి. కాన నెన్నఁడును వీరికింగీడు రోయకుము. అనిపలికి శ్రీరాముఁడు సుగ్రీవుని మఱిమఱి కౌఁగిలించుకొని మధుర వాక్కులతో విభీషణున కిట్లనియె.

## శ్రీరాముఁడు విభీషణుని లంక కనుచుట.

విభీషణా! నీవు లంకను ధర్మబద్ధంబుగాఁ బరిపాలింపుము. నాకును, పౌరులకును, రాక్షసులకు సోదరుఁడగు కుబేరునకును నీవు ధర్మజ్ఞుఁడవని గట్టి నమ్మకము. రాజా! నీ వెన్నఁడును, నధర్మమునందు బుద్ధిని జొరనీయకుము. బుద్ధిమంతులగు రాజులే, భూమిని స్థిరంబుగా ననుభవింతురు. భూపతులమైన నన్నును సుగ్రీవునిఁ బరమప్రీతితో నిత్యంబును దలంచుచుండుము. దిగులు మాని లంకకుంబొమ్ము. అని పలికిన శ్రీరామవాక్యంబు లాలించి ఋక్షవానర రాక్షసులు మేలు మేలని వేనోళ్లఁ బొగడిరి.

మహాబాహూ! నీ బుద్ధియు, నీ వీర్యంబును అద్భుతంబులు. రామా! బ్రహ్మవాక్కులందుం బలె నీ మాటలందేనియ తేటలూఱుచుండును.

## శ్రీరాముఁడు హనుమంతునకు వరంబులిచ్చుట.

అనియిట్లు వానరరాక్షసులు పల్కుచుండఁగా హనుమంతుండు నమ్రుఁడై రామునితో నిట్లనియె.

రామా! నీ యందు నాకెల్లపుడు నధిక స్నేహంబు కుదిరియుండుఁగాక! నీ యందలి భక్తి నన్నుఁ బాయకుండుఁగాక; నిన్నువీడి నామనంబు వేఱొండు చోటునకుఁ జనకుండుఁగాక! ఎంతవఱకు రామభద్రా! భద్రంబగు నీ చరిత్రంబు భూతలంబున నిలిచిపోలుచునో యంతవఱకు నా శరీరమునఁ బ్రాణంబులు నిస్సంశయంబుగ నిలుచుఁగాక! నరశ్రేష్ఠా! రఘునందనా! దివ్యమైన నీ కథను అచ్చరులు గానంబుచేసి దానితోపాటు నా కథనుంగూడ వినుతురు. ప్రభూ! నీ దివ్యచరిత్రామృతంబును నేను మనంబారఁగ్రోలి చెలుతమబ్బులను వాయువువలె నా యుత్కంఠను బోఁగొట్టుకొందును. అని యిట్లు పలుకుచున్న హనుమంతుని వాక్యము లాలించి శ్రీరామచంద్రుఁడు వరాసనంబు

నుండిలేచి, ఆలింగనంబుచేసికొని స్నేహపూర్వకంబుగా నిట్లనియె. కపిశ్రేష్ఠా! నీకోరిక తప్పక సిద్ధించుఁగాక! నా చరిత్ర యీ లోకంబున నెందాఁక నిలుచునో యందాఁక నీ కీర్తి నిలుచుఁగాక! నీ మేనం బ్రాణంబులుండుగాక! లోకంబు లున్నంతవఱకును నా చరిత్రయునుండును. నీ వొనర్చిన యొక్కొకయుపకృతికి నా ప్రాణంబు లర్పించెదను. ఆపదలయందు నరుఁడు ప్రత్యుపకార మొనర్చి స్నేహంబునకుఁ పాత్రుఁడగుచున్నాఁడు. అని వచియించి శ్రీరామచంద్రుఁడు చంద్రాభంబును వైడూర్యతరళంబును నగు హారంబును దన కంఠంబుననుండి దీసి హనుమంతుని కంఠంబునందువైచెను. ఉరంబున వ్రేలాడు నాహారంబుచే నాంజనేయుండు చంద్రబింబము శిరంబున ధరించిన మేరునగంబువలెం బ్రకాశించెను. రాముని వాక్యము లాలించి వానరులు లేచి శ్రీరాముని పదంబుల శిరంబులు సోఁక నమస్కరించి వెడలిచనిరి. సుగ్రీవుఁడును, విభీషణుఁడును దక్కంగల ఋక్షరాక్షస వానరులును రాముని కౌఁగిలిం బాసి కన్నీరు మున్నీరుగాఁ గార్చుచుఁ జేష్టలుడిగి మూఢులవలెఁ దపించి రామునిచే ననుగ్రహింపఁ బడి యా రఘుకులతిలకునకు నమస్కరించి దేహి దేహంబును బాసిపోవు తెఱంగున వానింబాసి వియోగభరంబునూని వలసపోవు వారివలెఁ దమతమ నివాసములకుం జనిరి.

ఇది నలుబదియవ సర్గము

---

## న లు వ ది యొ క ట వ స ర్గ ము

### కుబేరునొద్దనుండి పుష్పకము శ్రీరామునిఁ గొల్వవచ్చుట.

మహాబాహువయిన శ్రీరామచంద్రుఁడు ఋక్షరాక్షసవానరులను వీడ్కొలిపి తమ్ములంగూడి సుఖంబు లనుభవించుచునుండెను. అంత నపరాహ్ణ సమయంబునఁ దమ్ములతోఁ గూడియున్న వానికి నంతరిక్షంబునుండి వెలువడిన యొకమధురవాక్కు వినవచ్చెను.

సౌమ్యా! రామా! సౌమ్యముఖుండవై నన్నుఁ జూడుము. ప్రభూ! నేను గుబేరు నాజ్ఞ నొదలందాల్చి వచ్చిన పుష్పకమను. నీశాసనంబు వహించి కుబేరభవనంబున కరిగితిని. నన్నుఁగాంచి యాతఁడిట్లనియె. విమానరాజమా! దుర్ధర్షుఁడగు రావణుని యుద్ధంబునఁ బరిమార్చి రాముఁడు నిన్ను వానియొద్ద నుండి జయచిహ్నంబుగాఁ గైకొనియె. పుత్త్రమిత్రబంధుగణసహితుండై దురాత్ముఁడైన రావణుఁడు, రామునిచే మడిసినందులకు నేను బ్రహ్మానంద భరితుఁడనైతిని. కాన సౌమ్యా! పరమాత్ముఁడైన రామునిచే లంకం గైకొనఁబడిన నీవు; నాయాజ్ఞ వహించి వానినే వహింపుము. లోకరక్షకుండైన

శ్రీరామచంద్రుని నీవు వహించుటే నాకుం బరమానందము. కాన నీవు విచారంబు దక్కి చని వానిని వహింపుము. అని పలికిన మహాత్ముఁడైన కుబేరుని యాజ్ఞం గైకొని నీసన్నిధికే తెంచితిని. శంక దక్కి నన్నేలుము, కుబేరాజ్ఞచే నేనేభూతంబునకు లొంగక నీచెప్పు చేతల గొప్పఁదనంబున మెలంగుదును. అని పల్కిన పుష్పకంబుఁ గాంచి రాముఁ డిట్లనియె. అట్లైనచో విమానవరా! పుష్పకా! నీకిదే స్వాగతంబు. కుబేరుఁడు నాకనుకూలుండగుటం జేసి నీయునికి వలన మాకిట నే కొఱంతయుఁ గలుగదు అని పేలాలతోడనుఁ, దావిగల పువ్వులతోడను, ధూపములతోడను బుష్పకంబును బూజించి పుష్పకా! నీవు కుబేరునొద్దకే పొమ్ము. నేఁ దలంచినపుడు రమ్ము. సౌమ్యా! సిద్ధమార్గంబునఁ జనుము. వారికి బాధగలిగింపకుము. నీకెందును నష్టము లేదు. ఎల్లదిక్కుల యథేచ్ఛగా సంచరింపుము. అని రాముఁడు పుష్పకంబును విడిచిపుచ్చ నది యథేచ్ఛముగాఁ జనినంత

### భరతుఁడు శ్రీరామునకుఁ బ్రజల సుఖస్థితినిఁ దెలుపుట.

భరతుఁడు ప్రాంజలియై రామునిం గాంచి యిట్లనియె. రామచంద్రా! నీవొకనెల పరిపాలించినంతనే దేవుఁడవుగాఁ గనుపించుచున్నావు. నిన్నుం గూర్చి సత్వంబులు మాటిమాటికి అమానుషవాక్యంబులు పలుకుచున్నవి. సత్వంబులెల్ల ననామయంబులై యున్నవి. జీర్ణసత్వంబుగూడ మృతినంద కున్నది; నెగులు, దిగులులేక మగువలు నీళ్లాడుచున్నారు. మానవులు పుష్టిగలిగి యున్నారు. పురవాసులు ఆనందాంబుధి నోలలాడుచున్నారు. పర్జన్యుఁ డమృతంబును సకాలంబున వర్షించుచున్నాఁడు. స్పర్శయుక్తంబులై సుఖప్రదంబులై శివంకరంబులై గాలులు వీచుచున్నవి. ఇట్టి మహారాజు మాకెల్ల కాలమేలికయై యుండుఁగాక! యని పౌరులును జానపదులును బురంబునందెల్లెడలఁ జెప్పుకొనుచున్నారు. అని మృదుమధురంబుగా భరతుండాడిన వాక్యంబులాలించి నృపసత్తముఁడైన శ్రీరామచంద్రుఁడు సంతోషభరితుఁడయ్యెను.

ఇది నలుబదియొకటవ సర్గము

---

## నలుబదిరెండవ సర్గము.

హేమభూషితమైన పుష్పకవిమానంబునట్లు విడిచిపుచ్చి శ్రీరాముఁడు అశోకవనంబును బ్రవేశించెను. పల్లవితంబులు కుసుమితంబులు ఫలితంబులునై మనోహరంబులై దివ్యగంధరసోపేతములై శిల్పిపరికల్పితంబులై మధుబంభరసంకులంబులై కోకిల భృంగరాజ కలకల నినాదసంయుతంబులై నానా

వర్ణశకుంత సంతానవిరాజితంబులై శాతకుంభనిభంబులై యగ్నిశిఖోపమంబులై నీలాంజనతుల్యంబులై కనువిందొనరించుచుండు చందనములు అగరువులు రసాలములు పొన్నలు గంధకాష్ఠములు దేవదారువులు సంపెఁగలు అశోకములు సురపొన్నలు ఇప్పలు పనసలు పారిజాతములు లొద్దుగులు మంకెనలు ఏలుమద్దులు ఏడాకులయరఁటులు తినాసములు (నెమ్మిచెట్టు) మందారములు అనఁటులు గుల్మములు లతాజాలములు కొండగోఁగులు ప్రేంకణములు కదంబములు గోరంటలు నేరేడులు దిరిసెనలు కలిగొట్టులు (పాటలి) కాంచనములు మున్నగు నానావృక్షములు, సురభిలపుష్పములు పూలమాలలు నిర్మలజనపరిపూర్ణములైన వివిధాకారములుగల నడబావులు,అనర్ఘమణిసోపానములు; స్ఫాటికాంతరకుట్టిమములు చక్రవాకోపశోభితంబు లగు ఫుల్లపద్మోత్పలవనంబులు గలిగి కూహరుగుండఁగులను పక్షులయింపుఁ దళుకొత్తుకూఁతలతోఁడను హంససారస నినాదములతోడను జిత్రవర్ణములగు పుష్పములుగల తీరస్థ మహీజములతోడను వివిధాకారములగు ప్రాసాదములతోడను సొగసైన శిలాతలంబులతోడను వైదూర్యమణి సన్నిభంబులగు పచ్చికబయళ్లతోడను నెత్తావులు విరజిమ్మచారఁబూసిన చెట్లతోడను జిత్రవర్ణములైన పూలురాలిన ప్రస్తరంబులతోడను నక్షత్రములతోవిలసిల్లు నాకాశంబువలె విరాజిల్లుచు నందనవనంబువలె బ్రహ్మమందిరంబువలెఁ జైత్రరథంబువలె మనోహరంబై పెక్కు ఆసనములుగల గృహములుగలిగి లతాసనసమవేతంబై ప్రకాశించుచున్న యశోకవనమును బ్రవేశించి రఘురాముఁడు శుభాకారంబును బుష్పస్తబకశోభితంబును కుశాస్తరణసంవీతంబును నగు నాసనంబున సుఖోపవిష్టుఁడై సీతాదేవి హస్తంబును దనకేలఁగీలించి యింద్రుఁడు శచీదేవి కమృతం బిడినట్లు తెల్లనై తియ్యనైన చెఱకుఁగల్లునొసంగి త్రావఁజేసెను. పిమ్మట సేవకులు రాముఁడారఁగింప రకములైన గరగరని మాంసములు పలువిధములైన పండ్లు కడువడిఁ గొనితెచ్చిరి. అంత మధుపానమత్తలై రూపవతులు నృత్తగీతవిశారదలునగు యువతులు అభిరామంబుగా రామునియెదుట నృత్యంబు చేసిరి.

ధర్మాత్ముఁడును భూషణభూషితుఁడును రమమాణాగ్రణియు నగు రాముఁడు మనోభిరామలగు నారామలను భూషణాదులచే రమింపఁజేసెను. (సంతోషపెట్టెను) సీతతోఁగూడ నాసనాసీనుఁడై యున్న రాముఁడు అరుంధతితోఁ బీటపైఁ గూర్చున్న వసిష్ఠునివలె శోభిల్లెను.

ఇట్లు రాముఁడు సంతోషభరితుఁడై దేవతాకన్యంబోని సీతతోఁ దేవునివలె నహరహంబును సుఖంబు లనుభవించుచుండ శుభప్రదంబును భోగదంబునునగు శిశిరకాలము మెల్లగాఁగడచిచనెను.

ఇట్లు వివిధభోగములు ననుభవించుచుండ నామహానుభావులకుఁ బది వేలవర్షములు గడచెను. శిశిరకాలంబును గడచెను. ధర్మజ్ఞుఁడైన రాముఁడు పూర్వాహ్ణమున ధర్మకార్యములను ధర్మయుక్తముగా నిర్వర్తించి మిగిలిన దివసార్ధంబును నంతఃపురమునుజేరి ప్రొద్దుపుచ్చుచుండును. సీతాదేవియుఁ బౌర్వాహ్ణికకార్యములు దేవతాపూజనంబులు నెఱవేర్చి యత్తలకెల్లఁబూజలు గావించి పిమ్మటఁ జిత్రాభరణాంబరభూషితయై త్రివిష్టపంబునఁ గూర్చున్న యింద్రునికడకు శచీదేవి వచ్చినట్లు రామునిచెంగట కరుదెంచెను.

సీతాదేవి ఋష్యాశ్రమంబులకుఁ బోవఁ గోరుట.

సింగారించుకొనివచ్చిన యిల్లాలిఁగాంచి రాముఁడు నిరుపమానందంబు నొంది మేలుమేలని మెచ్చుకొనుచు సురసుతోపమయు వరారోహయునైన సీతతో నిట్లనియె.

వైదేహీ! నీయందు గర్భచిహ్నములు పొడకట్టుచున్నవి. నీవేమి కోరుచున్నావు? నీకోరిక యేమి? చెప్పుము. అదియొనరింతును. అన జానకి మందస్మితవదనారవిందయై రామున కిట్లనియె.

నాథా! పవిత్రంబులగు తపోవనంబులుచూచి గంగాతీరోపవిష్టులును ఉగ్రతేజస్వులును ఫలమూలాశనులును నగు ఋషీంద్రుల చరణసన్నిధి నొక్కరేయియైన నివసింప నిచ్ఛపొడముచున్నది. అన అక్లిష్టకర్ముఁడగు రాముఁడు వైదేహీ! రేపు నిన్నుఁదప్పక తపోవనంబుల కనిచెదను. సందియములేదు. నమ్ముము. అనిపలికి చింతావ్యాకులమానసుఁడై మానంబుతో ముహూర్తకాలముండి పదపడి నెయ్యురంగూడి మధ్యకక్ష్యాంతరంబునకుఁ జనెను.

ఇది నలువది రెండవ సర్గము

---

న లు వ ది మూ ఁ డ వ స ర్గ ము

శ్రీరాముఁడు భద్రుని లోకవార్తలడుగుట.

అట్లు సుఖోపవిష్టుండైన రాముని చుట్టును బలుతెఱంగులగు కథల నెఱింగిన బహురూపధారులగు నేర్పరులునగు హాస్యకారులు పరివేష్టించి యుండిరి. విజయుఁడు, మధుమత్తుడు, కాశ్యపుఁడు, పింగళుఁడు, కుటుఁడు, సురాజుఁడు, కాళియుఁడు, భద్రుఁడు, దంతవక్త్రుఁడు, సుమాగధుఁడు, మున్నగు హాస్యకాంద్రు పరిహాస సమన్వితంబులగు పలుకథలను రామునకు సంతోష పూర్వకంబుగాఁ జెప్పుచుండిరి. వారిలో భద్రుఁడను వానింగాంచి రాముఁడు

ఓకీ! భద్రా! నగరంబునను దేశంబులందునునే యేకథలు ప్రవర్తిల్లుచున్నవి. పట్టణవాసులును, బల్లెనాటివారును నన్నుఁగూర్చి యేమనుకొనుచున్నారు? సీతనుగూర్చి యేమిచెప్పుకొనుచున్నారు, భరతునిఁ గూర్చి యేమివాకొను చున్నారు. లక్ష్మణునిఁగూర్చి యేమిపలుకుచున్నారు? శత్రుఘ్ను విషయంబున ననేమనుకొనుచున్నారు తల్లియగు కైకేయింగూర్చి యేమాడుచున్నారు? వివరింపుము. క్రొత్తగా రాజ్యమునకువచ్చిన రాజులకు భృత్యులు వక్తవ్యాంశం బులెల్ల విశదీకరింపవలయుఁజుమీ? అని రాముడు వలుకఁగానే భద్రుఁడు ప్రాంజలియై యిట్లనెను.

రాజా! పురజనులెల్ల మంచికథలే చెప్పుకొనుచున్నారు. నీవు రావణుం బరిమార్చి కావించిన విజయంబును, బట్టణంబు నలుమూలలను బౌరులు తనివోక చెప్పుకొనుచున్నారు. అని పలుకఁగావిని రాముఁడిట్లనియె. శుభములు నశుభంబులు నగునేవాక్యంబులు పురజనులాడుకొనుచున్నారో వాని నన్నిం టిని ఉన్నవున్నట్లుగా దాఁపక చెప్పుము. నే, విని కీడులంబోకార్చి శుభంబు లొనర్తును. పాపులగు పౌరులు జానపదులు నేమనుకొనుచున్నారో యది నిర్భయంబుగా బెంగవీడి నన్ను నమ్మిచెప్పుము.

### భద్రుఁడు శ్రీరామునకు సీతావిషయకాపవాదంబు దెలుపుట.

అనవిని భద్రుఁడు చేతులుజోడించి సమాహితమతియై రామునకిట్లనియె. రాజా! వినుము మంటపములందును, అంగడివీధులందును, వనములందును, ఉద్యానవనములందును జనులేయే శుభాశుభంబులను జెప్పుకొనుచున్నారో వానినెల్ల వినుము. రాముఁడు దేవదానవులుగూడ కనివిని యెఱుంగని దుష్కరంబగు సేతుబంధనంబు సముద్రమునకుఁ గావించెను. బలవాహ నుఁడు దుర్ధర్షుఁడునైన రావణునిఁ బరిమార్చెను. ఋక్షవానరరాక్షసులను లోపఱచికొనెను. కాని యుద్ధమున సీతనపహరించిన రావణునిఁజంపి రాముఁడు కోపంబు తుంగలోఁద్రొక్కి పరువు, మరియాద వీడి భార్యను మరల తన యింటికిం దీసికొనివచ్చినాఁడు. తొల్లి రావణుఁడు సీతను బలవంతంబుగ నెత్తి కొనిపోయి తొడపైనిడికొని లంకకుం దోకొనిపోయి యశోకవనంబున నిల్పి. రాక్షసులను బలకరముంచిన కథను రాముఁడెట్లు మఱచినాఁడు? ఏల రోఁత చెందకున్నాఁడు? సీతా సంభోగంబువలన వాని హృదయంబున నెట్టి సుఖంబు గల్గినది! మనముకూడ మనభార్యలనిట్లే మన్నింతము. రాజెట్లాచరించునో ప్రజలట్లనువర్తింపవలయునుగదా? అని మహాప్రభూ! పల్లెలను, పట్ట ణంబులను బ్రజలెల్ల బహువిధంబులుగాఁ జెప్పుకొనుచున్నారు. అని భద్రుండు వలుకగావే విని రాముఁడు పరమార్తింగూరి సమస్త స్నేహితులంగాంచి, ఇది

నిజమేనా? యని ప్రశ్నింపఁగా వారందఱు శిరంబులు వాంచి కరంబులెత్తి నమస్కరించి దీనుఁడైన రామునింగాంచి ప్రభూ! నిజమే సందియంబులేదు. అని పలుకఁగానే శత్రుసంహారియగు రాముఁడు వారెల్లరాడిన వాక్యంబు నాలించి వారికి సెలవొసంగి పనిచెను.

ఇది నలువదిమూఁడవ సర్గము

---

## నలువదినాల్గవ సర్గము

### శ్రీరాముఁడు సోదరులఁ బిలిపించుట.

శ్రీరామచంద్రుఁ డట్లు మిత్రబృందంబును విడిచిపుచ్చి తదనంతర కార్యంబు మనంబున నిశ్చయించి సమీపముననున్న ద్వారపాలకునిఁ గాంచి యిట్లనియె. ఓరీ! నీవుపోయి శుభలక్షణలక్షితుఁడగు లక్ష్మణుని మహాభాగుఁడగు భరతుని, అపరాజితుండగు శత్రుఘ్నుని శీఘ్రంబుగాఁ దీసికొనిరమ్ము. అన వాఁడు శిరంబునఁ గరంబులు గీలించి యేఁగి నిరాతంకముగా లక్ష్మణ గృహంబు ప్రవేశించి దీవించి నమస్కరించి యిట్లనియె. రాజుగారు మిమ్ముఁ జూడఁ గోరినారు. వైళంబచనుండు. అన విని లక్ష్మణుఁడు మంచిదని రథారూఢుండై రామునింటికిం జనెను. ద్వారపాలకుఁడు భరతునికడకేఁగి నమస్కార పూర్వకముగా దీవించి వినయావనతుండై మహారాజావారు మిమ్ముఁ జూడఁగోరుచున్నారు.

అని పలికినంతనే భరతుఁ డాసనంబుననుండి యులికిపడి లేచి కాలినడకతోఁ గడువడిగా రామునికడ కేఁగెను. అంత ద్వారపాలుఁడు శత్రుఘ్ను భవనంబున కేఁగి రఘుశ్రేష్ఠా! మహారాజు నిన్నుఁ జూడనెంచెను. రారమ్ము. మహాశయులైన లక్ష్మణుఁడును, భరతుఁడును గూడవెళ్లియున్నారు. అన శత్రుఘ్నుండు ఆసనంబుననుండి దిగి మహాత్ముఁడైన రామునకు భూమిపై శిరంబుమోపి మ్రొక్కి రాముఁడున్న యెడకు నడచివెడలెను. అంత ద్వారపాలుఁడు రామునియొద్ద కేఁగి నమస్కరించి తమ్ములెల్ల రరుదెంచిరని విన్నవించెను. అదివిని చింతావ్యాకులతేంద్రియుఁడై అవాఙ్ముఖుఁడై దైన్యంబుఁ దోఁప ద్వారపాలునితో నిట్లనియె. ఓరీ! నీవు వేగంబుగనేఁగి కుమారులను సత్వరంబుగా నాయొద్దకుఁ దీసికొనిరమ్ము. వీరు నా ప్రాణప్రియులు. అన రాజాజ్ఞఁ గైకొని శుభ్రవస్త్రములు దాల్చిన రాకుమారులు అడఁకువచే వంగినవారై చేతులు జోడించుకొని యప్రమత్తులై లోపలఁ బ్రవేశించి రాహుగ్రస్తమైన చంద్రబింబంబువలె సంధ్యాకాలమునందలి సూర్యబింబంబువలెఁ గాంతి దొఱఁగిన పద్మంబువలెఁ గళావిహీనమైయున్న యన్న మొగంబును

భాష్పపూర్ణంబులైన కన్నులను గాంచి తత్తరపడుచు వాని పాదంబులపైఁ బడి నమస్కరించి లేచి నిలువఁబడిరి. వారిఁగాంచి రాముఁడును గన్నీరుమున్నీరుగా విడిచి వారినిం గౌఁగిలించుకొని యాసనంబులఁ గూర్చుండుఁడని చెప్పి పిమ్మట నిట్లనియె. సోదరులారా! మీరు నాసర్వస్వము. మీరు నాజీవితము. మీరు కూర్చిపెట్టిన యీరాజ్యంబును నేను బాలించుచున్నాను. మీరు శాస్త్రార్థంబుల నాజితేజిన బుద్ధిగలవారు. మీరందఱుఁగూడి నాచెప్పు కార్యంబు నొఁగాదనక యొనర్పవలెను. అని పలుకఁగానే వారుద్విగ్నమానసులై రాముఁడేమనునో యని యవధానంబుతో నవలోకించుచుండ వారింగాంచి రాముఁడు మొగంబు వెలవెలఁబాఱ నిట్లనియె.

ఇది నలువదినాల్గవ సర్గము

---

## న లు వ ది యై ద వ స ర్గ ము

### శ్రీరాముఁడు భరతాదులకు లోకాపవాదవిధంబు దెల్పుట.

సోదరులారా! మీరెల్లరు వినుఁడు. మీకు భద్రంబగుఁగాక. మీమనంబులన్యథాయత్తంబులు గానీయకుఁడు. నాకు సీతయందుఁగల ప్రేమముంగూర్చి ప్రజలేమనుకొనుచున్నారో చెప్పెద వినుఁడు. మందబుద్ధులు తమ యజ్ఞానమునంజేసి సీతచరిత్రంగూర్చి నిందాస్పదంబుగా వాడవాడలవాకొనుచున్నారు. నాయందు వారికి రోఁత జనించినది. వారి మాటలు నామర్మంబులు భేదించుచున్నవి. నేను మహాత్ములైన ఇక్ష్వాకులకులంబున జన్మించితిని. సీతయు మహాత్ములైన జనకుల సత్కులంబున జనించినది. సౌమ్యా! లక్ష్మణా! విజనంబైన దండకావనంబుననుండి రావణుఁడు సీతనెత్తుకొనిపోవుటయు నేను వానింజంపుటయు నీ వెఱుంగుదువుగదా? అప్పుడే నాకు పరునియింటనుండిన యా సీతనెట్లు పురంబునకుం గొంపోవుదునని సందియము వాటిల్లినది. అంత సీత నాకు నమ్మకము గల్గించుటకై యగ్నిప్రవేశంబు గావించెను. తొల్లి దేవతల సన్నిధిని హవ్యవాహనుఁడును ఆకాశవాణియు, సూర్యచంద్రులును ఋషులెల్లరును సీత యేపాపమెఱుఁగదని పలికిరి. ఇట్లు దేవగంధర్వసమక్షమున అగ్నిపూతయైన సీతను లంకాద్వీపంబున దేవేంద్రుఁడు నాచేత నుంచెను. యశస్వినియగు సీత పవిత్రయని నేను త్రికరణశుద్ధిగా నెఱింగితిని. కావుననే యామెను బరిగ్రహించి యయోధ్యకరుదెంచితిని. ఈ మహాపవాదంబును శోకంబును నా హృదయంబును దహింపఁజేసెను. ఇప్పుడు పల్లెలను బట్నములనుగూడ విపరీతవార్తలు వినఁబడుచున్నవి. ఎంతకాలంబు లోకంబున నెవని యపకీర్తి కీర్తింపఁబడుచుండునో యంతకాలంబు వాఁడు అధోలోకంబున

నివసించుచుండును. దేవతలపకీర్తిని నిందింతురు. కీర్తి లోకంబులఁ బూజింపఁ బడును. మహాత్ములెల్ల గీర్తికొఱకే యెల్లయారంభంబులఁ గావింతురు. అపవాదభయంబున నేను ప్రాణంబులనైన విడుతును. మిమ్ములనైన విడుతును. సీతనువిడుచుటలో నాశ్చర్యమేమున్నది ? కాన శోకసాగరంబున మునింగియున్న నన్ను మీరు చూడుఁడు. నావంటిహీనుని నేనెందునుగానను. ఈ యపవాదమునుమించిన దుఃఖమేది కలదు ?

## శ్రీరాముఁడు సీతాదేవిని వాల్మీకియాశ్రమముచెంత విడువ లక్ష్మణు నాజ్ఞాపించుట.

కాన సౌమిత్రీ ! రేపు వఱువాతనే సుమంత్రుఁడు రథముతోకొని రాఁగా నీవెక్కి సీతనెక్కించుకొని మనదేశాంతమున గంగానది కావలి యొడ్డున నున్న తమసానది నానుకొని స్వర్గతుల్యమగు వాల్మీకియాశ్రమంబు గలదు. అచ్చట నొకవిజన ప్రదేశమున నీమెనువిడిచిపెట్టుము. త్వరగారమ్ము! నీకు శుభమగుఁగాక ! నామాట పాటింపుము. మాఱాడఁబోకుము. లక్ష్మణా! ఆలోచింపకుము. పొమ్ము! నామాట కాదందువా ? నాకుఁ గోపంబు రేకెత్తును. నా పాదములతోడు : నా ప్రాణములయాన. ఔఁగాదని యెవరేని నామాట గీటునంబుత్తురేని వారు నామాట దాఁటిన వారగుట శత్రువులుగఁ దలంతును. నన్ను మీరు గారవింతురేని నా యానతి మేరమీఱకుఁడు. ఇప్పుడే సీతను దీసికొనిపొండు. నాయాడినట్లచేయుఁడు.

గంగాతీరమునంగల యాశ్రమంబులఁజూచివత్తునని యింతకుఁ బూర్వమే సీతాంగన కోరియున్నది. అది నెపంబుగాఁ జెప్పి లక్ష్మణా ! సీతను దోకొనిచనుము. అని వచియించి శ్రీరాముఁడు బాష్పాకులితనేత్రుఁడై సోదరులు వలదని నివారించుచున్నను నిలువక తన భవనంబు ప్రవేశించెను.

ఇది నలువదియైదవ సర్గము

---

# నలువదియాఱవసర్గము

## లక్ష్మణుఁడు సీతాదేవిని ఋష్యాశ్రమములకని పిలుచుకొనిపోవుట.

అంతఁ దెల్లవాఱఁగానె లక్ష్మణుఁడు దీనమానసుఁడై మొగంబువిన్నఁదనంబున వన్నెదఱుగ సుమంత్రునిఁగాంచి యిట్లనియె.

సారథీ! రథంబునకుఁ దురంగంబుల శీఘ్రంబుగాఁ బూన్పుము. రాజభవనమునుండి చక్కని చిక్కని యొక్కమెత్తని మెత్తం దెప్పించి యాసనంబొయత్తపఱుపుము. రాజాజ్ఞను శిరంబునఁదాల్చి ధరణికన్యను బుణ్యా

కర్మమైన నిరాహారుల యాశ్రమంబున విడిచి రావలయును. శీఘ్రముగా రథము తెమ్మన. అన సుమంత్రుఁ డట్లేయని సురుచిరంబును సుఖశయ్యాయుత స్వాస్తీర్ణ విరాజితంబును నగురథంబునకు ఆజానేయంబులఁబూన్చి తోలుకొనివచ్చి మిత్రమానవర్ధనుండగు సౌమిత్రింగాంచి ప్రియా! ఇదిగో అరదంబు సిద్ధపఱచితిని. కర్తవ్యం బాచరింతువుగాక!

అన లక్ష్మణుఁడు రాజగృహంబుచొచ్చి సీతనుగాంచి యిట్లనియె. తల్లీ! నీయుల్లంబు ఋష్యాశ్రమంబులఁ గాంచఁ బల్లవితంబగుట ప్రాణేశ్వరునకెఱింగించితివి. ఆయన యందుల కియ్యకొనియె. దేవీ! రాజాజ్ఞయాటంజేసి నిన్ను గంగాతీరంబునం గల జడదారుల పుణ్యాశ్రమంబులకుఁ గొనిపోవుదును. నీవు మునిజననిలయంబగు యచ్చోట సుఖంబుగాఁ గాలంబు బుచ్చవచ్చు. అన విని సీత నిర్భరానందముచెంది ప్రయాణోన్ముఖయయ్యెను. వెలగలవలువలు, పలుతెఱఁగులరతనములు నాణెంపుభూషణంబులు వివిధ ధనంబులు మునిపత్నుల కిచ్చుటకై కైకొనిరాఁగా సౌమిత్రి యామెను రథంబునఁ గూర్చుండఁబెట్టుకొని రామాజ్ఞను దలంచుచు అశ్వంబులు శశ్వద్గతిం జనుచుండఁ దరలిపోయెను.

### సీతాదేవి అపశకునంబులఁగాంచి పరితపించుట.

లక్ష్మణా! అపశకునంబులు పెక్కులుఁ దోఁచుచున్నవి. నా కుడికన్నదురుచున్నది. మేను వణఁకుచున్నది. హృదయంబు అదవదపడుచున్నది. ఔత్సుక్య మధికమగుచున్నది. అధైర్యము హెచ్చగుచున్నది. లోకంబెల్లఁ పాడుపడినట్లగపడుచున్నది. భ్రాతృవత్సలా! మీయన్న సుఖంబున్నవాఁడు గదా? పల్లెలను పట్టణములను నెల్లరకుఁ గుశలమే గదా? అని సీత దోసిలి యొగ్గి దేవతలం బ్రార్థింప, నామెంగాంచి లక్ష్మణుఁడు శిరంబువంచి మ్రొక్కి యెందువాఱినడెందంబుతో అందఱకు సుఖంబనిచెప్పి గోమతీతీరంబునఁ గల యాశ్రమంబు దరియంజని యందారేయి వసియించి ప్రభాతంబునలేచి సూతుంగని రథంబు వేగంబుగా సిద్ధపఱుపుము. నేనిప్పుడేపోయి కైలాసంబు మహేశ్వరునిఁబోలె భాగీరథీజలంబు శిరంబునం దాల్చెదను. అన వాఁడు మనోజవంబులగు నాలుగుగుఱ్ఱంబులను రథంబునకుఁ బూన్చి వాగెలాగి, దేవీ! రథంబెక్కుమని ప్రార్థించి లక్ష్మణుని సీతను గూర్చుండఁబెట్టుకొని గంగానదిచెంతకుం జేర్ప విశాలాక్షియగు సీత మిత్రసుమంత్రులతోఁగూడ పాపనాశినియగు గంగను గాంచెను. అంత నర్ధదివసంబున భాగీరథింగాంచి లక్ష్మణుండు దీనాతిదీనుండై దుఃఖంబు నాఁపుకోలేక బావురని యేడ్వఁదొడంగెను.

## సీతాదేవి లక్ష్మణు నూరార్చుట.

ధర్మజ్ఞా! లక్ష్మణా! నేను జిరకాలంబుననుండి గోరుచున్న జాహ్నవీ తీరంబును నన్నుఁజేర్చి యేల యీలీల వాపోయెదవు. సంతోషింపవలసిన యీ సమయంబున నన్నేమిటికి విషాదంబున ముంచెదవు. నీవెల్లపుడు రాముని నంటియుందువు.

వాని వీడి రెండురాత్రులేగదా యాయెను. అంతమాత్రమునకే యింతవగ నూరనగునా? లక్ష్మణా! రాముఁడు నాకుఁగూడఁ బ్రాణంబుల కంటెఁ గడుప్రియుఁడు. నేను నీవలె విచారించుచున్నానా? అన్నా! బాలి శత్వంబును వీడుము. నన్ను గంగానదిని దాఁటింపుము. ఋషుల దర్శనంబు సేయింపుము. నేనచట ఋషిపత్నులకుఁ బట్టుపుట్టంబులు దివ్యాభరణములు నొసంగెదను. ఋషులకెల్ల అభివాదన మాచరింతును. అందొకరాత్రి మాత్రమే యుండి క్రమ్మఱ మనపురంబున కేఁగుదము. నాకును బద్మపత్రాక్షుఁడును, సింహోర్కస్కుఁడును, కృశోదరుఁడును రమమాణవరుండును అగు రామునింగాంచ మనంబు త్వరపడుచున్నది! అన విని లక్ష్మణుండు కన్నులు తుడుచుకొని నావికుని బిలువ వాఁడు ఓడ సిద్ధంబుగా నున్నదనెను.

ఇది నలువదియాఱవ సర్గము

---

## న లు వ ది యే డ వ స ర్గ ము

### లక్ష్మణుఁడు శ్రీరామాజ్ఞ చెప్పలేక యేడ్చుట.

అంతవిశాలమైనదియు, గదులు గలదియునగు నా నావపైని సీతను ముందుగా నెక్కించి పిమ్మటఁ దానెక్కి సుమంత్రు నుండుమనిచెప్పి శోక సంతప్తుఁడై నావికునిఁ బడవ త్రోయుమని యావలిగట్టునకుంజేరి డగ్గుత్తికతోఁ బ్రాంజలియై సీత కిట్లనియె.

అన్న నన్నిట్టి కట్టఁడి కార్యము చేయఁబంచి లోకనిందల బ్రుంగఁ జేసెను. అది హృదయశల్యమై బాధించుచున్నది. నాకిప్పుడు మరణమైన మృత్యువైన రా రాదా! కట్టా! నన్నేటిరట్టడికార్యమున కన్ననియోగించినాఁడు! లోకులు కాకులై నన్ను నిందింపరా! తల్లీ నన్నను గ్రహింపుము. కోపంబుసూపకుము. అని లక్ష్మణుఁడు కరములుమోడ్చి యేడ్చి భూమిపైఁ బడెను. మృత్యువును గోరుచుఁ బ్రాంజలియై యేడ్చుచున్న లక్ష్మణునిఁ గని మనంబు భృశంబు కలఁపుచెంద సీత యిట్లనియె.

ఇదియేమి లక్ష్మణా! ఇట్లు వగఁగూరెదవు; నిజముచెప్పుము. రాజునకు నేమమేకదా! నీవెందులకు సంతాపమునొందుచున్నావో చెప్పుము. చెప్ప కుంటివా రాజుతోడు! ఇది నాయాజ్ఞ.

లక్ష్మణుఁడు సీతాదేవికి రామాజ్ఞ నెఱింగించుట.

అని ప్రేరేప లక్ష్మణుఁడు విని తలవ్రేలవైచి బాష్పరోధమునఁ గంఠంబు గాద్గదికమ్ము వహింప నిట్టులనియె.

తల్లీ ! పల్లెలను పట్నములను నిన్నుఁగూర్చి యాడికొను దారుణాప వాదమును నిండుకొలువున నాలించి రాముఁడు నన్నీపనికి నియోగించి తాను గృహంబునకేఁగెను. అమ్మా ! నీధవుఁడాడిన వాఁడిమాటలు నేనీడ నాడరాదు. కినుక వెనుకాడించుచున్నది. నిర్దోషవగు నీమహిమ నేనుగన్నార మున్నే కన్నాను. జనాపవాదభీతిచే నిన్ను విడిచెనుగాని మఱొక్కటికాదు. రామాజ్ఞచే నిన్ను నేనాశ్రమభూముల విడిచి వెడలెదను. నీకు వేఁకటిని గల్గినగోర్కుల నెపంబుగా రా జింతలు చేసి పోనడచెను. అదే జాహ్నవీతీరంబున బ్రహ్మర్షుల తపోవనము. అది మిక్కిలి చక్కనిది. పవిత్రమైనది. అందు వసింపుము. విషాదంబు దక్కుము. ఆయాశ్రమము మాపితృపాదుల కిష్టసఖులు విప్రులు మునిపుంగవులు మహాశయులు నగు వాల్మీకులది. నీవా మహాత్ముని పదంబుల భజించి సుఖముగా దినములు గడపుము. ఉపవాసవ్రతంబు నూనుము. ఈలువుఁదనము గాపాడుకొనుము. రాముని సదా మనంబున నిలుపుకొనుము. ఇట్లొనర్చితివేని దేవీ ! నీకు సకల శ్రేయస్సులు గలుగును.

ఇది నలువది యేడవ సర్గము

---

నలువది యెనిమిదవ సర్గము

శ్రీరామాజ్ఞ విని సీతాదేవి విలపించుట.

లక్ష్మణుఁడాడిన దారుణవాక్యము లాలించి భూజాత దుఃఖాక్రాంతయై మూర్ఛిల్లి ముహూర్తకాలంబునఁ దెప్పిఱిల్లి బాష్పాకులితనేత్రయై లక్ష్మ ణునిఁగాంచి దైన్యంబుగదుర నిట్లనియె.

అన్నా! లక్ష్మణా ! నాయిూతనువు దుఃఖములనుభవించుటకే బ్రహ్మచే సృజింపఁబడెఁగావలయు. నాజన్మము నాకు దుఃఖమూర్తిగాఁ దోఁచుచున్నది. పూర్వజన్మముల నేను ఏమిథునంబులఁ బాయఁజేసి వారేడ్చుచుండఁగా నవ్వు చుంటినో యాపాపము నన్నిపుడు కట్టికుడుపక పోవునా ? అట్లుగాదేని పవిత్రచరిత్రనగు నన్నేల నాథుఁడు విడిచిపుచ్చును! సౌమిత్రీ ! మున్ను నేను

దుఃఖపరంపరలఁ దొప్పఁదోఁగుచున్నను శరణ్యంబగు రామపాదానువర్తినై బ్రతుకఁగంటిని. నేనిప్పు డొంటరిగా నిర్జనారణ్యంబున నెట్లు వసియింతును? నాదుఃఖంబు నెవ్వరితో వెళ్లఁబోసికొందును. లక్ష్మణా! మునులెల్ల గుమిగూడి వచ్చి నీవేమి చెడుకార్యమొనర్చితివి? ఎట్టి దుడుకుఁబోకలఁబోతివి? ఏమిటికి రాముఁడు నిన్ను అరణ్యముల పాలుచేసెను? చెప్పుమని యడిగిన నేమి చెప్పుదును? సౌమిత్రీ! నానాథుని రాజవంశము పరిహాసభాజనంబు కాద యేని నేనిదే నాప్రాణములను గంగాభవాని కర్పింతును. తండ్రీ! సుమిత్రానందనా! రాజాజ్ఞ పరిపాలింపుము. దుఃఖభాగినినగు నన్ను విడిచిపెట్టుము. రాజాజ్ఞయందు నిలువుము. నాయీమాట నాలింపుము.

సీత రామాదులకుఁ దుదివాక్యములు చెప్పి పంపుట.

అన్నా! లక్ష్మణా! అయోధ్యకుఁ జనుము. ముగ్గురత్తలకు మ్రొక్కితి ననుము. రాజునకు నానమస్సు లర్పింపుము. తన క్షేమంబు నడిగితిననుము. అందఱకు నావందనము లందఁజేయుము. రాజేంద్రునితో ధర్మమార్గంబు తప్పవలదనుము. సీత నిర్మలస్వాంత, పూత, హిత, పరమభక్తియుత యగుట నీవెఱింగినదే యనుము. అపవాదమునకు జంకిన తనచే విడువఁబడితి ననుము. తానే నాకుఁ బరమగతి యనుము. తనయపయశంబుఁ బాపనే నర్హ ననుము. మఱియు నామాటలుగా నిట్లనుము. సోదరులవలెఁ బౌరులను గాపాడుమనుము. ఇదే పరమ ధర్మమనుము. ఇదే యనుత్తమ కీర్తియనుము. నామేను దుఃఖంబునఁ గృశించుచున్నందులకు వగవననుము. జనాపవాదమునకు వగతుననుము. పతియే నాకు గతి. పతియే నాకు దైవము. పతియే నాకు బంధువు. పతియే నాకు గురువు. పతియే నాకుఁ బ్రాణాధికుఁడు. కావున భర్తకార్యంబు శిరంబున వహించి చేయుట యీదాసురాలి పనియనుము.

అని పలుకుచున్న సీతనుగాంచి లక్ష్మణుఁడు దీనాననుండై సిరంబు నేలఁదాఁక మ్రొక్కి దుఃఖంబువెల్లువ మాట్లాడనేరక

లక్ష్మణుఁడు సీతయాజ్ఞగొని మరలి గంగఁదాఁటుట.

ప్రదక్షిణ మాచరించి, గోలుగోలున నేడ్చుచుఁ దిరిగి నావనెక్కి పడవపోనిమ్మని యావలియొడ్డునకరిగి శోకభరసమన్వితుండై యాధునిమాడ్కి విలపించుచు రయంబున రథంబునెక్కె; యావలియొడ్డున నేలపైఁబడి దిక్కు లేని దానివలె వెక్కివెక్కి పొక్కుచున్న యన్నవలాతలవహానికమును జూచుచుఁ జనెను.

దవ్వుదవ్వుల కరిగిన రథంబును లక్ష్మణునిఁ జూచిచూచి దిగులుచెంది గుండెలు పగులఁగా యశోధనయగు సీత దుఃఖభారమున వంగిపోయి నెమిలి కూంతల మాఱుమ్రోఁగుచున్న యావనంబున నెలుఁగెత్తి యేడ్చుచుండెను.

ఇది నలువది యెనిమిదవ సర్గము

---

## నలువదితొమ్మిదవ సర్గము

### మునికుమారులు వాల్మీకికి సీతా వృత్తాంతము తెలుపుట.

అట్లు విలపించుచున్న సీతనుగాంచి మునికుమారులు బుద్ధిమదగ్రణి యగు వాల్మీకియొద్దకుఁ బరువిడి అభివాదనమాచరించి యామె విలాపంబు సర్వంబు నిట్లు నివేదించిరి.

మౌనిచంద్రా! ఏమహాత్ముని యిల్లాలో కాని గంగాతీరమున గోం తెండ నేడ్చుచున్నది! ఆమె శ్రీదేవి కానోపును. మున్నెన్నఁడు నామెను గాంచియుండలేదు. ఆకాశంబుననుండి వచ్చిన దేవకాంత కావలయును. ఆమె యెవరో యారయుము! ఉత్తమాంగన కాని యన్యకాదు! ఆల్లగరఁగ నేడ్చు నామెను మేము కనివచ్చితిమి. దిక్కుమొక్కు లేక యామె యట్లు విలపింపఁ దగదు. ఆమె మానవకాంతగాఁ దోఁపదు. ఆతిథ్యంబీయ నర్హురాలు. మన యాశ్రమముపొంతనే యున్నది. కాన మీరవశ్యము శరణంబు కావలయును. కాపాడువారు లేక వాపోవు నామెను గాపాడ మీరెయర్హులు. అన విని వాల్మీకి దివ్యదృష్టి నామె వృత్తాంతమునరసి, సీతగా నెఱింగి వెంటనంటి శిష్యులు పరువిడిరాఁగా సురుచిరంబైన యర్ఘ్యంబుగైకొని కాలినడకతో జాహ్నవీతీరంబున కరిగి యనదయై పడియున్న రాముని యిష్టసఖినిఁ గాంచెను.

### వాల్మీకి సీతాదేవి నూఱార్చి యాశ్రమంబునకుఁ దోడ్కొని వెళ్లుట.

మునిపుంగవుఁడగు వాల్మీకి శోకభారార్తయగు సీతంగాంచి తన బ్రహ్మతేజంబున నామెను సంతోషపెట్టుచు మధురవాక్యంబుల నిట్లనియె. పతివ్రతా! నీవు దశరథుని కోడలవు. రాముని పట్టమహిషివి. జనకుని ముద్దు పట్టివి. నీకిదే స్వాగతమమ్మా! నీరాకకుం గారణంబు నే యోగదృష్టిచేఁగాంచి తిని. ముల్లోకములం గలుగు వృత్తాంతంబులు నాకు విదితంబులే, తపోదృష్టిచే నీవే పాపమెఱుంగవని కంటిని. అమ్మా! భయపడకుము. నీవు నాయొద్ద నుండుము. నాయాశ్రమంబదిగో అందున్న తపస్వినులు బిడ్డా! నిన్ను గోవుతే గము నాకిన చందంబునఁ గాపాడఁగలరు. ఇదిగో నీయర్ఘ్యమును గొనుము. ఉమ్మలిక వీడి నెమ్మదింగాంచుము. స్వగృహంబునంబోలె నిందుండుము. అని

భాషించిన మునీంద్రుని పరమాద్భుతవాక్యంబు లాలించి సీత వాని చరణంబులకు శిరంబుమోపి మ్రొక్కి చేతులు మోడ్చికొని వాని వెంబడించజనెను.

### వాల్మీకి సీతాదేవిని మునిపత్నుల కప్పగించుట.

సీతం దోడ్కొనివచ్చు సంయమీంద్రులఁగాంచి మునిపత్నులు సంతసంబుతో నెదురేఁగి యిట్లనిరి. "మునీంద్రా! స్వాగతము. చిరకాలంబున కరుదెంచితిరి. మానమస్కారము లందుకొనుఁడు. మాచేయుపను లాజ్ఞాపింపుఁడు." అన విని వాల్మీకివారి కిట్టులనియె. "ఈవచ్చిన యామె సీత. రాముని యర్థాంగి. దశరథుని కోడలు. జనకుని కూఁతురు. నిర్దోషయయ్యు నీమెభర్తచే విడువఁబడినది. నే నీమెను గంటికిం రెప్పవోలెఁ గాపాడవలయును. నాయందలి గౌరవంబుచే మీరీమెను అధికస్నేహంబుతో నారయుచుండవలయును." అని చెప్పి సీతను బరిపరివిధంబుల నోదార్చి వాల్మీకి శిష్యపరివృతుఁడై నిజాశ్రమంబున కరిగెను.

ఇది నలుబదితొమ్మిదవ సర్గము

---

## ఏఁబదవ సర్గము

### లక్ష్మణుఁడు శ్రీరాముని గుఱించి సుమంత్రునితోఁ జెప్పి దుఃఖించుట.

ఆశ్రమంబునఁ బ్రవేశించిన సీతంగాంచి లక్ష్మణుండు ఘోరదుఃఖంబు నొంది మంత్రియు సారథియునైన సుమంత్రునింగాంచి యిట్లనియె. "సారథీ! శుద్ధచరిత్రయగు సీతావియోగంబున రామునికింగల్గిన దుఃఖంబు నారయుము. ఇంతకుమించిన దుఃఖము రామున కేమియున్నది. రాముఁడు సీతను విడనాడుట దైవ(యోగంబుగాని) యన్యంబుగాదు. దైవంబు నతిక్రమింప నెవ్వంఁడు సమర్థుండు! దేవదానవ గంధర్వ, రాక్షసులను, బరిమార్చిన రాముఁడే నేఁడు దైవమున కగ్గమైనాఁడు. మున్ను మాయన్న పితృవాక్యపరిపాలనకై విజనంబైన దండకావనంబునఁ బదునాలుగేండ్లు వసించెను. అంతకంటె నీ సీతావియోగము సైఁచుట దుర్భరంబు, దుఃఖతరము. పౌరులమాటపాటిగాఁగొని ఆలిని వీడిన రాముఁడెంత దయావిహీనుఁడు! యశోహానిగలిగించు నీ నిందమోపి నీచులైన పౌరులేమి బావుకొనిరి."

### సుమంత్రుఁడు లక్ష్మణునకు మనస్తాపోపశమనంబు చేయుట.

అన విని ప్రాజ్ఞుఁడైన సుమంత్రుఁ డిట్లనియె. లక్ష్మణా! సీతంగూర్చి వగవకుము. తొల్లి బ్రాహ్మణులు నీ తండ్రితో నిట్లనిరి. మహారాజా! దశరథా! రాముఁడు దురదృష్టవంతుఁడు. తఱచుదుఃఖముల పాలగుచుండును. ప్రియుల

నెడఁబాయును. సిన్నును సీతను శత్రుఘ్నుని భరతునిఁగూడ రాముఁ డెడఁబాయును. దీనిని నీవు భరతునితోఁగాని రామునితోఁగాని చెప్పకుము. దుర్వాసుఁడు, నేనును దశరథుండును వసిష్ఠమహర్షియు వినుచుండ నీవృత్తాంత మెఱింగించెను. మీతండ్రి మహాజనసమీపంబున దుర్వాసుఁడాడిన యీ మాట యెక్కడను బొక్కనీయకుమని నాతో నొక్కిచెప్పెను. రాజాజ్ఞ దాఁటరానిదగుటచే నీ సంగతి యెవరికిం జెప్పలేదు. నీతోఁగూడఁ జెప్పరాదు. కాని వినఁగోరుదువేని వినుతును. ఆలకింపుము. ఇది కడుంగడు రహస్యవృత్తాంతమని మీ తండ్రి చెప్పియున్నను నేను నీకుఁజెప్పుచున్నాను. దైవాజ్ఞ దాఁటరానిది గదా ? నీ విట్టి దుఃఖంబునఁగలఁత నొందుచుండుటంగాంచి నీ దురవస్థ తొలఁగించి నీకు శుభంబొనఁ గూర్పనెంచి యీ వృత్తాంతంబు నెఱిఁగించుచున్నాను. నీ విది భరతునకుఁగాని, శత్రుఘ్నునకుఁగాని చెప్పరాదు సుమీ ?

అట్లు గంభీరార్థంబుగాఁ బలికిన సుమంత్రుని వాక్యంబు లాలించి సౌమిత్రి నీ చెప్పినట్లరెయొనర్తు. ఆకథ వివరింపుమనెను.

ఇది యేఁబదియవ సర్గము

---

ఏఁ బ ది యొ క ట వ స ర్గ ము

దశరథ దుర్వాసుల సంభాషణము సుమంత్రుఁడు లక్ష్మణునకుఁ దెలుపుట.

సుమంత్రుఁడు దుర్వాసమహాముని చెప్పినచొప్పున నిట్లు చెప్పఁ దొడఁగెను. పూర్వము అత్రిపుత్త్రుఁడైన దుర్వాసమహాముని పవిత్రమైన వసిష్ఠాశ్రమమున వర్షాకాలమునఁ జాతుర్మాస్యనియతి నెఱపుచుండెను. ఆసమయంబునఁ బ్రతాపశాలియుఁ గీర్తిమూర్తియునగు మీ తండ్రిగారు తమ పురోహితులైన వసిష్ఠుల దర్శింప నేతెంచి పట్టపగలింటి సూర్యునివలె వెలుఁగొందుచున్న వసిష్ఠుని, వాని సవ్యపార్శ్వమందున్న కొండొకమహామునినిఁ గాంచి, వినీతుండై నమస్కరించిన నాఋసులు దశరథ రాజేంద్రుని స్వాగతం బడిగి యర్ఘ్యపాద్యములు కందమూలఫలంబులు నొసఁగి సత్కరించి యాయా కథలు వినిచిరి. అంత మధ్యాహ్నమగుడుఁ గథాకథనసమయంబున మహారాజు అడఁకువదోఁప దుర్వాసమునీంద్రునితో నిట్లనియె.

స్వామీ ! మావంశము భూమినెందాఁక నుండును ? రామచంద్రుఁ డెన్నేండ్లు జీవించును ? తక్కిన పుత్త్రు లెంతకాలము బ్రతుకుదురు ? రాముని కెందఱు కొడుకులు కలుగుదురు ? వారి యాయుఃప్రమాణ మెంత ? నా వంశ మెట్టిది. ఆనతిమ్ము. ప్రార్థించుచున్నాను.

## భృగుమహర్షి విష్ణువును శపించుట.

అని యడిగిన దశరథుని వాక్యములాలించి దుర్వాసుఁ డిట్లనియె.

రాజా! వినుము! ఇది పూర్వగాథ! పూర్వమొకప్పుడు దేవాసురులకు యుద్ధంబు ప్రవర్తిల్లినది. దేవతలకు వెఱచి రాక్షసులు భృగుపత్నిని శరణు చొచ్చిరి. ఆమె వారికభయంబొసఁగెను. వారు నిర్భయంబుగా నామెకడ నుండిరి. అది కని వెన్నుఁడు కన్నుల నిప్పుకలు రాలఁ దననిశితచక్రధారచే నామె శిరంబును నఱకెను. తనపత్ని నఱకఁబడుట కాంచి భృగుమహర్షి శత్రువంశ నాశంకరుఁడగు విష్ణువు నిట్లు శపించెను. జనార్దనా! నీవు అవధ్యయగు నా భార్యను క్రోధమూర్ఛితుఁడవై చంపితివి. కాన మనుష్యలోకంబున జన్మించుము. అక్కడ భార్యావియోగంబునఁ బెక్కువత్సరంబులు తపియింపుము. అని శపించి భృగువు అయ్యో భగవంతునేల శపించితిని. ఎంతపాపంబుచేసితిని. అని పశ్చాత్తప్తుఁడై చిరకాలంబు విష్ణువును బూజించెను. వాని తపంబునకు మెచ్చి భక్తవత్సలుఁడగు విష్ణువు లోకహితార్థం బాశాపంబు గ్రహించి వాని ననుగ్రహించి విడిచెను.

## శ్రీరామవృత్తాంతము దుర్వాసుఁడు దశరథున కెఱింగించుట.

ఆ మహావిష్ణువే నీకుఁ గొడుకైపుట్టి ముల్లోకంబుల రాముఁడని ప్రఖ్యాతిఁ గాంచెను. ఇతఁడు భృగుశాప ఫలంబును ననుభవించును. అయోధ్యకు రాజై చిరకాలము పరిపాలించును. అచ్చట దీర్ఘకాలభార్యావియోగంబు గూడ సంభవించును. వాని తమ్ములు సౌఖ్య సమృద్ధులు గాంతురు. పదునొకండువేల సంవత్సరంబులు రాముఁడు రాజ్యమేలిపిమ్మట బ్రహ్మలోకంబు (వైకుంఠము) చేరంజనును. లెక్కకు మిక్కిలి యశ్వమేధంబు లాచరించును. అనేక రాజవంశములను నెలకొల్పును. సీతవలన రాముఁడిరువురు పుత్రులను గాంచును. వారయోధ్యను జన్మింపరు. వేఱొక్కచోటఁబుట్టుదురు. ఇది సత్యము. సందియములేదు. పిమ్మట రాముఁడా సీతానందనులకుఁ బట్టాభిషేక మొనర్చును.

అని దుర్వాసుఁడు రాజవంశముయొక్క గతాగత చరిత్రయెల్లఁజెప్పి యూరకొన్నంత దశరథుఁ డామునులకు మ్రొక్కి తన పురంబునకు మరలిచనెను. తొల్లి యా మునిచెప్పిన యీ వృత్తాంతము నేను విని హృదయంబున దాచి యుంచితిని. ఇది తప్పదు. కాన లక్ష్మణా నీవేల యూరక పరితపింతువు. సీతనుగూర్చిగాని రామునిఁగూర్చిగాని వగపునొందకుము. దృఢచిత్తుఁడవుకమ్మి.

అని సూతుఁడు చెప్పిన పరమాద్భుత వాక్యంబు లాలించి సౌమిత్రి పరమానందంబునొంది మేలు మేలని కొనియాడెను. అంత సుమంత్ర లక్ష్మణు లిరువురు 'పిచ్చపాటి' ముచ్చటించుకొనుచుఁ జనుచుండ సూర్యుఁడ స్తంగతుఁ డాయెను. అత్తఱి వారు గోమతీతీరంబున విడిసిరి.

ఇది యేఁబదియొకటవ సర్గము

---

## ఏఁ బ ది రెం డ వ స ర్గ ము

### లక్ష్మణుఁడు శ్రీరాము దర్శింపఁ బోవుట.

అల్లారాత్రి గోమతీతీరంబునఁ గడపి ప్రభాతంబు గాఁగానే లేచి లక్ష్మణుఁడు తిరిగి పయనమైచనెను. అంత లక్ష్మణుండు మార్తాండుండు గగన మధ్యంబు నలంకరించునంతకు చిరత్నరత్నపూర్ణంబును హృష్టపుష్టజనావృతం బును నగునయోధ్యాపట్టణంబు సేరంజనుచు దీనాననుండై 'నేను రామపాదసన్నిధికేఁగి యేమని విన్నవింతును'? అని తలంచుచుఁ జంద్ర సన్నిభంబగు రామమందిరంబు నెదుటఁగాంచి దరియంజని రథావతరణంబు చేసి, మోమువాంచి మనంబున ఘనంబగు దైన్యంబునొంది నిరాతంకంబుగా లోనికింబోయి దీనుఁడై యుత్కృష్టాసనంబునఁ గూర్చున్న రాముని అశ్రు పూర్ణనేత్రుఁడై దర్శించి పాదంబులకెఱఁగి యిట్లనియె.

### లక్ష్మణుఁడు సీతా వృత్తాంతంబుచెప్పి శ్రీరాముఁ నూఱార్చుట.

ఆర్యా! మీయాజ్ఞ శిరంబునధరించి యశస్వినియు శుద్ధాచారయునగు జనకాత్మజాతను మున్నిడికొని తాము సెలవిచ్చిన గంగాతీరంబుననున్న వాల్మీకి పుణ్యాశ్రమంబున విడిచిపుచ్చి తిరిగి తమపాదంబులఁ గొలువ వచ్చితిని. పురుషశ్రేష్ఠా! వగపుఁజెందకుము. కాలగతి యిట్లున్నది. నినువంటి సత్యవంతులు, జ్ఞానులు వగలపాలు గారాదు. ధనములెల్ల దంధనములే, పెరుఁగుట విఱుగుటకే, సంయోగంబు వియోగంబునకె, పుట్టుట గిట్టుటకె, కాన రామచంద్రా! పుత్త్రులందుఁ, గళత్రములందు, మిత్రులందు, ద్రవ్యంబులందు అధికాశ పెట్టుకొనరాదు. వాని నెప్పటికో యొకప్పటికి నెడఁబాయుట ధ్రువము. నీవు ఆత్మచే నాత్మను, మనంబుచే మనంబును, సర్వలోకంబులను లోపఱచు కొన శక్తుండవు. అట్టి నీకిట్టి విచారంబుడుగుట యెట్టిఘనకార్యము? నీవంటి పురుషశ్రేష్ఠులు అవివేగకలంబునఁ దగులరాదు. నిన్ను వ్రేలువెట్టి యెవ్వరును జూపరాదు. ఏయపవాదభయంబున నీవు సీతను విడిచితివో, యాయపవాదమే యిపుడు సీతలకెక్కును. లోకులు కాకున్నై నిన్ను నిందింతురు. సందియంబు లేదు. కాన పురుషశార్దూలా! ధైర్యంబు వహింపుము. దుర్బలత్వము

విడనాడుము. సంతాపముఁ దొఱంగుము. అనియిట్లు మిత్రవత్సలుండైన లక్ష్మణుండు పలికిన విని శ్రీరాముఁ డిట్లనియె,

లక్ష్మణా! నీవుచెప్పినదంతయు నొప్పిదంబ. నీవు మదాజ్ఞ చెల్లించి నందులకుఁ జాలసంతసించితిని. తివుటఁదియ్యని నీమాటలు నాగాటంపు సంతాపంబపనయించెను. మనంబు కుదురువడియెను.

ఇది యేఁబది రెండవ సర్గము.

---

## ఏఁబదిమూఁడవ సర్గము

### శ్రీరాముఁడు లక్ష్మణునకు నృగుచరిత్రము దెలుపుట.

లక్ష్మణుని పరమాద్భుతవాక్యంబు లాలించి సంతసించి రాముఁడుక్ర మ్మఱనిట్లనియె. లక్ష్మణా! ఇట్టి క్లిష్టసమయంబున నీయట్టి బుద్ధిమంతుఁడు లభించుటదుర్లభంబు. నీవెల్ల విధంబుల నన్నుంబోలిన వాఁడవు. నామనంబున నొక తలంపుగలదు. నాలుగు నాళ్లనుండి నేను రాచకార్యంబులు చక్కఁబెట్టుట లేదు. దాన నాయూయంబులెల్ల గాయంబులగుచున్నవి. ప్రకృతులను, బురోహితులను, మంత్రులను, గార్యార్థులను, బురుషులను, స్త్రీలను, బిలువనంపుము. ఏనాఁటి కానాఁడు పౌరకార్యంబులు దీర్పనిరాజు, మృతుండై నిస్సంశయంబుగా ఘోరనరకంబునం బడును

వినలేదా నీవు; నృగమహారాజును గూర్చి. అతఁడు మహాశయుఁడు, బ్రహ్మణ్యుఁడు, నిత్యసత్యవ్రతుఁడు. పవిత్రుఁడు. ఒకనాఁడాతఁడు పుణ్యతీర్థంబున రత్నభూషితలును సవత్సలును నగుకోటియావులను సదక్షిణంబుగా బ్రాహ్మణుల కొసంగెను. దరిద్రుండును, ఉంఛవృత్తిచే జీవించువాఁడును, ఆహితాగ్నియు నైనయొక్కబ్రాహ్మణునియావు దూడతోఁగూడ నాదానం బిడిన యాలమందనే గలిసియుండెను. పోయిన యావు నరయుచు వెదకికొనుచు నాబ్రాహ్మణుండు క్షుధార్తుడై యెల్లరాజ్యంబులను బెక్కేండ్లు తిరిగి యెచ్చటను దొరకనుగానక, కనఖలంబను గ్రామంబునకువచ్చి బక్కచిక్కిన దూడతోఁ దెవులులేని తన యావు నొక బ్రాహ్మణుని యింటఁగాంచి శబలా! రమ్మని తా నిడ్డ పేరుతోఁ బిలువ నది యాతని మాటగుర్తించి యగ్నితుల్యుఁడగు వానిని వెంబడించి పోవుచుండెను. ఇంతకుమున్ను దానిని గాచుచున్న విప్రుఁడు వాని కడ్డుదగిలి వానిచేయిపట్టుకొని యిది నాయావు. నృగమహారాజు నాకు దానమిచ్చెను. దీని నెచటకుఁ దోలుకొనిపోదువని మూదలించెను. అంత వారిరువురకు వివాదంబు వాటిల్లఁ దగవుదీర్చుకొన రాజునొద్ద కేఁగుచో రాజభవన ద్వారంబున ద్వారపాలకులచే నడ్డుకోఁబడి యెన్నియో రేయింబవళ్లు

చటనే పడి గాపులుపడియుండి రాజు దర్శనంబుగాక సంతప్తహృదయులై శార్ద్రమూర్తులై, కార్యార్థులై వచ్చిన యర్థులకు దర్శనంబీయక గికురించితివి. కాన, భూతంబుల కెల్ల నదృశ్యుండవై, యూసరవెల్లివై వెక్కువేలేండ్లు యొక్క బిలంబునఁబడి యుండుము. నరుఁడును, నారాయణుఁడును ధరణీభారమడంప ద్వాపరాంతంబున భూలోకంబున జన్మింతురు. కృష్ణుఁడు యదుకులంబున నుద్భవించును. వానిచే నీవు విముక్తింగాంతువు. అని శపియించి, బలహీనయు వృద్ధయు నగునా మొదవును వేఱొక బ్రాహ్మణునకు దానమొసంగి తమ దారిఁజనిరి. ఆరాజిప్పటికిని దారుణంబగు శాపం బనుభవించుచున్నాఁడు. కార్యార్థులకుఁ గలహంబు గల్గుటకుఁ గారణంబు ప్రభుదోషంబే. కాన నా దర్శనార్థ మెవరేని వచ్చిరేమో చూచిరమ్ము. పార్థివుఁడు తాఁజేయని కార్యం బు ఫలంబునందనేరఁడు. కాన సౌమిత్రీ! వెళ్లుము! కార్యార్థులకై వేచి యుండుము.

ఇది యేఁబదిమూఁడవ సర్గము

---

## ఏఁ బ ది నా ల్గ వ స ర్గ ము

### నృగోపాఖ్యాన శేషము.

అది వచించిన రామునివాక్యము లాలించి పరమార్థవేదియగు లక్ష్మ ణుండు ప్రాంజలియై యిట్లనియె. రామచంద్రా! ఈ యల్పాపరాధంబునకే నృగమహారాజునకు బ్రాహ్మణులు యమదండమునుబోని శాపం బొసఁగిరి గదా? అది విని నృగమహారాజు బ్రాహ్మణుల కేమనెను? అని యడుగ రాముఁ డిట్లనియె. అంత నృగమహారాజు బ్రాహ్మణులు తమదారినిఁ దాము పోయిరని విని మంత్రులను వేదవిదులగు పురోహితులను, పౌరవర్గంబును రావించి దుఃఖాక్రాంతుఁడై యిట్లనియెను. "అనిందితులు విప్రులునగు నారద పర్వతులు నాకు ఘోరశాపంబొసంగి వాయురూపంబులఁ ద్రిభువనంబులం జరించుచున్నారు. వీఁడు నాకుమారుఁడు వసువనువాఁడు. వీనిం బట్టాభిషిక్తుం జేయుఁడు శుభ్రంబును, సుఖస్పర్శంబును నగు బిలంబును శిల్పులచే త్రవ్వింపుఁడు. అందుండి బ్రాహ్మణశాపంబు నే ననుభవింతును. ఒకబిలంబు వర్షఘ్నంబు; మఱొకబిలంబు హిమఘ్నంబు; వేఱొకబిలంబు గ్రీష్మ ఘ్నంబుగాఁ ద్రవ్వింపుఁడు. ఫలవంతంబులగు వృక్షంబులును, పుష్పవతులగు లతలను, నీడలిచ్చుపొదలను, బెక్కింటిని వాని చుట్టునుబెంచి యెల్లకడల చక్కఁదనంబుల కెక్కులగునట్లు చేయింపుఁడు. శాపాంతంబు నొందువఱకే నచటే వసించెద. అర్ధయోజనంబుదాఁక సుగంధపుష్పంబులు వానిచుట్టు విల

సిల్లఁజేయుఁడు.'' అని యాజ్ఞాపించి కుమారుఁడైన వసువునుబిల్చి ''తండ్రీ! ధర్మమార్గంబువీడక క్షత్త్రధర్మంబు వదలక ధాత్రినేలుము. అపరాధలేశ మునకై నాకు విప్రులు విపరీతశాప మొసంగిరి. కోపింపకుము, సంతాపింప కుము, దైవంబు నిపుణమైనది. దానిచే నే నిట్టి వగలపాలైతిని. వచ్చునవి రాకమానవు. పోవునవి పోకమానవు దుఃఖములుగాని, సుఖంబులుగాని పొందఁదగినవి పొందక తీరదు; బిడ్డా! నేను ప్రాగ్జన్మంబున మహాపాపం బొనర్చితిని. దానంజేసి యీ దుఃఖంబు సంప్రాప్తమైనది. నాయనా! నీవు విచారింపకుము'' అనిచెప్పి నృగమహారాజు రత్నమండితంబైన బిలంబుఁ జొచ్చి రోషావేశంబున బ్రాహ్మణులొసంగిన శాపం బనుభవించుచుండెను.

ఇది యేఁబది నాల్గవ సర్గము

---

## ఏఁబదియైదవ సర్గము

### శ్రీరాముఁడు లక్ష్మణునకు నిమికథ దెల్పుట.

లక్ష్మణా! నృగుశాప వృత్తాంతంబును సవిస్తరముగ వినిపించితిని. ఇంకే దేనిఁ గథ వినవలతువేనిఁ జెప్పెదనాలింపుము. నావుడు లక్ష్మణుండు ఆశ్చర్య కరంబులగు కథల నింకను వినవలతును. చెప్పుమన రాముఁడు పరమధర్మ యుక్తంబైన నిమికథ నిట్లు చెప్పఁదొడంగెను. ఇక్ష్వాకునకుఁ బండ్రెండవ కుమారుఁడు నిమియనువాఁడు. అతఁడు పరాక్రమమందును, ధర్మమునందును బరి నిష్ఠితుఁడు. వీర్యసంపన్నుఁడు. గౌతముని యాశ్రమమునొద్ద స్వర్గతుల్యమగు నగరంబొకటి నిర్మించి దానికి వైజయంతంబను బేరిడి తానందు వసించుచుం డెను. ఇట్లుండవానికిఁ దండ్రియుల్లంబును బల్లవింపఁజేయు దీర్ఘసత్త్రయాగంబుఁ జేయువలయునని బుద్ధిపుట్టి మనుకుమారుఁడగు తన తండ్రియనుమతిం బడసి బ్రహ్మర్షిశ్రేష్ఠుఁడగు వసిష్ఠుని యజ్ఞకార్య నిర్వాహణమునకుఁ బిల్చి పిమ్మట నాంగిరసుండగు నత్రినిఁ దపోధనుఁడగు భృగువునుగూడ ఋత్విక్కు లుగా నర్థించెను. వసిష్ఠుఁడు తానంతకుమున్నె యింద్రునిచేవరింపఁబడితి ననియుఁ దానువచ్చువఱకు వేచియుండుమనియుఁ జెప్పి చనెను. పిమ్మట బ్రాహ్మణశ్రేష్ఠుఁడగు గౌతముఁడు యజ్ఞకార్యము నిర్వర్తించెను. వసిష్ఠుఁ డింద్రునిచే యజ్ఞంబు చేయించుచుండెను. ఇట నిమి విప్రులను రావించి తన పురంబుచెంగట మహాత్ములపజ్ఞ జన్నంబుచేయుచు దీక్షతో నయిదువేలేండ్లు గడపెను. ఇంద్రుని యజ్ఞంబు పరిసమాప్తి గావించి యనిందితుఁడైన వసిష్ఠుఁడు ఆర్త్విజ్యంబును వహింప నిమియొద్దకు వచ్చి గౌతమునిచే నా యజ్ఞంబు పరి పూర్తిచేయఁబడుట యెఱింగి కోపావిష్టుఁడై రాజదర్శనార్థియై ముహూర్త

శాల మచటఁ గూర్చుండి యుండెను. నాఁడు రాజుగాఢనిద్రాసక్తుఁడై యుండెను. రాజదర్శనముకామికి వసిష్ఠునకుఁ గోపంబువచ్చి రాజా! నీవు నన్నుఁ గాదని తిరస్కరించి యజ్ఞార్థమన్యుని వరించితివి. కాన నీ దేహము చైతన్యము దక్కుఁగాక. అని శపించెను. అంత రాజర్షియగు నిమి మేల్కని వసిష్ఠుని శాపంబు విని క్రోధమూర్ఛితుఁడై ససంరంభుఁడై బ్రహ్మర్షీ! నేను నీ వచ్చుటెఱుంగక నిద్రించుచుండఁ గ్రోధకలుషితుఁడవై రెండవయమదండముంబోని శాపంబునకు నన్నర్గంబు గావించితివి. కాన నీవును అచేతనుఁడవుకమ్ము. నీ దేహముమాత్రము రుచిరత్వ మెడలకుండుఁగాక యని మాఱుశాపమొసంగెను. ఇట్లు వారిరువురు అన్యోన్యము శపించుకొని తత్తుల్యాధిగతప్రభావంతులై విదేహులై యుండిరి.

ఇది యేఁబదియైదవ సర్గము

---

## ఏఁబదియాఱవ సర్గము

### వసిష్ఠుఁడు దేహము ధరించుట.

రామునివాక్యము లాలించి శత్రుసంహారియగు లక్ష్మణుఁడు రామా! ఆ బ్రాహ్మణక్షత్రియు లిద్దఱు మేనులంబాసి క్రమ్మఱ దేహంబు లెట్లుగాంచిరి? అని యడుగ రాముఁ డిట్లనియె. తపోధనులు, ధార్మికులునగు నిమివసిష్ఠులు పరస్పర శాపంబుల దేహంబులు వీడి వాయురూపంబులం దాల్చిరి. శరీరము దొఱంగిన, వసిష్ఠుఁడు మఱియొక శరీరంబు నర్థించుచుఁ దండ్రియగు బ్రహ్మయొద్దఁ కేఁగి వానిచరణంబుల కెఱఁగి యిట్లనియె. తండ్రీ! నేను నిమిశాపంబునంజేసి మేను దొఱఁగి వాయురూపంబున నుంటిని. ప్రభూ! లోకనాథా! దేహములేని వారికెల్లరకు నపారదుఃఖంబు గల్గును. ఎల్లకార్యంబులు లుప్తంబులగును. కాన ననుగ్రహించి నాకు మఱియొక్క దేహంబు నొసంగుము. అని ప్రార్థింప బ్రహ్మయిట్లనియె. బ్రాహ్మణోత్తమా! నీవు మిత్రావరుణుల తేజంబునం జొచ్చి పుడమిని జన్మించి యయోనిజుండవై యధికతపంబొనర్చి మద్వశుండవయ్యెదవు గాక. అని పలికిన వసిష్ఠుఁడు బ్రహ్మకుమ్రొక్కి కడువడి వరుణాలయంబున కరుదెంచెను. ఆ సమయంబుననే మిత్రుఁడు పాలనము క్రమును జేరి దేవతలచేఁ బూజింపఁబడుచు వరుణత్వంబును వహించి రాజ్యంబునేలెను. ఈ సమయంబుననే యచ్చరతలమానికంబగు నూర్వశి చెలికత్తెలం గూడి తలవని తలంపుగా నా సముద్రేశునియొద్దకు వచ్చెను. తనయాలయంబునఁ గ్రీడించుచున్న రూపసంపన్నయగు నూర్వశినిఁగాంచి వరుణుఁడు పరమానందంబుచెంది పద్మపత్రదళాక్షీ! పూర్ణచంద్రనిభాననా! నన్నురతులందేల్పవే యని కోరెను. అది విని యామెప్రాంజలియై సురేశ్వరా! నే నింతకుమున్నే

మిత్త్రునిచే వరింపఁబడితిని. కాన క్షమింపు మన నాతఁడు కందర్పశరపీడితుఁడై వరవర్ణినీ ! నీవు నాతోడిసంగమంబున కియ్యకొనవేని, నిదిగో నా యిం ద్రియంబును దేవనిర్మితమైన యీకుంభంబున విడిచి నీ యందలి కామంబు దీర్చుకొనియెదను.

అన విని యూర్వశి ప్రేమపూర్వకంబుగా లోకపాలా ! నీ కామంబట్లే తీర్చుకొనుము. నా హృదయంబు మాత్రము నీయందే లగ్నమైయున్నది. శారీరక సుఖము మాత్రము మిత్త్రుఁడొందుఁగాక. అని పలుకఁగానే వరుణుఁడు జ్వలదగ్నిశిఖాతుల్యంబగు తన యద్భుతరేతస్సును నాకుంభంబున విడిచెను. అంత నూర్వశి మిత్త్రుఁడున్న యెడకుంజన నాతఁడామెనుగాంచి కోపించి యిట్లనియె. ఓసీ ! దుష్టచారిణీ ! కలుషచరిత్రా ! నీవు మునుమున్న నాచేవరింపఁబడియు నడుమ నన్ను నెడఁబాసి మనంబున మఱెవరినో కోరుచున్నావు. కాన నీ పాపంబునకు ఫలంబుగా మానవజన్మంబునెత్తి కొండొకకాల మచట నివసింపుము. బుధుని పుత్త్రుండును, రాజర్షియుఁ గాశీరాజును నగు పురూరవుఁడు నీ కచటభర్త కాఁగలఁడు. అని పలికి మిత్త్రుఁడుగూడఁ దన రేతస్సును ఆకుంభంబునందే విడిచిపెట్టెను.

అంత నూర్వశి శాపంబు ననుభవింప బుధుని యౌరసపుత్త్రుఁడగు పురూరవునిఁ గూడఁ బ్రతిష్ఠానపురంబునకుఁ జనెను. ఆ పురూరవునకు మహాబలుఁడగు నాయువును, ఆయువునకు నహుషుండును జన్మించెను. అంత నింద్రుఁడు వజ్రాయుధంబున వృత్రుని సంహరించి తత్పాపంబునంజేసి నందం దుఁదిరుగుచుండ నహుషుం డింద్రత్వంబునొంది నూఱువేలేండ్లు స్వర్గంబు నేలెను. అంత సుదతియు, సునేత్రయు, సుభ్రువును నగు నూర్వశి పెక్కు వత్సరంబులు భూలోకంబున వసించి శాపంబు నంతంబు నొందించుకొని పిమ్మట నింద్రసదనమున కేతెంచెను.

ఇది యేఁబదియాఱవ సర్గము

---

## ఏఁబదియేడవసర్గము

### వసిష్ఠుఁడు మైత్రావరుణుఁడై జన్మించుట.

దివ్యమై యద్భుతంబైన యాకథను విని లక్ష్మణుఁడు పరమ ప్రీతినొంది రామున కిట్లనియె.

కాకుత్స్థకులతిలకా ! దేవసమ్మానితులైన యాద్విజపార్థివులు దేహముల నెడఁబాసి పిమ్మట నెట్లు దేహధారులైరి. వినిపింపుమన రామభద్రుఁడు వసిష్ఠుని చరిత్రనిట్లు చెప్పెను.

సోదరా! లక్ష్మణా! మిత్ర వరుణుల తేజంబున్న యాకుంభమునుండి తేజోమయులగు నిరువురు ఋషిసత్తము లావిర్భవించిరి. ఊర్వశీకారణంబున మిత్రుడును వరుణుడును ఏకివ్యఘటంబునఁ దమతమ వీర్యములనుంచిరో యందుండి తొలుత నగస్త్యమునిచంద్రుఁ డుదయించి మిత్రునిఁగాంచి నేను నీపుత్త్రుఁడను గాననిచెప్పి యెందేనిఁ జనెను. మఱికొంతకాలంబునకు వారుణంబైన తేజంబున్న కుంభమునుండి యిక్ష్వాకుకుల దైవతంబగు వసిష్ఠుఁడు పుట్టెను. మిత్రావరుణుల తేజోయుక్తిఁ బుట్టినవాఁడగుట నాతఁడు మైత్రావరుణుఁడని ప్రఖ్యాతిఁ గాంచెను. వసిష్ఠునిఁ బుట్టినవెంటనే మహాత్మునిగా నెఱిఁగి యిక్ష్వాకుమహారాజు వానిని మనకులపురోహితునిగా మన్నించెను.

లక్ష్మణా! వింటివిగదా వసిష్ఠునియపూర్వదేహధారణవిధంబు, ఇఁక నిమి తనువుఁదాల్చినవిధము చెప్పెద నాకర్ణింపుము.

## దేవతలు ఋషులు నిమి కోరిన వరములిచ్చుట.

మనీషులగు ఋషులు విదేహరాజుఁగాంచి యాగదీక్షితుఁడవు గమ్మని యాదేశించి బ్రాహ్మణోత్తములు పౌర భృత్య సమన్వితులై యావిదేహరాజు శరీరమును గంధములతోడను బూలమాలలతోడను బూజించి కాపాడు చుండిరి. అంత యజ్ఞపరిసమాప్తికాఁగానే భృగువు రాజా! నీయెడ సంతసించితిని. నీదు జీవము రప్పించెదను. అన దేవతలెల్ల సంతసించి నిమి ప్రత్యగాత్మతో రాజర్షి! వరము గోరుము. నీ జీవమెక్కడ నున్నదోచూపుము. అని పలికిరి. అదివిని నిమిజీవ మిట్లనియె. దేవతాశ్రేష్ఠులారా! నేను సర్వభూతముల నేత్రముల నిలువఁగోరెదను. అన దేవతలు మంచిది. నీవు సర్వభూతముల నేత్రములయందును వాయురూపమునఁ జరింపుము. వాయురూపంబుననున్న నీవలన సర్వభూతములు విశ్రాంతికై నేత్రనిమీలనము తఱచుఁ గాంచు చుండును. అనిపలికి తమవచ్చినదారినిఁ జనిరి. ఋషులు నిమికిఁ బుత్త్రుఁడు పుట్టుటకై వాని దేహమునుదెచ్చి యందరణియుంచి మంత్రహోమములతో బలిమిమైఁ ద్రచ్చిరి. అందుండి యొకమహాత్ముఁ డుదయించెను. మథనంబునఁ బుట్టుటచే మిథియనియు, జననంబందుటచే జనకుఁడనియు, విదేహమునుండి జనించుటచే వైదేహుఁడనియు నాతఁడు పేరుగాంచెను. అతఁడె మూల పురుషుఁడు. మిథియేలుటఁజేసి యది మిథిలయయ్యెను. లక్ష్మణా! నీకు నిమి వసిష్ఠుల జన్మోదంతమును వసిష్ఠుఁడు రాజశాపమునుండి తొలఁగిన విధమును నిమి బ్రాహ్మణశాపమునుండి తొలఁగినరీతియు నెఱింగించితిని. వింటివిగదా!

ఇది యేఁబది యేడవ సర్గము.

## ఏఁబదియెనిమిదవ సర్గము

### శ్రీరాముఁడు లక్ష్మణునకు యయాతిచరిత్ర తెలుపుట.

అని పల్కిన యగ్నితేజుఁడగు రామునిఁగాంచి లక్ష్మణుఁడు రాజేంద్రా! మహాద్భుతంబును నాశ్చర్యకరంబును నగునిమివసిష్ఠుల పూర్వవృత్తాంతంబు నా కెఱింగించితివి. ధన్యుఁడనైతిని! అన్నా! నిమి క్షత్రియుఁడు శూరుఁడు, విశేషించి యజ్ఞదీక్షవహించినవాఁడుగదా! ఏల క్షమతొఱంగి వసిష్ఠుని శపించెను? తెలుపవేయన రాముఁ డిట్లనియె. సోదరా! పురుషులయందు క్షమయుండుట యరిది. ఒక్కయయాతికిఁదక్కఁ దక్కొరులకు రోషమణఁగించుట శక్యంబుగాదు. కాన సత్త్వబుద్ధితో వానికథ చెప్పెదను. అవహితవతివై వినుము. లక్ష్మణా! నహుషుఁడను రాజునకు యయాతియను కొడుకు గలఁడు. అతఁడు పౌరజనానందవర్ధనుఁడు. వానికి నిరుపమాన రూపవతులగు నిరువురుభార్యలు గలరు. అందొకతె శర్మిష్ఠ. అది వృషపర్వుఁడను రాక్షస రాజుకూఁతురు, యయాతి యామెకు మిక్కిలి గూర్చువాఁడు. రెండవది దేవయాని. ఆతనుమధ్య శుక్రునికూఁతురు. ఆమెయందు యయాతి కంతయనురక్తి లేదు.

ఆసవతుల కిరువురు రూపవంతులగు పుత్త్రులు పుట్టిరి. శర్మిష్ఠకొడుకు పూరుఁడు. దేవయాని తనయుఁడు యదుఁడు. పూరుఁడు స్వగుణములచేతను దల్లివల్లను యయాతికిఁ బ్రేమపాత్రుఁడయ్యెను. అదికని యదువు వగపుచెంది తల్లియొద్దకేఁగి యిట్లనియె.

తల్లీ! నీవు అక్లిష్టకర్ముఁడగు భార్గవునివంశంబున జన్మించితివి. హృద్గతంబగు నీదుఃఖంబును దుస్సహంబైన యీయవమానంబును నెట్లు సహించితివమ్మా! మనమిరువురమును గలిసి యగ్నిఁజొత్తము రమ్మ! రాజు పెక్కురాత్రులు రాక్షసపుత్త్రిఁగూడి రమించునుగాక. నీవీయవమానము నోర్చుకొందువేని నోర్చికొనుము. నాకుమాత్ర మగ్నిఁబడ నాజ్ఞయిమ్ము. నేనొక్క నిముసమైననోర్వఁజాలను. మృతినొందుదును. ఇందు సందియములేదు. అని కన్నీరుజాలువాఱ నేడ్చుచు నాడిన పుత్త్రునిమాట లాలించి దేవయాని కోపంబు నూని తండ్రిని దలఁచెను. భార్గవుఁడు కూఁతు హృద్గతాభిప్రాయము తెలిసికొని ద్రుతగతి నామెయున్నయెడ కరుదెంచి, పలుకు కులుకులేక చేష్టలుడిగియున్నకూఁతుఁగాంచి యిదియేమి తల్లీ! యిట్లుంటివని ప్రశ్నింప నామె యిట్లనియె. తండ్రీ! నేను అగ్నిఁజొచ్చికాని, విషముత్రావిగాని, నీటమునిఁగిగాని ప్రాణంబులు పాసెదను. ఇఁక క్షణకాలమేని జీవింపనొల్లను. నాయనా! దుఃఖములపాలై అవమానంబునకుఁ దావలంబనై యవయుచున్న

నన్ను నీవెప్పుడైనఁ దలఁచితివా? వింటివా! చాలు. నాయనా! చాలు. చెట్టెం డినఁ జెట్టు నంటియున్నయాకులు పూవులు కాయలు ప్రాణులుగూడ వన్నెయు వాసియుఁ దఱిగి ఖిన్నత్వంబు నొందును. అన్నా! మీయల్లుఁడు మిమ్ముఁ దిరస్కరించి నన్నుఁ గన్నెత్తిచూడక యవమానంబు పాలొనర్చినాఁడు. అని పలికిన కొమారిత పలుకులాలించి శుక్రుఁడు కడంగడు నలిగి యీయయాతి దురాత్ముఁడై నన్నవమానించెను. కాన జరాభారంబునఁ జిక్కి క్రుస్కుఁ గాక! యని శపించి కూఁతునోదార్చి నిజనివాసంబునకుఁ జనెను.

ఇది యేఁబదియెనిమిదవ సర్గము

---

## ఏఁబదితొమ్మిదవసర్గము

యయాతి పూరునకు వార్ధకమిచ్చి యౌవనంబు గొనుట.

శుక్రశాపంబున యయాతి ముసలితనంబునొంది పుత్త్రుంగాంచి యిట్లనియె.

యదూ! నీవు ధర్మజ్ఞుఁడవు, నా ముదిమినిఁగైకొని నీజవ్వనంబు నాకిమ్ము! దాన నేను విషయసుఖము లనుభవింతును. నాకింకను విషయభోగంబులఁ దృప్తికలుగలేదు. కామంబు ననుభవించి యనుభవించి, పిమ్మట నా ముసలితనమును నేను గైకొందును.

అన విని యదుఁడిట్లనియె నాయనా! నీ ప్రియపుత్త్రుఁడగు పూరుఁడే నీ జరాభారంబు వహించునుగాక. నీవు నన్నెల్ల విషయంబులందును బహిష్కరించితివి. తుదకు నీదరికైన రానీయవైతివి. నీవు లాలించి పాలించు పూరుండు బంతిఁగుడుచుచు, ఫలాహారంబులఁదినుచుఁ బానీయంబులు త్రావుచు, మృష్టపదార్థంబులమెక్కుచు, నెయ్యంబుతియ్యంబులనుభవించుచున్నాఁడుగదా? వాఁడే నీ ముసలితనంబు పూననిమ్ము. అని సోల్లుంఠనంబుగాఁబలికిన యదుని మాటలాలించి యయాతి పూరునిఁగాంచి నాయనా! నా యీజరాభారంబు గ్రహింపు మన నాతఁడు ప్రాంజలియై తండ్రీ! ధన్యుఁడనైతిని. అనుగ్రహింపఁబడితిని. నీయాజ్ఞ జవదాఁటక పాలింతు నన నాహుషుఁడు (యయాతి) పరమానందభరితుఁడై తన ముసలితనంబును గొడుకున కొసంగి తాను దారుణ్యంబు వహించి, వేలకొలంది యజ్ఞంబులాచరించి పెక్కువేలేండ్లు రాజ్యంబు పాలించెను. ఇట్లు చాలకాలంబు చన యయాతి పూరుం గాంచి కుమారా! నీ కడనిల్లడపెట్టిన నా ముసలితనంబు నాకిమ్ము. ఇల్లడగాఁబెట్టిన నా ముదిమిని నేను గైకొనుచున్నందులకు నన్యథా తలంపకుము. నీవు నాయాజ్ఞ పాలించుటంజేసి మిక్కిలి సంతసించితిని. నిన్ను

రాజ్యాభిషిక్తునిం గావింతును. అని పలికి దేవయాని కొడుకగు యదునింగాంచి, కారంబులు, మిరియంబులునూఱె యోరీ దురాసదా! నీవు పుత్త్రరూపంబున నా కడుపునంబుట్టిన రాక్షసుండవు. నాయాజ్ఞం దిరస్కరించితివి. కాన సంతాన విషయంబున విఫలమనోరథుండవుగమ్ము. గురుతుల్యుండనగు నన్నవమానించితివి. కావునం గ్రూరులును, యాతుధానులు నగు రాక్షసులు నీకడుపునం బుట్టుదురుగాక. దుర్మతీ! నీ సంతతికి సోమకులవిఖ్యాతి గలుగకుండుం గాక! నీకుందగిన దుర్వినీతులగు కొడుకులం గాంచెదుగాక! అనిపలికి యయాతి పూరునకుం బట్టాభిషేకంబు గావించి తా నాశ్రమంబున కేఁగి కొంతకాలంబునకు దివంబు నలంకరించెను. పూరుఁడు ప్రతిష్ఠానపురంబున రాచతీవి మెఱయం గాశీరాజ్యంబు నేలెను. యదుఁడు రాజవంశంబునుండి బహిష్కృతుఁడై దుర్గమంబగు క్రౌంచవనం బనుపురంబున వేలకొలంది రాక్షసులంగనెను. సోదరా! లక్ష్మణా! నిమియెట్టి శాపంబు నోర్వలేకపోయెనో యట్టి శాపంబును యయాతి మహారాజు క్షత్త్రధర్మంబున వహించెను. తమ్ముఁడా! యయాతి చరిత్ర వింటివి గదా? నృగుదోషము మనల నంటకుండుఁగాక. ఇఁక దర్శనార్థులను విచారింతము. అని రామచంద్రుండు పలుకుచుండఁగా నాకసంబునం గాంతివిహీనంబులై క్షత్త్రంబులు గానరాకుండెను. అరుణకిరణంబుల నెఱ్ఱనై తూర్పుదిక్కు కుసుంభాంబరంబు ముసుంగిడినట్లు ప్రకాశించెను.

ఇది యేఁబదితొమ్మిదవ సర్గము

---

## అ ఱు వ ది య వ స ర్గ ము

### చ్యవనాదులు శ్రీరాముని దర్శింప వచ్చుట.

ఇట్లు రామలక్ష్మణులు ముచ్చటలాడుకొనుచుండఁగా నాత్యుష్ణయు, నాతిశీతలయునగు వాసంతకీరాత్రి యరుదెంచెను. అంతఁ బ్రభాతంబు కాఁగానే పౌర్వాహ్ణిక క్రియలను నిర్వర్తించి రాముఁడు పురజనుల వ్యవహారములం దీర్ప నోలగంబునకుం జనియె. అంత సుమంత్త్రుఁడరుదెంచి రామున కిట్లనియె. మహారాజా! యమునాతీరవాసులగు మహర్షులుకొందఱు భార్గవచ్యవనుని మున్నిడికొని తమదర్శనార్థమై వచ్చి రాజద్వారంబున దౌవారికులచే నడ్డగింపఁబడి నిలిచియున్నారు. నిన్నుఁజూడఁ దలఁచినారు. ఏదియో కార్యభారంబుగల్గి త్వరపడుచున్నారు. అన విని రాముఁడు వేగంబ వారిం బ్రవేశపెట్టుమన ద్వారపాలుఁడు రాజు నాజ్ఞ శిరంబునందాల్చి ధర్మమూర్తులగు నా శతాధిక ఋషులను హజారంబునం బ్రవేశపెట్టెను. ఆ ఋషులు సమస్త తీర్థాంబు సత్కృత పూర్ణకలశంబుల గ్రహించి తెచ్చిన ఫలమూలంబుల

రాముని కర్పింప నాతఁడు తీర్థోదకములను ఫలంబులను గైకొని మునుల కిట్లనియె. మహర్షులారా! ఇవిగో పవిత్రాసనంబులు. ఇందుఁ గూర్చుండుఁడు. అన వారు బంగారుదర్భాసనంబులఁ గూర్చుండ వారింగాంచి రాముండు ప్రాంజలియై యిట్లనియె. ఋషిపుంగవులారా! ఆజ్ఞాపింపుఁడు. సర్వకామప్రదంబును, సుఖకరంబు నగు నే కార్యంబు నేను జేయవలయును. ఈ రాజ్యము, ఈ జీవితము బ్రాహ్మణరక్షణార్థమే వహించితిని. ఇం దిసుమంతయు నసత్యంబు లేదు. అన వారందఱు మేలుమేలని రామా! ఇట్లు పల్క నీకుఁదక్క నన్యునకు నర్హంబుగాదు. నీకు నీవే సాటి. పెక్కుమంది రాజులు ప్రతిజ్ఞచేసి కార్యగౌరవంబు తెలిసికొని తా మొనర్చిన ప్రతిజ్ఞ నిరర్థకంబుగావించిరి. నీవన్ననో బ్రాహ్మణులయందలి గౌరవంబునం జేసి మా వచ్చిన కార్యంబు నారయకే ప్రతిజ్ఞచేసితివి. కావున మా కార్యంబు నెఱవేర్ప నీవ నేర్తువు. ఇందు సందియంబు లేదు. మము భయంబునుండి కాపాడ నీవ యర్హుఁడవు.

ఇది యఱువదవ సర్గము

---

## అ ఱు వ ది యొ క ట వ స ర్గ ము

### చ్యవనుఁడు లవణవృత్తాంతంబు శ్రీరామునకుఁ దెల్పుట.

ఇట్లు పల్కిన ఋషులఁగాంచి శ్రీరాముఁడు మీకుఁ గలిగిన భయంబేమో తెల్పుఁడు తలఁగింతు ననన విని భార్గవుఁడు మాకును దేశంబునకును గల్గిన భయకారణంబు వినుమని యిట్లనియె.

రామా! పూర్వము కృతయుగంబున లోలుఁడను రాక్షసుఁడు గలఁడు. వాని పెద్దకొడుకు మధువు. అతఁడు మహాబలశాలి, బ్రాహ్మణులకు శరణ్యుఁడు; పరినిష్ఠితమతి; దేవతల ప్రీతికిఁ బాత్రుఁడైనవాఁడు. అతఁడు వీర్యసంపన్నుఁడై ధర్మనిష్ఠాగరిష్ఠుఁడై యీశ్వరప్రీతికై పెక్కువేలయేండ్లు తపంబుగావించెను. రుద్రుఁడు ప్రీతుండై వానికి వరమీయఁజని గౌరవించి, తన శూలమునుండి మహావీర్యంబును మహాప్రభంబును నగు వేఱొక శూలంబును గైకొని వానికొసఁగి ప్రేమదైవాఱ నిట్లనియె. నీవు నాకు నీయందనుగ్రహము గల్గునట్లు అతుల తపంబుచేసితివి. నాకు మెచ్చువచ్చి యీయుత్తమాయుధంబు నీకొసఁగితిని. ఎందనుక నీవీశూలంబున దేవతలకు భూదేవతలకు హాని చేయకుందువో యందనుక నిన్నిది సేవించును. హాని దలంచితివేని ఈశూలంబు పనిచేయక వ్యర్థమై చనును. ఎవఁడేని నిన్నుఁ బోరికిఁ జీరెనేని వాని నీశూలంబు బూదిచేసి క్రమ్మఱ నీచేతికే తెంచును. అని రుద్రుఁడు వరం బీయ మధువు మఱికొంతకు మ్రొక్కి పరమేశ్వరా! యీయనుత్తమ

శూలంబు సతతము మావంశంబునందె యుండునట్లనుగ్రహింపుము. అని ప్రార్థింప నీశ్వరుఁడది యట్లుగాదు. కాని నామాట యమోఘంబగుట నీపుత్రు నొక్కనిమాత్ర మీశూలము భజించును. ఎందాఁక నీకొడుకుచేత నీశూలముండునో యందాఁక నాతఁడు సర్వభూతావధ్యుఁడై యెసఁగును. అని పరమేశ్వరుఁడు వరమీయఁగానె మధువు సంతసించి కాంతికృతంబగు నొక భవనంబును గట్టించెను. అతని భార్య కుంభీనసి. ఆమె చాల సదృష్టవంతురాలు, విశ్వావసువామె తండ్రి. తల్లి అనల. కుంభీనసీమధువుల పుత్రుఁడె లవణుఁడు. వీఁడు మహాదారుణుఁడు. వానికంటె ముందె చెడుబుద్ధులు పుట్టినవి. పాపాచరణమే వాని నిత్యక్రీడ; దుర్వినీతుఁడగు నాపుత్రునిఁగాంచి మధువు కోపించినాఁడు, దుఃఖించినాఁడు. కన్నకొడుకౌట వాని నేమీ యనలేక యీ లోకంబు వీడి వరుణాలయమును (సముద్రమును) జొచ్చెను. వెళ్లుచు వెళ్లుచు నీశ్వరదత్తమైన శూలంబును లవణున కొసఁగి దాని మహిమంబు వానికి వినిచెను. లవణుఁడు శూలప్రభావముచేతను దనదౌరాత్మ్యముచేతను ముల్లోకంబులను బాధించుచు ఋషులను రాసి ఱంపానఁ బెట్టుచుండెను. రామా! వింటివి గదా! లవణుని ప్రభావము, శూలము శక్తియు. నీవే మాకు దిక్కు. రామా! మేము భయార్తులమై యెందఱనో రాజుల నాశ్రయించితిమి, శరణుచొచ్చితిమి. కాని రక్షకుఁడెవ్వఁడును గానరాఁడయ్యెను. వీరాధివీరా! నీవు రావణుని సబలవాహనముగాఁ బొరిగొన్న జగజ్జట్టివని విని నిన్ను శరణుచొచ్చితిమి. నీవుదక్క మఱొక్కఁడు మాకు రక్షకుఁడు లేఁడు. కాన లవణాసురుని బాధనుండి మమ్ముఁ గాపాడుము. అన విని రాముఁడు కృతాంజలియై మునుల కిట్లనియె.

ఇది యఱువది యొకటవ సర్గము

---

## అఱువదిరెండవ సర్గము

### శ్రీరాముఁడు మునులను లవణు నాచారాదుల నడుగుట.

మహర్షులారా! లవణుని యాహారమేమి? ఆచారమేమి? అతఁడెచ్చట నివసించుచుండును. అన విని ఋషులిట్లనిరి. సర్వసత్త్వంబు లాతని యాహారము. విశేషించి తాపసులన్న యాతండు చెవి గోసికొనును. రౌద్రంబే వాని యాచారంబు. మధువనంబు వాని నివాసభూమి. అతఁడు దశసహస్రసింహ, వ్యాఘ్ర, మృగ, గజ, మనుష్యసంఘంబును వధించి పగటిపూఁట భుజించుచుండును. లయకాలమందలి యమునివలె వాఁడు నోరుదెఱచుకొని పైఁజెప్పిన సత్త్వములకంటెఁ జిన్నజంతువులంగూడఁ దనపొట్టం బెట్టుకొనుచుం

మును. అన విని రాముఁడు సంతసించి ఋషులారా! భయపడకుఁడు. నేను వానిని వధింతును అని యభయంబొసఁగి తమ్ములనుగాంచి యిట్లనియె. వీరులారా! మీలో నెవరు వానిం జంపుదురు? వాఁడెవనివంతు?

శత్రుఘ్నుఁడు తాను లవణునిఁ జంపఁబోయెదననుట.

భరతుని వంతా? లక్ష్మణుని వంతా? అన విని భరతుఁడు వాని నేను వధింతును. వాని వధ నాపాలుసేయుము. అన విని ధైర్యశౌర్య సమన్వితుండగు శత్రుఘ్నుఁడు స్వర్ణాసనమునుండి నిలిచి రామునకు మ్రొక్కి రామచంద్రా! భరతుఁడీనఱకే యనేకకార్యములు సాధించియున్నాఁడు. తొల్లి పూజ్యులైన తామయోధ్యను వీడినపుడు సంతప్తహృదయుఁడై మీరాకను నిరీక్షించుచు నాకేశపట్టణంబున సీతంపుగాదె నాఁకినాఁడు? అంతియె కాదు. వెక్కు దుఃఖంబు లనుభవించినాఁడు. మీరరణ్యావాసము చేయుటకు వగచి తాను నందిగ్రామంబున నున్నపుడు దుఃఖశయ్యయందే పరుండెను. ఫలమూలంబులే యాహారించెను. జడలను దాల్చెను. నారచీరలు ధరించెను. ఇన్నియిడుమ లీనఱకే పడియున్న భరతుండు నేనుండ మరల నిడుమలఁ గుడువనేల?

శ్రీరాముఁడు లవణుఁ జంపి శత్రుఘ్నుని మధురాపురి నేల నాజ్ఞాపించుట.

అని పలుక రాముఁ డిట్లనియె. శత్రుఘ్నా! అట్లే కానిమ్ము. నా యాజ్ఞ పాలింపుము. నిన్ను మధునగరంబునకుఁ బట్టాభిషిక్తునిఁగావింతును. భరతు నింకను శ్రమపెట్టుట కిష్టంబులేదేని నీవే యుద్ధంబునకుఁ జనుము. శూరుఁడవు కృతవిద్యుఁడవు యుద్ధములం దాఱితేఱినవాఁడవు. కాన నారాక్షసుని వధించి యందొకపట్టణంబు నిర్మించి నీవ దానికి పతివై పరిపాలింపుము. శత్రువధంబుఁజేసి రాష్ట్రంబు గైకొని యందొకరాజును నిలుపనివాఁడు నిరయంబున కరుగును. శూరా! ఇఁక నీవు నాకు మాఱుపలుకకుము. అన్న యాజ్ఞను తమ్ముఁ డనుమానింపక పరిపాలింపవలెను. వసిష్ఠాది మహర్షులు విధిమంత్రపూర్వకంబుగా నీకభిషేకంబు గావింపఁగలరు.

ఇది యఱువదిరెండవ సర్గము

---

## అ ఱు వ ది మూఁ డ వ స ర్గ ము

పట్టాభిషేకంబొల్లక శత్రుఘ్నుఁడు పరితపించుట.

అన విని శత్రుఘ్నుఁడు లజ్జాభరంబున శిరంబువాంచి యల్లనల్లన రామున కిట్లనియె.

అన్నా! కాకుత్స్థా! పెద్దలగు నన్నలుండఁగాఁ జిన్నవాఁడనగు నన్నభిషేకించుట ధర్మముగాదు. అయినను దమశాసనము దాఁటరానిదగుట నవశ్యముగా ననుసరింతును.

పెద్దలకుఁ జిన్న లెదురాడరాదని మీవలనను శ్రుతులవలనను గూడ వింటిని, వినియు నెఱిఁగియుఁగూడ భరతునిఁగాదని నేనే లవణుని యుద్ధంబునఁ బరిమార్తునని యాడరాని ఘోరదుర్వాక్యము లాడితిని. ఆ దురుక్తులకు ఫలముగా నిట్టి దుర్గతికిఁ బాల్పడితిని. జ్యేష్ఠుఁడు పలికిన దానికి మాఱుసెప్పరాదు. అట్లు చెప్పినవాఁడు ధర్మదూరుఁడు పరలోకదూరుఁడుగూడ నగును. అన్నా! నాచేసినపని కీశిక్షచాలు. మఱి నీకు మాఱుపలుకను. నాకు మఱి రెండవ మాఱు నీచే దండనంబు గలుగకుండుఁగాక. కాని రాజ్యము మాత్రము నాకు వలదు. మీ గీసినగీటు తప్పకుండ మీ యాజ్ఞ నెఱవేర్తును. అధర్మము నన్నుఁ దాఁకకుండుఁ గాక.

అన విని రాముఁడు సంతసించి లక్ష్మణుని భరతునిఁగాంచి యిట్లనియె.

సోదరులారా! పట్టాభిషేకమునకు వలయు సంభారములను దెప్పింపుఁడు. దుర్జయుఁడగు శత్రుఘ్ను నిప్పుడే మధురాపురికి నభిషిక్తునిఁ జేయుదును.

శ్రీరాముఁడు శత్రుఘ్నుని మధురకభిషిక్తునిఁ జేయుట.

సోదరులారా! నాయాజ్ఞగా వెంటనే పురోహితుని వేదశాస్త్రజ్ఞులను ఋత్విజులను ఎల్లమంత్రులను రావింపుఁడు. అన వారభిషేకమునకు వలయు యత్నము లన్నియుఁ జేసి పురోహితునిఁ దోడ్కొని రాఁగా బ్రాహ్మణులు రాజులు రాజభవనంబును బ్రవేశించిరి. అంత రామునకును పౌరులకు వేడుక కలుగునట్లుగాఁ బట్టాభిషేకంబు ప్రవర్తిల్లెను. సూర్యసన్నిభుఁడైన శత్రుఘ్నుని యభిషేకము దేవతలచేఁ జేయఁబడిన కుమారస్వామి యభిషేకమును దలపించుచుండెను. రాముఁడు శత్రుఘ్ననికిఁ బట్టాభిషేకంబు గావింపఁగానె పౌరులును బహుశ్రుతు లగుబ్రాహ్మణులును మిక్కిలి సంతసించిరి. కౌసల్యయు సుమిత్రయుఁ గైకయు మిగిలిన రాజస్త్రీలును శత్రుఘ్ననకు రాచనగరున మంగళ మాచరించిరి. యమునాతీరవాసులగు మహర్షులు శత్రుఘ్ను నభిషేకంబుగాంచి లవణాసురుఁడు చచ్చినవాఁడేకాఁ దలంచిరి. శ్రీరాముఁడు పట్టాభిషిక్తుఁడైన తమ్మునిఁ దనయంకమునఁ గూర్చుండఁ బెట్టుకొని ప్రతాపంబు పెంపొందించు నింపుగుల్కు వాక్యంబుల నిట్లనియె.

శ్రీరాముఁడు శత్రుఘ్నునకు నారాయణాస్త్రం బొసంగి లవణుఁ జంపు నుపాయము దెలుపుట.

సోదరా ! పరపురంజయా ! దివ్యమైన యీశరము అమోఘమైనది. దీనిచే లవణాసురునిఁ బరిమార్పుము. సురాసురులకు నజితుఁడగు స్వయంభువు మున్ను పాలమున్నీటిలో నెల్లభూతములకు నదృశ్యుఁడై పరుండి, దురాత్ములైన మధుకైటభులను దక్కిన సర్వరాక్షసులను బరిమార్చుటకును లోకంబులను సృజించుటకును ఈ శరంబు సృష్టించి, దీనిచే మధుకైటభాది రాక్షసులఁ బొరిగొని జనంబులు సుఖింప లోకంబులు సృష్టించెను. వింటివిగదా సోదరా ! దీని మహిమము ! లోకంబుల కుపద్రవంబు వాటిల్లునని తొల్లి నే నీయస్త్రంబు రావణుపైఁ బ్రయోగింపలేదు. మధుఁడు శత్రునాశనమునకై తనకీశ్వరుఁ డిచ్చిన శూలాయుధమును దన యింటనేయుంచి, మాటిమాటికిఁ బూజించుచుఁ దా నాహారార్థమై యెల్లదెసలకుఁ జనుచుండును. ఎవఁడేనివచ్చి తన్ను యుద్ధమునకుఁ జీరినచో నప్పుడు వెంటనే యా శూలముఁగొనివచ్చి వానిని భస్మము చేయుచుండును. కాన సోదరా ! నీవు వానిని ఆయుధంబు వీడి యాహారార్థమేఁగినపుడు పురంబుఁ జొరనీకుండ నాయుధధారివై యరికట్టి యుద్ధంబునకు నెసకొల్పుము. అట్లొనర్చితివేని వాని ననాయాసముగా జయింతువు. మఱొక్కలాగున నొనర్చితివేని వానిఁ జంపఁజాలవు. నేఁజెప్పినట్లు చేసితివయేని వాఁడు తప్పక వినాశంబు నొందును. తమ్ముఁడా ! శూలవృత్తాంతంబును ఈశ్వరాజ్ఞయు నీ కెఱింగించితిని.

ఇది యఱువదిమూఁడవ సర్గము

---

అ ఱు వ ది నా ల్గ వ స ర్గ ము.

ఇట్లుపలికి రాముఁడు శత్రుఘ్నునిఁబొగడి మఱియు నిట్లనియె. చూడు సోదరా ! ఇవిగో ఈనాలుగువేల సేనలును వేయిరథంబులును నూఱుగజంబులును నానాపదార్థములతోఁగూడిన యంతరాపణవీథులును నటనర్తకులును నూఱువేల వెండిబంగారు నాణెంబులును వస్త్రంబులును విశేషధనధాన్యవాహనంబులును నీతోఁ గొనిపొమ్ము. భటులకు జీతము బత్తెము నిచ్చి హృష్టియుఁ బుష్టియుఁగలవారిగాఁజేసి సరససల్లాపంబులచేతను వస్తుప్రదానములచేతను సంతోషపెట్టుము. మఱియు నర్థంబులు భార్యలు బంధువులు లేనివారిని నీవెఱింగి వారినిఁ దేనెలూరుమాటలతో సంతోషపెట్టుము. హృష్టజనాకీర్ణమైన మహాసేనను ఒకచోనుంచి నీవొక్కఁడవే కోదండపాణివై మధువనంబున కరుగుము. నీరాకనుమాత్రము లవణునికిఁ దెలియనీయకుము

లవణుని జంపువాఁ డెవఁడును లేఁడు. తొలుత నెవఁడు వానికంటఁబడునో వాఁడు మఱియుఁ దీరదు. గ్రీష్మకాలమేఁగి వర్షాకాల రాత్రులు రాఁగానే యా లవణాసురుని వధింపుము. అదే వానిఁ జంపఁదగిన కాలము. మహర్షులను మున్నిడికొనిపోయి సైనికులు సాయంకాలములోపల గంగానదిని దాఁటునట్లు చేయుము. బలఁగమెల్ల నదిదాఁటి యావలియొడ్డున నొకచో విడియఁగా నీవు ధనుర్ధారివై ముందుగా నరుగుము.

అని రామభద్రుఁడు పలుకఁగానె శత్రుఘ్నుఁడు సేనానాయకులను బిలిచి

శత్రుఘ్నుఁడు సేనలముందుగాఁ బంపి తానొంటిగ లవణునిపైఁబోవుట.

చమూపతులారా! మీ కెచ్చటెచ్చట విడిదిపట్టు లేర్పఱుపఁబడెనో యచ్చటచ్చట విడిసి యొద్దులకు బాధకలుగకుండులాగున మెలంగుఁడని యాజ్ఞ యిచ్చి పంపి తల్లులకెల్ల వందనమాచరించి రాముని వలగొని శిరంబుతో మ్రొక్కి రామునిచే ననుజ్ఞాతుఁడై లక్ష్మణ భరతులకెరఁగి పురోహితుఁడగు వసిష్ఠునకు నమస్సులర్పించి చతురంగబలంబును ముందంపి తానొక నెల యన్నయొద్దనుండి పిమ్మట యుద్ధార్థియై చనెను.

ఇది యఱువది నాల్గవ సర్గము

---

అ ఱు వ ది యై ద వ స ర్గ ము

శత్రుఘ్నుఁడు వాల్మీకియాశ్రమంబు చేరుట.

శత్రుఘ్నుఁడు పయనమై చనుచు మార్గమధ్యమున రెండు రాత్రులు గడపి ఉత్తమంబును బవిత్రంబును నగు వాల్మీకి యాశ్రమంబు చేరి యామునిచంద్రునకు నేటికోళ్లు ఘటించి యిట్లనియెను.

మునిచంద్రా! అన్నగారియాజ్ఞచే నిటకరుదెంచితిని. రేపుదయమునసే భయంకరమగు పడమటిదెస కరఁగువాఁడను. అన విని వాల్మీకి చిఱునవ్వునవ్వి మహాశయా! నీకు స్వాగతమేకదా! సౌమ్యా! ఇది రఘువంశస్థులకు సొంతయాశ్రమముసుమా! ఎరవుచోటుగాఁ దలంపకుము. నాయిచ్చు నీయాసనము పాద్యము అర్ఘ్యము నిశ్శంకముగాఁ గైకొనుము. ఫల మూలములను భుజింపుము. అన శత్రుఘ్నుఁడు మునీంద్రు పూజలగైకొని తనివు దీర ఫలమూలముల మెసవి యెదుటఁ బరికించి సంయమీంద్రా! పూర్వభాగంబున నాశ్రమసమీపంబున నెవ్వరో యాగంబొనర్చిన గుఱుతులు గానఁబడుచున్నవి. యజ్ఞముచేసిన యాపుణ్యాత్ముఁ డెవ్వరు? సెలవిండన ముని శత్రుఘ్నా! విను. ఇది యెవరియాశ్రమమో చెప్పెదను.

## వాల్మీకి శత్రుఘ్నునకు సౌదాసు చరిత్రఁ దెలుపుట.

పూర్వము మీపూర్వులలో సుదాసుఁడను రాజొకఁడు కలఁడు. వాని కొడుకు వీరసహుఁడు. అతఁడు పరాక్రమశాలి, ధార్మికుఁడు. అతఁడు చిన్ననాఁటనే ఘోరాటవులకు వేఁటకుఁ బలుమాఱు పోవుచు వచ్చుచునుండువాఁడు. ఆ వనంబున నిరువురురాక్షసులు పెద్దపులిరూపమును దాల్చి చరించుచు నందలి మృగంబులనెల్ల తనివితీరక భక్షించుచుండఁ దుదకావనంబు నిర్మృగంబాయెను. అది కని సౌదాసుఁడు మండిపడి యందొక్కనిఁ గోలం గూలనేసి తనవేఁడిమియుఁ గోపంబును జల్లారఁ జచ్చి క్రిందఁ బడియున్న యా రాక్షసునిఁ గాంచుచుండ బ్రదికియున్న రాక్షసుండు సౌదాసునిఁగని పాపిష్ఠా! అనపరాధుండగు నాసహాయునిఁ జంపితివి. కాన నీకుఁ బ్రతిక్రియ యొనర్చెదను. అని ప్రతిజ్ఞచేసి యంతర్ధానమొందెను. కొంతకాలమునకు మిత్రసహుండను రాజాయెను. ఈ యాశ్రమసమీపముననే యారాజు అశ్వమేధమహాయజ్ఞంబును, వసిష్ఠుని పురోహితునిగాఁ గైకొని చేయఁదొడఁగెను. ఆ యజ్ఞంబు సర్వసంపదలతోఁ దులఁదూఁగుచు, దేవయజ్ఞంబువోలెఁ బెక్కువత్సరంబులు జరిగెను. యజ్ఞావసానదినంబునఁ బూర్వవైరంబు దలంచి యా రాక్షసుండు వసిష్ఠరూపంబుధరించి రాజునుగాంచి యిట్లనియె. రాజా! యజ్ఞము పరిపూర్తియాయెను. నాకు మాంసముతోడి భోజనము పెట్టుము. ఆలసింపకుము. ఆలోచింపకుము. అన విని రాజు బానసీనిఁగాంచి హవిష్యంబును సామిషంబును స్వాదుతరంబును నగు భోజనము మాగురువులు తృప్తిగాంచునట్లు సిద్ధము చేయుము అన వాఁడు సంభ్రాంతమనస్కుఁడై చని రాజాజ్ఞచొప్పున యోగిరంబు సిద్ధముచేసెను. ఆరాక్షసుఁడు సూపకారవేషంబుదాల్చి మనుష్యమాంసముదెచ్చి రాజా! ఇదిగో రుచికరంబును హవిష్యంబును సామిషంబును నగునోగిరము గొనివచ్చితిని. పత్నియగు మదయంతిచెంతనుండ వసిష్ఠునకు నారగింపనిడుము. అన రాజు నిష్కల్మషహృదయముతో మునింగని భుజింపుమని పాత్రంబునఁ బెట్టెను.

## వసిష్ఠుఁడు సౌదాసుని శపించుట.

వసిష్ఠుఁడది నరమాంస మనిగ్రహించి యుదగ్రాగ్రహంబునఁ గణఁతలదుర నిట్లనియె.

రాజా! నీవేదినాకు భోజనముగానిడితివో యదే నీకుఁ గూడగుఁగాక. అన, సౌదాసుఁడు క్రోధఘూర్ణిత మానసుఁడై వసిష్ఠమునిని శపింప నీళ్లు చేతంబూనెను. అదికని వానిభార్య మదయంతి రాజా! వసిష్ఠుఁడు మనగురుదేవుఁడు. బృహస్పతింబోలు పురోహితునకుఁ బ్రతిశాపం బీయందగదు అని నివారింప,

ధర్మాత్ముఁడగు నారాజు చలంబుమాని మరల నిని శపించుటకుఁ గొనిన క్రోధమయంబును తేజోబల సమన్వితంబును నగు నా నీటిని తన పాదంబులపై విడువఁ గవి కమలిపోయెను. అది మొదలు ఆతఁడు కల్మాషపాదుఁడనఁ బరఁగి వసిష్ఠునిఁ గాంచి భార్యయుఁ దానును మ్రొక్కి స్వామీ! ఇదంతయు బ్రాహ్మణరూపధారియగు రాక్షసుఁ డొనర్చిన మాయగాని నే నేపాపము పుణ్య మెఱుఁగనని వేఁడుకొన మరల యోగ దృష్టిం జూచి కలనిజంబెఱింగి రాజుం గాంచి రాజా నేను రోషంబుతో నాడిన వాఁడిమాటలఁ ద్రిప్ప శక్యము గాదు. కాని యొక్క వరంబొసంగెదను. దానఁ దృప్తిఁ గాంచుము. పండ్రెండేండ్లకు నీకు శాపవిముక్తి కలుగఁగలదు. నాయను గ్రహంబునఁ జేసి నీకు గతంబెల్ల విస్మృతిఁ బొరయదు గాక. అని మునీంద్రుఁ డాడిన తెఱంగున నారాజు శాపం బనుభవించి ముక్తిఁ గాంచి, తిరిగి రాజ్యం బును గైకొని ప్రజలను గన్నబిడ్డలవలెఁ బాలించెను. శత్రుఘ్నా! నీవడిగిన యాశ్రమ సమీపమునందలి యజ్ఞాయతనము ఆకల్మాషపాదునిది అని వాల్మీకి యెఱిఁగింప శత్రుఘ్నుఁ డా మునికి నమస్కరించి చని పర్ణశాలను ప్రవేశించెను.

ఇది యఱువదియైదవ సర్గము

---

## అఱువదియాఱవ సర్గము

### సీతాదేవి కుమారులఁ గనుట.

ఏరాత్రి శత్రుఘ్నుఁడు పర్ణశాలను బ్రవేశించెనో యారాత్రియందె సీతాదేవి కవలబిడ్డలఁ గాంచెను.

అంత మునిబాలకు లర్ధరాత్రంబున వాల్మీకిచెంత కరుదెంచి భగవానుఁడా! రామపత్నియగు సీత యిరువురు బాలకులఁ బ్రసవించెను. వారిని భూతములు సోఁకకుండ రక్షింపుఁడు. అని విన్నవించిరి. అది విని ముని మహానందంబు నొంది చని బాలచంద్రతుల్యులును తేజోమూర్తులును రాజపుత్రులును నగు కుమారులఁ జూచి భూతనాశన మంత్రములు చదివి దర్భల మంత్రించి యిందుఁ గొనలతో మొదటివానికిని మొదళ్లతో రెండవవానికిని మార్జన మొనర్చెను. కుశముచేఁ దుడువఁబడినవాఁడు కుశుఁడు. లవముచే నిర్మార్జన మొనర్పఁబడినవాఁడు లవుఁడు అనఁబడును. నే నిడినయీపేళ్లచే నీయుభయులు కుశ లవులని ప్రఖ్యాతిఁ గాంతురు. అని చెప్పి భూతఘ్నియు రక్షోవినాశినియు నగు నారక్షను వారి కొసంగెను. ఆరక్షను గైకొని చని నిరాబాలబోటులు వాల్మీకి చెప్పినట్లు కవలకు రక్షఁగట్టిరి. వృద్ధమునిపత్నులు సీతకుఁ జేయుఁ బ్రసూతి శుద్ధియు 'రామనామగోత్ర సంకీర్తనంబును అర్ధరాత్రంబు శత్రుఘ్నుఁ

డాలించి నిర్భరానందము చెంది పర్ణశాలకడ కేఁగి తల్లీ! యదృష్టమని పలికెను. అట్లు శత్రుఘ్నుఁడు సంతసించుచునుండఁగా వర్షాకాలమునందలి శ్రావణ మాస రాత్రి గడచెను. తెల్లవాఱఁగానే యతఁడు పౌర్వాహ్ణిక క్రియలు నిర్వర్తించి వాల్మీకికి నమస్కరించి పోయివత్తునని చెప్పి పశ్చిమాభిముఖుండై చని మధ్యేమార్గంబున యమునానదీతీరంబున నేడురాత్రులుగడపి పుణ్యకీర్తులగు ఋషుల యాశ్రమములకుఁ జని యందు విడిసెను. అందు భార్గవచ్యవనుఁడు కాంచనుఁడు మున్నగు ఋషులు వానికి మనోహరంబులగు కథలు చెప్పి యుఋసుపుచ్చిరి.

ఇది యఱువదియాఱవ సర్గము

---

## అ ఱు వ ది యే డ వ స ర్గ ము

**శత్రుఘ్నునకుఁ జ్యవనుఁడు లవణునిచే మాంధాత మడిసిన విధము తెలుపుట.**

అట్లారాత్రి గడవఁగానే శత్రుఘ్నుఁడు చ్యవనునిఁగాంచి మహామునీంద్రా! లవణుని బలమెంత? వాని శూలము బలమెట్టిది? అతఁడా శూలంబుగొని ద్వంద్వయుద్ధముచేసి పూర్వమెవరినైన వధించెనా? వచింపుమన విని ముని యిట్లనియె.

నరవరా! లవణుని వీర కర్మంబులు లెక్కింప సెక్కెంబుగాదు. ఇక్ష్వాకువంశమందు జరిగిన యొకవృత్తాంతము దెలిపెద నాలింపుము. తొల్లి యయోధ్యయందు యువనాశ్వుఁడను రాజుగలఁడు. అతఁడు చాలబలశాలి, వానికి మాంధాతయను పుత్రుఁడు గలఁడు. వాఁడు ముల్లోకంబులఁ బేరుగొన్న ప్రతాపశాలి. అతఁడు వసుంధరాతలంబెల్ల శాసించి దేవలోకంబు జయింప నుద్యోగించెను. అదికని యింద్రుఁడును దేవతలును నడునడు నడఁకిరి. తనతో నర్ధాసనంబున నుండి యర్ధరాజ్యంబు గైకొని సురగణంబులచే మ్రొక్కులు గొనఁగోరువాని ప్రతిజ్ఞ నెఱిఁగి పాకశాసనుఁడు సాంత్వపూర్వకవాక్యంబుల నిట్లనియె.

రాజేంద్రా! నీవు మానవలోకము నంతటిని నీయాజ్ఞ మేర నిలిపితివే? భూమిని వశపఱచుకొనలేనివాఁడవు దేవరాజ్యము మీఁదికేల రాఁజూచుచున్నావు? ఉట్టి కెగురలేని యమ్మ స్వర్గాని కెగిరె నందురిదెకాఁబోలు? పుడమి నాలుగు చెఱఁగులు నీవేలంగలిగిననాఁడు సభృత్య బలవాహనుఁడవై దేవరాజ్యంబు నేలుము. అన విని మాంధాత శక్రా! నాయాజ్ఞ భూమినెందు చెల్లుటలేదో చెప్పుమన నింద్రుఁ డిట్లనియె.

మాంధాతా! మధుపుత్రుఁడైన లవణుఁడు మధువనమేలుచున్నాఁడు. అందునీయాజ్ఞ చెల్లుచున్నదా ? చెప్పుమన

మాంధాత లవణునిచే మడియుట.

సిగ్గుపడి మాంధాత తలవాంచి బదులుపలుకలేక యింద్రుని వీడి కోలు వడసి భూలోకంబునకువచ్చి యెడఁద మచ్చరంబూని భటులను సేనను వాహనంబులను వెంటఁగొని లవణుని వశపఱచుకోనఁ జనుదెంచి యుద్ధంబును గాంక్షించుచు లవణునియొద్దకు దూతను బుత్తెంచెను. వాఁడు దౌత్యంబు నెఱప లవణునియొద్దకరిగి నోరికివచ్చినట్లు ప్రేలుచుండ రాక్షసుఁడు వానినిఁ జంపి మ్రింగెను.

తనదూత మరలిరాక తడయుటఁగాంచి మాంధాత క్రోధసమన్వితుఁడై చని లవణుని శరవర్షంబున ముంప నతఁడు నవ్వి యైశశూలంబు కరంబునఁ దాల్చి బలఁగముతోపాటు రాజును బరిమార్పనేసెను. ఆశూలంబు తత్క్షణంబ రాజును బలమును మాఁడ్చి నీఱుచేసి తిరిగి లవణునియొద్ద కరుదెంచెను.

కాన శత్రుఘ్నా! శూలంబుబలంబు అప్రమేయము. అనుత్తమము. నీవు రేపు వఱువాత శూలము నింటనిడి మాంసాహారార్థమరిగినలవణుని ప్రేల్మిడిన తప్పక వధింతువు. నీకు విజయంబు ధ్రువంబు. నీవైనర్చు నీకార్యమువల్ల లోకంబులు సుఖపడును. రాజకుమారా! వింటివికదా! లవణుని సర్వచరిత్రయు,శూలంబు ఘోరవృత్తాంతంబును. మాంధాతకుఁ గల్గిన గతి నీకెన్నఁడును గలుగకుండుఁగాక! పోయిరమ్మన.

ఇది యఱువదియేడవ సర్గము

---

అ ఱు వ ది యె ని మి ద వ స ర్గ ము

శత్రుఘ్నుఁడు లవణునిఁ బురంబులోనికిఁ బోకుండనిరోధించుట.

శత్రుఘ్నుఁడు మునీంద్రులుచెప్పు నాకథలను ఊఁకొట్టుచుండఁగానె బళ్లునఁదెల్లవాఱెను. అత్తఱి భీమ విక్రముఁడైన యారాక్షసుఁడు ఆహారార్థము పురము వీడిచనెను. ఇంతలో వీరుఁడైన శత్రుఘ్నుఁడు యమునానదినిదాఁటి మధురాపురద్వారమున ధనుష్పాణియై నిలిచెను. అంత మిట్టమధ్యాహ్నము కాఁగానె క్రూరకర్ముఁడైన యా లవణుఁడు వేనవేలు మెకంబులఁదునుమాడి మూఁపునవైచికొని మోయలేక మోయుచు వచ్చి విల్లంబులుదాల్చి దారి కడ్డంబుగా నిలిచియున్న శత్రుఘ్నునిగాంచి, ఓయీ! శరకాండంబులఁబూని యుంటివి, వీనితో నేమొనర్తువు? నీవంటివిలుకాండ్రను వెక్కుర నీవఱకు

మ్రింగియున్నాఁడను. నీవు కాలంబు మూఁడివచ్చితివి గాఁబోలు. నీతో నాకాహారంబు ప్రాప్తమగును. రమ్ము నీవు స్వయంబుగా నావాతంబడితివి. ఎట్లు దప్పించుకొందువు. అని ఉల్లకట్టు మాటలాడుచుఁ బలుమాఱు నవ్వ చుండెను. అది గాంచి శత్రుఘ్నుఁడు కోపంబునఁ గన్నులనుండి నీరుగాఱ రోమరోమంబునుండి మంటలు గ్రక్కుచు నిట్లనియె.

“ఓరీ నిశాచరా! నీతో ద్వంద్వయుద్ధంబుఁ జేయఁగోరివచ్చితిని. నేను దశరథుని పుత్త్రుఁడను. రామునితమ్ముఁడను. నిత్యశత్రుఘ్నుండనగు శత్రుఘ్నుండను. నిన్నుఁ జంపవచ్చితిని. నాతో ద్వంద్వయుద్ధంబుచేయుము. నీవు సర్వజీవులకు శత్రునవు. ఇఁకనిన్నుఁ బ్రాణములతోఁ బోనీయను.” అని శత్రుఘ్నుఁడు పలుక లవణుఁడు అపహాస్యముఁ జేయుచు నిట్లనియె. దుర్మతీ! నా యదృష్టంబున నీవిచటికి వచ్చితివి. నా పినతల్లి సోదరుఁడగు రావణుని నీ యన్నయగు రాముఁడు ఆఁడుదానికొఱకై చంపెను. రావణవంశమంతయు నశించినను దాని నేనంతపాటింపక సహించియుంటిని. నేనింతకుమున్ను మునుపటివారిని నిప్పటివారిని, పెక్కుమందినిఁ దృణప్రాయంబుగాఁ దుదముట్టించితిని. నీవొక లెక్కా? యుద్ధంబుసేయవచ్చిన నీతో యుద్ధముచేయ సిద్ధముగానున్నాను. క్షణమాఁగుము. ఆయుధంబుఁ దెచ్చుకొందును నీకోర్కె నా యాయుధంబే పరిపూర్తి చేయఁగలదు.

అన విని శత్రుఘ్నుఁడిట్లనియె. ఓరీ! నాముక్కున నావియుండఁగా నీవెక్కడకుఁబోయెదవు. శత్రువు యాదృచ్ఛికముగాఁ గంటఁబడినపుడు సమర్థుఁడగు వాఁడెవ్వఁడేనివిడిచి పుచ్చునా? ఎవఁడు వైక్లబ్యంబగుబుద్ధిచే శత్రువును లోనికిం జొరనిచ్చునో యాకాపురుషుఁడు తన తెలివితక్కువచే నశించును. కాన నీవిప్పుడే నీప్రపంచమునఁజూడ వలసినవన్నియుఁ జూడుము. ఇఁక క్షణకాలంబులోఁ ద్రిలోకకంటకుండవగు నీవు నావాఁడిములుకుల కెరగాఁగలవు.

ఇది యఱువదియెనిమిదవ సర్గము

---

## అఱువదితొమ్మిదవ సర్గము

### లవణ శత్రుఘ్నుల యుద్ధము

అదివిని మది నలిగి లవణుఁడు నిలునిలు మని యదలించుచుఁ జేతితోఁ జేతిని నలుపుచు పండ్లు పటపట కొఱుకుచు శత్రుఘ్ని యుద్ధంబునకుం బిలువ దేవశత్రుఘ్నుండగు శత్రుఘ్నుఁడు ఘోరదర్శనుండైన లవణుని కిట్లనియె. ఓరీ! నీ వింతకుమున్ను నిర్జించిన రాజులవంటి వాఁడు గాఁడీ శత్రుఘ్నుఁడు. ఇదే కాచికొమ్ము. నాబాణఘాతములచే నిన్నిదే యమసదన

మున కంపుచున్నాను. నిన్ను నేను రణంబునఁ బరిమార్చినంతనె రాముఁడు రావణునిఁ జంపఁగానె దేవతలు సంతసించినట్లు, ఋషులును, విద్వాంసులును నిన్నుఁజూచి సంతసింతురుగాక. నిశాచరా! నిన్ను నేను బాణములచే దగ్ధమొనర్పఁగానే పల్లెలు, పట్టణంబులు, క్షేమంబుగాంచుఁగాక. వజ్రనిభాననంబులగు మద్భుజాముక్తనిశితమార్గణంబులు, సూర్యకిరణంబులు పద్మంబును జొచ్చునట్లు నీ గుండెలు చీల్చును. చూడుమన లవణుఁడు కనలి, వృక్షంబుగొని శత్రుఘ్నునురంబుపై వ్రేయనతఁడది తుత్తునియలు చేసెను. అదెకని లవణుఁడు పెక్కు మ్రాఁకులు పెఱికి శత్రుఘ్నునిపై వైవ నతఁడు వానినెల్ల వంగినకణుపులుగల మూఁడేసి నాలుగేసి బాణంబులచే నఱికి బాణవర్షంబున రాక్షసుని ముంచెను. ఇట్లు పోరుఘోరంబుగ జరిగినను శత్రుఘ్నుఁడుగాని లవణుఁడుగాని అలసటఁగాంచలేదు. అంత లవణుఁడు పకపక నవ్వి లీలగా నొక చెట్టును బెఱికి శత్రుఘ్నుని శిరంబుపై వేసి గొట్ట నతఁడు మూర్ఛనొందెను. అదికని ఋషులు, దేవతలు, గంధర్వులు, అప్సరసలు హాహాకారమొనర్చిరి. శత్రుఘ్నుఁడు భూమిం ద్రెళ్లుటఁగాంచి లవణుఁడొక చీరికంగొనక, వానిఁజచ్చినవానిగాఁదలఁచి యింటికేఁగక శూలంబు తేక భక్ష్యముల మాత్రము దెచ్చుకొనుచుండ, ముహూర్తకాలములో శత్రుఘ్నుఁడు మూర్ఛఁదేఱి యాయుధమును ధరించి, మునులచేఁ బూజింపఁబడి రాక్షసుని దారికడ్డముగా నిలిచెను.

## శత్రుఘ్నుఁడు లవణుని సంహరించుట.

అంత దివ్యంబును, అమోఘంబును, ఉత్తమంబును, తేజోమయంబును, ఘోరంబును, వజ్రాననంబును, వజ్రవేగంబును, మేరుమందర సన్నిభంబును, నతపర్వంబును, రణాపరాజితంబును, రక్తచందన శోభితంబును, చారుపత్రంబును, దానవభంజనంబును బ్రళయాగ్నిసన్నిభంబును, నగు బాణంబును శత్రుఘ్నుఁడు కరంబునఁ దాల్చినంతనే దాని మంటలు దశదిశలు నలమికొనఁగాఁ గాంచి సర్వభూతంబులును అట్టుడికినట్లుడికెను. దేవాసుర గంధర్వులును మునీంద్రాప్సరోగణంబులును సర్వజగంబులును స్వస్థత వీడి బ్రహ్మకడకేఁగి దేవా! లోకక్షయంబు సంభవించెనా? యుగక్షయంబు సంభవించెనా? ఇట్టి యుపద్రవం బెన్నఁడు కనలేదు. వినలేదు. అన వారివచనంబు లాలించి బ్రహ్మ వారి కభయం బొసంగి భయకారణంబుగూర్చి మధురవాక్కులతో నిట్లనియె. దేవతలారా! వినుఁడు. శత్రుఘ్నుఁడిపుడు లవణుం బరిమార్ప శరంబు కరంబునఁదాల్చెను. దాని తేజంబున నింతపుట్టె. బిడ్డలారా! మిమ్మిపుడు భయపెట్టిన తేజోమయ శరంబు లోకకర్తయు, సనాతనుఁడు నగు విష్ణుదేవునిది. విష్ణువు దీనిని మధుకైటభులను వధించుకొఱకు కగ్నిమయంబుగా సృజించెను. దాని నతఁడొకఁడే తెలిసినవాఁడు. ఇది విష్ణుతేజంబేగాన మీరందఱు తరలి చని

శత్రుఘ్నునిచేఁ జంపఁబడు లవణునిఁ గాంచుఁడన విని వారు పాలికలని కెలనికిఁ జని శత్రుఘ్నుఁడు ధరించిన యాశరంబును గనుచుండిరి. దేవతలెల్ల మింటిపైఁ మూఁగియుండుటఁగాంచి శత్రుఘ్నుఁడు రోదసీకుహరంబు భోరుకలంగ సింహ నాదంబు గావించి లవణుని యుద్ధంబునకుఁ బిలువ నాతండు తొడచఱిచి నిలువ శత్రుఘ్నుఁడు ఆకర్ణాంతము నారి లాగి శరంబునేయ నది లవణుని యురంబుఁగాఁడి పాతాళంబుఁ జొచ్చి క్షణంబులోఁ బైకి వచ్చి శత్రుఘ్నునిఁ జేరెను. వజ్రాహతిం బ్రద్దలైన పర్వతంబుమాడ్కి లవణుండు పడియుండఁగనే శత్రుఘ్నునియొద్దనుండి యాశరంబు సర్వభూతంబులు చూచుచుండఁగా రుద్రునియందైక్యమొందెను. అంత దేవతలు,ఋషులు, గంధర్వులు, సిద్ధులు, అప్సరసలు గుమిగూడి శత్రుఘ్నుని మేలుమేలని పొగడి పూజించిరి. శత్రుఘ్నుఁ డిట్లొక్క బాణంబుననే లవణునిఁ జంపి లోకత్రయభయంబు నుడిపి, చీఁకటినిఁ బోకార్చిన సూర్యునివలెఁ దేజరిల్లుచుండ దేవతలు ఋషులు పన్నగులు అప్స రసలుమున్నగు నెల్లరు మనయదృష్టవశంబున శత్రుఘ్నుఁడు జయించెనని పాముపలని భయంబుపాసినవారివలెఁ బ్రశాంత చిత్తములతోఁ జనిరి.

ఇది యఱువది తొమ్మిదవ సర్గము

---

## డెబ్బదియవ సర్గము

### దేవతలు శత్రుఘ్నునకు వరమిచ్చుట.

లవణుం డట్లు హతుండు కాఁగానే దేవతలు ఇంద్రాగ్నిపురోగములై శత్రుఘ్నునిఁ జూడవచ్చి సుధామధురవాక్కుల నిట్లనిరి. శత్రుఘ్నా! మా యదృష్టంబున నీవు జయముగాంచితివి. లవణాసురునిం జంపితివి. మేమెల్ల సంతసించి నీకు వరంబీయ నరుదెంచితిమి. మాదర్శనంబు వ్యర్థంబు కాదు. నీ వలసిన వరంబు కోరుమన విని శత్రుఘ్నుఁడు శిరంబునఁ గరంబులు గీలించి నమ స్కరించి నిర్మలచిత్తుఁడై యిట్లనెను. దేవనిర్మితమై రమ్యంబైన యీమధురా పురంబు శీఘ్రమే నాకు రాజధానియగుఁ గాక! ఇదియే నాకోర్కి.' అన దేవ తలందఱట్లే యగుఁగాక యని పలికి దివంబున కరిగిరి.

### శత్రుఘ్నుఁడు మధురాపురం బభివృద్ధి చేయుట.

శత్రుఘ్నుండు సేనను రమ్మని పిలువనంప రాజాజ్ఞనాని చమూపతు లెల్ల నరుదెంచిరి. శత్రుఘ్నుఁడు శ్రావణమాసమున గృహనిర్మాణ మునకుఁ దొడఁగి యొసంగెను. పండ్రెండవయేఁటికి పట్టణంబు నిర్మాణంబు పూర్తియై శూరులకునికిపట్టై యెవరివలన నెట్టి భయంబులేనిదియై స్వర్గము

వలెఁ బ్రకాశించెను. మేఘుఁడు నెలకు మూఁడువర్షంబులు వర్షించెను. క్షేత్రంబులు, సస్యభరితంబులాయెను. జనులెల్ల రోగరహితులైరి. ఆపట్టణము యమునాతీరంబున అర్ధచంద్రాకారమై పొలిచెను. అందెన్నెన్నియో ముఖ్య గృహంబులు నిర్మింపఁబడెను. మండపంబులు అంగడివీధులు తీర్చికట్టఁబడెను. నాలుగు వర్ణములవారు లోటుపాటులు లేక విరాజిల్లిరి. నానావిధవాణిజ్య వస్తువు లందెందుఁ జూచినను గుప్పలుతెప్పలుగా శోభిల్లుచుండెను. ఇంతకు మున్ను లవణుండు శంభ్రపఱచిన యింటిని శత్రుఘ్నుఁడు చిత్రచిత్రవర్ణ ములచే నలంకరింపఁజేసెను. ఎందుఁ జూచినను పూఁదోటలే. ఎందుఁజూచినను దటాకంబులే. ఎందుఁజూచినను దేవమానుషగృహంబులే. ఎందుఁజూచినను వర్తకార్థం బరుదెంచిన నానాదేశవర్తకులే. ఇట్లు సర్వవస్తుసమృద్ధిచే మూరిఁ బోవు తనపట్టణంబునుగాంచి శత్రుఘ్నుఁడు పరమానందభరితుఁడై యుండఁ బన్రెండగునేఁట రామపాదంబులఁగాంచి రావలెనని తలంపు పుట్టె

ఇది డెబ్బదియవ సర్గము

---

## డెబ్బదియొకటవసర్గము

### శత్రుఘ్నుఁడు వాల్మీకి యాశ్రమంబున విడియుట.

మంత్రి శ్రేష్ఠులను సైనికోత్తములను బురంబునకుఁ గావలివెట్టి యుత్త మాశ్వంబులు పూన్చిన నూఱురథంబులు తనవెంట నరుదేర నల్పభృత్యబల సమేతుఁడై యయోధ్యకు బయలుదేఱి యేడెనిమిదినెలలపాటు నెడనెడ నిలుచు చుఁ జని వాల్మీకియాశ్రమంబుఁ జేరి యామహర్షి పాదములకు వందనమాచరించి యతఁడొసఁగిన యర్ఘ్యపాద్యంబులును ఆతిథ్యంబును గైకొనెను. వాల్మీకి మహర్షి బహురూపంబులు బహుమధురంబులు నగు వేనవేలు కథలు శత్రు ఘ్నునకుఁ జెప్పి ప్రస్తావవశంబున లవణుని గూర్చి ముచ్చటించుచుఁ బార్థివా! నీవు లవణునిఁ ద్రుంచి యనన్యసామాన్య కార్యంబు సాధించితివి. ఈదురాత్మ ర్గుఁడగు లవణుఁడు తనతోఁ బోరు సల్ప వచ్చిన పెక్కుమంది రాజులను ససైన్యంబుగఁ గూల్చియున్నాఁడు. అట్టివానిని నీవు లీలగాఁ జంపి లోకమునకు భయముడిపి శాంతిచేకూర్చితివి. మీయన్న శ్రీరామచంద్రుఁ డంతయత్నమున రావణునిఁ జంపెను. నీవు అప్రయత్నముగా నీలవణునిఁ బొరిగొన్నావు. లవ ణుని చావు దేవతలకు సర్వభూతములకు సర్వజగత్తులకు మోదంబు చేకూ ర్చెను. నేనింద్రసభలోఁ గూర్చుండి నీచేయు యుద్ధంబు తిలకించి మేనం బుల కించితిని. నాయనా! చేరరమ్ము! నీశిరంబు మూర్కొందును. ఇదే నాకు నీ యెడఁగల ప్రేమకుఁ జిహ్నము. అని వాని శిరంబు మూరుకొని వానికిని వాని బలఁగమునకును విందొనర్చెను.

## శత్రుఘ్నుఁడు శ్రీరామాయణము వినుట.

విందుగుడిచి కూర్చుండి శత్రుఘ్నుఁడు గీతమాధుర్యంబును అనుత్తమమును తంత్రీలయసమన్వితంబును త్రిస్థానకరణాన్వితమునుఁ (ద్రుతమధ్యవిలంబితము) సంస్కృతంబును లక్షణోపేతంబును సమతాళసమన్వితంబును బూర్వకృతంబును సత్యాతురసంయుతంబును బూర్వవృత్తభాసితంబును నగు రామచరితంబును విగతచేష్టుఁడై బాష్పాకులలోచనుఁడై మాటిమాటికి నిట్టూర్పులు నిగుడించుచు నప్పుడు జరిగినదివలె నాలించెను.

శత్రుఘ్నునిఁ బరిజనులుగూడ నామధురగీతము నాలించి దీనులై తలలువంచి యాశ్చర్య మాశ్చర్యమని పలుకుచు నొండొరులఁ బరికించి ఏమిది ? ఎక్కడనున్నాము ? స్వప్నముకాదుగదా! తొల్లి మనముకన్నదియెల్ల నిప్పుడు మరల నిచ్చటఁ గనుచున్నాము! కలయే కలగీతమై మించ వినుచునున్నాముగావలయు; అని ప్రశ్నించుకొని శత్రుఘ్నునిఁజూచి రాజా! ఈ గీతవృత్తాంతమునుగూర్చి వాల్మీకిమునిచంద్రు నడిగి తెలిసికొనుము. అన శత్రుఘ్నుఁడు కౌతూహలసమన్వితుఁడై యిట్లనియె. సైనికులారా ! నే నడుగఁజాలను. ఈయాశ్రమంబున నిట్టి విచిత్రకథ లెన్నెన్నో వినవచ్చుచుండును. వానినెల్ల మనము కుతుకంబున నడుగరాదు. అని సైనికులకు బదులుపలికి శత్రుఘ్నుఁడు వాల్మీకికి నమస్కరించి తననివేశనమునకుఁ జని

ఇది డెబ్బదియొకటవ సర్గము

---

## డెబ్బదిరెండవసర్గము

### శత్రుఘ్నుఁడు శ్రీరాము దర్శింప నయోధ్య కేఁగుట.

శయ్యఁజేరి సుమధురశబ్దయుతంబును తంత్రీలయసమన్వితంబును అనుత్తమంబును నగురామగీతంబును నిద్దురలేక యేకాగ్రచిత్తంబునఁ జింతించుచుండఁ బ్రొద్దుపొడిచెను. అంతఁ బౌర్వాహ్ణికక్రియాకలాపంబు నిర్వర్తించి మౌనిశ్రేష్ఠునిఁగాంచి ప్రాంజలియై స్వామీ! రఘురామచంద్రునిఁ జూడ మనంబుఱ్ఱటలూఁగుచున్నది. తామును నియమవ్రతులగు నీమునులును సెలవిచ్చిపంపుఁడు. అన విని వాల్మీకి కౌఁగిలించుకొని పోయిరమ్మునాయనా! యని, సాగనంప మౌనికి మ్రొక్కి రథంబెక్కి రామునిఁగాంచవలయునను కోర్కె క్రేళ్లుదాఁటుచుండ శత్రుఘ్నుఁడు కడువడి నయోధ్యకుఁ జని శ్రీరాముఁడున్నయెడ కరిగి దేవతామధ్యస్థుఁడై వెలుఁగొందు దేవేంద్రుని మాడ్కి మంత్రిమధ్యస్థుఁడైయున్న యన్ననుగాంచి యిట్లనియె. మహా

రాజా! తామాజ్ఞాపించినట్లుగా లవణుని వధించితిని. పట్టణంబుఁ జక్కఁ బఱచితిని. జనులు నివేశనంబులు గొనిరి. మిమ్మెడఁబాసి పండ్రెండేండ్లాయెను. నే నొంటరిగా నందుండఁజాలను.

## శ్రీరామ శత్రుఘ్నుల సంభాషణము.

కాన రామా! నన్ననుగ్రహింపుము. తల్లినిఁబాసిన దూడవలె నిన్నుఁ బాసి నే నుండఁజాలను. అన విని రాముఁడు తమ్మునిఁ గౌఁగిలించుకొని యిట్లనియె. విచారింపకు సోదరా! విచారింపకు. ఇది క్షత్రియధర్మము కాదు. రాజులెడఁబాటులందు వగలపాలుగారాదు. ప్రజాపరిపాలనంబు స్వేత క్షత్రియధర్మము.

వీరా! నీ వప్పుడప్పుడు వచ్చి యయోధ్యను జూచిపోవచ్చును. కాన నీవిఁక నీపురంబునకుఁ జనుము. ప్రాణములందుకంటె నీయందు నాకుఁ బ్రీతి మెండు. అనుమానింపవలదు. రాజ్యపాలనం బవశ్యకరణీయము! కాన సోదరా! నీవు నీబలఁగముతో నేడురాత్రులుమాత్ర మిందుండి పిమ్మట మధురాపురంబునకుఁ జనుము. అన విని శత్రుఘ్నుఁ డట్లెయని యియ్యకొని యేడురాత్రులుమాత్రమె యందుండి రామ భరత లక్ష్మణులతోఁ బోయివత్తునని చెప్పి భరతలక్ష్మణులు చాలదూరము సాగనంపఁగా రథంబునెక్కి శీఘ్రంబుగా మధురాపురంబునకుఁ జనెను.

ఇది డెబ్బదిరెండవ సర్గము

---

## డెబ్బదిమూఁడవసర్గము.

### బ్రాహ్మణుఁడు మృతబాలకు కళేబరమును శ్రీరాముని యింటివాకిట వైచి యేడ్చుట.

అట్లు శత్రుఘ్ననంపి రాఘవుఁడు తక్కిన తమ్ములఁగూడి సంతోషముతో సుఖముగా ధర్మయుక్తముగా రాజ్యమును బాలించుచుండఁ గొన్నాళ్లకు నొకపల్లెటూరి వృద్ధబ్రాహ్మణుఁ డొకమృతబాలకునిఁ దీసికొని వచ్చి రాజద్వారమునఁ బడవైచి స్నేహదుఃఖసమన్వితుఁడై కొడుకా! కొడుకా! యని పరిపరివిధంబుల విలపించుచు నిట్లనియె.

అక్కటా! నేను తొలిబామున నేమిపాపంబు చేసితినో! లేకున్న నాకన్నుల ముందటనే నాయేకైక పుత్త్రుఁడేల మృతినొందును. నాయనా! యౌవనమురాకమునుపే అయిదేండ్లైన నిండకమునుపే యకాలమృత్యువు నిన్ను వాతఁ బెట్టుకొన్నదా? మమ్ము దుఃఖసముద్రమున ముంచివైచితివా?

నీశోకంబును నోపలేక నేను నీతల్లి కొలఁదినాళ్లకె నీగతిం బొందుదుము. సందియములేదు. నమ్ముము. ఎన్నఁడు అనృతమాడలేదు. హింస యెట్టిదో యెఱుంగను. ఇట్టినాపుత్త్రుఁ డేపాపముఁజేసి పితృకార్యము చేయకమునుపే యమసదనమున కేఁగెను. రామరాజ్యమందువలె నిట్లకాల మృత్యువువాతఁ బడినవార్త యెందును వినలేదు. కనలేదు. రాముఁడొనర్చిన పాపమే మా కొంపముంచినది. ఏదో ఘోరపాప మీరాముఁడు చేసినాఁడు. సందియము లేదు. లేదేని నాకొడుకేల చనిపోవును.

రాజా! ఇతరరాజుల రాజ్యములం దెందును నీరాజ్యమునందువలె బాలురకు మృతికలుగలేదు. కాన మృతినొందిన నాబాలుని బ్రతికింపుము. లేదేని నేను, నాభార్య కూడ నీనగరువాకిటనే దిక్కులేనివారివలె మృతినొందుదుము. రామా! నీవు బ్రహ్మహత్యాపాపము మూటగట్టికొని సుఖంబుండుము. తమ్ములఁగూడి చిరకాలము బ్రతుకుము. మహాబలా! నీరాజ్యమున, నేమిందనుక దుఃఖంబెఱుఁగక సుఖంబుగనుంటిమి. కాని యిన్నాళ్లకుఁ బుత్త్రమరణంబునం జేసి యిట్టి దుస్సహార్తికిఁ బాల్పడితిమి. బాలురకు మృత్యువు తెచ్చిపెట్టిన రాముని రాజుగాఁబడసి మహాత్ములైన యిక్ష్వాకుమహారాజుల రాజ్యము దిక్కులేనిదాయెను. రాజులొనర్చిన దోషమే జనులను పలువిధములఁ బరిమార్చును రాజులు దుర్వృత్తిగలవారైనచోఁ బ్రజ లకాల మృత్యువుఁ గాంతురు.

పల్లెలను బట్టణములను జరుగు ననుచిత కృత్యంబులను రాజణఁపఁడేని ప్రజల కకాలమరణంబు సంభవిల్లును. పల్లెనో పట్టణముననో రాజదోషంబున నెద్దియేని నకృత్యము జరిగియుండును. సందియంబులేదు. అనియిట్లు బహువిధంబుల బడిబడి పుడమియెడని నిందించి దుఃఖసంతప్తుఁడై కొడుకును గౌఁగిలించికొని వాపోవుచుండెను.

ఇది డెబ్బది మూఁడవ సర్గము.

---

## డె బ్బ ది నా లు గ వ స ర్గ ము.

### నారదుఁడు శ్రీరామునకు బాలకుఁడు మృతుఁడైన కారణము తెలుపుట.

అట్లు సకరుణంబుగా విలపించు బ్రాహ్మణుని దుఃఖశోకసమన్వితంబగు పరిదేవనంబు నాలించి రాముఁడు దుఃఖసంతప్తుఁడై మంత్రులను వసిష్ఠుని వామదేవుని సోదరులను వేదవిదులను బిలువనంప వసిష్ఠుఁడు ఎనమండుగురు బ్రాహ్మణులతో రాజసన్నిధికి నరుగుదెంచి వర్ధిల్లుమని దీవించినంత మార్కండేయుఁడు, మౌద్గల్యుఁడు, వామదేవుఁడు, కాశ్యపుఁడు, కాత్యాయనుఁడు,

జాబాలి, గౌతముఁడు, నారదుఁడు అను బ్రహ్మర్షులు సుఖాసనాసీనులైరి. అట్లుపవిష్టులైన మంత్రులను, వేదబ్రాహ్మణులనుగాంచి రాముఁడు నమస్కారంబు గావించి బ్రాహ్మణుని దుఃఖంబునకు కారణంబేమై యుండునని యడుగ నారదుం డిట్లనియె.

రాజా! వినుము. బాలుండు అకాలమరణంబుఁ జెందెను. వివరించెదను. విన్నపిమ్మటనీకుఁ బోలినతెఱంగునఁ జేయుము. పూర్వము కృతయుగంబునఁ దపస్వులెల్ల బ్రాహ్మణులే అబ్రాహ్మణతపస్వి యెందునులేఁడు. ఆయుగంబు బ్రహ్మభూతంబు అజ్ఞానరహితంబు నైప్రజ్వరిల్ల జనులెల్ల దీర్ఘదర్శనులై మృత్యువెఱుంగక యుండిరి. పదపడి వపుష్మంతులైన మానవులుగల త్రేతాయుగంబు తోఁతెంచెను. అందు క్షత్రియులు దేహబలము గలవారగుటచేఁ దపమొనరింపఁ గడంగి పూర్వముకంటె వీర్యంబునను, దపంబునను మిక్కుటలైరి. కాని కృతయుగమునవారిని మించఁజాలరైరి. త్రేతాయుగంబునఁ బుట్టిన క్షత్రియులకంటెఁ బూర్వపువారు అధికవీర్యవంతులు, తపోధికులునై యుండిరి. త్రేతాయుగంబున క్షత్రియులు, బ్రాహ్మణులు, సమవీర్యులై యుండిరి. వారిలో హెచ్చులొచ్చులు వచింప శక్యంబుగాదు అప్పుడు చాతుర్వర్ణ్య సమ్మతంబైనపద్ధతి యొక్కటి యేర్పాటు గావింపఁబడెను. ఆయుగంబున ధర్మంబనావృతమై తేజరిల్లుచుండ అధర్మంబొక పాదంబు పొడసూపెను. అధర్మంబునం గూడుటంజేసి తేజంబు మందంబునొందెను. ప్రజలు అధర్మయుక్తులగుటంజేసి తేజోవిహీనులైరి. కృతయుగంబున బ్రహ్మజ్ఞానంబు విస్తారంబుగ నుండుటంజేసియు, అధికమహిమంబు గలుగుటంజేసియు, విమలజ్ఞానులైన లోకులు సేద్యంబు (అనృతము) చేయరైరి.

త్రేతాయుగమునందలి జనులు మహిమతో జీవించు స్వతంత్రతలేనివారగుటఁ గృతయుగజనులు అమేధ్యముగాఁ దలంచిన రాజసంబైన కరిసనమును (కృషి) బ్రతుకుఁ దెరువునకై చేపట్టిరి. అనృతంబుతోపాటు ధర్మహానియు జనించెను. దానంజేసి దీర్ఘాయువణఁగఁ దొడఁగెను. ఆయువు తఱుఁగుటచే నలజడిఁజెంది సత్యధర్మపరాయణులై శుభంబు లాచరించుచుండ్రు. త్రేతాయుగంబున బ్రాహ్మణ క్షత్రియులు తపంబుసేయఁగాఁ దక్కినవారు పరిచర్య చేయుచుండెడివారు. అందు శూద్రులకు శుశ్రూషయే పరమధర్మమాయెను. పదపడి ద్వాపరంబు దాపరింపఁగానె యధర్మంబుద్వితీయపాద ముద్భవిల్లెను. దానంజేసి యధర్మంబును అనృతంబును నెల్లడలఁ బెల్లెసంగెను. అందుచే నది ద్వాపరంబనంబడెను. అందుఁగృషికిదగ్గ ఫలంబు లభింపమింజేసి వైశ్యులు తపంబుసేయఁ దొడంగిరి. ఇట్లు మూఁడు యుగంబులందును, మూఁడువర్ణంబులవారును దపంబుచేయువారు. శూద్రులుమాత్ర మీ

మూఁడుయుగంబులఁ దపంబుఁ జేయఁదగదు. కాని కలియుగంబునమాత్రము ఉగ్రతపంబు చేయువారగుదురు. ద్వాపరమందే యిట్టి కలిపుప్రవర్తనంబు పుట్టినగాన ఘోరంబని వేఱె చెప్పనేల? ఎవ్వఁడో దుర్బుద్ధియగు శూద్రుం డిప్పుడు తపముచేయుచున్నాఁడు. ఆ కారణంబుననే యీ బాలమరణంబు సంభవించెను. తనరాజ్యమందెవఁడేని దుర్మతియై యలక్ష్మీకిమూలమగు నకార్యం బాచరించినచో వానిని శిక్షింపనిరాజు నిస్సంశయంబుగా నధోగతి పాలగును. తపంబునను అధ్యయనంబునను బుణ్యకర్మములను నాఱవభాగంబుగొను రాజు ధర్మముగాఁ బ్రజల నేలఁడేనిఁ బ్రజలపాపములో నాల్గవ వంతు నను భవింపవలయును. కాన రాజేంద్రా! నీ రాష్ట్రంబున నట్టి దుష్కృతంబు నొనరించిన వాఁడుండెనేమో కనుఁగొను యత్నంబు సత్వరంబుగాఁ జేయుము. అట్లొనర్చితివేనిధర్మంబు పెంపొందఁ గలదు. ఆయువు వృద్ధిఁగాంచఁగలదు. ఈ బాలుండును జీవింపఁగలఁడు.

ఇది డెబ్బదినాల్గవ సర్గము

---

## డెబ్బదియయిదవ సర్గము

### శ్రీరాముఁడు పుష్పకముపైనెక్కి మునిని వెదకనేఁగుట.

రాముఁడమృతమయంబులగు నారదునివాక్యంబు లాలించి పరమానందంబుఁజెంది లక్ష్మణునితో నిట్లనియె. వెళ్లు లక్ష్మణా! సువ్రతుఁడగు నా బ్రాహ్మణశ్రేష్ఠు నోదార్పుము. బాలుని శరీరము నూనెకాఁగులో నుంపుము. చక్కని గంధములతోడను, సుగంధ తైలములతోడను వాని మేనుపాడువాఱకుండ మార్పుచెందకుండఁ బదిలంబుచేయుము.

అనిచెప్పి తాను బుష్పకంబును మనంబునఁదలంప, నది ముహూర్తకాలములో రాముని సమీపించి రాజా! ఇదిగోవచ్చితిని. ఏమిసెలవు? అని యడఁకువతోఁ బలుక, దాని సురుచిర వాక్యమాలించి రాముఁడు ఋషులకు మ్రొక్కి విమానమెక్కి బాణ, బాణాసన, తూణీర, కరవాలంబుల నందుంచి, భరతలక్ష్మణులను నగరంబునకుఁ గావలియుంచి యెడనెడ నెమకుచుఁ బడమటిదిక్కునకుంబోయి, యందే చెడుగును గానక, హిమవత్పర్వతావృతంబైన యుత్తరంబునకేఁగి నచ్చటఁగూడ దోసంబావంతయైనఁ గానక, శుద్ధసమాచారముగలదియు నద్దంబువలె నిర్మలమైనదియు నగు తూర్పుదిక్కునకుం జని విమానంబునందుండి నలుకెలంకులం బరికించి యందే దోషంబుగానక, దక్షిణంబునకేఁగి యచ్చటి పర్వతంబునుత్తరపార్శ్వంబున సరోవరంబు నొకదానిం గాంచి యందు నధోముఖుండై వ్రేలాడుచు ఘోరతపంబు గావించునొక

ఋషింగాంచి దగ్గఱకేఁగి యిట్లనియె. తపోవృద్ధా! సువ్రతా! నీవు ధన్యుఁడవు. ఏకులంబునవాఁడవు. నేను దశరథపుత్త్రుఁడను. రాముఁడను. ఇటు చూడుము. నీవే యర్థంబునర్థించితివి? స్వర్గలాభమా? మఱియొకటియా? పరాశ్రయంబు దేని నభిలషించి యింతటి దుష్కరతపంబు చేయుచున్నావు వినఁ గౌతుకమగు చున్నది. బ్రాహ్మణుఁడవా? క్షత్త్రియుఁడవా? శూద్రుఁడవా? సత్యంబు వచింపుము. సత్యము తపస్సునకంటె నిత్యమైనది. అమృతత్వము దాననే సిద్ధించును. అన విని ముని తనజాతిని దాఁజేయు తపోయత్నంబును బూస గ్రుచ్చినట్లుగా నిట్లుచెప్పెను.

ఇది డెబ్బదియయిదవ సర్గము

---

## డెబ్బదియాఱవ సర్గము

### శ్రీరాముఁడు శంబూకుని వధించుట.

నేను శూద్రయోనిం జన్మించితిని. నన్ను శంబూకుఁడందురు. నేను దేహంబుతోడనే దేవత్వంబును బొందఁగోరుచున్నాను. దేవలోకజిగీషకలిగి యున్నాను. కల్లలాడెడు వాఁడనుగాను. ఉగ్రతపంబున్న నన్ను శూద్రునిగా నెఱుంగుము. అని శంబూకుఁడు విన్నవించుకొనుచుండఁగానె రాముఁడు తళ తళమెఱయు తరవారి నొఱనుండి తటాలునఁదూసి వాని తల తెగనఱికెను. అది కాంచి యింద్రాగ్ని దేవతలు మేలుమేలని రాముని మఱిమఱి పొగడిరి.

దివినుండి మున్మురమైన కమ్మనివాసనలఁ జిమ్ము పూలవాన యెల్ల యెడలఁ గురిసెను. గంధవాహుఁడు తన పేరు సార్థకముగా మందమందముగా వీచెను.

దేవతలు సుప్రీతులై రామునిఁగాంచి అరిందమా! సురకార్యము నెఱవేర్చితివి. నీవలసిన వరంబు కోరుము. నీచేఁ జంపఁబడిన యీశూద్రుఁడు స్వర్గమును బొందఁడు అని వచింప విని రాముఁ డిట్లనియె. మీరు నాకుఁ బ్రసన్నులరై రేని యాబ్రాహ్మణ బాలుఁడు జీవించునట్లు వరమొసఁగుఁడు. ఇదియే నాకుఁ బరమప్రీతికరంబు. నాయపచారంబునంజేసి బ్రాహ్మణుని యేకపుత్త్రుఁడైన యాబాలుఁడు కాలము దీఱకమున్నే యమసదనమున కరిగెను. వానిని బ్రతికింపుఁడు. మీకు మేలయ్యెడు. నీసుతుని బ్రతికింతునని బ్రాహ్మణుని నమ్మఁబల్కితిని. నాపల్కు పొల్లుగానీయకుఁడు.

అన విని దేవతాశ్రేష్ఠులు కడుంగడు సంతసించి రామున కిట్లనిరి. రామా! యుష్మల్లిక దక్కుము. నేఁడే యాబాలకుఁడు బ్రతికి బయటఁబడి

బంధువులను గూడెను. రామా! పరంధామా! నీవేముహూర్తమున నా శూద్రుని జంపితివో యాముహూర్తముననే యాబాలుఁడు ప్రాణంబులు గాంచి సుఖించెను.

రాజశ్రేష్ఠా! మేల్గాంచుము. నీకు భద్రంబగుఁగాక! పోయి వచ్చెదము.

### శ్రీరాముఁ డగస్త్యుఁ జూడఁ బోవుట.

మేమగస్త్యాశ్రమము దర్శింప నేఁగుచున్నాము. ఆమునీంద్రుఁడు జలశయ్యనుబరుండి పండ్రెండేండ్లాయెను. ఇంతకు ఆదీక్ష ముగిసినది. రామా! మేమాతని నభినందింప నరుగుచున్నాము. నీవును మాతోవచ్చి యభినందింప వచ్చును. భద్రంబు లందవచ్చును. రమ్ము. పోయివత్తము. అన రాముఁ డట్లే యని హేమభూషితంబైన తన పుష్పకవిమానము నెక్కెను. దేవతలును తమ తమ విమానంబుల నధిరోహించిరి. అందఱును గలిసి రయంబుమై నగస్త్యుని తపోవనంబున కరిగిరి. వారిం గాంచి తపోనిధియగు నగస్త్యుఁడు యథార్హంబుగాఁ బూజలుచేసెను. దేవతలు వానిపూజలం గైకొని సంతసించి సపరివారంబుగా నాకంబున కరిగిరి. అంత రాముఁడు పుష్పకంబునుండి దిగి కుంభజన్మున కభివాదనముచేసి యాతఁడొసఁగిన యాతిథ్యము గొని యటఁ గూర్చుండ నగస్త్యుఁ డిట్లనియె.

రామా! నీకు స్వాగతంబే? నీరాకచే మాయదృష్టము పండినది. అనంతకళ్యాణగుణగణాఢ్యుఁడవగుట రామా! నీవు మాకుఁ బూజనీయుండవైన యతిథి వైతివి. సదా నీవు నామనంబున నిలిచియుందువు. నీవు శూద్రమునిని జంపుటయు బ్రాహ్మణకుమారుని బ్రతికించి ధర్మంబు నుద్ధరించుటయు దేవతలు నాకుఁ జెప్పిరి. చాలసంతసించితిని. రామా! తెల్లవాఱుదాఁక నాయొద్ద నుండుము. వేగుఁబోకనే విమానంబునెక్కి యయోధ్యకుఁ జనవచ్చును. నీవు శ్రీమన్నారాయణుఁడవు. నీయందు సర్వంబు నిలిచియుండును. నీవు సర్వభూతంబులకు నేలికవు; సనాతనపురుషుఁడవు;

### అగస్త్యుఁడు శ్రీరామునకు దివ్యాభరణ మొసఁగఁబోవుట.

రామా! దివ్యదీధితుల నీను నీయాభరణంబు విశ్వకర్మచేఁ జేయఁబడినది. దీనిని నీవు గైకొని నాకు ముదంబొదవింపుము. ఒకరిచ్చిన దానిని మరల మఱొకరికిచ్చుట విశేషఫలంబని పెద్దలందురు. మహాత్ఫలంబును గూడ భరింప నీవ శక్తుండవు. ఇంద్రాది దేవతలనెల్లఁ దరింపఁజేయుటకు నీవ శక్తుండవు. కాన భాస్కరునివలెఁ జిత్రంబుగా వెలుంగు నీదివ్యాభరణంబును నీకు శాస్త్రోక్తముగా నొసంగుచున్నాను. కైకొనుము. అన విని క్షత్రియధర్మంబును మనంబునఁ దలంచి రాముఁడు అగస్త్యునిఁ గాంచి మునినాథా! బ్రాహ్మణు

నకు దానంబువట్టుట నింద్యంబుగాదు. కాని, క్షత్రియున కిది తగదుగదా! క్షత్రియుఁడనైన నేను బ్రాహ్మణదత్తంబైన దానంబు నెట్లు గైకొందును? అనుగ్రహించి సమాధానము చెప్పుమన ముని యిట్లనియె.

దివ్యాభరణముఁ గొనవచ్చునని యగస్త్యుఁడు శ్రీరాము సమాధానపఱచుట.

రామా! బ్రహ్మభూతంబైన కృతయుగంబునఁ దొలుతఁ బ్రజలకు రాజులేఁడు. శతక్రతుఁడు దేవతలకు రాజై యుండెను. సురలకువలెనే తమకు నొక్క రాజుండవలెనని కోరుటకై ప్రజలు బ్రహ్మయొద్ద కరిగి పితామహా! నీవు దేవతలకు శతక్రతుని రాజుగా నొసఁగితివి. అట్లే మాకును నొక్క నరో త్తముని రాజుగా ననుగ్రహించి దయ చేయుము. వానిఁ బూజించుచు మేము పాపరహితులమై చరింతుము. రాజు లేకుండ మేముండఁజాలము. ఇది మా నిశ్చయము.

అన విని విరించి కార్యంబు యోజించి యింద్రుఁడు మున్నగు లోక పాలురను బిలిచి మీలో నొక్కొక్క యంశ మొసఁగుఁడు. వానిచే నరపాలుని సృష్టించెద నన వారట్లె తమ చతుర్థభాగంబుల నొసంగిరి. అంత బ్రహ్మక్షుప మొనరింప క్షుపుఁడను పురుషుఁడొకఁడు జనించెను. నలువ వానిని బ్రజల కాఁకలి దప్పులు దీర్చు రాజుగాఁజేసి మహేంద్రాంశముచే భూమిని నీయాజ్ఞ చెల్లునట్లును వారుణాంశంబుచే నీమేను రక్షింపఁ బడునట్లును కుబేరాంశం బుచే నీకు విశేషధనంబు చేకూరునట్లును యముని యంశంబుచే లోకంబును శాసించునట్లును ననుగ్రహించితిని. అనెను. కాన నీవింద్రాంశంబుచే నీ యాభరణంబుగైకొని నన్నుఁ దరింపఁజేయుము.

అని పరమధార్మికుఁడైన ముని వచింపఁగా విని రాముఁ డా యాభరణ మును గైకొని వానింగని యద్భుతంబై యీ దివ్యాకారంబుగల యాభర ణంబు తమ కెట్లు లభించెను. ఎవరు తెచ్చి యిచ్చిరి? వినఁ గుతూహలమగు చున్నది. అచ్చెరువులకెల్ల గనులయిన మీరీ యచ్చపుటాభరణంబుకథ ముచ్చటదీర వచింపుఁడన ముని వినుమని యిట్లనియె.

ఇది డెబ్బది యాఱవ సర్గము

---

## డెబ్బదియేడవ సర్గము

### శ్వేతోపాఖ్యానము.

విను రామా! త్రేతాయుగమున శతయోజనవిస్తారంబును నిర్మృ గంబును పక్షివర్జితంబును నగు వనం బొండుగలదు. నే నావనంబున నుత్తమ

తపం బొనరింపఁదలంచి యరిగితిని. దాని చక్కఁదనము వర్ణింపనేరికిని శక్యం బుగాదు. ఎందెందుఁ జూచినను నోరూరు నూరించు కందమూలములె. ఎందుఁ గాంచినను బహురూపంబులైన వృక్షంబులె. ఆ మనోహరారణ్యసీమకు నడిమి ప్రదేశంబున నొక సుందరతరసరోవరంబుగలదు. అది యెటుచూచినను నొక యోజనము పొడవుగలిగియుండును. హంసలు బెగ్గురు పక్షులు చక్రవాకములు నున్నగు రమణీయపక్షిగణంబు లందు సదా విహారములు సలుపుచుఁ దమ్మి తూండ్లు కముచుచు తేటనీటినానుచు నాచులఁద్రోయుచు రెక్కలల్లార్చుచుఁ గొలకొలఁగూయుచు మునుఁగుచుఁ దేలుచుఁ గలువకాఁడలఁ ద్రుంచుచు బురదలేక, కలఁకఁ బాఱక పొలుచు నాకొలఁకు పొలంబును దిలకించి కులుకుచు నుండును. ఆ చెఱువుచెంతఁ బరమాద్భుతంబైన యొక యాశ్రమంబు గలదు. అది యేనాఁటిదో యెవరికి నెఱుకపడదు. అతి పవిత్రమైన యాయాశ్రమంబున నొక్క ఋషియైనఁ గానరాఁడు. అది వేసఁగియగుట నే నటఁ నారేయి సుఖనిద్రచేసి వెలుఁగురాఁగానె కాలకృత్యంబులు నిర్వర్తించి కొలను చెంగటి కరిగి యా మడుఁగులో నొక శవంబును గాంచితిని. అది బాగుగా బలిసి యున్నది. పరువంబు కలిగియున్నది. పంక్తిభేదంబుచేఁ బుష్టాంగమైయున్నది. దాని మొగంబునుండి సిరియొలుకుచున్నది. ఈ శవం బెవ్వరిదై యుండునో యని నాలో నేను వితర్కించుకొనుచు దీర్ఘంబుగా నాలోచించుచునుంటిని. ముహూర్తకాలములో నొక విమాన మచ్చటి కరుదెంచెను. అది దివ్యమై అద్భుతమై అత్యర్థమై ముద్దులు మూటగట్టుచున్నది. దానికి మనోజవంబులగు హంసలు పూన్పఁబడియున్నవి. అందొక దివ్యభూషణ భూషితాంగుఁ డుపవిష్టుఁడై యుండెను. సర్వాంగసౌష్టవంబుగల యప్సరోంగనా సహస్రంబు చుట్టునుండి వానిని సంతోషపెట్టుచుండెను. కొందఱు అమరగానంబు చేయుచుండిరి. కొందఱు వాయిదంబు నెఱపుచుండిరి. కొందఱు సింహనాదంబు చేయుచుండిరి. కొందఱు లాస్యంబు నొనర్చుచుండిరి. కొందఱు చంద్రకాంతుల నీను హేమదండంబుల మండితంబులగు వింజామరములుచేఁగొని వాని సుందరవదనారవిందమునకు విసరుచుండిరి. అంత నాస్వర్గవాసి మేరుగిరినుండి దిగివచ్చు సూర్యునివలె సింహాసనమునుండి వెడలివచ్చి విమానంబు దిగిసరస్సు చొచ్చి యుబ్బియున్న యాశవము మాంసము తనివుతీరఁదిని యాకొలని నీళ్లతో యథావిధిగా నాచమనంబు గావించి విమానంబు నెక్కఁబోయెను. వానింగాంచి నే నిట్లంటిని.

దేవవంశాశా ! నీ వెవ్వఁడవు ? రోఁతగొల్పు నీ పీనుఁగు నేలతింటివి ? చెప్పుము ? నీవొ. దేవతాస్వరూపుఁడవు. ఆహారమో వాకొనఁగూడనిది.

ఏమీ విచిత్రము ! నిజము చెప్పుము. విన వేడుకపడుచున్నాను. ఈ శవ భక్షణము నీ కర్హంబుగాఁ దలంపను.

అన విని రామా ! యా స్వర్గవాసి సంతసించి నాకు నమస్కరించి మృదుమధురంబుగా నిట్లనియె.

ఇది డెబ్బదియేడవ సర్గము

---

## డెబ్బదియెనిమిదవసర్గము

### శ్వేతుఁడు తన వృత్తాంత మగస్త్యునితోఁ జెప్పుట.

బ్రాహ్మణోత్తమా ! సుఖదుఃఖభాజనంబై దురతిక్రమణీయంబైన నాపూర్వచరిత్ర నీకోరిక దీఱఁజెప్పెద నాలింపుము. మహాయశస్కుఁడగు సుదేవుఁ డనురాజు నాతండ్రి. అతఁడు విదర్భకునేతయై ముల్లోకంబులఁ బేరు గాంచెను. అతని కిద్దఱుభార్యలు. నేను పెద్దదానికొడుకను నాపేరు శ్వేతుఁడు. రెండవయామె కుమారుఁడు సురథుఁడు. కొన్నాళ్లకు మాతండ్రి దివంబున కరిగెను. ప్రజలు నన్ను రాజునుజేసిరి. నేను ధర్మంబు తప్పక వేయేండ్లు రాజ్యంబు నేలితిని. ఒక్కకారణంబునంజేసి నేను నాయాయుఃప్రమాణంబు నెఱిఁగికొని, మరణంబు మనంబున నుంచుకొని. నాతమ్ముఁడగు సురథుని రాజ్యాభిషిక్తునిఁజేసి దుర్గమంబును మృగపక్షివివర్జితమును నగునొకవనంబును జొచ్చి యీ సరోవరంబుచెంత మూఁడువేలయేండ్లు తపంబుచేసి దుష్కరంబైన బ్రహ్మలోకంబును బొందితిని. అందును క్షుత్పిపాసలు నన్ను బాధింపఁగా వ్యధితేంద్రియుఁడనై త్రిభువనశ్రేష్ఠుఁడగు బ్రహ్మకడకరిగి దేవా! యీబ్రహ్మలోకము ఆఁకలిదప్పులులేనిది కదా ! ఇందుఁగూడ నాఁకలి దప్పులేల కలుగుచున్నవి ? నాకర్మంబేమి ? నాకేదేని యాహారమానతిమ్మన. అన బ్రహ్మ రుచికరములైన మాంసములు తినుమని నా కానతిచ్చి యిట్లనియె. నీవు ఒడలు పెంచుకొనుచుఁ దపస్సును జేసితివికాని వనసత్వంబులు వసించు నావనంబున నొక్కవిత్తైన విత్తవైతివి. భిక్షార్థ మరుదెంచిన యతికి గుప్పెఁడుమెతుకులైనఁ బెట్టవైతివి నీవొసర్చిన దానంబు గోరంతైన లేదు. ఊరకే తపస్సుమాత్రము చేసితివి విత్తునాటక మొక్క మొలచునా? దానంజేసి నీవు స్వర్గమందున్నను నీకు ఆఁకలిదప్పులు తప్పవాయెను. కాన ఆహారంబులచేఁ గ్రొవ్వియున్న నీ శరీరంబును నీవె యమృతంబుమాడ్కిఁ దృప్తిదీఱ భక్షించుచుండుము. శ్వేతా ! అగస్త్యుఁ డెపుడు నీయున్నవనంబున కరుదెంచునో యప్పుడు నీకష్టంబు గట్టెక్కఁగలదు. దేవతలనుఁగూడఁ దరింపఁ జేయుశక్తిగల యగస్త్యునకు ఆఁకలిదప్పులకు లోనైన నిన్నుఁ గాపాడు టొక

లెక్కలోనిదికాదు. అని వచించిన పితామహుని యాజ్ఞ నాలించి నాశరీరంబును నేనే రోఁతదోఁప దినుచున్నాను. నామేను నేను బెక్కేండ్లనుండి తినుచున్నను దఱుగకున్నది. నాకుఁ దృప్తిగలుగకున్నది. కాన మునీంద్రా! నన్నీకష్టమునుండి యొడ్డుచేర్పుము. అగస్త్యుఁడవైన నీవుదక్క నన్యులెవ్వరు నన్నుఁ దరిఁజేర్పఁగలరు? ఈ యాభరణము చేకొని నన్ననుగ్రహించి రక్షింపుము. ఈ యాభరణము నీకు ధన ధాన్య వస్త్ర భక్ష్య భోజ్యాభరణాది సకలకామ్యముల నొసఁగఁగలదు. దీనిమూలమున నీకు సకలభోగముల నొసఁగుచున్నాను. కాన ననుగ్రహించి నన్నుఁ దరింపఁజేయుము అని వచించిన యాస్వర్గవాసి దుఃఖపూరిత వాక్యంబులాలించి జాలిచెంది వాని నుద్ధరింపఁదలంచి యా యాభరణము చేకొంటిని. వెంటనే యాతని తొంటిమానవశరీరము నశించిపోవ నాతఁడు పరితృప్తిచెంది సంతసముతో దివంబున కరిగెను. తత్కారణంబుగా నాకీ యాభరణము లభించెను. అతఁడును గతకల్మషుఁడాయెను.

ఇది డెబ్బదియెనిమిదవ సర్గము

---

## డెబ్బదితొమ్మిదవ సర్గము.

### దండకారణ్య చరిత్ర మగస్త్యుఁడు శ్రీరామునకుఁ దెలుపుట.

శ్రీరాముఁడు అద్భుతంబగు నాయగస్త్య వాక్యంబునాలించి విస్మయంబుచెంది సగౌరవంబుగా నిట్లు ప్రశ్నించెను.

మునీంద్రా! వైదర్భుఁడగు శ్వేతుఁడు తపంబున్న యాఘోరవనంబు మృగపక్షిరహితము నిర్జనమునై యుండుటకుఁ గారణమేమి? ఆశుద్ధాటవిలో శ్వేతుఁడెట్లు తపంబొనర్చెను. విన వేడుక యగుచున్నది. కలతెలంగెఱింగింపు మన ముని రామునికిట్లనియె.

రామా! పూర్వము కృతయుగమున దండధరుఁడైన మనువు పుడమికెల్లఁ బ్రభువై యుండెను. వానికొడుకు ఇక్ష్వాకుఁడు. అతఁడు కులానందవర్ధనుఁడు, దుర్జయుఁడునగుతనపుత్రునిఁ దనప్రాక్తనరాజ్యంబునకు నభిషిక్తునిఁ జేసి వసుధంగల రాజవంశంబులకెల్ల నీవే కర్తవుకమ్మని యాజ్ఞాపింప నతఁడట్లేయని యియ్యకొన మనువిట్లనియె. నాయనా! నీయౌదార్యమునకు సంతసించితిని. నీవే నిస్సంశయముగా నావంశమునకుఁ గర్తవు. దండంబున బ్రజలను గాపాడుము. అకారణముగా మాత్రము ఎవరిని దండింపకుము. నేరము చేసినవారి నేటికి శిక్షించినరాజును ఆదండము స్వర్గమును జేర్చును.

కాన పుత్త్రా! దండనము చేయుపట్ల జతకంబును జాగరూకతయుఁ గలిగి యుండుము. న్యాయదండనంబు చేసితివేని నీకు అనంతపుణ్యంబు చేకూరును. అని తనయునకు బుద్ధులుగఱపి మనువు తనువుచాలించి సానందుఁడై సనాతనంబగు త్రిదివంబను బ్రహ్మలోకంబునకుఁ జనెను. తండ్రిచనిన పిమ్మట నిక్ష్వాకుఁడు సంతానమువైఁ గాంక్షకలిగి పలునోములునోఁచి దేవసుతోపము లైన నూర్వురు పుత్త్రులను బడసెను. అందుఁ గడగొట్టువాఁడు పరమశుంఠ. డొక్కచించిన యక్కరపుముక్క లేనివాఁడు. పెద్దలఁ దిరస్కరించువాఁడు. ఆమూఢాగ్రేసరునకు ఎట్లును దన్నులు తప్పవనియెంచి తండ్రి దండుఁడని పేరుపెట్టి వింధ్యశైల వలయమధ్యంబైన ఘోరారణ్యప్రదేశంబు వానికిఁ దగినదిగానెంచి దానికతని రాజుంజేసెను. దండుఁడా వింధ్యపర్వత రోధస్సున మధుమంతమను నొక రమ్యపురంబును నిర్మించి సువ్రతుఁడగు శుక్రునిఁ దనకుఁ బురోహితునిగాఁ జేసికొని బృహస్పతియుక్తుఁడై యింద్రుఁడు స్వర్గంబు నేలునట్లు తనరాజ్యంబు నేలుచుండెను.

ఇది డెబ్బది తొమ్మిదవ సర్గము.

---

## ఎనుబదియవసర్గము.

### దండుఁడు శుక్రకూఁతు నరజను జెఱచుట.

రామా! జితేంద్రియుఁడై దండుఁడట్లు రాజ్యంబు నిష్కంటకంబుగాఁ బెక్కువేలేండ్లేలి మనోహరంబైన చైత్రమాసమునం దొక్కనాఁడు దర్శనీయంబగు భార్గవాశ్రమంబునకుఁజని యందు మందమందగమనంబునఁ జరించుచున్న నిరుపమానలావణ్యవతియు నుత్తమాంగియునైన భార్గవకన్యం గాంచి, స్మరశరపీడితుఁడై సుశ్రోణీ! ఎందుండి యెందుఁబోవుచు నిందుల కరుదెంచితివి? సుభగా! నీవెవ్వని తనయవు? చెప్పుము. కలికీ! నీచక్కఁదనంబుఁ గాంచి నేను చక్కెరవిలుకాని బారికిఁజిక్కితిని. అన విని భార్గవి వాఁడంగజరాగమత్తుఁడగుట యెఱిఁగి చిత్తంబు త్తలపాటు చెంద సానునయంబుగ నిట్లనియె.

ఓయీ! నేను దేవతా స్వరూపుఁడై యక్లిష్టకర్ముఁడై పేరుగాంచు శుక్రుని జ్యేష్ఠపుత్త్రికను. చెలికత్తెలు నన్ను అరజయని పిలుచుచుందురు. నేనీయాశ్రమంబుననే సదా వసించుచుందును.

రాజా! బలవంతంబుగ నన్నంటరాకుము. నేను కన్యను. తండ్రిచాటుదానను. మాతండ్రి నీకు గురువులు. నీవామహాత్ములకు శిష్యుఁడవు. మా తండ్రికోపించిన నిన్ను శపించును. వానికోపంబునకు నీవనఁగా నెంతని? ముల్లో

కంబులే క్షణములో మాడి మసియైపోవును. నన్ను నీవు వరింపఁగోరుదువేని మాతండ్రిని సవినయముగా వేఁడుము. అట్లుగాదేని నీవు నిష్కారణముగా శాపంబు పాలగుదువు. నీవు మాతండ్రి నడుగుము. నీ ప్రార్థనము నాయన వృథపుచ్చఁడు. నన్ను స్వీకొనఁగును. అనిపలికిన యరజనుగాంచి దండుఁడు మదనరాగమత్తుఁడై శిరంబునఁ గరంబుగీలించి యిట్లనియె.

నితంబినీ! అనుగ్రహింపుము. కాలవిలంబనమును దాళఁజాలను. నా ప్రాణములు పోవుచున్నవి. మీతండ్రి నన్నుఁ జంపిననుసరే శపించినను సరే కాని నేను నిన్నుఁ గవయకుండఁజాలను. నేను నీదాసుఁడను. నీచరణసేవ చేయఁబూని నిన్ను భజింపవచ్చినన్ను రతులఁ దేల్పుము. నాతమిఁదీర్పుము. అని పలుకుచు వలదువలదని వణఁకుచు బ్రతిమాలుచున్నను వినక యామెను చేతులతోఁ బెనవెట్టిలాగి క్రిందికిఁద్రోసి కోర్కెదీర రమించి లేచి మధుమంత మునకుఁ జనెను. అరజయు నేమియుచేయలేక యేడ్చుచు నాశ్రమముపొంతఁ దండ్రిరాకకై నిరీక్షించుచునుండెను.

ఇది యెనుబదియవ సర్గము

---

## ఎ ను బ ది యొ క ట వ స ర్గ ము

### శుక్రుఁడు దండుని దేశముపై మట్టివాన గురియ శపించుట.

అంత భార్గవుఁడు ముహూర్తకాలంబు వేదాధ్యయనంబుగావించి యాఁకలిగొన్నవాఁడై శిష్యులంగూడి నిజాశ్రమంబున కరుదెంచెఁ దీనయై ధూళిధూసరితాంగియై ప్రత్యూషకాలంబున నరుణకాంతిచేఁ గాంతి దఱఁగి యున్న వెన్నెలవలెనున్న తనకన్నెఁగాంచి ఆఁకలిమంటకన్న మిన్నగాఁ గూఁతునవస్థ తన్ను మండింపఁ గన్నుల నిప్పుకలురాల శిష్యులతో నిట్లనియె. శిష్యులారా! చంచలాత్ముఁడై పెడబుద్ధిగల దండుఁ డొనర్చిన యగ్నిశిఖవోలె ఘోరాకారమైన విపత్తినిఁ గాంచుఁడు. మండుచున్న యగ్నిజ్వాలను దాఁకఁ గోరిన యీ మూఢాత్ముఁడు సపరివారంబుగా నశించునుగాక. ఈ దుర్మతి తాఁజేసిన పాపఫలంబు తాననుభవించుఁగాక. ఏడురాత్రులలోఁ బాపకర్మరతుండగు నీతఁడు సభృత్యబలవాహనుఁడై యమసదనంబున కరుగుఁగాక. శతయోజనవిస్తీర్ణమైన వీనిదేశంబునం దెల్లయెడల ఇంద్రుఁడు పాంసువర్షంబు గురిపించి నాశనముచేయుఁగాక. ఆ దుమ్ము వానచే వీని రాజ్యంబునంగల చరాచరసత్వంబులెల్ల నాశంబుఁ జెందుఁగాక. అని పలికి యాశ్రమనివాసులంగాంచి దండుని రాజ్యసీమం దాఁటిపొమ్మని యానతీయ నా జనంబెల్ల శుక్రునిమాటలఁ బాటించి వానిరాజ్యంబు బయటకుం బోయి

నివాసంబు లేర్పఱచుకొనిరి. అంత శుక్రుండు తనకూఁతుఁగగు నరజను గూర్చి యిట్లనియె. బుద్ధిహీనురాలా! నీవు నా యాశ్రమంబుననే యుండుము. యోజనపర్యంతంబైన, సుందరంబైన యీ సరస్సునొడ్డునే కాలంబు గడుపుచు దుడుకువిడిచి యాహారకై కలిపెట్టుకొని యుండుము. నేఁటి కేఁడగు రేయిం గురియుదుమ్ము వానంజేసి యిందలి సత్త్వంబులెవ్వియుఁ జావకుండును గాక. అని పలికిన తండ్రియాజ్ఞను గైకొని యరజ దుఃఖితయై యుండెను. శుక్రుండు వేఱొకచోటునకుం జని నివాస మేర్పఱచుకొనెను. అంత నాదండుని సభృత్య బలవాహనంబైన యీ రాజ్యంబెల్ల నా బ్రహ్మర్షి శాపంబుకతంబున నేడు దినంబులలో భస్మమైపోయెను. రామా! వింధ్యపర్వతము నడుమనున్న నాదండుని దేశంబెల్ల నిట్లు శాపంబుపాలాయెను. అది మొదలుకొని దీనికి దండకారణ్యమని పేరువచ్చెను. ఇందుఁ గొందఱు ఋషులు వసించుటంజేసి దీనికి జనస్థానమనియుఁ బేరుగలిగెను. రామా! నీ కోరికఁ జొప్పున దండకావన వృత్తాంతమెల్లఁ జెప్పితిని. సంధ్యావందనమునకు సమయము మీఱుచున్నది. ఈ మహర్షులందఱు పూర్ణకుంభంబులతో నీటినిఁ గైకొని సూర్యునుపాసించుచున్నారు. ఆ సూర్యుఁడును బ్రహ్మవిత్తములైన ఋషులచే నుపాసింపఁబడుచు నస్తంగతుఁడయ్యెను. రామా! నీవుకూడ సంధ్యావందనము చేయుము.

ఇది యెనుబదియొకటవ సర్గము

---

## ఎనుబదిరెండవ సర్గము

### శ్రీరాముఁ డగస్త్యు నాజ్ఞగొని యయోధ్యకు మరలి చనుట.

అగస్త్యుల యానతిచొప్పున రాముఁడు సంధ్యావార్చ నప్సరోగణ సేవితంబగు నాసరస్సునకరిగి యాచమనంబుచేసి సాయంసంధ్య దీర్చి కుంభజన్ముఁడగు నగస్త్యుని యాశ్రమంబునకుఁ జని యగస్త్యుఁ డొసఁగిన పలురుచులు గలిగి పరిశుద్ధమై యమృతమువలెఁ బవిత్రమైన వరియన్నముతోడి కందమూలాహారమును భుజించి ప్రీతినొంది పరితుష్టిఁగాంచి యారాత్రి యచ్చటఁ గడపి వేకువవేళ లేచి కాలకృత్యములు దీర్చుకొని ఋషులందఱితోఁ బోయివత్తునని చెప్పి యగస్త్యునిఁగాంచి నమస్కరించి "మహాత్మా! అయోధ్యకరిగి వత్తును. అనుగ్రహించి యాజ్ఞ యొసంగుము. నీదర్శనంబునంజేసి నేను ధన్యుఁడనైతిని. నీయనుగ్రహంబునకుఁ బాత్రమనైతిని. తమ్ము దర్శించి యాత్మపరిశుద్ధిఁగాంచ మఱియొకమాఱు వత్తును. సెలవిచ్చి పంపుము. అని సవినయంబుగాఁ బలికిన రాముని వాక్యము లాలించి ధర్మనేత్రుఁడును తపోధనుఁడును నైన యగస్త్యుఁ డిట్లనియె.

రామా! నీవాసిన పాడిమాటలు పరమాద్భుతంబులు. భూతంబులం దెల్ల నీవ పావనుండవు. ఒక్క మువూర్తకాలమైన నెవ్వరు నిన్నుఁ గనులు దనియఁ బ్రియదృష్టిం జూతురో వారు సకలపాపములు తొలఁగి పవిత్రులై స్వర్గంబునకుం జని దేవతలచేఁగూడఁ బూజింపఁబడుదురు. ఎవరు నిన్నుఁ గ్రూర దృష్టులఁ జూతురో వారు తత్క్షణంబ యమదండంబున కెరయై నిరయంబున కరుగుదురు.

రామా! నీవిట్టివాఁడవు. ఎల్ల దేహులను దరింపఁ జేయువాఁడవు. నీనామ మాత్రస్మరణంబుచేతనే జనులు మోక్షంబు నొందుచున్నారు. రామా! నిష్కంటకమగు శుభమార్గముగుండ నవ్యగ్రుఁడవై చని రమ్ము. ధర్మంబు తప్పక రాజ్యంబు నేలుము. జగంబునకుఁ బతియు గతియు నీవ.

అన విని సవినయంబుగా రాముఁ డగస్త్యునకుఁ బ్రదక్షిణ మాచరింప దేవేంద్రుని దీవించు దేవతలవలె ఋషులెల్ల రాము నాశీర్వదింపఁ బుష్పకం బెక్కి రాముఁడు వర్షర్తువునందలి జలదంబుల చెంతనున్న జలజారివలె భాసిల్లి యెడనెడఁ బూజలుగొనుచు మధ్యాహ్నమగు నప్పటికి నయోధ్యకుఁ జని యందలి మధ్యకక్ష్యను విమానంబు దిగి విమానమా! నీకు మేలయ్యెడు. చనుమని దానిఁ బంపివైచి, కక్ష్యాంతరమున నున్న ద్వారపాలకునిఁ గాంచి ఓరీ! నీవు లోనికిఁ జని నారాక భరతలక్ష్మణుల కెఱింగించి యూరను జాటిం పించుము. అని యానతిచ్చెను.

ఇది యెనుబదిరెండవ సర్గము

---

## ఎ ను బ ది మూఁ డ వ స ర్గ ము

### శ్రీరాముఁడు రాజసూయ యాగంబుచేయఁ దమ్ములతో యోజించుట.

అది విని చని ద్వారపాలకుఁడు భరత లక్ష్మణులఁ దోకొనివచ్చి రామున కగపఱుప రాముఁడు వారిని బిగియారఁ గౌఁగిలించుకొని యిట్లనియె. సోదరులారా! అనుత్తమంబగు బ్రాహ్మణకార్యంబు యథాయోగ్యంబుగా సఫలంబు గావించితిని. ఇఁక నక్షయంబును, అవ్యయంబును నగు ధర్మసేతువును నిర్మింపఁ దలంపుకొంటిని. ఆధర్మప్రవచనము సర్వపాపంబులఁ బోకార్పఁ గలదు. ధర్మబద్ధంబును శాశ్వతంబును నగు రాజసూయయాగంబును నాకుం బ్రాణతుల్యులైన మీసాయంబునఁ జేయఁ దలంచితిని. శత్రుసూదనుఁడైన మిత్రుఁడు రాజసూయయాగంబుఁ జేసి మిత్రపదమును గాంచెను. వరుణుండు గూడ నట్లుగావించి వరుణపదము నొందెను. చంద్రుండుగూడ నారివలె నొప్పి యెల్లలోకంబులకు శాశ్వతంబైన కీర్తిస్థానము గాంచెను. నేడు

మీరు నాతోనుండి మనకు మేలొడఁగూర్చునదేదియో యోచించి యుక్తమైన దానిని వచింపుఁడన విని భరతుఁడు నమస్కరించి యిట్లనియె.

భరతుఁడు రాజసూయ మర్హముకాదని చెప్పట.

స్వామీ! నీయందే ధర్మంబు నిత్యమైయున్నది. నీయందే వసుంధర యెల్లఁ బ్రతిష్ఠితమైయున్నది. నీయందే యశస్సు యనశ్వరమై నిలిచియున్నది. దేవతలు బ్రహ్మను, మేము భగవంతునిఁ గాంచునట్లు నిన్ను భూపతులెల్ల లోకైకనాథునిఁగా మన్ననతోఁ గాంచుచున్నారు. జనులెల్లరు నిన్నుఁ గన్న తండ్రివలెఁ జూచుచున్నారు. ఈచతుస్సాగరమధ్యమహీతలంబునకును నిందలి ప్రాణులకును నీవే రక్షకుండవు. అట్టినీవు భూమండలంబునంగల రాజవంశంబులకెల్ల వినాశంబు గల్గించు నీయజ్ఞంబు నేల చేయఁబూనితివి? రామచంద్రా! రాజసూయంబు చేయఁబూనిన యింద్రునకును నక్షత్రములకును ఆకసంబున మేటియుద్ధంబు జరిగెనని వినుచున్నాము. హరిశ్చంద్రునకుఁ గూడ రాజులతో రాజసూయయాగాంతమున సర్వక్షత్ర వినాశన హేతువగు మహాయుద్ధము జరిగెనఁటగదా! వరుణుఁడు రాజసూయంబు చేసినప్పుడు కూడ జలచరంబులగు మత్స్య కచ్ఛపంబులుకూడ ఘోర సంగ్రామంబున మడిసెనఁట. అట్లే ఇంద్రుఁడు రాజసూయయాగంబు చేసినప్పుడుకూడ సర్వజననాశంకరంబగు ఘోరావహంబు దేవాసురలకు జరిగెనఁట. రాజసూయంబు గావించుపట్లఁ బుడమినిఁగల తిర్యగ్యోనిగతంబులగు సత్వంబులకును సమస్త రాజులకును జేటువాటిల్లును. అంతియకాక మూతివై మీసంబుగల పౌరుష శాలికెల్లఁ గోపంబుకతంబున నాశంబు తప్పదు. కావున నవక్రవిక్రమా! నీకు లోపడియున్న యీపుడమిని నీవంటి జ్ఞానమూర్తి నాశంబు కావించుట తగదు. కావునఁ బురుషశ్రేష్ఠా! రామచంద్రా! నీబుద్ధిచే నీవు చక్కఁగా యోజించి ప్రాణులకు హితంబు చేకూర్పుము. వారికెల్ల నీవేకదా దిక్కు. అని వచించిన భరతుని యమృతమయ వాక్యంబులాలించి శ్రీరాముఁడు అమందానందంబునొంది యిట్లనియె. భరతా! నీవచనంబుల నేను ప్రీతుఁడనైతిని. పరితుష్టిఁ గాంచితిని. ధర్మబద్ధంబును, అక్లీబంబును నగు నీవచనంబులు నా మనంబున కెక్కినవి. రాజుల కసూయ గలిగించి లోకంబులకుఁ జేటుతెచ్చు రాజసూయంబు చేయమానెదను. విచక్షణు లెవ్వరు లోకపీడాకరంబగు కర్మము నాచరింపరు. లక్ష్మణాగ్రజా! శుభకరంబగు వాక్యంబు బాలుఁడాడినను గ్రహింపవలయును. కాన సాధువై, యుక్తియుక్తంబైన నీవాక్యంబును నేను గ్రహించుచున్నాను.

ఇది యెనుబది మూఁడవ సర్గము.

---

## ఎనుబదినాల్గవ సర్గము

### లక్ష్మణుఁడు వృత్రుని కథ శ్రీరామునితోఁ జెప్పుట.

అట్లు రాముఁడును, భరతుఁడును సంభాషించుకవిమ్మట లక్ష్మణుఁడు శ్రీరామునిఁ గాంచి యిట్లనియె. రామచంద్రా! సామాన్యులకుఁ జేయనలవి గాని యశ్వమేధమహాయజ్ఞము సర్వపాపములనుండి తొలఁగించి మానవునిఁ బావనునిఁ జేయును. కానఁ బవిత్రమైన యా యజ్ఞంబు చేయుట తమకిష్టంబని తలంతును. ఇంద్రునిఁ గూర్చిన పూర్వగాథ యొకటి గలదు. తొల్లి దేవాసురులకు యుద్ధంబు ప్రవర్తిల్లినపుడు ఇంద్రుండు వృత్రాసురునిఁ జంపిన బ్రహ్మహత్యాదోషముఁ బాపుకొనుటకై యశ్వమేధయాగంబు గావించెను. రామా! పూర్వము వృత్రుఁడను రాక్షసుఁడొకఁడుకలఁడు. అతఁడు లోకసమ్మతుఁడు. శతయోజనముల విస్తీర్ణంబును, దానికి మూఁడురెట్లు నిడివియుఁ గలవాఁడు. ముల్లోకంబులను అనురాగంబుతోఁ గంటికి రెప్పవలెఁ గాపాడుచుండువాఁడు. ధర్మజ్ఞుఁడు, కృతజ్ఞుఁడు, స్థిరచిత్తుఁడునై యతఁడు పుడమిని ధర్మబద్ధంబుగాఁ బాలించెను. అతని పాలనంబున భూమి కామధేనువై యెల్లకోర్కెలం దీర్చుచుండెను. పూవులు, దుంపలు, పండ్లు రసవంతంబులై కుప్పలు తెప్పలుగా లభించుచుండెను. వసుంధర దున్నక యే పండుచుండెను. జను లెందుచూచినను సిరి సంపదలచే నోలలాడుచుండిరి. ఇట్లుండఁ దపంబే పరమశ్రేయస్కరంబు. ఇతరసుఖంబు మోహభాజనము. కాన అనుత్తమంబైన తపంబు నాచరించెదనని తలంచి వృత్రుఁడు తన జ్యేష్ఠపుత్రుఁడైన మధురేశ్వరుని రాజ్యంబున నిల్పి తాను సకలదేవతలను మలమలమాఁడ్చునట్టి మహోగ్రతపంబొనర్చెను. వృత్రుని యుగ్రతపంబున కాఁగలేక వాసవుఁడు రథాంగపాణి యొద్దకేఁగి యిట్లు మొఱవెట్టుకొనెను. మహాబాహూ! తపంబు పేరిమి వృత్రుండు లోకంబులెల్ల నిర్జించి కాటియవెట్టుచున్నాఁడు. తపోబలశాలియగు వాని శిక్షింప నేను శక్తుండఁ గాను. అతఁ డింకను అధికతపంబొనరించినచోఁ బదునాలుగుభువనంబులు వానికి వంగి సలాము వెట్టవలసినదే. దామోదరా! పరమోదారుండవగు నీవు వాని నేటికో పాటింపకున్నావు. నీవించుక కన్నువిప్పిచూచితివేని వాఁడు క్షణంబులో భస్మంబు కాకుండునా? మురారీ! నీతోడి నెయ్యంబు గలిగినదాది వృత్రాసురుండు సర్వలోకనాథుఁడై విరాజిల్లుచున్నాఁడు. కాన దేవాదిదేవా! నీవు సమాహితుండవై దేవతల ననుగ్రహింపుము. నీ కతంబున జగంబులెల్ల నీరోగంబులై స్వస్థతఁ గాంచును. వీరుగో (ఇరుగో) దేవతలెల్ల నీదయకుం బాత్రులుగా నిరీక్షించియున్నారు. వృత్రాసురుని వధించి

వీరికి సాయము బొనరింపుము. మహాత్ములగు నీవేల్పులకు నీ వెల్లప్పుడును పాటు పడుచునే యున్నావు. ఇవి మొఱలకు సాక్ష్యంబు కాదు. దిక్కులేనివారలకు నీవేదిక్కు.

ఇది యెనుబదినాల్గవ సర్గము

---

## ఎనుబదియైదవ సర్గము

### విష్ణువు వాసవునితో వృత్రుం జంపు నుపాయంబు దెలుపుట.

శత్రునాశంకరుండగు రాముండు లక్ష్మణుని వాక్యంబు లాలించి వృత్రాసుర సంహారంబు పూర్తిగా నెఱింగింపుమని యడుగగ సుమిత్రానందవర్ధనుండగు లక్ష్మణుండు ఇట్లు చెప్ప దొడంగె.

రామా! సర్వదేవతలను మున్నిడుకొని సహస్రాక్షుండాడిన మాట లాలించి విష్ణువు వారల కిట్లనియె. నేను బూర్వము వృత్రునితోం జెలికారంబు దృఢంబుగాం గావించితిని. మీ మేలుగోరి నేను వానిని జంపనైతిని. అయినను నేను మీకుం దప్పక సుఖము చేకూర్పవలయును. కాన నే యుపాయంబున వృత్రుండు సంహరింపంబడునో చెప్పెద నాలింపుండు. సురలారా! నన్నునే మూండు భాగములుగాం జేసికొందును. అందొక భాగముచే నింద్రుండు వృత్రునిం దెగటార్చును. సందియము లేదు. మొదటి యంశము ఇంద్రుని, రెండవయంశము వజ్రమును, మూండవయంశము భూతలంబును బొందును. అప్పుడింద్రుండు వృత్రుని వధించును.

అని విష్ణువు పలుకంగానే దేవతలెల్ల దేవదేవా! నీవు చెప్పిన చొప్పున నిస్సంశయముగం గానిమ్ము. నీకు శుభంబగుంగాక! మేము వృత్రాసుర సంహారమునకై పోయెదము. నీవు నైజతేజంబున వాసవునిం బొందుము. అని చెప్పి యింద్రాది దేవతలెల్ల వృత్రుండు తపంబున్న వనంబున కరిగి బ్రహ్మతేజోవిరాజమానుండై లోకంబులు మ్రింగువానివలె నాకసంబును దహించు వానివలె నున్న వృత్రునింగాంచి, వీని నెట్లు సంహరింపంగలము? వీనివల్లం బరాజయంబు గాంచకుండ నెట్లుండంగలము? అని దోదూయమానమానసులై దేవత లాలోచించుచుండం బురందరుండు కాలాగ్నిసన్నిభంబైన ఘోరాకారంబుతో నిప్పులుగ్రక్కుచున్న వజ్రాయుధంబు చేకొని వృత్రుని శిరంబు దెగనఱుక జగంబులెల్ల భయంబునొందె.

### ఇంద్రునకు బ్రహ్మహత్య ప్రాప్తించుట.

అంత విబుధాధిపుండు వృత్రువధం బన్యాయంబని తలంచి వైళంబ చని లోకంబు కడపటి తమమునందు డాగెను. అట్లు పోవుచున్న యింద్రుని వెన్నంటి

పోయి బ్రహ్మహత్యాదోషంబు వాని యంగంబులెల్ల నలమికొనెను. దాన నతండు దుఃఖాక్రాంతుఁ డాయెను. దేవతలు శత్రుమరణంబునకు సంతసించి యు ఇంద్రునిపోకకు విచారంబు చెందె యగ్నిని మున్నిడుకొని విష్ణువును పలు విధంబులఁ బూజించిరి.

పరమేశా ! నీవు ఆదిపురుషుఁడవు. లోకపితవు. ఎల్లభూతంబుల రక్షింపుచుపోంటె విష్ణురూపంబున జగంబున నవతరించినవాఁడవు. నీవె మాకు దిక్కు. నీ యనుగ్రహంబుకతంబున వృత్రుఁడు హతుండాయెను. కాని యింద్రుఁడు బ్రహ్మహత్యాదోషంబునఁ గరంబు దురపిల్లుచున్నాఁడు. వానికి బ్రహ్మహత్యాదోషంబు తలంగు దారి చూపుము. అన విని విష్ణు విట్లనియె.

ఇంద్రుని నన్నుఁ గూర్చి యాగంబు చేయుమనుఁడు. నే నాతని పాపంబు పోకార్తును. పవిత్రమైన యశ్వమేధయాగంబున నన్నతఁడు పూజించి నిర్భయుండైన యింద్రత్వము నొందుఁగాక! అని చెప్పి విష్ణువు దేవలోకంబునకుఁ జనెను.

ఇది యెనుబదియైదవ సర్గము

---

## ఎ ను బ ది యా ఱ వ స ర్గ ము

### ఇంద్రుఁ డశ్వమేధమొనర్చి బ్రహ్మహత్య తొలఁగించుకొనుట.

లక్ష్మణుఁ డట్లు వృత్రవధంబు సర్వంబు వినిచి శేషకథ నిట్లు చెప్పఁ దొడంగెను. దేవభయంకరుండగు వృత్రుండు హతుండుకాఁగానే, శక్రుండు బ్రహ్మహత్యాయుతుండై, అంధకారమునంబడి నష్టసంజ్ఞుఁడు, విచేతనుఁడునై యురగంబుపోలిక వ్రేలాడుచుండెను. సహస్రాక్షుం డిట్లు కష్టంబు పాలుకాఁగా జగంబెల్ల భీతిల్లెను. భూమి తపించెను. అడవులెండెను. నదులు, మడుఁగులు నింకెను. అనావృష్టిచే సత్వంబులెల్ల సంక్షోభంబు నొందెను. ఇట్లు లోకంబులెల్ల దద్దఱిల్లుచుండుటఁగని దేవతలు చిత్తంబులఁ దత్తరంబునొంది తొల్లి విష్ణువుచెప్పిన యశ్వమేధయాగంబు చేయంబూని ఋత్విజుని వెంటనిడుకొని యింద్రుఁడున్న యెడకుఁ జని బ్రహ్మహత్యాయుతుండై యున్నవానింగాంచి, తేర్చి యతనిని మున్నిడికొని యశ్వమేధంబు పూర్తి గావింప, బ్రహ్మహత్య స్వస్వరూపంబుతో వచ్చి దేవతల యెదుట నిలచి నాకెచ్చట నిల్వనీడ నొసంగుదురని యడుగ వారు కరంబు మోదంబునొందిరి. బ్రహ్మహత్యా ! నీవు నాల్గుభాగంబులు గమ్మా. అని వచింప వారి మాటలాలించి బ్రహ్మహత్య వేఱొండు స్థానంబుననుండ వరంబిండు. మొదటి యంశంబున నిండునీరుగల

నదులయందు వర్షాకాలంబు నాల్గుమాసములును, దర్పఘ్నులై, స్వేచ్ఛావిహారంబులఁ జరించుచుందును. రెండవ యంశంబునఁ జవుడు రూపంబున భూమియందుఁ జరింతును. మూఁడవ యంశంబున దర్పసంపూర్ణలై జవ్వనులై విఱ్ఱవీఁగు స్త్రీలయందు మూన్నాళ్లు వారిదర్పంబు నణఁప, రజోరూపంబున వసింతును. నాలుగవ యంశంబున నిర్దోషులగు బ్రాహ్మణులను గల్లలాడి చంపువారియందు నుందును. అనదేవతలు నీ కోరిన విధంబున నగును. ఇటనుండి సత్వరంబుగాఁ దలఁగి పొమ్ము. అని దానిని బంపివైచి సంతసంబున నింద్రునిగాంచి నమస్కరించిరి. ఇంద్రుండును బ్రహ్మహత్యనుండి తొలఁగి పరిశుద్ధుఁడాయెను. జగంబెల్ల శాంతివహించెను. ఇంద్రుఁడు యజ్ఞపురుషునిఁ బూజించెను. రామచంద్రా! అశ్వమేధమిట్టి ప్రభావంబుగలది కాన నీవు గూడఁ దీనింజేయుము. అని లక్ష్మణుఁడాడిన యతిమనోహరంబగు వాక్యంబు నాలించి యింద్రతుల్యుండును, వాక్యవిశారదుండును నగు రాముఁడు నవ్వుచు నిట్లనియె.

ఇది యెనుబదియాఱవ సర్గము

---

## ఎనుబదియేడవ సర్గము

### శ్రీరాముఁడు లక్ష్మణునకు ఇలుని వృత్తాంతంబుఁ దెలుపుట.

లక్ష్మణా! నీవు చెప్పిన వృత్రాసురవధంబును, అశ్వమేధఫలంబును, సాంతంబుగావింటిని. అది యెల్లవాస్తవంబ. పూర్వము ఇలుఁడను రాజొకఁడుండెను. కర్దమప్రజాపతి వాని తండ్రి. అతఁడు బాహ్లికదేశమునకు రాజు. చాలధార్మికుఁడు. పుడమియెల్లఁ దనకసివాఱుగా నేగు బయలుగాఁ జేసికొని ప్రజలను గన్నబిడ్డలవలెఁ గాపాడుచుండెను. దేవ దానవ నాగ రాక్షస గంధర్వ యక్షాదులెల్ల భయార్తులై తత్పరత వానిని భజించుచుండిరి. వాని కనుఁగొలఁకు లించుక యెఱ్ఱవాఱినఁ జాలు ముల్లోకంబులు గజగజ వణఁకెడివి. ఇట్లాతఁడు ధర్మనిష్ఠాగరిష్ఠుఁడు వీర్యవంతుఁడు పరమోదారుఁడునై ధరాపాలనంబు చేయుచుండ హృదయంగమమైన చైత్రమాసము తల సూపెను. అత్తఱి నాతఁడు వేఁటయందలితమకంబున సభృత్యబలవాహనుఁడై కాననసీమకరిగి శతసహస్రమృగంబులఁ దునిమి తనివిగాంచక నానామృగంబులను వేఁటాడుచుఁ జనిచని కుమారస్వామి జన్మించిన పర్వతనిర్ఝర స్థలంబునకరిగెను. అందు ఇందుధరుండు పరిచరయుక్తుఁడై గౌరీసమేతుఁడై యాఁడురూపంబు దాల్చి యామెతోఁ గ్రీడించుచుండెను. అత్తఱి నందలి చెట్టులు పుట్టలు మృగములు సర్వము ఆఁడురూపుచెంది యుండెను. ఇలుఁడట నావింతఁ జూచుచుఁ

దానును తన పరివారంబునుగూడ నాఁడుఁదనంబు నూనుటఁగాంచి పగగూరి చూచి యీశ్వర కృతమని తలపోసి సభృత్యుఁడు సానుగుఁడునై చని

ఇలుఁడు స్త్రీయై పార్వతీ పరమేశ్వరుల శరణు చొచ్చుట.

దేవదేవుఁడైన శితికంఠుని కాళ్లపైఁబడి శరణంబుచొచ్చెను. అది కని పార్వతీయుక్తుఁడైన పరమేశ్వరుఁడు మందహాసంబుచేసి మహాబలా! లెమ్ము లెమ్ము. పురుషత్వము దక్క నాచేవరమైన గోరుము. అన నతఁడు శోకార్తుఁడై పుంస్త్వమే కావలయునని మరల శంభునిఁ బ్రార్థించి లాభంబుగానక శైలరాజ తనయ పాదంబులపైఁ బడి కన్నీరు మున్నీరుగాఁ గార్చి యేడ్చి తల్లీ! నీవు లోకంబులకెల్లఁ నేలికసానివి. కామితార్థప్రదాయినివి. దయామతివి. వరదానకర్త్రివి! నీదర్శనము సౌఖ్యనిదానము. అమోఘదర్శనీ! నాతప్పు క్షమింపుము. చల్లనిచూపుల నన్నుఁ జూడుము అని యీశ్వరుని యెదుటనే వేడుకొన్న యిలుని తలఁపెఱిఁగి పరమేశ్వరి యిట్లనియె.

రాజా! నేను వరార్థంబు మాత్రమె యీఁగలదానను. తక్కిన సగము నిచ్చుటకు నీశ్వరుఁడె కర్త. కాన స్త్రీపుం రూపములలో నీకేది వలయునో చెప్పుము.

ఇలుఁడొకనెల స్త్రీగను నొకనెల పురుషుఁడుగను నుండఁ బార్వతి యనుగ్రహించుట.

అన విని యతఁ డచ్చెరువొంది యిట్లనియె. త్రిలోకసుందరీ! నీవు నాకుఁ గరుణించితివేని ఒకనెల స్త్రీరూపము ఒకనెల పురుషరూపము దాల్చి యుండ వరమిమ్మన నామె యట్లే యుండుము. పురుషరూపమున నున్నపుడు స్త్రీత్వమును స్త్రీరూపముననున్నపుడు పౌరుషమును విస్మరింపుము. అని పరమేశ్వరి వర మనుగ్రహింప నతఁ డొకనెల పురుషుఁడును ఒకనెల త్రిలోక సుందరియగు స్త్రీయునై యుండెను.

ఇది యెనుబదియేడవ సర్గము

---

## ఎనుబదియెనిమిదవ సర్గము

ఇలుఁడు స్త్రీయై బుధునియాశ్రమము చేరుట.

అని శ్రీరాముఁడు వచింప విని భరతలక్ష్మణులు పరమాశ్చర్యము చెంది కరంబులు శిరంబులమోపి మ్రొక్కి. రామా! పాపమాయిలుఁడు స్త్రీయైయెవ్వ డెట్లుండెను? పురుషుఁడైనప్పు డెట్టివృత్తిని జేపట్టి వర్తిల్లెను?

ఆనతీయు మన రాముఁడు సంతసించి యిలునివృత్తాంత మిత్తెఱంగునఁ జెప్పఁ దొడఁగెను.

ఆయిలుఁడు మొదటిమాసమునఁ ద్రిలోకసుందరియగు స్త్రీయై తోంటి పరివారము చెలికత్తెలై తన్ను భజింపఁగా నిళయనుపేరుతోఁ దరు గుల్మ లతాకీర్ణంబగు నావనంబుజొచ్చి పూర్వవాహనాదికములను డొఱంగి యంఘ్రి కొండచరియలయందుఁ గాల్నడకతో విహరించుచు నాపర్వతసమీపమునఁ గల యా వనప్రదేశమున సురుచిరంబును నానాపక్షిగణవిరాజితంబును నగు సరస్సుకడ కరిగి యందు నైజరమ్యకాంతులచే వెలుంగువాఁడును షోడశకళా పరిపూర్ణుఁడగు పున్నమచందురునిఁబోలువాఁడును దురాసదుఁడును యశస్కరుఁడును కామకరుఁడును నిండుజవ్వనంబున నివ్వటిల్లువాఁడును జంద్రతనయుండును నగు బుధుఁడు తపంబొనరించుచుండుటఁ గాంచి తన చెలికత్తెలతో నాజలాశయంబుచొచ్చి దానినెల్లఁ గలఁచెను. బుధుఁ డాయిళనుగాంచి కామశరపీడితుఁడై చంచలమనస్కుఁడై యా నీరంబుల నటునిటు దిరుగుచుఁ ద్రిలోకసుందరియగు నామెను మాటిమాటికిం గాంచుచు ఓహో! ఎవ్వతె, యీచక్కనిచుక్క? దేవతా స్త్రీలనుగూడఁ దలఁదన్నుచున్నదే! అచ్చరముచ్చెకంటులందుఁగాని, నాగకాంతలయందుఁ గాని, అసురీసుందరులయందుఁగాని యిట్టి రూపరేఖావిలాస సమన్వితయగు కాంతనుగని యుండలేదు. ఈమె పరునింబెండ్లాడనిచో నాకుఁదగిన బెండ్లాము కాఁగలదు. అని తలంచి జలంబులువీడి యొడ్డుఁజేరి యాశ్రమంబునకువచ్చి యందలి మృగాక్షులను, చేయిపట్టి పిలిచి, వారినమస్కారంబులంది "ఓ సుందరులారా! యీ త్రిలోకసుందరి యెవ్వతె? ఎందుల కిందుల కేతెంచినది? వేగంబవచింపుఁడు." అనవిని యావనిత లిట్లనిరి. "ఈనితంబిని మా ప్రభ్వి. ఈమె కింకను బెండ్లికాలేదు. మము వెంటఁబెట్టుకొని యీ వనాంతంబుల సదా గ్రుమ్మరుచున్నది" అని పలికినవారి యస్పష్టవాక్యంబు లాలించి యతఁడు "ఆవర్తని" యను తనపవిత్ర విద్యామహిమచే నారాజు యొక్క సర్వవృత్తాంతంబు యథాతథంబుగా నెఱింగికొని యా కాంతలం గాంచి "మీరీ పర్వతచఱియలయందు నివాసం బేర్పఱచుకొని కింపురుషులై చరింపుఁడు. కందమూలఫలపత్రంబుల నాహారింపుఁడు. మీకుఁ గింపురుషులు భర్తలగుదురు" అనినబుధునిమాట లాలించి వారల్లె యందు వసించుచుండిరి.

ఇది యెనుబదియెనిమిదవ సర్గము

---

## ఎనుబదితొమ్మిదవసర్గము

### ఇలాదేవి బుధునితోఁ గలియుట.

భరతలక్ష్మణులిరువురుఁ గింపురుషోత్పత్తి నాలించి, ఆశ్చర్యనిమగ్నులై రామా! యాయిలుని యానలివృత్తాంతము వినిపింపుమన రాముఁడిట్లనియె. అంత బుధుఁడు కిన్నరకాంతల దూరంబుగాఁబనిచి, రూపవతియగు ఇళనుగాంచి కిలకిలనవ్వుచు ఓ చంద్రాననా! నేను చంద్రుని పుత్రుఁడను. బుధుఁడను. ప్రణయదృష్టుల నాపైఁబఱపి నన్నుంగవయుము. అన విని ఇళ యటునిటు నెవరు లేరుగదాయని పరికించిచూచి యిట్లనియె. ఓ సుందరాంగా! నేను విచ్చలవిడి చరించుదానను నీకు లోఁబడితిని. నీవేదిచెప్పిన నది చేయుదానను. ఆజ్ఞాపింపుము. అన విని యశేఁడు పరమహర్షంబు చెంది యామెంగూడి రమించుచుండ మధుమాసమొక త్రుటినలెఁ గడచి చనెను. అంతఁ బూర్ణచంద్రనిభాననుం డగుఇలుండు సెజ్జనుండి లేచి యూర్ధ్వబాహుఁడై, నిరాలంబుఁడై జలాశయంబునఁ దపంబుచేయు బుధునింగాంచి యిట్లనియె. భగవానుఁడా! నేను పరిజనులతోఁ గూడి దుర్గమంబగు నీ పర్వతంబుఁ జొచ్చితిని. నాయనుచరులెందేఁగిరో కానరాకున్నారు. అని పూర్వస్మృతిలేక భాషించు నిలుని యోదార్చుచు బుధుఁడిట్లనియె. నీభృత్యులు, రాలవానచే మంటఁగలసిరి. నీవు ఆశ్రమపదంబున వానకు, గాలికి వెఱచి నిద్రించి బ్రతికి బయటఁబడితివి. ఏల విచారింతువు? ఇందలి ఫలమూలంబుల నారగించుచు సుఖంబుగనుండుము. అన ఇలుఁడు భృత్యనాశనంబునకుఁ దద్దయు విచారించి బ్రాహ్మణోత్తమా! నేను రాజ్యమును విడిచితిని. భృత్యులు మడిసిరి. ఇఁకక్షణమైన నిట నిలువఁజాలను. అనుజ్ఞ నొసఁగుము. నా పెద్దకొడుకగు శశిబిందుని రాజునుజేయఁబోయెదను. భృత్యులను, దారలను, జనములను విడిచి సంయమివలె, నే వనంబుల నుండఁజాలను. కాన మాసీంద్రా! అశుభవాక్యంబులాడక నన్నునుపు మన విని బుధుఁడాశ్చర్యపడుచు రాజా! ఏల సంతాపింతువు? ఒక్కయేడిందు వసింపుము. నామాట త్రోచిపుచ్చకుము. నీకు మేలొడఁగూర్చి పంపెదను.

### ఇలాదేవి పురూరవునిఁ గనుట.

అన నిలుఁడందుల కంగీకరించి యొకమాసంబు స్త్రీయై బుధునిరమింపఁ జేయుచు నొకమాసంబు ధర్మంబున బుద్ధినిలుపుచుఁ జరించుచుండెను. ఇట్లుండఁ దొమ్మిదగుమాసంబున ఇళ పురూరవసుండను కొడుకునుగాంచి వెంటనే యానిసువును దండ్రిచేతికొసంగెను. జ్ఞానియగు బుధుండు సంవత్సరాంతంబున మగరూపుదాల్చిన యాయిళునికి ధర్మబద్ధంబులగు కథలనుజెప్పి సంతోషపెట్టుచుండెను.

ఇది యెనుబదితొమ్మిదవ సర్గము

## తొంబదియవసర్గము

### బుధుఁడిలునకు శాశ్వతపురుషత్వంబు గల్పింప నశ్వమేధంబుఁ జేయుట.

రాముఁడిట్లు ఇలుని వింతచరిత్ర చెప్పఁగావిని భరతలక్ష్మణులు తనివి సనక సంవత్సరాంతమందిలుఁడేమియైనర్యానుని విననేడుకయగుచున్నది రామా! యన రాముఁడిట్లు తియ్యండన మొప్పఁబలికెను.

ఇళ పురుషత్వమొంది యిళుఁడు కాఁగానె బుద్ధిమదగ్రణీయగు బుధుఁడు మహాశయులు తత్త్వవేత్తలునగు సంవర్తుఁడు చ్యవనుఁడు అరిష్టనేమి ప్రమోదనుఁడు దుర్వాసుఁడు అను మునులనురావించి ధైర్యంబుమెఱయ సౌహార్దంబుతో ఋషులారా! యితఁడు కర్దముని పుత్త్రుఁడు. ఇళుఁడనువాఁడు. వీని గీనదశ మీ తెఱఁగినదే! మీయనుగ్రహమునకుఁ బాత్రుఁడగు వీనికి శాశ్వత పురుషత్వమొసంగి మేలు చేకూర్పుఁడు అని వచించుచుండఁగా మహాత్ములగు ద్విజులతోఁడఁ గర్దముఁడట కేతెంచెను. ఆసమయంబుననే పులస్త్యుఁడు క్రతువు వషట్కారము ఓంకారముగూడ నచట కరుదెంచెను. వారెల్ల రాజునకు హితము చేయువారై యొండొరులతో భాషించుచుండ గర్దముఁడు సుతహితముగోరుచు నిట్లనియె. ద్విజులారా! వినుఁడు. ఈశ్వరారాధనముదక్క దీనికి వేఱొండు మందులేదు. ఉతనికిఁ బ్రీతికరమైనది యశ్వమేధయాగంబొక్కటే. కాన పార్థివార్థంబు తద్యాగంబు పొనరింతము అనవిని ఋషులందఱు ఈశ్వరారాధనము పొందె, నాజన్నంబొనర్చుట మంచిదని యంగీకరించిరి. సంవర్తుఁ డనురాజర్షి శిష్యుఁడును బరపురంజయుఁడును నగు మరుత్తనువాఁడాయజ్ఞంబును బుధాశ్రమమునొద్ద జేసెను. దానఁ బరమేశ్వరుఁడు పరమప్రీతినొంది బ్రాహ్మణులఁ గాంచి యిట్లనియె.

### ఇలుఁ డెప్పటియట్ల పురుషత్వము గాంచుట.

ద్విజోత్తములారా! హయమేధయాగంబున మీరుచూపిన శ్రద్ధాభక్తులకు సంతసించితిని. ఈయిలునకు నేనేమి మేలుచేకూర్పవలయునో తెలుపుఁడు. అన వారందఱు ఏకగ్రీవముగా ఇళను శాశ్వతముగాఁ బురుషునొనర్పుమనిరి. అట్లేయగుఁగాక! యని పరమేశ్వరుఁడు అంతర్ధానమొందెను. హయమేధముముగించి దీర్ఘదర్శులగు బ్రాహ్మణులందఱుఁ దమతమ యాశ్రమంబులకరిగిరి.ఇలుఁడు తనబాహ్లి రాజ్యమునకు శశిబిందుని రాజుఁజేసి తానా రాజ్యమునువీడి మధ్యదేశంబునకుఁ జని కీర్తిమంతంబగు ప్రతిష్ఠానపురంబును నిర్మించి యందుఁ గొంతకాలము సుఖముండి పుత్త్రుఁడగు పురూరవుని దాని

కభిషిక్తునిఁజేసి తాను బ్రహ్మపదంబును జేరెను. సోదరులారా! స్త్రీ దుర్లభంబగు పురుషత్వమునొందుట అశ్వమేధయాగ ఫలంబునసేనుఁడీ! హయమేధ ప్రభావమిట్టిది.

ఇది తొంబదియవ సర్గము

---

## తొంబదియొకటవ సర్గము

### శ్రీరాముఁడు పురోహితాదులఁ బిలిపించి యశ్వమేధమొనర్తునని చెప్పుట.

ఇలుని వృత్తాంతము విని రాముఁడు లక్ష్మణునితోఁ గ్రమ్మఱ నిట్లనియె. లక్ష్మణా! వసిష్ఠుని వామదేవుని జాబాలిని కాశ్యపుని ఉత్తమోత్తములగు బ్రాహ్మణులను దోడి తెమ్ము. వారితో మంతనమాడి సర్వలక్షణసంపన్నమగు హయంబును అశ్వమేధంబు సాగింప విడిచిపుత్తము. అన విని లక్ష్మణుఁడు కడువడి నేఁగి బ్రాహ్మణులఁ దోడ్కొనివచ్చి రాముని దర్శనంబు చేయింప వారు కృతపాదాభివందనుఁడు దేవసంకాశుఁడు నగురామునాశీర్వదింప రాముఁడు ప్రాంజలియై వారింగాంచి ద్విజోత్తములారా! నేను వాజిమేధము చేయఁబూనితిని. అనుజ్ఞ యొసంగుఁడన వారు ఈశ్వరేశ్వరునకు మ్రొక్కి రాజులకశ్వమేధంబు చేయుట యెంతయు నర్హంబు. అది శుభప్రదము. అన రాముఁడు తద్దయు సంతసించి లక్ష్మణునిఁజూచి యిట్లనియె.

లక్ష్మణా! నాచేయు వాజిమేధ మహోత్సవంబు ననుభవింప సుగ్రీవుని సకలవానరులను వెంటఁబెట్టుకొని రమ్మని తక్షణంబు దూతలనంపుము. కామగమనులగు రాక్షసులతోఁగూడి విభీషణునిఁగూడ సవనంబుఁ గాంచ రమ్మని వార్తనంపుము. నాహితముగోరు రాజులనెల్ల సపరివారముగా రావింపుము. దేశాంతరగతులై యున్న ధర్మాత్ములగు బ్రాహ్మణులనుగూడ వేల్మిఁగాంచ రప్పింపుము. సతులతోఁగూడి రావలసినదిగా ఋషులకు కబురు పెట్టుము. తాళగించువాండ్రను, నటులను, నర్తకులనుగూడఁ బిలువనంపుము. నైమిశారణ్యంబున గోమతీనదీతీరంబున యజ్ఞశాల గట్టింపుము. అది పవిత్రమైన తపోవనభూమి. అచ్చట వలయు శాంతులఁగూడఁ జేయింపుము. వచ్చినవారెల్ల యజ్ఞవైభవంబుగాంచి తుష్టినిబుష్టినిఁగాంచి యథావిధిగా మనము చేయు మన్ననలనంది తమతమ దేశంబుల కరుగఁగలరు. కాన నెల్లజనులను బిల్వఁబంపుము. నూఱువేల బండ్లపైని బియ్యమును పదివేల యెడ్లమీఁద నూవులు పెసలు, సెనగలు, ఉలవలు, మినుములు, ఉప్పు తదనురూపమైన తైలాదులు సుగంధద్రవ్యములు కోటిహేమములు నూఱుకోట్ల వెండినాణెములు వేయించి లోపలియంగడివీధులను నటనర్తకులను వంటవారలను

ము త్తైదువులను, యౌవనాంగులను, నైగమజనులను, బాలురను, వృద్ధులను, బ్రాహ్మణులను, భృత్యులను, శిల్పులను, బండిశులను, మల్లులను, కుమారులను, అంతఃపురజనులను, గోశాధిపతులను, నాపత్నియొక్క కాంచన ప్రతిమను, యజ్ఞరక్షార్థమైన వస్తుచయంబునుకూడ గొని భరతుని ముందుపోగునుని చెప్పెను.

ఇది తొంబది యొకటవ సర్గము.

---

## తొంబదిరెండవ సర్గము

### శ్రీరాముఁ డశ్వమేధయాగముచేయ నుపక్రమించుట.

అట్లు శ్రీరాముఁడు సత్వరంబుగ సర్వంబు నాయుత్తపటిపించి శుభ లక్షణంబులు గలదియు నల్లనిచారలుగలదియు నగు గుఱ్ఱమును విడిచిపుచ్చి యా గుఱ్ఱమునకు రక్షకంబుగ బుత్విక్కులతో లక్ష్మణునిఁబంపి తాను ససైన్యం బుగ నైమిశారణ్యమునకుఁ జని పరమాద్భుతంబగు యజ్ఞశాలనుగాంచి నిస్తు లానందమునుఁ జెందియుండఁగా నానాదేశాధీశు లరుదెంచి పలుతెఱంగుల కానుకలుపెట్ట రాముఁడు వారినెల్లఁ బూజించి యాయారాజులకును వారి పరి వారంబునకును, దగిన విడుదుల నేర్పరించెను. భరత శత్రుఘ్నులు ఇంచుకేని యాలస్యంబుచేయక యా వచ్చినవారికి అన్నపానవస్త్రాదు లొసంగి తృప్తి గావించుచుండిరి సుగ్రీవుఁడు మొదలగు వానరులెల్ల నచ్చటి కరుదెంచిన బ్రాహ్మణులకు సకలవిధపరిచర్యలు జరిపి గౌరవించిరి. విభీషణుఁడు పూల మాలలు దాల్చిన రాక్షసులవెంట నిడుకొని యుగ్రతపంబు సలిపిన మహా ర్షులకుఁ బూజలొనర్చెను. ఇట్లు అశ్వమేధయాగంబు ఎంతయు నొప్పిదంబుగ జరుగుచుండ లక్ష్మణుని రక్షకత్వంబు వహించి హయరాజంబు భూమండల మునఁ గ్రుమ్మరుచుండెను. రాజశ్రేష్ఠుఁడైన రాముఁ డొనరించు నుత్తమయజ్ఞ మట్లు మహావైభవంబుతో నితరధ్వని యేమియులేక నిమ్మకు నీరువ్రాసినట్లు నిమ్మళముగా జరుగుచుండెను. యజ్ఞంబు జరుగునడుమ ఎవ్వఁడేని దేహి దేహియని వెదవికదిపినంతనే బెల్లముతోఁ జేయఁబడిన పలుతెఱంగులగు మధురపదార్థములను దెచ్చి వానర రాక్షసులు వారి వారికిఁ దనివుదీఱవడ్డించు చుండిరి. హృష్టపుష్టజనులతోఁ గూడుకొన్న యా యుత్తమయజ్ఞమునందు ముఱికివాఁడుగాని, దీనుఁడుగాని, దరిద్రుఁడుగాని మందునకేని గానరాకుం డెను. చిరకాలజీవులగు మహర్షులు అట్టి యజ్ఞంబు ఇంతకు మున్నెన్నఁడు కని గాని వినిగాని యెఱుంగమని యాశ్చర్యపడుచుండిరి. బంగారము గోరువాఁడు బంగారమును, ధనమును గోరువాఁడు ధనమును, రత్నములు గోరువాఁడు రత్న

ములు, వెండికోరువాఁడు వెండియు, మణులుగోరువారు మణులు, బట్టలుగోరు వారు బట్టలు, రాసులు రాసులుగాఁ బడయుచుండిరి అందున్న తపోధనులగు ఋషులు మేము ఇంతకుముందు ఇంద్ర, కుబేర, యమ, వరుణులయజ్ఞంబులం గాంచితిమి. కాని యిట్టి వైభవం బందెందునుం గానరాదయ్యె. ఇఁక ముందిట్టి సవనంబుగాంచఁబోము. అని తమలోఁ దాము చెప్పుకొనుచుండ వానరరాక్షసులు చూడవచ్చిన వారికెల్ల రెండు చేతులతో నెడ తెఱపిలేకుండ నన్నవస్త్రాదు లొసంగిరి. ఇవ్విధంబున నాక్రతువు సర్వగుణసమన్వితంబై యొక్కవత్సరము ప్రవర్తిల్లెను. కాని యందేలోపంబును గన్పట్టదయ్యె.

ఇది తొంబదిరెండవ సర్గము

---

## తొం బ ది మూఁ డ వ స ర్గ ము

### వాల్మీకి కుశలవుల రామాయణము గానము చేయ నియమించుట.

అట్లా యజ్ఞంబు సర్వజనాశ్చర్యకరంబుగా జరుగుచుండ మునిపుంగవుండగు వాల్మీకి శిష్యసమేతుఁడై యాదరుదెంచి యాయ్యాగంబునుగాంచి ఋషివాటికలకుఁ జెంతను గోమతీ తీరసమీపంబునఁ దనపర్ణశాలనుగూడ నిర్మించి బండ్ల కొలంది పండ్లు, దుంపలు తుంపెసలార వసించెను రాజును,మహాత్ములగు మునులును దన్నుఁ బూజింపఁగా సుఖంబుండి శిష్యులైన కుశలవులం గాంచి బిడ్డలారా! పర్వతాగ్రంబులం బుట్టిన ఈతీయని వివిధఫలంబులు మృష్టములైన దుంపలు దనివితీఱఁ దినితిని నేదదేఱి యూరివెలపలనుండి ఋషివాటికల యందును బ్రాహ్మణ గృహములయందును, మార్గములందును, రాచబాటల యందును, రాజగృహంబులయందును యజ్ఞము ప్రవర్తిల్లుచున్న రామ మందిర ద్వారంబునందును, ఋత్విజుల యెదుటను రామాయణంబు సర్వంబును అవ్యక్తమధురకంఠములతో గానంబు చేయుఁడు. అది వినఁగోరి రాముఁడు మిమ్ములఁ బిలువనంపెనేని సుఖోపవిష్టులైన ఋషుల యెదుట రామాయణంబు గానంబుచేయుఁడు. నే నాదేశించిన చొప్పున బహువిధనియమంబులం బాటించుచు మధురమధుర వాక్కులతో దినమున కిరువది సర్గములు మాత్రమే పాడుఁడు మనము కందమూలములు తిని జీవించు నాశ్రమవాసులము గావున నాశకులోనై స్వల్పధనంబైనఁ గాంక్షింపరాదు. రాముఁడు మిమ్మెవరి బాలురని యడిగెనేని వాల్మీకి శిష్యులమని చెప్పుఁడు. నేను ముందుచూపిన స్థానంబున ఈవీణామధురతంత్రులను మీాటి జంకులేక విను వారెల్లఁ దన్మయత్వంబు చెందునట్లు తీయతీయగాఁ బాడుఁడు. రాజు సర్వ భూతంబులకుఁ దండ్రి. కాన వానిని దిరస్కరింపక మొదటినుండియు నాలకిం

పుడు. రేపు ప్రాతఃకాలంబునుండి మీరిరువురు సంతసంబు వైవాఱ నేకాగ్ర చిత్తులై రామాయణ గేయంబును మధురంబుగా గానంబు చేయుడు. అ యిట్లు వాల్మీకి కుశలవులకుఁ బలుతెఱంగుల నానతిచ్చి మిన్నకుండ జాన సుతు లిరువురును నట్లే యని బయలుదేఱి వెళ్లిరి. అశ్వినీదేవతలు శుక్రనీః సంహితను నేర్చుకొన్నట్లు రాజకుమారులగు కుశలవులు వాల్మీకి మునీంద్రుఁ చెప్పిన యాశ్చర్యకరంబైన శుభవాక్యములను మనంబుల నిడుకొని యెప్పుడ తెల్లవాఱునా యెపుడు రామాయణంబు గానంబు సేయుదుమా యని యన కొనుచు నారేయిగడపిరి.

ఇది తొంబదిమూఁడవ సర్గము

---

## తొంబదినాల్గవ సర్గము

### కుశలవులు రామాయణము గానముచేయ శ్రీరాముఁడు వినుట.

అంత తెల్లవాఱఁగానె కుశలవులు లేచి స్నానంబుచేసి యగ్నులన వేల్చి వాల్మీకి చెప్పినచొప్పున పూర్వాచార్య వినిర్మితంబును అపూర్వంబున పాఠ్యజాతియుతంబును గేయమయంబును బహుప్రమాణ (వృత్త)యుక్తం బును తంత్రీలయసమన్వితంబునుగా రామాయణంబు గానంబుచేయఁగా విః కౌతూహలపరుండయి రామచంద్రుఁడు యజ్ఞ కర్మాంతరంబున మునులన రాజులను పండితులను వేదవిదులను పౌరాణికులను శబ్దవిదులను వృద్ధబ్రాహ్మ ణులను స్వరలక్షణజ్ఞులను గథాశ్రవణోత్సుకులను గాంధర్వలక్షణజ్ఞులన శాస్త్రవిశేషజ్ఞులను బాదాక్షరసమాసజ్ఞులను ఛందశ్శాస్త్రజ్ఞులను గళ మాత్రవిభాగజ్ఞులను జ్యోతిషశాస్త్రపారంగతులను క్రియాకల్పవిదులన గావ్యకోవిదులను భాషాభిజ్ఞులను ఇంగితజ్ఞులను వేదాంతవిదులను హేతూః చారకుశలులను వచనహేతువాదవేదులను ఛందోవిదులను బురాణజ్ఞులన వైదికబ్రాహ్మణులను జిత్రకళానిపుణులను వృత్తసూత్రవేత్తలను గీతనృత్య విశారదులను శాస్త్రజ్ఞులను నీతినిధులను వేదాంతార్థప్రబోధకులను రావించి యా బాలగాయకులచే రామాయణంబు గానంబుచేయింప మునిగణంబున బార్థివనికరంబంబును అమితజనంబును విని రాజును గాయకులను గన్నుల ద్రావునట్టులుగాంచుచు వారందఱుఁ దమలోఁదాము

### కుశలవులయందు శ్రీరాముని ముఖచ్ఛాయ గురిచూచి జను లాశ్చర్యపడుట.

ఈ బాలకులు రామునిరూపంబు పుణికిపుచ్చుకొన్నట్లున్నారు. రామ బాలకులయందు బింబప్రతిబింబభావంబు పూర్తిగాఁ గన్పట్టుచున్నది. జఁ

లును పల్కులాజీవములును పేడిరేని పేరెకిని: (గాయకులకును) రామునకు భేదమిసుమంతయేనిగానరాదు. అని వాకొనుచుండఁగా నాబాలకులు వీనులవిందుగాఁ బాడఁదొడంగిరి. అతిమానుషంబైన యా సంగీతంబును విని శ్రోతలు తృప్తిగాంచనైరి. నారదుఁడు చెప్పిన మొదటిసర్గమునుండి యిరువదిసర్గములు వారపరాహ్ణసమయమున గానంబుచేయఁగా విని రాముఁడు సోదరునిఁగాంచి

## శ్రీరాముఁడిచ్చిన కాన్కలు కుశలవులు నిరాకరించుట.

లక్ష్మణా ! వీరికిఁ బదునెనిమిది వేల బంగారు నాణెములను వెంటనేయొసంగుము. మఱేమి వారు కోరినను గాదనక యిమ్ము. అన లక్ష్మణుఁడు వేలువేలుగా వారిరువురకు రాముఁడు చెప్పినచొప్పునఁ గాన్కలువెట్టఁబోవ నా కుశలవులు వానిఁ గైకొనక యాశ్చర్యచకితులై మేము వనవాసులము. వన్యఫలములను మాత్ర మాహారించువారము. మీరొసఁగఁదలఁచిన యీ మేలిమి బంగారునాణెముల గ్రహించి మమ్మేమిచేయుమందురు ? మాకు వీనితో నేమిపని వలవదనిన

## రామాయణమునుగూర్చి శ్రీరాముఁడు కుశలవులఁ బ్రశ్నించుట.

విని శ్రోతలును రాముఁడును నాశ్చర్యపడిరి. అంత రాముఁడు ఆముని బాలకులఁగాంచి బాలకులారా ! ఈకావ్యకర్తయగు మునిపుంగవుఁ డెవ్వరు ? అతని ప్రతిష్ఠయెట్టిది ? ఈ మహాకావ్యమునందలి గ్రంథసంఖ్య ప్రమాణ మెంత విన వేడుకయగుచున్నది చెప్పుఁడని యడుగ మునిదారకులు రామున కిట్లనిరి.

రాజా ! ఈ కావ్యమునకుఁ గర్త భగవానుఁడగు వాల్మీకిమునీంద్రుఁడు. ఆతఁడీయజ్ఞవాటికకు వచ్చియున్నాఁడు. కావ్యంబునవిషయము సంపూర్ణంబగు భవచ్చరితంబు. ఇందలి శ్లోకములు ఇరువదినాలుగువేలు. ఉపాఖ్యానములు నూఱు. సర్గములు అయిదువందలు. ఉత్తరకాండముతోఁగలిసి కాండములు ఏడు. పూజ్యపాదుఁడగు మాగురుదేవుఁడు భార్గవుఁడు శుభాశుభము లెల్లఁ దేటపడ భవద్వర్తనంబు నిట్లభివర్ణించెను. రాజా ! నీకువినఁ గుతూహలముగలదేని తమ్ములఁగూడి కర్మాంతరములయందు (రెండుపనులకు నడిమి కాలము) తూష్ణీభూతుఁడవై (మాఱుపనిలేక) వినుము. వినిచెదమన రాముఁడు మంచిదియని వారి కాజ్ఞయిచ్చి పంప వారు వాల్మీకిమునియున్న పర్ణశాలకరిగిరి. రాముఁడు మునులతోడను రాజులతోడనుగూడి తాళలయోపన్నమును

సర్గాంచితంబును సస్వరశబ్దయుక్తమును దంత్రీలయవ్యంజనయోగయుతం బును గుశలవ పరిగేయమానంబును నగు రామాయణమును విని యజ్ఞశాల కరిగెను.

ఇది తొంబదినాల్గవ సర్గము

---

## తొంబదియైదవ సర్గము

### కుశలవులు తన పుత్త్రులని యెఱింగి శ్రీరాముఁడు వాల్మీకిమహర్షి యొద్దకు దూతల నంపుట.

రాముఁడు మునులతోడను రాజులతోడను వానరులతోడను గూడి పెక్కుదినంబు లా పరమాద్భుతగీతంబును వినెను. తద్గీతంబువలనఁ గుశల వులు సీతాపుత్త్రులని యెఱింగి రాముఁడు స్వబుద్ధితో యోజించి యా సభా మధ్యంబునకు శుద్ధసమాచారులగు దూతలను రావించి యిట్లనియె.

మీరు పవిత్రుఁడైన వాల్మీకిమునీంద్రునొద్దకుఁబోయి నా మాటగా నిట్లనుఁడు. మునీంద్రా! సీత శుద్ధసమాచార. విగతకల్మష. అని మీకు నమ్మ కంబుగలదేని యామె మాయందఱకుఁ దెలియునట్లుగా రేపు ప్రొద్దుటిపూఁట మా సభకరుదెంచి శపథముఁ (ప్రమాణము) గావించునా? యని తపసిమత మును సీత తలఁపునుగూడ నెఱిఁగిరండన వారు వాల్మీకియున్నెడ కరిగి యగ్ని వలె వెలుంగు వానికి నమస్కరించి మృదుమధురంబులగు రామ వాక్యంబుల విన్నవింప సంయమిచంద్రుఁడు రాముని మనోగతాభిప్రాయము నెఱింగి,

### సీత శపథంబుచేయునని వాల్మీకిమహర్షి శ్రీరామునకుఁ జెప్పి పంపుట.

రాముఁడు చెప్పినట్లె సీత సల్పెడుఁగాక. స్త్రీలకు పతియె దైవతంబు గదా! అని పలుక విని దూతలు సత్వరంబుగాఁజని వాల్మీకి పలుకులు రామున కెఱింగింప రాముఁడు విని పరమానందంబుచెంది యచ్చటనున్న ఋషులను రాజులనుగాంచి మహానులారా! మీరును మీ శిష్యులును రాజులును బరిజను లును సీతా విషయమై సందియముగల యితరులును రేపు సభకరుదెంచి సీత చేయు శపథంబును గాంతురుగాక. అన వారెల్లరు మేలు మేలని రామునిఁ బ్రశంసించి రామా! ఇట్టి విధము నీకేతగునుగాని యన్యుని కెవనికిఁ దగదని పొగడ రాముఁడు వారిఁగాంచి మీరెల్ల రేపు తప్పకరండని పలుక వారట్లే యని పనివినిరి.

ఇది తొంబదియైదవ సర్గము

---

## తొంబద్యాఱవ సర్గము

### సీతాశపథంబు చూచుటకు లోకులు గుంపులు గుంపులుగాఁ జేరుట.

తెల్లవాఱఁగానే ప్రతాపశాలియగు రాముఁడు యజ్ఞవాటికయందుండి ఋషీశ్వరుల నందఱను బిలిపించెను. అంత వసిష్ఠుఁడు వామదేవుఁడు జాబాలి కాశ్యపుఁడు విశ్వామిత్రుఁడు దుర్వాసుఁడు పులస్త్యుఁడు శక్తి భార్గవుఁడు వామనుఁడు మార్కండేయుఁడు మౌద్గల్యుఁడు గర్భుఁడు చ్యవనుఁడు శతానందుఁడు భారద్వాజుఁడు అగ్నిపుత్రుఁడు నారదుఁడు పర్వతుఁడు గౌతముఁడు కాత్యాయనుఁడు సుయజ్ఞుఁడు అగస్త్యుఁడు మున్నగు తపోనిధులగు మహర్షులు పెక్కుమంది కుతూహలసమావిష్టులై యజ్ఞశాలకేగుదెంచిరి. మఱియు బలవీర్యంబులుగల రాక్షసులును వానరులును, క్షత్రియ, వైశ్య, శూద్రులును నానాదేశాగతులగు బ్రాహ్మణులు, జ్ఞాననిష్ఠులు, కర్మనిష్ఠులు, యోగనిష్ఠులు నగు నితరజనంబును సీతాశపథంబు వీక్షింప నచ్చటి కరుదెంచి కదలు మెదలు లేక నిశ్చేష్టులై యుండ వాల్మీకి సీతాదేవిని దీసికొని యచటి కరుదెంచెను.

### సీతాదేవినిఁ దోడ్కొని వాల్మీకి యజ్ఞశాలకు వచ్చుట.

ముందు వాల్మీకివచ్చుచుండఁగా సీత తలవాంచి బాష్పరుద్ధకంఠయై రాముని మనంబున నిల్పికొని దోసిలియొగ్గి, వెనువెంట నచ్చటికివచ్చెను. బ్రహ్మవెంటవచ్చు వేదంబుమాడ్కి వాల్మీకివెంటవచ్చు సీతనుగాంచి యటనున్న వారందఱు మేలు మేలని కొనియాడిరి. అంత సీతంగాంచఁగానే దుఃఖశోకాకుల మానసులై, యందున్న కొందఱు హాలహాలధ్వనులు గావించిరి. కొందఱు రామా! మేలుమేలనిరి. కొందఱు సీతామేలుమేలనిరి. కొందఱు సీతారాములారా! మేలుమేలనిరి. అంత వాల్మీకి మునిపుంగవుండు సీతను దీసికొనివచ్చి జనుల (సభామధ్యమున) నడుమ నిలచి రామునుద్దేశించి యిట్లనియె.

### సీతాదేవి పతివ్రతయని వాల్మీకిమహర్షి సత్యముఁజేసి చెప్పుట.

దాశరథీ! ఇదిగో సీత. ఈమె సువ్రత. ధర్మచారిణి. నాయాశ్రమము చెంతనేయున్నది. నిరపరాధిని. రామా! లోకాపవాదంబునకు వెఱచిన నీకు నమ్మకము కలుగుటకై యీ సీత నీ యెదుటఁ బ్రమాణము గావింపనున్నది. అనుజ్ఞయొసఁగుము. ఇదుగో! జానకీపుత్రులగు నీ యమడబిడ్డలు నీ కొడుకులు. ఇది సత్యము. నేను బ్రచేతసుని పదియవపుత్రుఁడను. అబద్ధమెన్నఁడునాడను. వీరు నిజముగా నీ పుత్త్రులు. ఈ సీత దుష్టురాలైనచో సహస్రవర్షంబులు నేచేసిన తపంబంతయు నిష్ఫలంబై పోవుఁగాక! మనస్సుచేతను గర్మంబుచేతను

వాక్కుచేతను నే నించుక నెట్టిపాపంబుచేసి యెఱుంగను. ఈ సీత పాపాత్మురాలుగా దేని నాచేసినపుణ్యఫలంబు నాకుఁ జేకూరకుఁగాక! రామా! నేను పంచభూతములమూలములనను మనస్సుచేతను సీత పూతయని గ్రహించి యడవిలో సెలయేటిచెంగటనున్న యీమెను నా యాశ్రమంబునకుఁ గొంపోతిని. ఈమె శుద్ధసమాచార! అపాప! పతి దేవత; పాతివ్రత్యవ్రత. అనుచు నీమె లోకాపవాదభీతుఁడవగు నీకు స్వయముగాఁ బ్రత్యయంబు గల్గింపనున్నది. రామా! యీసీత నిర్మలభావయనినే దివ్యదృష్టిచే నెఱింగితిని. నీవు ప్రియతమయగు నీమె శుద్ధయని యెఱింగియుండియు లోకాపవాద కలుషీకృతిచేత స్కుఁడవై విడిచి పుచ్చితివి.

ఇది తొంబదియాఱవ సర్గము

---

## తొంబదియేడవ సర్గము

### లోకాపవాదమును బాపుకొన సీతాదేవి శపథము చేయువలయునని శ్రీరాముఁడు కోరుట.

అని వాల్మీకి పలుకఁగానే, రాముఁడు సభామధ్యంబున బ్రాంజలియై నిలిచియున్న యుత్తమకాంతయగు జానకినిఁగాంచి మునీంద్రునితో నిట్లనెను. మహానుభావా! ధర్మవేత్తలగు తాము సెలవిచ్చినదెల్ల సత్యమే. నిష్కల్మషంబులగు తమ వాక్యంబులచే నాకు సీతయెడ నమ్మకము కలిగినది. ఇంతకుమున్ను సీత లంకలో దేవతలసన్నిధిని అగ్నిపూతయై శపథంబు గావించి నాకు నమ్మకముఁ గలిగించినది. కావుననే నే నామెనింటికిఁ గొంపోతిని. మునీంద్రా! సీత నిర్దోషయని యెఱిఁగియుండియు నేను లోకాపవాదమునకు వెఱచి, విడిచిపుచ్చితిని. కాని యన్యంబు కాదు. కావఁ దాము నన్ను క్షమింపుఁడు. అమడలగు నీ కుశలవులు నా పుత్రులని యెఱుఁగుదును. ఈ మైథిలి ఈజనులనడుమ 'శుద్ధ' యని తెలియఁబడఁగానే నా కామెయందుఁ బ్రీతి జనించునుగాక. అనునంతలో సీతా శపథవిషయమున రాముని యభిప్రాయము నెఱింగి మహేంద్రాది దేవతాశ్రేష్ఠులెల్ల బ్రహ్మను మున్నిడుకొని యచ్చటికిఁ జనుదెంచిరి. ఆదిత్యులు వసువులు రుద్రులు అశ్వినీదేవతలు మరుత్తులు గంధర్వులు అప్సరసలు సాధ్యులు విశ్వేదేవులు మహర్షులు నాగులు సుపర్ణులు సిద్ధులు మున్నగువారెల్లరుఁగూడ సీతాశపథమును గాంచువారై ప్రహృష్టమానసులై కడువడి నరుదెంచిరి. రాముఁడు ఆ దేవతలను ఋషులనుగాంచి క్రమ్మఱ నిట్లనియె.

## తొంబదియాఱవ సర్గము

### సీతాశపథంబు చూచుటకు లోకులు గుంపులు గుంపులుగాఁ జేరుట.

తెల్లవాఱఁగానే ప్రతాపశాలియగు రాముఁడు యజ్ఞవాటికయందుండి ఋషీశ్వరుల నందఱను బిలిపించెను. అంత వసిష్ఠుఁడు వామదేవుఁడు జాబాలి కాశ్యపుఁడు విశ్వామిత్రుఁడు దుర్వాసుఁడు పులస్త్యుఁడు శక్తి భార్గవుఁడు వామనుఁడు మార్కండేయుఁడు మౌద్గల్యుఁడు గర్గుఁడు చ్యవనుఁడు శతానందుఁడు భారద్వాజుఁడు అగ్నిపుత్రుఁడు నారదుఁడు పర్వతుఁడు గౌతముఁడు కాత్యాయనుఁడు సుయజ్ఞుఁడు అగస్త్యుఁడు మున్నగు తపోనిధులగు మహర్షులు పెక్కుమంది కుతూహలసమావిష్టులై యజ్ఞశాలకేగుదెంచిరి. మఱియు బలవీర్యంబులుగల రాక్షసులును వానరులును, క్షత్రియ, వైశ్య, శూద్రులును నానాదేశాగతులగు బ్రాహ్మణులు, జ్ఞాననిష్ఠులు, కర్మనిష్ఠులు, యోగనిష్ఠులు నగు నితరజనంబును సీతాశపథంబు వీక్షింప నచ్చటి కరుదెంచి కదలు మెదలు లేక నిశ్చేష్టులై యుండ వాల్మీకి సీతాదేవిని దీసికొని యచటి కరుదెంచెను.

### సీతాదేవినిఁ దోడ్కొని వాల్మీకి యజ్ఞశాలకు వచ్చుట.

ముందు వాల్మీకివచ్చుచుండఁగా సీత తలవాంచి బాష్పరుద్ధకంఠయై రాముని మనంబున నిల్పికొని దోసిలియొగ్గి, వెనువెంట నచ్చటికివచ్చెను. బ్రహ్మవెంటవచ్చు వేదంబుమాడ్కి వాల్మీకివెంటవచ్చు సీతనుగాంచి యటనున్న వారందఱు మేలు మేలని కొనియాడిరి. అంత సీతంగాంచఁగానే దుఃఖశోకాకుల మానసులై, యందున్న కొందఱు హాలహాలధ్వనులు గావించిరి. కొందఱు రామా! మేలుమేలనిరి. కొందఱు సీతా మేలుమేలనిరి. కొందఱు సీతారాములారా! మేలుమేలనిరి. అంత వాల్మీకి మునిపుంగవుండు సీతను దీసికొనివచ్చి జనుల (సభామధ్యమున) నడుమ నిలచి రామునుద్దేశించి యిట్లనియె.

### సీతాదేవి పతివ్రతయని వాల్మీకిమహర్షి సత్యముఁజేసి చెప్పుట.

దాశరథీ! ఇదిగో సీత. ఈమె సువ్రత. ధర్మచారిణి. నాయాశ్రమము చెంతనేయున్నది. నిరపరాధిని. రామా! లోకాపవాదంబునకు వెఱచిన నీకు నమ్మకము కలుగుటకై యీ సీత నీ యెదుటఁ బ్రమాణము గావింపనున్నది. అనుజ్ఞయొసఁగుము. ఇదుగో! జానకీపుత్రులగు నీ యమడబిడ్డలు నీ కొడుకులు. ఇది సత్యము. నేను ప్రచేతసుని పదియవపుత్రుఁడను. అబద్ధమెన్నఁడునాడను. వీరు నిజముగా నీ పుత్రులు. ఈ సీత దుష్టురాలైనచో సహస్రవర్షంబులు నేచేసిన తపంబంతయు నిష్ఫలంబై పోవుఁగాక! మనస్సుచేతను గర్మంబుచేతను

వాక్కుచేతను నే నిందనుకే నెట్టిపాపంబుచేసి యెఱుంగను. ఈ సీత పాపాత్ము రాలుగాదేని నాచేసినపుణ్యఫలంబు నాకుం జేకూరకుంగాక! రామా! నేను పంచభూతముల మూలమునను మనస్సుచేతను సీత పూతయని గ్రహించి యడవిలో సెలయేటివద్దనున్న యీయామెను నా యాశ్రమంబునకుం గొంపోతిని. ఈమె శుద్ధసమాచార! అపాప! పతి దేవత; పాతివ్రత్యవ్రత. అనుచు నీమె లోకాపవాదభీతుండవగు నీకు స్వయముగాం బ్రత్యయంబు గల్గింపనున్నది. రామా! యీసీత నిర్మలభావయనినే దివ్యదృష్టిచే నెఱింగితిని. నీవు ప్రియ తమయగు నీమె శుద్ధయని యెఱింగియుండియు లోకాపవాద కలుషీకృతచేత స్కుండవై విడిచి పుచ్చితివి.

ఇది తొంబదియాఱవ సర్గము

---

## తొంబదియేడవ సర్గము

### లోకాపవాదమును బాపుకొన సీతాదేవి శపథము చేయవలయునని శ్రీరాముఁడు కోరుట.

అని వాల్మీకి పలుకంగానే, రాముఁడు సభామధ్యంబున బ్రాంజలియై నిలిచియున్న యుత్తమకాంతయగు జానకినింగాంచి మునీంద్రునితో నిట్లనెను. మహానుభావా! ధర్మవేత్తలగు తాము సెలవిచ్చినదెల్ల సత్యమె. నిష్క ల్మషంబులగు తమ వాక్యంబులచే నాకు సీతయెడ నమ్మకము కలిగినది. ఇంతకుమున్ను సీత లంకలో దేవతలసన్నిధిని అగ్నిపూతయై శపథంబు గావించి నాకు నమ్మకముం గలిగించినది. కావుననే నే నామెనింటికిం గొంపో తిని. మునీంద్రా! సీత నిర్దోషయని యెఱింగియుండియు నేను లోకాపవాద మునకు వెఱచి, విడిచిపుచ్చితిని. కాని యన్యంబుకాదు. కావునం దాము నన్ను క్షమింపుఁడు. అవమడలగు నీ కుశలవులు నా పుత్రులని యెఱుఁగుదును. ఈ మైథిలి ఈజనులనడుమ 'శుద్ధ' యని తెలియంబడంగానే నా కామెయందుం బ్రీతి జనించునుగాక. అనునంతలో సీతా శపథవిషయమున రాముని యభి ప్రాయము నెఱింగి మహేంద్రాది దేవతాశ్రేష్ఠులెల్ల బ్రహ్మను మున్నిడుకొని యచ్చటికిం జనుదెంచిరి. ఆదిత్యులు వసువులు రుద్రులు అశ్వినీదేవతలు మరుత్తులు గంధర్వులు అప్సరసలు సాధ్యులు విశ్వేదేవులు మహర్షులు నాగులు సుపర్ణులు సిద్ధులు మున్నగువారెల్లరుంగూడ సీతాశపథమును గాంచు వారై ప్రహృష్టమానసులై కడువడి నరుదెంచిరి. రాముఁడు ఆ దేవతలను ఋషులనుగాంచి క్రమ్మఱ నిట్లనియె.

సురశ్రేష్ఠులారా! అకల్మిషులైన ఋషుల వాక్యంబులచే నాకు సీత యందు నమ్మకము గలిగినది. అయినను జగంబుగూడ నావలె నమ్మెనేని సంతసింతును. అనిపలుకఁగానె సురశ్రేష్ఠుఁడైన వాయుదేవుఁడు శుభంబును పుణ్యంబును దివ్యగంధయుతంబును మనోహరంబును నగు నట్లుగావీచి యా జనసమూహమునకెల్లఁ బరమాహ్లాదంబు గలిగించెను. సర్వరాష్ట్రములనుండి యరుదెంచిన మానవులందఱు కృతయుగంబునందువలె నప్పుడేమి వింత జరుగునో యని లేచి చూచుచుండిరి. అంతఁ గాషాయాంబరధారిణియైన సీత యచ్చటనున్న జనసమూహమునెల్లఁ జూచి ప్రాంజలియై యవాఙ్ముఖియై (తల వాంచి) యధోదృష్టితో నిట్లనియె.

## సీతాదేవి శపథంబు చేయుట.

నేను రామునిఁదక్క వేఱొక్కని మనస్సునఁ దలంపనయేని నాకు మాధవుని దేవియగు భూదేవి దారియొసంగుఁగాక. నేను మనోవాక్కర్మం బులఁ శ్రీరామునిఁ బూజించితినేని నాకు మాధవీదేవి (భూదేవి) వివర మొసంగుఁ గాక.

నేను శ్రీరామునిఁదక్క నన్యునెఱుంగ ననిచెప్పిన వాక్యంబు సత్యంబేని నాకు మాధవీదేవి లాఁగ నొసంగుఁగాక.

## సీతాదేవి రసాతలంబునకుఁ బోవుట.

అని సీతాదేవి శపథంబు కావింపఁగానే భూతలంబునుండి యద్భుతం బును దివ్యంబును అనుత్తమంబును నగు సింహాసనము పైకి నెగయుదెంచెను. ఆ సింహాసనంబును అమిత విక్రమంబుగల సర్పంబులు శిరంబునఁ దాల్చి యున్నవి. అది దివ్యరత్నములచే నలంకరింపఁబడి ధగధగ మెఱయుచున్నది. భూదేవి సీతను జేతులారఁ గౌఁగిలించుకొని స్వాగతకుశలప్రశ్న పూర్వకంబుగా నా సింహాసనంబునఁ గూర్చుండఁబెట్టుకొని రసాతలంబున కరిగెను. అంత నెడ తెఱపి లేకుండ మింటినుండి పూలవాన గురిసెను. దేవతలు ఆకసంబునుండి సీతాప్రవేశమును గాంచి సంతసించి సీతా! నీశీలము సాటిలేనిది మేలుమేలు! అని కొనియాడిరి.

యజ్ఞశాలయందున్న మునులు రాజులు మున్నగువారందఱుఁ గూడ అత్యాశ్చర్యనిమగ్నులైరి.

ఆకాశమునందును భూమియందును పాతాళంబునందునుగల స్థావర జంగమాత్మకమైన సర్వజగంబులును దానవులును బన్నగాధిపులును గొందఱు సంతోషంబున జయజయధ్వానములు గావించిరి. కొందఱు ధ్యానపరాయ

ములైరి. కొందఱుఁ రాముని జూడఁదొడఁగిరి. కొందఱు నిశ్చేష్టులై సీతను గాంచఁదొడంగిరి. సీతాప్రవేశనము గానవచ్చిన జగత్సంఘమెల్ల నా ముహూర్తమున నేకకాలమున సమ్మోహితమై యుండెను.

ఇది తొంబదియేడవ సర్గము

---

## తొంబదియెనిమిదవసర్గము

### సీత వియోగంబునకు శ్రీరాముఁడు పరితపించుట.

అట్లు సీతి రసాతలంబు ప్రవేశింపఁగనె రాముని సన్నిధినున్న వానరులెల్ల విలపించిరి. మునులు మేలుమేలని ప్రశంసించిరి రాముఁడు బాష్పాకుల నేత్రుఁడై దండకాష్ఠము నానుకొని తలవాంచి దీనభావుఁడై క్రోధశోక సమావిష్టుఁడై కన్నీళ్లుగార్చుచు నిట్లనియె. ఇంతకుముందు నెన్నఁడు నెఱుఁగని శోకంబు నామనంబున నెలకొనియున్నది. సాక్షాల్లక్ష్మియో యనునట్లున్న సీత నేను జూచుచుండఁగనే మాయమైపోయెను. మున్ను మహాసముద్రమున కావలనున్న లంకయందున్న సీతను గొనివచ్చిన నేను పాతాళంబున కరిగిన యామె నిపుడు తీసికొని రాఁజాలనా?

### శ్రీరాముఁడు భూదేవిపైఁ గోపించుట.

భూదేవీ ! నా సీతను పైకి తెచ్చియిమ్ము. అట్లుగాదేని నాకోపంబు చవిచూచెదవుసుమా ! తొల్లి నాఁగేటికోలచే దున్ను జనకునిచే సీత నీయొద్దనుండి కదా కైకొనఁబడినది. కావున నీవు నా కత్తవు. కాన సీతను నీయొద్దనే యుండనిమ్ము. లేదా యల్లుఁడనని సీతనైనఁ దెచ్చియిమ్ము. లేదా నాకు దారినైన నొసంగుము. పాతాళమునఁగాని స్వర్గమునఁగాని నే నామెను గూడి యుండెదను. భూదేవీ! నీ వాసీతనుదెచ్చి యొసంగుము. సీతను వీడుటచే మతి పోయినది. యథారూపంబుగా సీతను దీసికొనివచ్చి నా కొసంగవేని వనపర్వతపట్టణములతోఁగూడ నిన్నుఁ బూర్తిగా నాశనముకావించి నీటఁ గల్పెదను. అని భృత్యులనుగాంచి, భటులారా ! బాణములతోఁ గూడిన కోదండమును దీసికొనిరండు. సీతావిషయమందు భూదేవికిం గల యభిమతంబు నెఱింగి పిమ్మట నీమెగుండెలు బ్రద్దలువావెదను. అని యిట్లు రాముఁడు క్రోధశోకసమన్వితుఁడై నిరానందుఁడై కన్నీరుగార్చుచుఁ బలికినవాక్యము నాలించి బ్రహ్మదేవతలతోఁగూడి రామున కిట్లనియె.

### బ్రహ్మ శ్రీరాముని శాంతునిఁ జేయుట.

రామా! రామా! నీవు సంతాపింపఁదగదు. నీవు నీపూర్వభావంబును (విష్ణుత్వము) ఒకమాఱు స్మరింపుము. నేను నీభావంబును జ్ఞప్తికిం దెచ్చు నంతటివాఁడనుగాను. కాన నీవు మహార్తకాలము యోజించి నీవైష్ణవ జన్మంబు నెఱింగికొనుము (విష్ణువు నవతారంబనని యెఱింగికొమ్ము).

నీ పూర్వపరాయణ యగు సీత విమల, సాధ్వి, నీయాశ్రయ మనెడు తపోబలమునం జేసి యామె నాకలోకంబునకు సుఖంబుగ నేగుఁగాక.

### రామాయణవిశేషము వినుమని బ్రహ్మ శ్రీరాముని వేఁడుట.

స్వర్గమందే (వైకుంఠము) నీకు సీతతోడ సంగమంబు గలుగఁగలదు. దీన సందియంబులేదు రామా! నే నీసభామధ్యంబునఁ బలుకుచున్న విషయము నవహితుండవై యాలింపుము. ఈ నీకావ్యమెల్ల కావ్యములకు శిరోమణి యని తలంపుము. ఇది నీవు పుట్టినదాది యనుభవించిన సుఖదుఃఖంబులను సవిస్తరంబుగా వ్యాఖ్యానించుచున్నది. భవిష్యంబును నుత్తరంబు నగు రామాయణంబు సర్వంబుగూడ వాల్మీకిచే వ్రాయఁబడెను. ఇది యాదికావ్యము. ఇందెందుఁ జూచినను నీకథయే. రామా! నీకంటె నన్యుండీ కావ్యంబునఁ గీర్తింబొంద నర్హుండు లేఁడు. నేనును దేవతలును, ఈకావ్యంబు సర్వంబు నింతకు ముందే వినియున్నారము. ఈకావ్యంబెల్ల సత్యవాక్పరిపూర్ణంబై యద్భుతంబై దివ్యంబై విరాజిల్లుచున్నది. కాన నీవు ధర్మయుక్తుండవై భవిష్యంబును శేషంబును నగు నుత్తరరామాయణకావ్యంబునుగూడ ఋషులతోఁగూడ వినుము. పరమర్షివైన నీవు దక్క నీయుత్తమకావ్యం బన్యులు వినఁదగరు. అని పలికి త్రిభువనేశ్వరుండైన బ్రహ్మదేవుఁడు దేవతల వెంటఁగొని త్రిదివంబున కరిగెను. అచ్చటనున్న బ్రహ్మజ్ఞానులగు ఋషులు బ్రహ్మయాజ్ఞను గాంచి ఉత్తరరామాయణంబును వినఁగోరిన రామునికీర్తిని లోకంబుల వ్యాపింపఁజేయఁ దరలిచనిరి. ఇంతలో వసుధాతలంబుననుండి రామా! సంతాపంబు మానుము. దైవమే యన్నింటికిఁ గారణము. నీవు సీతం జూడఁ గోరుదువేని నీశ్రమమంతయు వ్యర్థము. ఇఁక నామె దర్శనము నీకు దుర్లభము. ఆమె స్వర్గమునందుఁ బ్రతిష్ఠితయయ్యెను (స్వర్గమున కరిగెను). ఈమానవ లోకంబున లక్ష్మి మనుజులచే ననుభవింపఁబడుచున్నది. పితృలోకంబున స్వధారూపంబున ననుభవింపఁబడుచున్నది. తిండిపోతులచేఁ దృప్తిరూపముచే ననుభవింపఁబడుచున్నది. విష్ణురూపుఁడవైన నీయురంబున లక్ష్మి నెలకొని యున్నది. ఆలక్ష్మి స్వర్గస్థులయిన సిద్ధులమూర్ధములయందు నెక్కొనియున్నది. కాన రామా! సీతాదర్శనంబుననుండి నీమనంబును మరలింపుము. ఆమెం

జూడఁ గోరుదువేని ఆమె పుత్త్రులగు కుశలవులం జూతువు. ఈను వాక్యంబులు వినవచ్చెను. అది విని రాముఁడు వల్మీకభవా! భూతభవిష్యత్కాలములను సత్యమును భవిష్యమును నుత్తరము నగు రామాయణము వినుమని బ్రహ్మ వచించెను. ఋషులును వినఁగోరుచున్నారు. కాన మిగిలిన కథ రేపుదయంబున వినిపింపు మని నిశ్చయించి పలికి కుశలవులం దోడ్కొని జనంబుల వీడ్కొని యజ్ఞశాలకుం జని జనాపవాదభీతిచే విడిచిపుచ్చిన సీతంగూర్చి చింతించుచుండఁగా నా రాత్రి గడచి చనెను.

ఇది తొంబదియెనిమిదవ సర్గము

---

## తొంబదితొమ్మిదవ సర్గము

### శ్రీరాముఁడుత్తరకాండ శేషము వినుట.

తెల్లవాఱఁగానే రాముఁడు ఋషులనందఱిని రావించి పుత్త్రులంగాంచి నిర్భయంబుగ గానము చేయుఁడన వారు బ్రహ్మఋషుల యెదుట భవిష్యంబగు నుత్తరరామాయణ మిట్లు గానముచేసిరి. సత్యమహిమచే సీత భూతలంబునం బ్రవేశింపఁగానే యజ్ఞావసానంబున రాముఁడు పరమ దుఃఖాక్రాంతుండై సీతను గానక లోకంబెల్ల శూన్యముగఁ దలంచి స్థైమిత్యము లేకయుండెను. రాజులను ఋషివానర రాక్షసులను, బ్రాహ్మణశ్రేష్ఠులను జనసమూహంబును ధనంబొసంగి పంపివైచి శాస్త్రోక్తముగా యజ్ఞ సమాప్తిం గావించి

### శ్రీరాముఁడు కొడుకులతో నయోధ్య ప్రవేశించుట.

సీతను మనంబున నిలిపికొని పుత్త్రులందోడ్కొని యయోధ్యకుం జనెను. సీతను గాక వేఱొకభార్యనాతండు వరింపలేదు తాను జేయు ప్రతి యజ్ఞంబునందును భార్యకు బదులుగ బంగారు సీతను చెంతనుంచుకొనుచుండెను. పదివేలయేండ్లు అశ్వమేధయాగంబులు గావించెను. వానికిఁ బదిమడుంగులు వాజపేయంబులు చేసెను. అగ్నిష్టోమము, అతిరాత్రము, గోమేధము మున్నగు యజ్ఞములనుగూడ నొనరించి యపారధనంబును దక్షిణలగా నొసంగెను. ఇట్లు రాముఁడు ధర్మపరిపాలనంబు చేయుచుండఁగాఁ జాలకాలంబు గడచిచనెను. ఋక్షవానర రాక్షసులు రాముని యానతి నొదలలందాల్చి యెల్ల వేళల రామునియందు భక్తిశ్రద్ధలు గల్గి బ్రతుకుచుండిరి. సకాలంబున మేఘుఁడు వర్షించుచుండెను. కఱవులు కఱవులాయెను. దిక్కులెల్ల నిర్మలంబులుగా నుండెను. పట్టణంబులు పల్లెలు హర్మ్యములు పుష్టులు నగుజనులచేఁ గ్రిక్కి-

జేసి యుండెను. రాముఁడు రాజ్యము చేయుచుండఁగా నకాలమరణంబు నెవఁడు గాంచలేదు. ఏ ప్రాణియు రోగంబు నెఱుఁగదు. అనర్థంబు లెట్టివియు కానరావయ్యెను. అట్లు కడు దీర్ఘకాలంబు గడచి చనఁగా

### కౌసల్యా సుమిత్రా కైకేయులు మరణించుట.

యశస్వినియు రాముని తల్లియునగు కౌసల్య పుత్రులను, పౌత్రులను గాంచి కాలధర్మము పొందెను. సుమిత్రయుఁ గైకయుఁ గూడ వివిధధర్మములను నెఱవేర్చి కౌసల్య ననుసరించి చనిరి. కౌసల్యాదులు మువ్వురును స్వర్గంబును జేరి దశరథుంగూడి తమ ధర్మంబులు ఫలించినవని సంతసించిరి. రాముఁడు ఆయాపుణ్యకాలములందు భేదభావంబు లేక మువ్వురు తల్లులు తరించుటకై తపస్వులైన బ్రాహ్మణులకు మహాదానంబులు చేసెను. మఱియుఁ బితృదత్తంబులైన బహురత్నములంగొని దేవతలకును పితృదేవతలకును తృప్తికలుగు నట్లుగా దుస్తరంబులగు మహాయజ్ఞములను బెక్కింటిని గావించుచుండ వర్ష సహస్రంబులు గడచి చనెను.

ఇది తొంబదితొమ్మిదవ సర్గము

---

## నూఱవ సర్గము

### యుధాజిత్తుఁడు గార్గ్యుని శ్రీరాము నొద్దకుఁ బంపుట.

అంతఁ గొంతకాలమునకుఁ గేకయరాజగు యుధాజిత్తు తనగురువును అంగిరసునిపుత్రుఁడును బ్రహ్మర్షియు నమితప్రభాకలితుఁడును నగుగార్గ్యుని మహాత్ముఁడగు రామునియొద్దకుఁ బంపెను. ప్రీతిచిహ్నముగాఁ బదివేలగుఱ్ఱములను రత్నములను, కంబళములను చిత్రవస్త్రములను ఆభరణములను గొని గార్గ్యుఁడు తనమేనమామయగు నశ్వపతియొద్దనుండి వచ్చుచున్నాఁడని విని రాముఁడు తమ్ములతోఁగూడఁ గ్రోసెఁడు దూరమెదురుచని బృహస్పతిని దేవేంద్రునివలె గార్గ్యుని వెంటఁబెట్టుకొనివచ్చి పూజించి మేనమామ పంపిన కానుకలను గైకొని యతని కుశలంబుల వివరముగ నడిగి సుఖాసీనుఁడైన ఋషినిట్లు ప్రశ్నించెను.

### గార్గ్యుఁడు యుధాజిత్తు సందేశమును శ్రీరామునితోఁ జెప్పుట.

ఋషీంద్రా! సాక్షాద్బృహస్పతులగు తామిందులకు విచ్చేసిరి. మా మేనమామ యేమిచెప్పి పుత్తెంచెను. అన విని గార్గ్యుడు తావచ్చిన కార్యమెల్ల రామునితో నిట్లు సవిస్తరంబుగాఁ జెప్పఁదొడఁగెను. రామచంద్రా! నీమేన

మామయగు యుధాజిత్తు ప్రీతిపూర్వకంబుగా నీతో నాడుమన్న మాటలు చెప్పుచున్నాఁడను. ఇష్టమున్నచో వినుకొనుము. సింధునదికి ఇరుపార్శ్వముల యందును గంధర్వదేశంబు గలదు. అది ఫలమూలోపశోభితంబై జనులకు సుఖము చేయుచుండును. యుద్ధకోవిదులును, సాయుధులును, శైలూషుని పుత్త్రులును మహాబలశాలురును నగు మూఁడుకోట్లమంది గంధర్వు లాదేశమును శాసించు చుండిరి. రామా! ఆగంధర్వ దేశంబును జయించి నీరాష్ట్రమునఁ గలుపు కొనుము. కనువిందొనరించు నాదేశమును మఱియొకండు చొరఁజాలఁడు. నీవే సమర్థుఁడవు. కాన జయింపఁబూనుము. నీకు నేను అహితంబు చెప్పఁ గోరువాఁడఁగాను. అని మేనమామ గార్గ్యునిచేఁ బలికించిన పలుకు లాలించి సంతసించి యట్లే యొనర్తునని చెప్పి భరతునివంకఁ జూచి మఱల మహర్షినిఁ గాంచి మ్రొక్కి బ్రహ్మర్షీ! భరతుని పుత్త్రులగు తక్షుఁడు పుష్కలుఁడు అను నీ వీర లిరువురు ఆగంధర్వదేశమున సంచరింపఁగలరు మేనమామచేఁ గాపాడఁబడుచు భరతుని ముందిడుకొని కుమారులు సపరివారంబుగ గంధర్వదేశము పై దాడివెడలి గంధర్వ సుతులను జెండాడి పట్టణము రెండుగా విభజించి యందు సుఖముండఁగలరు. పిమ్మట భరతుఁడు నాయొద్దకు రాఁగలఁడు. అని పలికి భరతుని సపరివారంబుగా దాడివెడల సిద్ధంబుగమ్మని యాజ్ఞాపించి

శ్రీరాముఁడు సపుత్త్రు భరతుని గంధర్వుల జయింపఁ బంపుట.

భరత కుమారులకుఁ బట్టాభిషేకంబు చేసెను. పుష్యమీ నక్షత్రంబున భరతుఁడు గార్గ్యుని ముందిడికొని పుత్త్రుల వెంటనిడుకొని ససైన్యంబుగ బయలువెడలెను. భరతునితోఁ గూడిన యాసేన యింద్రునితోఁ గూడిన సది వలెఁ బ్రకాశించి దేవతలకుఁ గూడ జయింపరానిదై చూపట్టెను. మాంసంబు తిను జంతువులును క్రూరరాక్షసులును, రక్తపిపాసచే భరతుని వెంబడించి చనిరి. మాంసభక్షకములగు క్రూరభూతసమూహములు వేలకొలందిగ గంధర్వ పుత్త్రమాంసంబును దినఁజనెను. సింహవ్యాఘ్రవరాహపక్షులుగూడ వేనవేలుగ గంధర్వులపాల యానఁ బాలికలనికిఁ జనెను. ఆసేన రోగము, రొచ్చు లేక పదునై దుదినంబులు దారిలోఁ గడపి హృష్టపుష్టజనాకీర్ణమగు కేకయ దేశమునకుఁ జనెను.

ఇది నూఱవ సర్గము

## నూ ట యొ క ట వ స ర్గ ము

### భరతుఁడు గంధర్వుల జయించుట.

భరతుఁడు సేనానాయకుఁడై గార్గ్యునితోఁ గూడి తనయొద్దకుఁ జను దెంచెనని విని యుధాజిత్తు పరమానందంబుఁ జెంది జనసమూహముతో వారికిఁ దోడుపడ నందఱును గలిసి గంధర్వనగరంబుపైకిఁ జన నదికని గంధర్వులెల్ల యుద్ధకాంక్షులై సింహనాదంబు గావించిరి. అంత నిరువాగులకు సంకులసమ రంబేడునాళ్లు జరిగెను. కాని యెవరికిని జయము చేకూరలేదు. కత్తులను సత్తులు, విండ్లను మొసళ్లు, గలిగి నెత్తుటియేళ్లు మనుష్యకళేబరముతోఁ బ్రవ హించెను. అంత రామానుజుఁడైన భరతుఁడు కడునలిగి దారుణంబగు సంవ ర్తమను కాలాస్త్రంబును గంధర్వులపైఁ బ్రయోగించెను. క్షణకాలములో మూఁడుకోట్ల గంధర్వులును సంవర్తమను నా కాలపాశముచే బద్ధులై గొట్టు వడి స్మృతిదప్పి క్రిందఁబడి మడిసిరి. అట్లు గంధర్వులు మడియఁగానే భర తుఁడు సర్వసమృద్ధములుగా రెండు పురంబులను నిర్మించి,

### భరతుఁడు తక్షపుష్కలులకుఁ బట్టాభిషేకంబుచేయుట.

గంధర్వదేశమునఁగల తక్షశిలయందుఁ దక్షుని గాంధారదేశంబునఁగల పుష్కలావతమునఁ బుష్కలుని రాజులుగా నియమించెను. ఆ పురంబుల నెందుఁజూచినను ధనరత్నరాసులె నెందుఁగాంచిన రమ్యవనంబులె, అవి తమ తమ గుణగణంబులచే నొండొంటితోఁ బోటిపడినట్లు వెలుఁగొందుచుండెను. అందెందును నిష్కల్మషవ్యవహారంబులె ప్రవర్తిల్లుచుండెను. ప్రతివీధియు ఉద్యానవనంబులు నానావిధవాహనంబులు గలిగి సూత్రపట్టినట్లున్న యంగ డులతో మనోజ్ఞంబై చూపట్టుచుండెను. ఆ రెండుపురంబులు సురుచిరంబు లగు నతివిస్తరంబులైన గృహంబులు బహువిమానంబులుగలిగి గలకలలాడు దేవాలయంబులును దాల తమాల తిలక వకుళాదివృక్షములును గలిగి శోభిల్లు చుండెను. అట్టి పట్టణంబున భరతుఁడు అయిదేండ్లు వసించి పిమ్మట నయో ధ్యకుఁ జనుదెంచి అపరధర్మమో యను నట్లున్న యన్నయగు రామునకు ఇంద్రుఁడు బ్రహ్మకుఁబోలె నమస్కరించి, తా నొనర్చిన గంధర్వవధమును జేసినగృహనిర్మాణంబును బూసగ్రుచ్చినట్లుగాఁ జెప్పఁగా విని రాముఁడు ముదంబందెను.

ఇది నూటయొకటవ సర్గము

## నూటరెండవ సర్గము

### శ్రీరాముఁడు లక్ష్మణ కుమారులను గారుపథచంద్రకాంతములకుఁ బ్రభువులఁ జేయుట.

అట్లు రాముఁడు తమ్ములతోఁ బ్రసంగంబు చేసి లక్ష్మణునిఁ గాంచి యిట్లనియె.

లక్ష్మణా! ధర్మవిశారదులగు నీ యీ కుమారులు అంగద చంద్రకేతులు దృఢవిక్రములగుట రాజ్యార్హులై యున్నారు. వీరికిఁ బట్టాభిషేకమొనర్తును. కాన రమణీయంబును నిష్కంటకంబును నృపాల సుఖకరంబును ఋష్యాశ్రమ బాధకంబును నగు దేశంబునుగాంచి చెప్పుము. మన ప్రవేశంబున నితరులకు నాటంకము గలుగరాదు సుమా!

అన విని భరతుఁడిట్లనియె. అన్నా! కారుపథమను రమణీయ నిరామయదేశంబొక్కటి కలదు. అందు అంగదునిఁ బట్టాభిషిక్తునిఁ జేయుఁడు. చంద్రకేతువునకును చంద్రకాంతం బను దేశంబు నభిషిక్తునిఁ జేయుఁడు.

అన విని రాముఁ డంగీకరించి భరత లక్ష్మణులతో నాదేశమును వశపఱచికొని యందు నంగదీయమను పురంబు నిర్మించి యందంగదునిఁ బట్టాభిషిక్తునిఁజేసి దానికిఁ దగిన రక్షణకూడ నొసఁగి మల్లుఁడైన చంద్రకేతువునకు మల్లభూమియందు స్వర్గపురమును బోలు చంద్రకాంత మనుపట్టణమును నిర్మించి పట్టాభిషేకంబు కావించి పరమప్రీతిఁ గాంచెను. పిమ్మట రాముఁడు లక్ష్మణుని సాయమిచ్చి యంగదునిఁ బడమటిభూమికిని భరతుని సాయమిచ్చి చంద్రకేతువు నుత్తరంబునకును బంపెను.

లక్ష్మణుఁడును భరతుఁడును అంగదచంద్రకేతువులయొద్ద నొక్కొక యేఁడు మాత్రము వసించి యా కుమారులు తమంతవారై ధరాపాలనంబు చేయుట కాంచి సంతసించి మరల రాముపాదములు గొలువ నయోధ్యకుఁ జనుదెంచిరి. రామపాదసేవానిమగ్నులై యున్న భరత లక్ష్మణుల కెంత కాలము చనినది యెఱుకపడకయుండెను. ఇట్లు నిత్యము రామ భరత లక్ష్మణులు ధర్మమార్గంబునఁ బౌర కార్యములు చక్కఁజేయుచుండఁ బదివేలయేండ్లు గిఱ్ఱునఁ దిరిగి చనెను. ధర్మపురంబగు నయోధ్యయందు నాభ్రాతలు మువ్వురు పరిపూర్ణచిత్తులై యైశ్వర్యంబునఁ దులఁదూఁగుచు మహాయజ్ఞంబునఁ బూర్ణాహుతిని వెలుంగు త్రేతాగ్నులవలెఁ బ్రకాశించిరి.

ఇది నూటరెండవ సర్గము

---

## నూటమూఁడవసర్గము

### శ్రీరాముని దర్శింపఁ గాలుఁడు వచ్చుట.

శ్రీరాముఁ డిట్లు ధర్మమార్గంబున రాజ్యంబు చేయుచుండఁగా నంతఁ గొంతకాలమునకుఁ గాలుఁడు తాపసవేషమున వచ్చి రామమందిరద్వారము నొద్దకువచ్చి ధీమంతుఁడగు లక్ష్మణునిఁగాంచి లక్ష్మణా! నేను అమిత తేజస్కుఁడగు నతిబలుఁడను మహర్షి యొక్క దూతను. రామునిఁగాంచు పని గలిగివచ్చితిని. కాన నారాక రామున కెఱింగింపుము. అన విని లక్ష్మణుఁడు కడువడి రామునికడకేఁగి రామా! ఉభయలోకంబుల ధర్మమునఁ బాలింపుము. సూర్యతుల్యుఁడగు దూతయొకఁడు నిన్ను దర్శింపవచ్చినాఁడు. అని విన్నవింప విని రాముఁడు తాతా! లోనికిఁ దీసికొనిరమ్మన లక్ష్మణుఁ డట్లొనర్చి నైజతేజంబున లోకంబుల మాఁడ్చునట్లున్న యాఋషి రాముని సమీపించి వర్ధిల్లుమని దీవింప రాముఁడు వానిఁ గాంచనాసనోపవిష్టునిఁ జేసి యర్ఘ్యపాద్యాదిపూజనం బాచరించి కుశలప్రశ్నంబు గావించి మీరు నెఱపు దౌత్యం బెద్దియో యానతిండన వక్తయగు నాఋషి రామా! నీవు మేలు గోరుదువేని మనమిద్దఱము ఏకతముండి ముచ్చటింపవలయును. మనము మాటలాడుచుండఁగా నెవఁడు విన్నను గన్నను వానిని నీవు వధింతువేని ఆ మునిముఖ్యుఁడాడిన మాటలు నీకెఱింగింతును. అన రాముఁ డట్లేయని ప్రతిజ్ఞచేసి లక్ష్మణునిఁగాంచి తమ్ముఁడా! నీవు ద్వారమున నిలువుము. ద్వారపాలు నవతలికంపుము. నేను ముని మాటలాడుచుండ నెవఁడు వినునో యెవఁడు కనునో వాఁడు వధింపఁబడును. అనిచెప్పి లక్ష్మణుని ద్వారమునఁ గాపుంచి దూతయైవచ్చిన మునింగాంచి మునీంద్రా! నీకోరిక యేమి? నిన్నెవరిచటకంపిరి? ఆ మునీంద్రుఁడు నాతో నేమి పలుకుమనెను. చెప్పుము. నా మనంబదే వినఁగోరుచున్నది.

నూటమూఁడవ సర్గము

---

## నూటనాల్గవసర్గము

### బ్రహ్మసందేశమును గాలుఁడు శ్రీరామునకుఁ దెలుపుట.

రామా! విను. నావచ్చినపని తెలిపెదను. నేను బ్రహ్మచే నీకడ కంపఁబడితిని. పూర్వభవమున నేను నీ పుత్రుఁడను. మాయాయుతుండనై సర్వసంహారము చేయుకాలుండను. నేను దేవా! బ్రహ్మవాక్యము లాలిం

పుడవు. రామా! నీవు నీ లోకంబును జేరి దాని రక్షింప నిదే సమయము. తొల్లి నీవు లోకంబులెల్ల మాయచే స్వయముగా సంహరించి మహార్ణవంబున శయనించి తొలుత నన్నును జలంబులను సృష్టించితివి. పిమ్మట జలశయమును భోగవంతంబును నైన అనంతుడను సర్పరాజమును బుట్టించి మాయచే బలాఢ్యులైన మధుకైటభుల సృజించితివి. వారి యస్థికలతో సశైలంబగు భూమి పుట్టెను. దివ్యమైన సూర్యసన్నిభమైన నీ నాభి కమలమునుండి నన్ను బుట్టించి ప్రజాపతి కార్యమెల్ల నాయందు నిలిపితివి. నేను సర్వలోకసృష్టియు రక్షింపగోరి సమస్తభారము నీపై వైచి స్వామీ! ప్రజానుకూలుడవై లోకముల బ్రోచి నాకు తేజము గూర్చుమన నీవు దుర్ధర్షుడవు నిత్యుడవు నగుట భూతాత్మస్వరూపమును దలంచి విష్ణుండవైతివి. పిదప అదితిపుత్రుడవై యుపేంద్రపరాక్రమమున భ్రాతలను గాపాడుచు వలసిన యప్పుడెల్ల సర్వనాశమును తొలగించితివి. అట్టి నీవు ప్రజలు హావళి (ఉపద్రవము) గాంచుటంగాంచి రావణుం జంప భూమండలమున మానవరూపంబున నవతరించితివి. పదివేల పదివందలపదునొకండువేల వర్షంబులు భూతలంబున నివసింప నీవు మున్నె నియమంబుచేసికొంటివి. నీవు దశరథునకు మనోమయ పుత్త్రుడవు. (స్వసంకల్పకృతమైన దశరథపుత్రభావముకలవాడు) ఈలోకంబునం బూర్ణాయువుగలవాడవై యుంటివి. నీవు మమ్ముం జేరుట కిదె సమయము. మహారాజా! నీకింకను బ్రజలనేలంగోరిక కలదేని నిందే నిలువుము. నీకు భద్రంబగుం గాక.

రామా! నీవు దేవలోకంబునకు రాంగోరుదువేని సురలెల్ల సనాథులై విష్ణువుంగూడి విగతజ్వరులై హర్షంబుగాంతురు. అని పలికిన పితామహుని వాక్యంబులను వినుచుం గాలునింగాంచి రామభద్రుండు నవ్వుచు నిట్లనియె. కాలా! పరమాద్భుతంబులగు బ్రహ్మవాక్యంబులు వినుటచేతను నిన్నుం గాంచుటచేతను నాకుం జాలనానందంబు గలిగెను. లోకత్రయరక్షణార్థంబు నేనిట జన్మించితిని. నీకు మేలగుంగాక. నేనెందుండి వచ్చితినో యందులకే మరల నరుదెంతును. నేజేయవలసిన పనులెల్ల దీఱెను. నామనమునం గలది నేడు సంప్రాప్తమాయెను. నాకీవిషయమున విచారములేదు. సర్వసంహారా! బ్రహ్మ పలికినట్లుగా నేను దేవతల సర్వకార్యములకు వశవర్తుడను గావలయును గదా!

ఇది నూటనాలుగవ సర్గము

---

## నూటయైదవ సర్గము

### దుర్వాసుఁడు తనరాక శ్రీరామున కెఱింగింపుమని లక్ష్మణునితోఁ జెప్పుట.

అట్లు రాముఁడును యముఁడును సంభాషించుచుండఁగా దుర్వాసోమహాముని రామదర్శనార్థమై రాజద్వారంబున కరుదెంచి లక్ష్మణునిఁగాంచి సౌమిత్రీ! ముందు తొందరగా నాకు రాముని దర్శనంబు గావింపుము కార్యంబొక్కటి మీఱిపోవుచున్నది. త్వరపడుము. అన విని లక్ష్మణుఁడు మునికి నమస్కరించి ఇట్లనియె. భగవానుఁడా! ఆలసింపను. పనియేమిటి? నేనేమి చేయవలయును? రాముఁడు కార్యాంతరమున నిమగ్నుఁడై యున్నాఁడు. ముహూర్తకాలము వేచియుండుము. అన విని ఋషిశ్రేష్ఠుఁడు క్రోధముచేఁ గలుషీకృతుఁడై కన్నుల నిప్పుకలు రాల లక్ష్మణునితో నిట్లనియె సౌమిత్రీ! ఈ క్షణమునందే నేను వచ్చితినని రామున కెఱింగింపుము. సౌమిత్రీ! నీ వీ క్షణముననే నారాక రామున కెఱింగింపవేని నన్ను నీదేశమును, నీ పురమును, రాముని భరతుని మీ సంతతిని శపింతును. నేను ఈ వచ్చినకోపంబును మరల మనంబున నణఁచిపెట్టఁజాలను. అని పలికినదుర్వాసుని ఘోరవాక్యము నాలించి లక్ష్మణుఁడు తన మనంబున నాకొక్కనికే మరణంబగుఁగాక! సర్వవినాశనంబు కలుగకుండుఁగాక! అని నిశ్చయించి, మౌని రాకను రాముని కెఱింగించెను. లక్ష్మణుని వాక్యములు విని రాముఁడు కాలుని విడచి పుచ్చి త్వరితగతిని వచ్చి అత్రిపుత్త్రుఁడగు దుర్వాసునిఁ గాంచి అభివాదనమొనర్చి కృతాంజలియై తాము వచ్చిన కార్యమేమని యడిగెను. అదివిని దుర్వాసుఁ డిట్లు ప్రత్యుత్తరంబిచ్చెను. ధర్మవత్సలా! రామా! వినుము. ఇప్పటికి నాసేయు వేయేండ్ల తపస్సు సమాప్తి చెందినది, నే నిపుడాఁకలి కోర్వఁజాలను. వేఱే ప్రయత్నము చేయకయున్న యన్నమేదో పెట్టుము అన విని రాముఁడు ప్రీతిమానసుఁడై యథాసిద్ధమైన భోజనమును మునిముఖ్యునకుఁ బెట్టెను. అమృతోపమంబైన యాయన్నమును దిని మునిశ్రేష్ఠుఁడు మేలు రాఘవా! మేలు. అని ప్రశంసించి నిజాశ్రమమున కరిగెను. అతఁడు చనఁగానే రాముఁడు కాలుని వాక్యములను దలంచి దుఃఖంబు నొంది సంతప్తహృదయుఁడై వాని ఘోరదర్శనంబు స్మరించి తలవాంచికొని దీనభావుఁడై మాటలాడఁజాలకుండెను. అంత రాముఁడు కాలుని వాక్యంబులు మనంబునఁ దలపోసి నిఖిలసంహారవేళ ఆసన్నమైనదని నిశ్చయించుకొనెను.

ఇది నూటయైదవ సర్గము

# నూటయాఱవ సర్గము

## లక్ష్మణుఁడు శ్రీరామునితోఁ దన్ను వధించి సత్యము రక్షింపుమని చెప్పుట.

దీనాననుఁడై తలవాంచికొని రాహుగ్రస్తుఁడైన చంద్రునివలె నున్న రామునిఁగాంచి లక్ష్మణుఁడు సంతోషపూర్వకంబుగా మృదు మధురవాక్యంబుల నిట్లనియె. రామా! నీవు నాకొఱకు సంతాపింపవలదు. పూర్వనిర్మాణబద్ధమై కాలగతి యిట్లున్నది. సౌమ్యా! నిస్సంశయంబుగా నీవు నన్నుఁ జంపుము. ప్రతిజ్ఞాపరిపాలనంబు గావింపుము. హీన ప్రతిజ్ఞులయి నరులు నరకకూపంబునఁ బడుదురు. మహారాజా! నీకు నాయందుఁ బ్రేమగలదేని, నన్ననుగ్రహింపఁ దలఁచితివేని నిశ్శంకంబుగా నీవు నన్నుఁ జంపుము. ధర్మమును వృద్ధిపఱుపుము. అన విని రాముఁడు ప్రచలితేంద్రియుఁడై మంత్రులను, బురోహితులను రావించి జరిగిన వృత్తాంతమును వారికి వినిచెను. కాలప్రతిజ్ఞయు దుర్వాసుని రాకయు విని మంత్రిపురోహితులు మిన్నకుండ వసిష్ఠుండు రామునికిట్లనియె.

## వసిష్ఠు వాక్యమున శ్రీరాముఁడు లక్ష్మణుని విడనాడుట.

రామా! రోమహర్షణంబు గలిగించు నీ క్షయంబుకూడ విధివిహితమే కాని ముందుగానె నీకు లక్ష్మణునితోడి వియోగము సంభవించినది. వీనిని విడిచిపెట్టుము. కాలము బలమైనది. ప్రతిజ్ఞభంగము కానీయకుము. ప్రతిజ్ఞకు భంగంబు కలిగెనేని ధర్మంబు లోపించిపోవును. ధర్మంబు నశించెనేని సచరాచరంబును దేవర్షిగణయుతంబునునైన లోకత్రయంబును దప్పక నాశనము చెందును. కాన పురుషశ్రేష్ఠా! నీవు లక్ష్మణుని విడనాడితివైనను త్రైలోక్యపాలనం బొనర్చి జగంబునకు స్వస్థత చేకూర్పుము. నీ వీతనియందలి యనురాగంబునం జేసి ప్రతిజ్ఞాభంగము గావింపరాదు. నీవు హీనప్రతిజ్ఞుఁడవైనచో రాజ్యార్థంబుగూడ నిరర్థకమై చనును. రామా! ప్రతిజ్ఞాపాలనకై నీతండ్రి నిన్ను విడుచుటయు నీ వడవులపాలు కావుటయు నీ వెఱింగినదే కదా! నీయందలి శోకంబుచేతనే దశరథుఁడు స్వర్గస్థుఁడయ్యెను. కాన రామా! నీవు ప్రతిజ్ఞాపరిపాలనంబునుండి తప్పించుకొనకుము. నీవు మేరుమందరధీరుండవై లోకత్రయహితార్థమై లక్ష్మణునిఁ ద్యజింపుము. అన విని రాముఁడు లక్ష్మణునిఁగాంచి యిట్లనియె. సౌమిత్రీ! నిన్నెడఁబాయుచున్నాను. ధర్మమునకు విపర్యయంబు (హాని) కలుగకుండుఁ గాక! సౌమిత్రీ! సాధులకు ఇష్టుల విడుచుటయుఁ జంపుటయు నొక్కరూప; కాన సోదరా! నిన్ను విడిచితిని.

లక్ష్మణుండు మేనితో దివంబున కేఁగుట.

అని రాముఁడు పలుకఁగానే లక్ష్మణుఁడు బాష్పాకులనేత్రుఁడై యింటి ముఖంబుచూడక ద్రుతగతినిఁ జని సరయూనదినిఁ జేరి, యాచమనంబుచేసి, కృతాంజలియై నవరంధ్రములు బిగియఁబట్టి యూపిరి విడువకుండెను. అట్లూపిరి బిగఁబట్టియున్న లక్ష్మణునిమీఁద నింద్రుఁడును నప్సరోగణంబులును, దేవతలును ఋషులును బుష్పవర్షంబు గురిసిరి. మనుజులకు నదృశ్యుండగు లక్ష్మణుని శరీరంబుతోడనే దేవేంద్రుఁడు స్వర్గంబునకుఁ దీసికొనిపోయెను. అంత విష్ణునినాల్గవయంశము స్వర్గంబున కరుదెంచుటగాంచి సురలును, మునులును సంతసించి పూజించిరి.

ఇది నూటయాఱవ సర్గము

---

నూ ట యే ఁ డ వ స ర్గ ము

శ్రీరాముఁడు మహాప్రస్థానంబేఁగ నిశ్చయించుట.

శ్రీరాముఁడు లక్ష్మణు నెడఁబాసి దుఃఖశోక సమన్వితుఁడై పురోహితుని మంత్రులను వేదవిదులనుగాంచి యిట్లనియె. మహాశయులారా! నే నిప్పుడు వీరుఁడును ధర్మవత్సలుఁడును నైన భరతుని అయోధ్యకుఁ బట్టాభిషిక్తునిఁ జేసి పిమ్మట వనంబుల కరిగెదను. కానఁ గాలయాపనంబు సేయక సంభారంబుల సిద్ధము గావింపుఁడు. నే నిప్పుడే లక్ష్మణుఁడొందినగతిని బొందుచున్నాను. అన విని వారందఱు శిరంబులు పుడమిదాఁక మ్రొక్కి బలంబు దొఱఁగియుండిరి. రామునిమాట వినఁగానే భరతుఁడు కూడ నిశ్చేష్టుఁడై కొండొకసేపునకు దేఱుకొని రాజ్యమునెడ వైముఖ్యముచూపి రామున కిట్లనియె. ఓ రాజా! నిజముగ స్వర్గలోకసాక్షిగఁ జెప్పుచున్నాను. నీవు లేని రాజ్యము నాకక్కఱ లేదు. ఈ కుశునిఁ గోసలదేశమునకు లవుని ఉత్తరదేశమునకుఁ బట్టాభిషిక్తులం జేయుము. మనము స్వర్గమున కరుగుచున్నామను వార్త వేగంబుగా నరుగఁగల దూతముఖంబునఁ దెలియనంపుము. అని భరతుఁడాడిన మాటలను విని ప్రజలు విచారంబుచే అధోముఖులై (సంతప్తహృదయులై) యుండ వారిం గాంచి వసిష్ఠుం డిట్లనియె. నాయనా! రామా! భూమిపైఁబడియున్న యీజనులను జూడుము. వీరి యీప్సితంబేమో యెఱింగి యది నెఱవేర్పుము. వీరికి విప్రియంబు గావింపకుము. అన విని రాముఁడు పల్లాయనమువారినెల్ల (ఆప్తుల) లేవనెత్తి మీకు నాచేయవలసిన కార్యంబేమని యడిగిన

శ్రీరామునివెంటఁబోవఁ బౌరు లనుజ్ఞఁగోరుట.

వారెల్ల రామా! నీ వెచ్చటికరిగెదవో మేమును అచ్చటి కరుదెంతుము. నీకుఁ బౌరులయందుఁ బ్రీతికలదేని అధికస్నేహంబు కలదేని భార్యాపుత్రులతో మమ్మెల్ల నీ వెంటఁగొనిచనుము. ప్రభూ! నీవు తపోవనంబునకుఁగాని స్వర్గమునకుఁగాని నదికిఁగాని, సముద్రమునకుఁగాని ఎచ్చటి కరిగిన నచ్చటికి అత్యాజ్యులమగుమమ్ము వెంటఁగొనిపొమ్ము. ఇదియేనూకుఁ బరమ వరము. నిన్ననుసరించి పోవలయుననియే మే మెప్పుడు మనంబులందుఁ దలంతుము. అన విని రాముఁడు పౌరుల దృఢభక్తిని ఆనాఁటి తన విధినిఁ గని యట్లేకానిండని పలికి కోసలదేశంబునకుఁ గుశుని ఉత్తరదేశంబునకు లవుని పట్టాభిషిక్తులంజేసి వారిరువురను దొడపైఁ గూర్చుండఁబెట్టుకొని కౌఁగిలించికొని మరల మరల శిరంబులు మూర్కొని వేయేసి రథములు పదివేలేసి యేనుఁగులు లక్షేసి గుఱ్ఱములు ఒక్కొక్కని కొసంగి బహురత్న ధన ధాన్య హృష్ట పుష్ట జనావృతంబులైన స్వపురంబులకుఁ గుశలవులను బంపి శత్రుఘ్నుని కొఱకు దూతనంపెను.

ఇది నూటయేడవ సర్గము

---

నూటయేనిమిదవసర్గము

శత్రుఘ్నుఁడు కొడుకులకుఁ బట్టాభిషేకమొనర్చి యయోధ్యఁ జేరుట.

రామునిచేఁ బంపఁబడిన యలఘు విక్రములగు దూతలు మార్గమధ్యంబునం దెచ్చట నాఁగక మూఁటామూఁటి మూఁడహోరాత్రంబులకు మధురకుం జని లక్ష్మణపరిత్యాగము, రామప్రతిజ్ఞ, పుత్త్రాభిషేకము, పౌరానుగమనము, రాముఁడు వింధ్యపర్వతభాగమునఁ గుశునకుఁ గుశావతియను పురంబును, లవునకు శ్రావస్తియను పురంబును, నిర్మించి యొసంగుటయు రామ భరతులు అయోధ్యానగరంబును విజనంబుగావించి స్వర్గగమనోద్యుక్తులగుటయుఁ దెల్పి త్వరగా నేతెంచి శత్రుఘ్ననృపాలా! త్వరపడు త్వరపడు మని చెప్పి యూరకుండిరి. భయంకరమై సముపస్థితమైన కులక్షయమును విని శత్రుఘ్నుఁడు పౌరులను, పురోహితుఁడగు కాంచనుని రావించి యావద్వృత్తాంతంబును వివరించి సోదరులతోపాటు తనకు రానున్న విపత్యాసంబు (ఆపద) నెఱిగించి తన కొడుకులగు సుబాహుని మధురకును, శత్రుఘాతిని వైదిశము నకును, రాజులంజేసి ధనమును, సేనలను చెఱుసగము పంచియిచ్చి తానొక్కఁడు రథంబునెక్కి యయోధ్యకుం దరలిచని సూక్ష్మక్షౌమాంబరధారియు

నగ్నినిభమూర్తియునై ధర్మాత్ములగు మునులతోఁ గూడియున్న రామునిం గాంచి నమస్కరించి ప్రాంజలియై ధర్మచింతతో నిట్లనియె. "రామా! నా సుతులకుఁ బట్టాభిషేకంబు గావించితిని. నిన్ననుగమింపఁ జనుదెంచితిని. ఇది నానిశ్చయము. నీవు మాఱుపలుకరాదు. నీశాసనము దాఁటరానిది. నీయందు భక్తి కలిగియున్న నన్ను విడిచిపుచ్చుట నీకు ధర్మంబుగాదు." అని పలికిన శత్రుఘ్నుని దృఢనిశ్చయంబును విని యట్లే కానిమ్మని పలికినంత

## సుగ్రీవవిభీషణాదులు శ్రీరామునిఁ జూడవచ్చుట.

కామరూపులగు ఋక్ష, రాక్షస, సుగ్రీవ సహితులగు వానరులు దేవతా పుత్త్రులు ఋషిసుతులు గంధర్వకుమారులు గూడ స్వర్గమున కరుగనున్న శ్రీరామచంద్రుని దర్శింప నరుగుదెంచి రామునకు నమస్కరించి రామచంద్రా! మేమును నీతో నరుగుదెంతుము. నీవు మమ్ములను విడనాడి యొక్కండవే స్వర్గంబునకుఁ బోతివేని యమదండంబున నూతలలు పగుల నడఁచినట్లుగా భావింతుమని విన్నవింప రాముఁ డట్లే కానిండని నవ్వుచుఁ బలుకుచున్నంతలో సుగ్రీవుండు రామునకు శాస్త్రయుక్తంబుగ నమస్కరించి యిట్లు విన్నవించెను. రామా! నేను అంగదుని రాజ్యాభిషిక్తునిం జేసి నిన్ననుగమింపఁ గృతనిశ్చయుఁడనై వచ్చితిని. అన విని రాముఁడు వాని మైత్రినిఁ దలంచుచు నిట్లనియె. సఖా! సుగ్రీవా! వినుము. నిన్ను వీడి నేను స్వర్గంబునకుఁ గాని పరమపదంబునకును గాని చనను. అని పలికి అట్లేవారొనిన ఋక్ష వానర రాక్షసుల వచనంబులుగూడ నాలించి పాలించి మధురవాక్కుల విభీషణున కిట్లనియె.

## శ్రీరాముఁడు హనుమద్విభీషణాదులకు వరంబు లిచ్చుట.

మిత్రమా! విభీషణా! ఈభూమియందు నెందాఁక జనులు నివసించుచుందురో యందాఁక నీవు లంకారాజ్యంబును బరిపాలించుచుందువు. ఎందాఁక సూర్యచంద్రులుందురో యెందాఁక భూమండలంబుండునో యెందాఁక నాకథ భూమండలంబందు నుండునో యందాఁక నీరాజ్యము సుస్థిరంబుగ నుండుఁగాక! నీవు స్నేహితుండవగుట శాసించితిని. కాన నాయానతి శిరసావహింపుము. ధర్మంబుతోఁ బ్రజలను బాలింపుము. మాఱు మాటాడకుము. మఱియు నీకొక్క సంగతి తెలుపుచున్నాఁడను. శ్రద్ధగా వినుము. సర్వదేవతలచేతను దేవేంద్రునిచేతను సర్వకాల సర్వావస్థలందుఁ బూజింపఁబడు మా యిక్ష్వాకుల కులదైవతంబగు జగన్నాథస్వామిని నిరతంబు పూజింపుము. అన విని విభీషణుఁడు అట్లే యొనర్తునని విన్నవించినంత రాముఁడు హనుమంతునిఁ గాంచి యాంజనేయా! నీకింకన్నం జీవింపవలయునను తలంపుగలదు. కాన నీ

ప్రతిజ్ఞను వ్యర్థముచేయకుము. ఎంతవఱకీలోకంబున నాకథలు గానంబు చేయఁబడుచుండునో యంతవఱకు నీవు నావాక్యంబులను పాలించుచు సంతోషంబునఁ గ్రీడించుచుండుము. అన విని హనుమంతుఁడు పరమానంద భరితుండై యిట్లనియె. రామచంద్రా! ఎంతకాల మీ లోకంబున నీపవిత్ర చరిత్ర పరిఢవిల్లుచుండునో యంతకాలము నేనీపుడమియందు నీయాజ్ఞాను వర్తినై యుందును. అన విని రాముఁడు బ్రహ్మసుతుండును వృద్ధుండును నయిన జాంబవంతుని, మైందుని, ద్వివిదునిఁగాంచి మీరైదుగురు కలియుగ ప్రారంభము వఱకు జీవించియుండుఁడని పలికి మిగిలిన ఋక్షవానరులను వారి యిచ్ఛానుసారంబుగఁ దనతో రమ్మని యనుమతిచ్చెను.

ఇది నూటయెనిమిదవ సర్గము

---

## నూటతొమ్మిదవ సర్గము

శ్రీరాముఁడు సకల ప్రాణులతో మహాప్రస్థానమేఁగుట.

అంత తెల్లవాఱఁగానే మహోరస్కుఁడును కమలపత్రాక్షుఁడును నగు రాముఁడు పురోహితునకిట్లనియె. మునీంద్రా! దీప్యమానంబగు నగ్నిహోత్రంబును గొని బ్రాహ్మణులు ముందు నడువవలయును. శోభమానంబగు వాజపేయాతపత్రంబును మహాపథంబున వఱలవలెను. అన విని వసిష్ఠుఁడు మహాప్రస్థానికంబగు విధినెల్ల విద్యుక్తంబుగ నిర్వర్తించెను. అంత రాముఁడు సూక్ష్మాంబరధరుఁడై గాయిత్రిని జపియించుచు కుశంబులంగైకొని బయలు వెడలెను. రాముఁడు ఎక్కడను ఇంచుకేనియు మాటలాడక నిశ్చేష్టుఁడై నిస్పృహుఁడై దీప్యమానుండగు సూర్యునివలె గృహంబునుండి బయలువెడలెను. రాముని దక్షిణపార్శ్వంబున పద్మమునుదాల్చి లక్ష్మీదేవి సేవించుచుండెను. వామపార్శ్వంబున హ్రీదేవి కొలుచుచుండెను. ముందు సంహారశక్తియుండెను. నానావిధశరంబులును, ఉత్తమధనుస్సును, సర్వాయుధంబులును బురుషాకారంబులందాల్చి రాముని వెంబడించెను. వేదములు, గాయత్రి, ఓంకారము, వషట్కారము, మున్నగునవియెల్ల బ్రాహ్మణరూపంబున రామునననుగమించెను. ఋషులు, బ్రాహ్మణులుగూడ అపావృతస్వర్గద్వారుఁడగు రామునననుసరించిరి. అంతఃపురస్త్రీలు సవృద్ధబాలదాసీకలై సవర్షధరకింకరలై రాముని వెంబడించిరి. భరతశత్రుఘ్నులు అంతఃపురకాంతలతో సాగ్నిహోత్రులై రాముని వెంటఁ జనిరి. అట్లుండఱును సాగ్నిహోత్రులై సపుత్రదారులై రామునిఁగూడఁ జనుచుండ మంత్రులును భృత్యవర్గంబును సపుత్రపశుబాంధవులును సానుగులును నై యానందంబున నోలలాడుచు రామునితోఁ జనిరి. అంత గుణరంజితు

లైన పౌరజనులెల్ల హృష్టపుష్టజనావృతులై రామభద్రు ననుగమించిరి. పిమ్మట రాముని సేవించుచున్న స్త్రీ పురుషులెల్ల సపక్షిపశువాహనులై విగతకల్మషులై సంతోషంబుతో రామునికూడఁ జనిరి. తరువాత వానరులెల్ల స్నానంబులుచేసి మోదంబున గంతులువేయుచుఁ గిలకిలారావంబులు చేయుచు రాముని వెంట నరిగిరి. అక్కడను వారిలో దీనుఁడుగాని, లజ్జాళువుగాని దుఃఖితుండు గాని యొక్కండును లేఁడు. ఆజనసమూహమంతయు మూర్తీభవించిన యానందమునలె పరమాద్భుతంబై గనుపట్టెను. స్వర్గంబునకరుగు రామునిఁ గానవచ్చిన జానపదులెల్ల వాని ననుసరించి పోయిరి. ఏయేభూతంబు లాపట్టణమున నంతర్ధానంబులై యున్నవో యవియెల్లఁగూడ రామునిఁగూర్చి వెడలెను. స్థావరజంగమాత్మకంబులగు నేవి రామునిం గాంచినవో యవియెల్లఁగూడ రామునితో నరిగెను. అయోధ్యాపట్టణంబున ముక్కున నూపిరియున్న నేసూక్ష్మపదార్థంబు గూడ నత్తరి గన్పట్టదయ్యెను. తిర్యగ్యోనులగు పశుపక్ష్యాదులన్నియుఁ గూడ శ్రీరామచంద్రు ననుసరించిపోయెను.

ఇది నూటతొమ్మిదవ సర్గము

---

## నూ ట ప ది య వ స ర్గ ము

### బ్రాహ్మణులు శ్రీరాముని దర్శింప వచ్చుట.

రామచంద్రుఁడు ఒకటిన్నరయామడ దూరంబు చని పశ్చిమాభిముఖుండై పాఱు సరయూనదీపుణ్యజలంబులంగాంచి యాకులావర్తమా ఆనదీజలంబుల దిగి సప్రజుండై చనుచు నొక వివిక్తప్రదేశంబును జేరెను. అంత నచ్చటికి ముహూర్తకాలంబులో లోకపితామహుండగు బ్రహ్మ మహాత్ములగు దేవతలతోడను ఋషులతోడను గూడి శతకోటి దివ్యవిమానంబులతోఁ జనుదెంచెను. స్వయంప్రభలచేతను స్వతేజస్సులచేతను స్వర్గీయపుణ్యకర్మంబులచేతను మూరిఁబోవు వేల్పుపిండుచే ననుత్తమంబై జ్యోతిర్భ్యాతంబై దివ్యతేజోవృతంబై వ్యోమతలంబు శోభిల్లెను. గంధవంతంబులును సుఖప్రదంబులును నగు పవిత్రవాయువులు వీతెంచెను. దేవతలు మహాప్రవాహంబువలెఁ బూలవాన కురిసిరి. తూర్యశతాకీర్ణంబును, గంధర్వాప్సరస్సంకులంబును నగు నా ప్రదేశంబునం గల సరయూజలంబుల శ్రీరామచంద్రుఁడు పాదచారియై చనుచుండ నంతలో నంతరిక్షంబుననుండి బ్రహ్మ విష్ణురూపుండవైన రాఘవా! రమ్మా. నీకు మంగళంబగు. మాయ దృష్టవశంబున నరుదెంచితివి. ఓ మహానుభావా! నీవు ఏతనువును గోరు

చున్నాఁడవు! ఆ నీతనువును దేవతుల్యులగు సోదరులతోఁగూడఁ బ్రవేశింపుము. వైష్ణవంబగు మహాతేజంబునఁగాని, లేదా సనాతనంబగు నాకాశంబునఁగాని ప్రవేశింపుము. పూర్వపరిగ్రహయు, విశాలాక్షియు, మాయారూపిణియు నగు లక్ష్మిదక్క లోకంబునకెల్లఁ దక్కిన నిన్నెవ్వరు నెఱుంగఁజాలరు. నీవు అచింత్యంబును, మహద్భూతంబును, అక్షయంబును, అజరంబును, స్వయం ప్రకాశకంబును, నగు నీదేహంబును జేరఁగోరుచున్నాఁడవు యందుఁ బ్రవేశింపుము.

## శ్రీరాముఁడు సానుజుండై సశరీరుండై వైష్ణవతేజంబు చొచ్చుట.

అని యానతిచ్చిన బ్రహ్మమాట లాలించి మహామతియైన రాముండు మనంబున యోచించి నిశ్చయించి సహానుజుండును సశరీరుండునునై వైష్ణవ శరీరంబునఁ బ్రవేశించెను. అంత దేవతలు సాధ్యులు మరుద్గణంబులు ఇంద్రాగ్నులు దివ్యఋషులు గంధర్వాప్సరసలు సుపర్ణనాగయక్షదైత్యదానవ రాక్షసులు సర్వపుష్టంబును, బ్రముదితంబును, సంపూర్ణమనోరథంబును, గతకల్మషంబును, నగు త్రిదివంబునంగల యావిష్ణుమయదేవునిం బూజించి మేలుమేలని కొనియాడిరి. అంత మహాతేజస్వియగు విష్ణువు పితామహుని కిట్లనియె. పితామహా! ఈ జనసమూహంబున కెల్లఁ బుణ్యలోకంబు లొసంగుము. బుద్ధిమంతులగు వీరెల్ల నాయందలి ప్రణయంబున నన్ననుసరించి వచ్చిరి. నాకు వీరు భక్తులు, భజితవ్యులు, నాకై ప్రాణంబు లర్పించినవారు.

## బ్రహ్మ సమస్తజనంబుల నుత్తమలోకంబున నుంచుట

అని పలికిన విష్ణువాక్యంబులు విని బ్రహ్మ మహావిష్ణూ! వీరెల్లరును భక్తితో నిన్ను ధ్యానించుచుఁ బ్రాణంబులు తొఱంగినతిర్యక్కులును, బ్రహ్మగుణంబునం గూడి, బ్రహ్మలోకంబున కావలనున్న సాంతానికలోకంబున వసింతురుగాక. వానరులు ఋక్షులు మున్నగువారు తామేయే దేవాంశంబుల జన్మించిరో యా దేవతలం గలియుదురుగాక. అందు సుగ్రీవుండు సూర్యమండలంబుఁ జొచ్చును. దేవతలందఱు చూచుచుండఁగనే ఋక్షవానరులు తమతమ పితృలలోఁ బ్రవేశింతురు. అని యిట్లు బ్రహ్మ చెప్పుచుండఁగా వారలెల్ల హర్షపూర్ణాశ్రువిక్లబులై గోప్రతారతీరంబున సరయూనదిం గ్రుంకిరి. ఏయే ప్రాణులు ఆనందంబుతో సరయూనదీజలంబుల మునింగెనో యాయా ప్రాణులు మనుష్యదేహంబును విడిచి విమానంబు నెక్కెను. పర

యూనదీజలంబులఁ జొచ్చిన తిర్యగ్జంతువులుగూడ సుందర శరీరంబులం దాల్చి దివంబున కరిగెను. సరయూజలంబుల మునింగిన స్థావరజంగమములు దివ్య దేహంబులఁ దాల్చి దేవతలవలె వెలుఁగొందెను. తనపేరిజలంబులఁ గ్రుంకు లిడి ఋక్షవానర రాక్షసులెల్ల తమ దేహంబుల నా జలంబులయందే యుంచి దేవలోకంబున కరిగిరి. అంత లోకగురుండగు మహావిష్ణువు నాకంబున కరు దెంచిన నెల్లర సందేశముంచి తాను సంతోషితస్వాంతుఁడైన దేవతలంగూడి వైకుంఠంబున కరిగెను.

ఇది నూటపదియవ సర్గము

---

## నూటపదునొకండవ సర్గము

### శ్రీ రామాయణ ఫలశ్రుతి.

ఇంతవఱకుఁ జెప్పఁబడిన చరిత్రయే వాల్మీకికృతంబైన యుత్తరరామాయణము. సచరాచరాత్మకంబగు లోకత్రయంబున సర్వవ్యాపియైయున్న విష్ణువు స్వర్గంబునందువలె నీరామాయణంబున నెలకొని (ప్రతిష్ఠితుఁడై) యున్నాఁడు. కావుటనే దేవతలు, గంధర్వులు, సిద్ధులు, సాధ్యులు, ఋషులు మున్నగువారెల్ల నిత్యంబును దివ్యంబైన రామాయణంబును దివంబున వినుచుందురు. ఈ రామాయణము ఆయుష్కరము, సౌభాగ్యము, పాపనాశనము. వేదసమంబైన యీ రామాయణమును బుధులు శ్రాద్ధములందు వినిపింపవలయును. ఇందొక పాదంబును బఠించినను అపుత్రుండు పుత్రవంతుఁడగును. అధనుండు ధనవంతుఁడగును. పాపాత్ముఁడు పుణ్యములఁగాంచును. ప్రతిదినము నిందొక శ్లోకంబునైన పఠించిన పాపాత్ముఁడు తన పాపంబులు తొలఁగును. ఈరామాయణము పురాణంబుగాఁ జెప్పువానికి వస్త్రము, బంగారము నొసంగవలయును. వాచకుఁడు పరితుష్టిచెందెనేని సర్వదేవతలు సంతసింతురు. ఆయుర్వృద్ధికరంబగు నీ రామాయణంబును నిరతంబు పఠించు నరుఁడు ఇహలోకంబునఁ బుత్రపౌత్ర సంపదలతోఁ దులదూఁగి పిమ్మట పుణ్యలోకంబు నొందఁ గలఁడు. అయోధ్యాపట్టణము చాలకాలము శూన్యమైయుండి పిమ్మట ఋషభుఁడను రాజును బొంది తొంటి వైభవంబున విరాజిల్లఁగలదు. ఆయుష్కరంబును సభవిష్యంబును, సహోత్తరంబును నగు నీ యుత్తర రామాయణం

బును బ్రచేతసుని పుత్రుఁడైన వాల్మీకి మునీంద్రుఁడు గీర్వాణభాషను రచించెను. దానిని బ్రహ్మ తద్దయు శ్లాఘించెను. ఈ మహాగ్రంథంబును దెలుఁగున వచనరూపంబుగఁ దెలుఁగురాజను పేరంబరగువాఁడును రాఘవాంబికా వేంకటపతి రాజపుత్రుఁడును నగు పెనుమెచ్చ సత్యనారాయణరాజు రచియించెను.

ఇంతదాక సర్గమును విన్నను వేయి యశ్వమేధయాగములు శతసహస్ర వాజపేయంబులు చేసిన పుణ్యంబు లభించును. ఈ రామాయణంబును విన్న మానవునకుఁ బ్రయాగాది తీర్థంబులను గంగాదినదులను నైమిశాదికాననంబులను గురుక్షేత్రాది పుణ్యక్షేత్రంబులను సేవించిన ఫలంబు లభించును. కురుక్షేత్రంబున సూర్యగ్రహణ సమయంబున స్వర్ణభారంబును దానంబుచేసిన యాతండు లోకంబున రామాయణమును విన్న యాతండును సమానపుణ్యభాక్కు లగుదురు. రామాయణకథను శ్రద్ధాభక్తులతో విన్న మానవుఁడు సర్వపాపవిముక్తుఁడై విష్ణులోకంబునకుఁ జనును. తొల్లి వాల్మీకిఋషికృతంబైన ఈ యాదికావ్యము సదా భక్తితో విను నాతఁడు విష్ణుసాయుజ్యమును గాంచును. ఇహలోకంబునఁ బుత్ర, పౌత్ర, భార్యలతోడను, సర్వసంపదలతోడను వృద్ధిగాంచును. ఈ సత్యంబు నెఱింగిన నియతాత్ములగు మానవులకు గాయత్రీరూపమైనయుత్తమమైన శ్రీమద్రామాయణంబు శ్రోతవ్యంబు. ఇందాక పదంబునువిన్నను అపుత్రులు పుత్రులను, అధనులు ధనములనుబొంది సర్వపాపములనుండి విముక్తిఁగాంతురు. ఈ రఘురామచరితము నిత్యము భక్తితో ఎవఁడు పఠియించునో, ఎవఁడు వినునో వాఁడు సర్వపాపవిముక్తుఁడై దీర్ఘాయుష్మంతుఁడై విరాజిల్లును. శ్రేయంబులొందఁగోరువాఁడు నిత్యము శ్రీరామచంద్రుని భజించుచుండవలయును. రామాయణంబును బ్రతిదినంబును బ్రాహ్మణులకు వినిపించుచుండవలయును. ఎవఁ డీ రఘునాథచరితంబు సకలంబు బఠించునో వాఁడు దేహాంతంబున నిస్సంశయంబుగ విష్ణులోకంబున కేఁగును. అట్లు పఠించువాని తండ్రియు, పితామహుండును వాని ప్రపితామహుండును ఆ ప్రపితామహుని తండ్రియు, వాని తండ్రియు మున్నగువారెల్ల విష్ణునం దైక్యమొందుదురు. దీన సందియము లేదు. రఘురామచరితంబు చతుర్విధపురుషార్థంబు. కావున నిత్యంబును బరమయత్నంబున దీనిని వినవలయును. ఈ రామాయణ

మునందు నొక పాదంబునుగాని, పదంబునుగాని యెవఁడు భక్తితో వినునో వాఁడు బ్రహ్మపదంబునుఁజెంది బ్రహ్మచేఁ బూజింపఁబడును. ఇట్లు ప్రాచీన వృత్తంబైన రామాయణంబు వాల్మీకిచేఁ జెప్పఁబడినది. సంశయంబు లేక నమ్మకంబుతో దీనింబఠించువారికి శుభమగుఁగాక. విష్ణుబలంబు వృద్ధి చెందుఁగాక. 2702

ఇది శ్రీమదుత్తరరామాయణంబున నూటపదునొకండవ సర్గము.

త్రుటితదురితయాత్రా ॥ దుర్గమాంబాకళత్రా !
స్ఫటికశుచిచరిత్రా ॥ శాంతమాంబాసుపుత్రా !
కుటిలజనలవిత్రా ॥ కోవిదస్తోత్రపాత్రా !
తటిదమలినగాత్రా ॥ ధర్మవిస్తారనేత్రా !

పరుషవచనదూరా ॥ భవ్యకావ్యోపహారా !
సరళహృదయగమ్యా ॥ సారసౌహార్దరమ్యా !
సరసజనవరేణ్యా ॥ సన్నుతాగణ్యపుణ్యా !
వరకవిహితకారీ ॥ బాధలోకోపకారీ !

జయ జయ మత్కావ్యపతీ !
జయ జయ శ్రీ వెలగపూఁడి ॥ సద్వంశమణీ !
జయ జయ విక్రమ మంత్రీ !
జయ జయ శ్రీరామకృష్ణ ! ॥ శామితతృష్ణా !

ఇతి శివమ్

శ్రీ కృష్ణార్పణ మస్తు